# ఆంధ్రలో చలం

(మూడవ భాగం)


## పురాణం సుబ్రహ్మణ్య శర్మ






న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్

ఏలూరురోడ్, విజయవాడ-2

ఫోన్స్: 74677 * 62222

# మా మాట.

తెలుగు వెలుగు చలం (పేజీ 260 వరకు) అనే విభాగంలో చలం అస్తమయం, ఆయనపోయాక ఆయన గురించి పత్రికలలో వచ్చిన అపూర్వ సంచలనం, ఆయన వ్యక్తిత్వం,ఆయన రచనల గురించిన తర్జన భర్జనలు అన్నీ ఈ మొదటి భాగంలో వున్నాయి.

అరుణాచలంలో చలం (పేజీ 261 నుంచి 592 వరకు) అరుణాచలం ఎందుకు వచ్చాడు? అక్కడ ఎలా జీవించాడు? ఆయన వ్యక్తిత్వంలో వచ్చిన మార్పేమిటి? రమణస్థాన్‌లో ఆయన జీవితం ఎలా గడిపాడు? సుమారు ముప్పైఏళ్ళ కాలంలో ఆయన ఏం సాధించాడు? రమణ భగవాన్ ఎవరు? కావ్యకంఠ గణపతి ముని ఎవరు? ఈ వివరణలతో చలం రమణాశ్రమ జీవితం ఈ రెండవ భాగంలో విపులంగా వస్తుంది.

ఆంధ్రలో చలం. (పేజీ 593 నుంచి)యిది చలం పూర్వాశ్రమ జీవితానికి సంబంధించినది.ఆయన బాల్యం,వివాహం,చదువు, తిరుగుబాట్లు, రచనలు, సంఘంతో పేచీలు, విరోధాలు, డాక్టరు రంగనాయకమ్మగారి మరణంతో పాత చలం కథ ఆగుతుంది. ఆంధ్రలో చలం అనే విభాగంలో 'చలం పిక్టోరియల్' రెండు ఫారాలలో చలం జీవితాన్ని ఫొటోలతో ఆఫ్‌సెట్‌లో సమర్పిస్తున్నాము.

పాఠకుల సౌకర్యాన్ని దృష్టిలో వుంచుకుని ఈ మొత్తం గ్రంథాన్ని మూడు విడి సంపుటాలుగానూ, కావలసినవారికి అంతా ఒకే వాల్యూముగానూ ప్రచురించామని మనవి చేస్తున్నాము. ఈ మా కృషిని మన్నించి, ఆదరించి, ఆశీర్వదించండి.

న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్,
విజయవాడ-2

## ఆంధ్రలో చలం

# విషయసూచిక

యుగయుగంబుల నీశ్వరయోషు లగుచు
స్వేచ్ఛకై ప్రాణసుమము లర్పించువారి
యమల జీవిత ఫలము ధన్యతను గాంచ
జగము నిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు.

# 3

# నేపథ్యం

చలం పుట్టుక వెనుకగల చారిత్రక నేపథ్యం — 19వ శతాబ్దం ఆదిలో.

మన దేశంలో ఇంగ్లీషు చదువులు ప్రారంభమయ్యాక అంతవరకు స్తబ్దంగా జడప్రాయంగా వున్న నీటి మడుగులోకి రాయి విసిరినట్లయింది. గతానుగతికత్వానికి, ఆచార సరళత్వానికి, నవీన కల్పనకు దానికి మూలమైన పాశ్చాత్య భావసరళికి హోరాహోరీ పోరాటం జరిగింది. హిందూ సంప్రదాయానికి గొప్ప ఘల్లాకపు పట్టు. అది ఎన్ని కొత్త చింతలనైనా జీర్ణించుకుని కొత్త రూపాన మనగలుగు. ఆంగ్ల విద్యాధికులైన ఒక తరంవారు తమ ఆలోచనా ధోరణులను సమూలంగా మార్చుకున్నారు. క్షీణించిపోయిన జరాగ్రస్తమైన సనాతన హిందూ శిథిలశకలాలను వారు సమూలంగా తిరస్కరించవలసి వచ్చింది. 19వ శతాబ్దం నాటికి హైందవ సంస్కృతి శల్యావశిష్టమై రోగిలా వుంది. మతంలోను, కళల్లోనూ సృజనాత్మకత దాదాపు అడుగంటిపోయింది. ఈ ఆంగ్ల విద్యాధికుల ఆలో

చనలలో మార్పులు ప్రారంభమై పునర్వికాస ఉద్యమం సంప్రదాయ విలువలతో కొంత మేరకు రాజీపడవలసి వచ్చింది.


రాజారామమోహనరాయ్

ఈ రాజీ నుంచి ఆధ్యాత్మిక ధార అనూచానంగా, నిరంతరాయంగా కొనసాగగలదని అరవిందుని వంటివారు అభిప్రాయపడ్డారు. బెంగాల్లో రాజారామ మోహనరాయ్ విజృంభించి సంప్రదాయ వాదులతో, సంప్రదాయ పద్ధతులతో పోరాడి శిథిల సంప్రదాయ శకలాలపై ఆంగ్లవిద్య ద్వారా ఆధునిక విజ్ఞానమందాకినిని కొని తెచ్చిన భగీరథుడయాడు. ఫ్రెంచి మహావిప్లవం అందించిన వైజ్ఞానిక వికాసం, హేతువాద దృష్టి, వ్యక్తి స్వాతంత్ర్య భావాలను జీర్ణించుకుని కరుడుగట్టిన మతవాదులతో ఆయన భీకర సమరం చేసి వారిని శుద్ధిచేశాడు. మతంలో అంతర్గర్భితమై ఉండే సార్వకాలిక, సార్వజనీనమైన సత్యాలను మరుగుపరిచేటంత. ఇతరేతరమైన చెత్త నుండి దానిని వేరుపరచి మానవ జీవితానికి ఒక ప్రాతిపదికను ఆయన సమకూర్చే ప్రయత్నం చేశారు. రామ్మోహనరాయ్ 1828లో స్థాపించిన బ్రహ్మసమాజం. ఆ తర్వాత అనేక ఉద్యమాలకు పుట్టినిల్లు అయింది దేవేంద్రనాథ్ టాగూర్ బ్రహ్మసమాజాన్ని సనాతన ఆర్షధర్మానికి పునరంకితం చేయగా దానిని కేశవచంద్రసేన్ స్వంతం చేసుకున్నాడు. మనసులోని క్రైస్తవ భావాలతో ప్రారంభించి, వైష్ణవ సంప్రదాయంతో జతచేసి, మత సంస్కరణం ఆరంభించాడు. క్రమంగా మత సంస్కరణ, సంఘసంస్కరణకు దారితీసింది. ఈ రకంగా బ్రహ్మసమాజికుల్లో మూడు శాఖాలు ఏర్పడ్డాయి. ఆది బ్రహ్మసమాజం, భారత బ్రహ్మసమాజం, సాధారణ బ్రహ్మసమాజం అంటూ విడిపోయాయి.

ఏది ఏ శాఖానికి చెందినా బ్రహ్మసమాజ అ తరణతో భావ స్వాతంత్ర్యానికి ప్రాణప్రతిష్ఠ జరిగింది. భావ స్వాతంత్ర్యాన్ని ఏ సంస్థలు, ఏ వ్యక్తులూ కట్టడికి లోను చేయకూడదు ఆచారం పేరగాని, నమ్మకం పేరగాని, భావ స్వాతంత్ర్యానికి అవరోధాలు కలిగించ కూడదు ఇతరులు మనమీద రుద్దే నిష్ట

యాలను అంగీకరించరాదు. ఆత్మ విమర్శ చేసుకుని తనకు తాను ఏర్పరుచుకున్న నిర్ణయమే ఆచరింప తగినది. బ్రహ్మసమాజ ప్రభావంతో ఏర్పడిన ఈ నిర్ణయమే రాజకీయ, అధికార నిరసనకు దారితీసింది. ఈ బ్రహ్మసమాజపు కుటుంబంలోంచే కాంగ్రెసు సంస్థ జన్మించడానికి కావలసిన వాతావరణం ఏర్పడింది. ఆ విధంగా రాజారామ్మోహనరాయ్ నవభారత నిర్మాతగా నిలిచిపోయారు. ఆయన సంస్కరణోద్యమం బ్రహ్మసమాజం ఏర్పడడంతో మొదలైంది 1856లో హిందూ వితంతు పునర్వివాహ చట్టం వచ్చింది. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ఈ ఉద్యమాన్ని చేపట్టారు. బాల్య వివాహాల వ్యతిరేకం,సతీసహగమన నిరోధం, స్త్రీ విద్య, వితంతువివాహ ఉద్యమం అన్నీ బ్రహ్మసమాజంలో నుంచే వెలువడి వ్యాపించాయి. అయితే ఈ బ్రహ్మసమాజపు రాకడిని ఎదుర్కొనడానికి ఆంగ్ల విద్యాధికులలో ఒక వర్గం సంప్రదాయ వంతంగా తథ్యంగా హైందవ ఉద్యమంఏర్పడింది. హిందూమత పునరుద్ధరణ ఉద్యమం ప్రారంభించారు బంకిమ్ చంద్రఛటర్జీ నవలలన్నీ ఈ ఉద్యమానికి ఉత్తేజాన్ని ఇచ్చాయి. హైందవమత పునరుద్ధరణ ఉద్యమానికి అరవింద్ ఘోష్ కూడా రాజకీయ స్వరూపం ఇచ్చారు. ఈ సమన్వయ దృక్పథం పాక్షిక మత దృష్టిని ప్రోదిచేసి, హిందూ, ముస్లింజాతుల మధ్య తేడాలను సృష్టించింది. దేశభక్తి, మత హైందవం ఐక్యమయ్యింది. వేద ప్రామాణాన్ని అంగీకరిస్తూ, ఇతర ప్రామాణికాన్ని తిరస్కరించిన హైందవ మతాన్ని ఆశ్రయిస్తూ దయానంద సరస్వతి ఆర్యసమాజాన్ని స్థాపించారు. హిందూ మతం నుంచి బయటకు వెళ్ళినవారు తిరిగి హిందూమతంలోనికి రావడానికి ఆర్య సమాజం అవకాశం కల్పించింది. ఇది యథా పూర్వంగా సనాతన ఆచారాలను యథాతథంగా అంగీకరించలేక వాటిని ఖండించలేక సంశయాత్మకులై నలిగిపోతున్న ఆంగ్ల విద్యాధికులకు దివ్యజ్ఞాన సమాజం ఒక ఆశ్రయమై నిల్చింది.

సాహిత్యంలో కూడా సంస్కరణకై సంస్కృతభాష ఉద్ధారకుడు రాజారామ మోహనరాయ్. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వచ్చాక వన్నెకెక్కింది వంగభాషలో వచనానికి సంకెళ్ళు విప్పివేసిన రచయిత టేగోర్. బెంగాలీ పద్యానికి ఛందో బందోబస్తుల్ని ఛట్ ఛట్ మని త్రెంచి, ముక్తిని ప్రసాదించి మహోద్యమాన్ని చెప్పినవాడు మైకేల్ మధుసూదనదత్. బంకిమచంద్ర ఛటర్జీ కూడా. టేగోర్ ప్రారంభించిన వచన రచన విధాన మహోద్యమాన్ని సఫలం చేశారు. ఈ చైతన్యం వంగసీమ దాటి తెలుగునాడును తాకింది.

## ఆంధ్ర దేశానికి వస్తే

1894వ సంవత్సరం వీరేశలింగంగారి జీవితంలో ఎలా వుందో పరిశీలిద్దాం.

"1894వ సంవత్సరమున ఎండ కాలపు సెలవులలో నేను చెన్న పట్టణము వెళ్ళినపుడు తెలుగున జీసస్ చరిత్రమును వ్రాయనారంభించి యాఱు ప్రకరణములు చేసితిని."

వెంకటచలంగారు మద్రాసులో 1894 మే 19న వైశాఖ పౌర్ణమనాడు బుద్ధజయంతి రోజున జన్మించారు. ఆ సమయానికి వీరేశలింగం పంతులుగారు మద్రాసులోనే వున్నారనుకోవచ్చు.

షెరిడన్ రచించిన ది రైవల్సు అనే నాటకాన్ని పంతులుగారు కళ్యాణ కల్పవల్లి అని తెలుగులో రచించి 1894వ సంవత్సరంలో ప్రచురించారు.

'—నాకుస్త్రీ విద్య యందును స్త్రీలయభివృద్ధి యందును విశేషాభిమానము. స్త్రీల దురవస్థకు బలుమారు పరితపించి వారి దుస్థితిని దొలగింప బ్రయత్నింప వలయుననియు, స్త్రీలను ప్రస్తుత స్థితిలోనే యుంచి తాము పైకి లేచుట పురుషుల కెన్నడును సాధ్యము కాదనియు, తాము బాగుపడవలె నన్నచో వారిని గూడ విద్యా వివేకాదుల యందు మంచి స్థితిలోనికి దెచ్చి వారితోఁ గలిసి యున్నత పదవికి పోవ వలయుననియు తాము మాత్రమే వృద్ధినంది వారిని నిజమైన మైత్రి కనర్హమైన దాస్యము నందే యుంచదలచిన పక్షమునఁ దెలియకయే, దినదిన క్రమమున, దాము న్నత పదము నారోహించుచు వచ్చుటకు మాఱుగా నొకొక్క మెట్టున దిగుచు వచ్చు కడపట వారితోఁగూడ నడుగంటుట యనివార్యమనియు, నేను దలంచుచుండెడు వాడను'

సరిగ్గా యిటువంటి అభిప్రాయాలూ ఆలోచనలూ ఒక మహాపురుషుని లో కల్లోలకడలిలో ఉత్తుంగ తరంగాల్లా విజృంభిస్తున్న కాలంలో చలం జన్మించారు.

1883లో పంతులుగారు స్త్రీలకోసం 'సతీహితబోధిని' అని తెలుగులో ఒక మాస పత్రికను ప్రారంభించారు.

ఆ సంవత్సరమే సత్యవతీ చరిత్ర అనే వచన ప్రబంధం రాశారు, (నవల కాబోలు). ఆ నవల చదివి ఆనందించిన అనేక మంది తమకు పుట్టిన పిల్లలకు సత్య వతి అని ముద్దుగా పేరు పెట్టుకున్నారట.

1889లో స్త్రీలకు శరీర ఆరోగ్య ధర్మాలను గురించి బోధించడానికై, 'దేహారోగ్య ధర్మబోధిని' ప్రచురించారు. 1896లో 'పత్నీహిత సూచని' విరచించారు. (ఇందు స్త్రీల యొక్క యూర్తవ కాలము నందును, గర్భధారణ స్థితి యందును, శిశుపోషణ సమయమునందును, నడపవలసిన మార్గములను జేయవలసిన ధర్మములను రాదగిన రోగములును తన్నివారణార్థ మాచరింపవలసిన చికిత్సలను సామాన్యముగా వివరింపబడినవి)

స్త్రీల కోసం పిల్లల కోసం కలం పట్టి చలం ప్రచురణ 1930 రచన 1925లో నరసరావుపేట నుంచి 'స్త్రీ' అనే గ్రంథం,బందరు నుంచి 1924లో 'బిడ్డల శిక్షణ' రాశారు. 1896 నాటికే స్త్రీల ఆరోగ్యాన్ని గురించి ఆలోచించి వారి కోసం 'పత్నీహిత సూచని' పంతులుగారు ప్రకటించడం (1889లో రాసిన 'దేహారోగ్య ధర్మబోధిని' తోసహా) సామాజిక కర్తవ్యాన్ని సూచించే వారి సాంఘిక చైతన్యానికి నిదర్శనాలు కదా!

పంతులుగారు 1894-95 కాలంలో స్వదేశ సంస్థాన చరిత్ర ప్రకటించారు. స్త్రీలు చదువు కొనడానికై ఛార్లెస్ లాంబ్ రాసిన షేక్స్పియర్ నాటక కథలను పద హారింటిని తెనిగించారు. అలాగే 1895లో జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము బొమ్మలతో ప్రకటించారు, (ఈ శాస్త్రమును చదివి, గ్రహణములు మొదలైనవి కలుగుటకుగల నిజమైన కారణములను తెలిసికొన్న పక్షమున, ఏతద్విషయమున జనులలో గల మూఢ విశ్వాసములును, మూఢాచారములును నశించి సుజ్ఞానము కలుగుననుటకు సందేహములేదు. ఈ శాస్త్రము మన దేశమునకు క్రొత్తది కాదు.)

చలం పుట్టేనాటికి 1894కు ముందూ వెనుకా స్త్రీజనోద్ధరణకు కంకణం కట్టుకున్న ఒక మహాపురుషుడు ఒక సుదీర్ఘమైన పోరాటానికి ఆయత్తం అవుతున్నాడు. శతాబ్దాలుగా తెలుగు జాతిని ఆవరించి వున్న జడత్వాన్ని వొదల కొట్టడానికి, దీనికి పునరుజ్జీవన వికాసాన్ని ప్రసాదించడానికీ కర్త్రీ కర్తాయీ నూరుతున్నాడు. చలం ఆవిర్భావానికి వెనుకనున్న ఈ నేపథ్యాన్ని పరిశీలించకుండా చలం గురించి రాయడం వీలుకాదు.

అభినవాంధ్ర దేశానికి వీరేశలింగం జనకుడు. మహోదయంలో కె.వి.రమణారెడ్డి 'మార్పులో ఆయనదే ఆది; సాధనలో ఆయన పెట్టినదే ప్రమాణం. ఆత్మూరి లక్ష్మీనరసింహం ఎన్నడనగానో బ్రహ్మసమాజంపట్ల తనకేర్పరచి ఉన్న సదభి



కందుకూరి వీరేశలింగం పంతులు

ప్రాయాన్ని. తను మద్రాసులోని ప్రెసిడెన్సీ కాలేజి ఆంధ్రభాషా చార్యుడయాకమున్నప్ఫుచ్చ్రయ్య పూర్తిగా స్థిరపరిచాడు. 1864లో కేశవచంద్రసేన్ మద్రాసుకు వచ్చి చేసిన ఉపన్యాసాల ఫలితంగా ఏడేళ్ళతదనంతరం శ్రీధరులునాయుడు దక్షిణభారత బ్రహ్మ సమాజాన్ని స్థాపించాడు. బ్రహ్మసమాజ ప్రచారయాత్రలో పండిత శివనాథశాస్త్రికి రత్నం వంటి అనుచరుడులభించాడు. క్రిస్టియన్ కాలేజీలో విద్యార్థిగా వుండిన రఘుపతి వెంకటరత్నంనాయుడు పండిత శివనాథశాస్త్రి ఉపన్యాసధారలో తడిసి బ్రహ్మ ధర్మ దీక్షితుడయాడు. రఘుపతి వెంకటరత్నంనాయుడు గురజాడ పుట్టిన సంవత్సరం 1862లోనే జన్మించాడు. దుందుభినామ సంవత్సరం). 1895లోనే బ్రహ్మసమాజం నిండుగా వీరేశలింగం మదికెక్కింది. మద్రాసు నుండి తిరిగి వచ్చి రాజమండ్రిలో దానికి అంటుగట్టాడు. అప్పటికే తెలుగుజిల్లాలలో సమాజ శాఖలు విస్తరించి వున్నాయి. శాతాబ్దులు మారసాగే నాటికి శివనాథశాస్త్రి అన్నట్లు, రాజమండ్రి బ్రహ్మకర్మ క్షేత్రమైతే, బాపట్ల బ్రాహ్మ భక్తమండలం, బందరు బ్రాహ్మ విజ్ఞానాలయం కాగలిగాయి. బాపట్లలో దేశిరాజుపెదబాపయ్య ధర్మానుష్ఠాన విషయంలో తనకే దారి చూపినట్లు వీరేశలింగం స్వీయచరిత్రలో రాసుకున్నాడు.

రాయసం వేంకటశివుడన్నట్లు "వీర సంస్కర్తగా వుండిన వీరేశలింగం వీరావేశం బ్రహ్మసమాజం పుణ్యమా అని తొలి తీవ్రతను కోల్పోయింది. సంస్కరణోద్యమం వెనక ముఖం పట్టింది కూడాను. కాకినాడలో పిఠాపురంరాజా కాలేజీకి ప్రధానాచార్యుడుగా రఘుపతి వెంకటరత్నంనాయుడు వచ్చిన నాటి నుంచి ఆస్తిక మత విషయాలే వీరేశలింగం దృష్టికి కూడా ప్రముఖంగా తోచాయి. వీరేశలింగం నడిపిన విధవా పునర్వివాహోద్యమం నాయుడుగారి మదికెక్కినట్లు లేదు. కాలేజీ విద్యార్థులెవ్వరూ విధవలను పెళ్ళాడడం ఇష్టంలేక పోవడమేగాక, కొంత కాలం ఒక భర్తతో కాపురంచేసి వైధ్యవం అనుభవించేస్త్రీ, చనిపోయిన తన భర్త ఆత్మశాంతి దృష్ట్యా మళ్ళీ పెళ్ళి చేసుకోరాదని కూడా ఆయన అభిమత మట.

అలా తమనితాము నిషాయించుకొని వుండలేని స్త్రీలు చెడితిరగడం కంటె పెళ్ళాడి బాగుపడడమే మేలని భావించాడు. ఇంత మాత్రాన ఆయన బాల్యవివాహాలను వ్యతిరేకించలేదని తీర్మానించుకో కూడదు. దేవదాసీ విధాన సంస్కరణ విషయంలో వెంకటరత్నంనాయుడు వీరేశలింగం కంటె ముందడుగు వేశాడు. అలాగే పెదబాపయ్యకు కూడా సహపంక్తి భోజన విషయంలో ఆక్షేపణలుండేవి. బాబూ హేమచంద్ర సర్కారు రాజమండ్రికి వచ్చినపుడు (1904) మాంసభక్షణ గురించి బ్రాహ్మసామాజికులు చూపెట్టిన ఉదాసీన వైఖరికి ఎంతో నొచ్చుకున్నాడు. ఆనంద గజపతి ప్రోత్సాహం కొద్దీ బ్రహ్మసమాజంలోనూ థియోసాఫికల్ సొసైటీలోనూ సభ్యుడైన గురజాడ అప్పారావు తన రచనలలో ముఖ్యంగా కొండుభట్టీయంలో ఈ వైరుధ్యాల నన్నిటినీ చిత్రించాడు.

వీరేశలింగం కీర్తి మంటపానికిగల వెయ్యి స్తంభాలలో బ్రహ్మసమాజం చిట్టచివరిదే కావచ్చు గాని.... దక్షిణభారత విద్యాసాగరుడని శతాబ్ది చివర (1898) ఆయనను సత్కరించారుగాని. దక్షిణభారతరామమోహనుడనదగిన మహావ్యక్తిత్వం ఆయనది.... ధవళేశ్వరంలో బాలికల పాఠశాలను ఏర్పాటు చేయడంతో శ్రీకారం చుట్టుకొన్న స్త్రీజనోద్ధరణ (1874) మదరాసులోని 'వేదవిలాస్'లో కాలధర్మం చెందేవరకు (1919) దాదాపు నిరంతరాయంగా సాగింది. 1881లో విధవా పునర్వివాహోద్యమం మొదలైంది. శరణాలయాలు, ప్రార్థనా మందిరాలు నెలకొన్నాయి. శాస్త్రవిద్యా ప్రచారం జరిగింది. సారస్వతం సంస్కరణకు ఒక సాధనమైంది.

## కృష్ణశాస్త్రిగారి మాటల్లో—

"ఆంధ్రదేశంలో బ్రహ్మసమాజ మనగానే, తను పెదవి విప్పిన సత్యవాణియై, తను ప్రబోధించినది వివేకవర్ధనియై, తాను ఆచరించినది హితకారిణియై, ఎదిరించే వేళ ప్రభంజనమై, అనాథలకు అభయహస్తమై అఖిలోద్యములకు ఆదిపురుషుడై, దక్షిణదేశమునకు రామమోహనుడై వీరేశలింగం వెలుగొందును"

ఈ నవ్యాంధ్ర నిర్మాత చలానికి గురువు కావడంలో ఆశ్చర్యంలేదు. చలానికి కూడా ఉద్యమం ప్రధానం. సాహిత్యసృష్టి అందుకు ఎత్తుకున్న గాండీవం మాత్రమే. వీరేశలింగంగారి స్త్రీజనోద్ధరణ అనే ధ్యేయాన్నే తీవ్రమైన ధోరణిలో స్త్రీకి స్వేచ్ఛ, సెక్సులో స్వేచ్ఛ (absolute freedom) అనే వాదాన్ని చేపట్టాడు చలం. వితంతువివాహ సంస్కరణాన్ని సాధించిన వీరేశలింగంగారు, స్త్రీ నీతి

చట్టాల్ని వెక్కిరించి ధిక్కరించిన వీరచలానికి spiritual father చలం యిందు కోసం నడుంకట్టి చేసిన రచనల్లో సాహిత్యగుణానికిరాక సంస్కరణో ద్దేశానికే ప్రాధాన్యం ఎక్కువ.

## 1894 గొప్పతనం

1894లో రాజమండ్రిలో ప్రభుత్వం ట్రెయినింగు కళాశాలను స్థాపించింది. ఈ కళాశాలలోనే తరువాత చలంగారు యల్. టీ. పరిక్షకు చదివారు. ఆ సంవత్స రమే కాంగ్రెసు మహాసభలు చెన్న పట్టణంలో జరిగాయి. సురేంద్రనాథ్ బెనర్జీ మదన మోహనమాలవ్యగార్ల ఉపన్యాసాలు జరిగాయి. 1894 నాటికి గోదావరి జిల్లాలు తూర్పు పశ్చిమాలుగా విభజన కాలేదు.

## బ్రహ్మర్షి

చలానికి సుమారు పదకొండేళ్ళ వయసు వుంటుంది 1904కి. ఈ సంవ త్సరంలో మునుముందు ఎందరి శిష్యులనో తన నిజాయితీ నిర్మలాంతఃకరణ సత్ ప్రవర్తన శీలసంపదతో ప్రభావితం చేసిన బ్రహ్మర్షి సర్ రఘుపతి వెంకట రత్నం నాయుడుగారు కాకినాడకు రావటం చిలకమర్తి వారి స్వీయ చరిత్రలో యిలా వర్ణితం అయింది. పి. ఆర్ కాలేజీ ప్రిన్సిపాల్ పదవికి ఖాళీరాగా ఆ ఉద్యో గానికై వి. శ్రీనివాస శాస్త్రిగారు, రఘువతి వెంకట రత్నం నాయుడుగారు యిద్దరూ దరఖాస్తుచేశారట. నాయుడుగారు సంఘ సంస్కరణాభిలాషి. బ్రహ్మ సమాజ ప్రియులు అవడంచేత యువకులను పూర్వాచార విముఖులుగా చేస్తారనీ, బ్రహ్మ మతస్థులై చెడిపోతారనే భయంతో కమిటీలో కొందరు, కాకినాడ పుర ప్రముఖులు దురభిప్రాయపడి ఆయన అభ్యర్థిత్వాన్ని వ్యతిరేకించారట. ఈ వార్తవినీ వినగానే వీరేశలింగం పంతులుగారు కాకినాడ వెంటనే వెళ్ళి నాయుడుగారి నిమిత్తమై పని చేశారట. న్యాపతి సుబ్బారావు పంతులుగారు శ్రీనివాస శాస్త్రిగారి విషయమై ప్రయ త్నం చేశారట చివరకు ఆ పదవి నాయుడుగారికే వచ్చింది. అప్పుడు సికిందరాబాద్ నుంచి నాయుడుగారు కాకినాడ వెళ్తూవుండగా రాజమండ్రి స్టేషన్లో వారిని దింపి ప్లాట్‌ఫారం మీద కుర్చీవేసి అభినందనపత్రాన్ని ధార్వాడ కృష్ణారావుగారు ఇంగ్లీ షులో చదివి వినిపించినట్లు చిలకమర్తివారు రాశారు. అ విధంగా నాయుడుగారు కాకినాడకు రావడం తెలుగు సామాజిక చరిత్రలో ఒక పెద్ద మలుపు. ఒక గొప్ప సుదుపు అయింది.



సర్ రఘుపతి వెంకటరత్నంనాయుడు

## గురుదేవ!

అలనాటి ఋషి వాటికల నుండి పఱతెంచు
　　నామ్నాయ పూతగంగామృతమ్ము
అలనాటి బోధి వృక్షయతచ్ఛాయల
　　సెలలైన బాష్పశీతల జలమ్ము
అలనాటి కఱి క్రొమోడు సిలువ గద్దియమీద
　　నురలిన రక్త కవోష్ణధార
అలనాటి యారబీయుల యెడారులలోన
　　గాఱిన విశ్వాసఘర్మవారి
కలసి నీలోన లోలోన గదలిపాఱ
బదను వారిన దయ్యె నీ హృదయ సీమ
తావక పవిత్ర జీవితధామ మైన
దయ్యె విశ్వ విశాల దేవాలయమ్ము

ప్రతి ఫలమ్మిసుమంత వలపక కర్మముల్
　　సేయు నీమెయి కురుక్షేత్ర మగును
ఆ శాంతములకుఁ జరాచర్మములకు
　　దరలు నీ యెదఁద బృందావనమగు
వివిధ ధర్మజ్ఞాన వేణీ సమాశ్లేష
　　మైన నీ మనసు ప్రయాగ యగును
పాతాళమును స్వర్గ పద మొక్క ముడిలోన
　　　నతుకు నీవే వారణాశివౌదు
నీవు కన్పడ నెదురుగా నిల్చినట్టి
మోలను బురాణ భారత పుణ్యభూమి
మాకు దినదిన యాత్రాకృతోత్స
వానుభూతి నొసంగు బ్రహ్మర్షి వీవు!

—శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి 'మహతి' భక్తి గీతములు,
ప్రార్థన సమాజము గుంటూరి వారి ప్రచురణ నుంచి—

బ్రహ్మర్షి నాయుడుగారి గురించి కృష్ణశాస్త్రిగారి మాటల్లో—

"ఆంధ్ర యువ మనస్సునకు ఆశయ పక్షములు తొడిగి, ఆంధ్ర యువ హృదయమును అమృత వాహినిగా కరిగించి, ఈనాటి పాప పంకములో రేపటి తపః కమలమును వికసింపజేసి ఈనాటి అనాథ జీవితములో రేపటికి శాఖోప శాఖలుగా పెరిగిపోగల సంస్కార మందారమును మొలిపించి సర్వలోక కుటుంబ సంస్కారములో అనాథలేడని ఘోషించుటకు తన హృదయమునే అనాథ శరణాలయముగా చేసుకొని భక్తికి, జ్ఞానమునకు, కార్యోత్సాహమునకు, మూడు సుందర నిర్మాణములను ఒక్క తావుననే నిలిపి మనకొక ప్రయాగను ప్రసాదించిన బ్రహ్మర్షి ప్రత్యక్షముగుచునే ఉండును."



దేవులపల్లి కృష్ణశాస్త్రి

హైందవ సంప్రదాయాలకు మతాతీతమైన కొత్త కల్పనలు మొగ్గతొడిగి రెక్కలు విప్పుకొంటున్న కాలమది. ఈ భక్తి మార్గము సంస్కరణ పతాకను ధరించి మాడిపోయిన తెలుగు నేలపై మధుర వర్షాలు కురిపించింది. ఇది దేశభక్తి ఉద్యమంతో కలిసిపోలేదు. ఈ సంస్కరణోద్యమాన్ని కబళించి వేసిన జాతీయ విమోచనోద్యమం చలాన్నిగాని భావకవుల్నిగాని అంతగా ఆకర్షించలేకపోయింది. ఈ స్వేచ్ఛా గగనానికి ఆ స్వేచ్ఛాగగనానికి చుక్కెదురు. సామాజిక విశుద్ధ జీవనానికి తోడ్పడే విలువలు ఏర్పడనీకుండా పాపంలా చుట్టుముట్టిన దేశభక్తి నాటిన విషబీజాలే నేటి నాయకులు, పాలకపక్షం, కాంగ్రెసు వగైరా వగైరా. మత సంస్కరణ సంఘ సంస్కరణ నవజీవనానికి చేసిన మేలు దిక్కుమాలిన దేశభక్తి చేయలేకపోయింది. అది దొంగల రాజ్యానికి తావిచ్చింది. నీచుల్ని పైకి లేవనెత్తి వారిచేతిలో రాజ్యదండాన్ని ఉంచింది. ఇది చరిత్ర చేసిన దగా! చలం చైతన్యంలో ఈ సామాజిక అంశం స్పష్టంగా కనిపిస్తుంది. థర్డ్‌రేట్ బ్రెయిన్స్‌ని ఆకర్షించిన దేశభక్తి చాలా నాసిరకం నాయకుల్ని సృష్టించింది. జాతి రుగ్మతలపై చరిత్ర కప్పిన ముసుగు జాతీయోద్యమం.

'నేను బ్రహ్మమతంలో ప్రవేశించడంతో, ఆ సమాజానికి నవజీవనం పోసినట్టయింది. నేనూ, రామ్మూర్తి, ఇంకా మిత్రులు అతివాదులమైనాం. ఆ విధంగా అమితమైన ఉత్సాహంతో, గొప్ప సంతోషంతో రెండేళ్ళు గడిచాయి. ఎప్పుడూ నాలో తీవ్రమైన స్ట్రగుల్....'

చలం చెప్పిన ఈ ఉజ్వలమైన కాలంలో అనుష్ఠానపరులైన బ్రహ్మ సమాజికులలోని ప్యూరిటానిజంతో చలానికి కొంతకాలానికి పేచీ వచ్చింది. అదంతా ఎట్లా జరిగిందంటే—

అవి ఆంధ్రదేశాన్ని తరుణ సంఘం వుర్రూతలూగించిన రోజులు. తరుణ సంఘం అంటే పెద్దాడ రామస్వామి, కృష్ణశాస్త్రి, చలం, గాదేపల్లి సూర్యప్రకాశ రావు, మల్లవరపు వెంకట కృష్ణారావు, గరిమెళ్ళ వీరభద్రరావు. ఆ రోజుల్లో కృష్ణశాస్త్రి గీతాలు—

'అవనియంతా పెద్ద అక్షయపాత్ర !
అఖిలేశుహస్తమే అన్నపూర్ణమ్మ!'

'ఏది నీకిత్తునందు నా హృదయనాథ!
కాన్కగానే మొసంగగాగలను నీకు.
తారక రత్న భాసురతారహార
సుప్రభామాలికాజాల శోభితుడవు,
రాజ రాజేశ్వరుడ వీవు, ప్రభుడ వీవు—'

కృష్ణశాస్త్రి గొప్ప కవితలకి తగిన భక్తి గీతాలవి. మహతిలో ముద్రితం.

చలం బ్రహ్మ సమాజంలో చేరీ చేరగానే జంధ్యం తీసి పారేశాడు. అతని కంటె ఘనురాలు అతని భార్య. ఆవిడ మంగళ సూత్రాలు తీసేసింది. రంగనాయకమ్మ అనే పేరును విసర్జించి మాలతీబాయి అని మరో పేరు పెట్టుకుంది. ఈవిడ చలాన్ని మించి ముందుకెళ్ళిన తీవ్రవాదిని. చలాన్ని ట్యూటరుగా తెచ్చుకుని నాయుడుగారు కాకినాడ బ్రహ్మసమాజ చరిత్రలో కొత్తమార్పుకి కొత్త పూపుకి దోహదం చేశారు. ఆ రోజుల్లో (1916-17 ఆ ప్రాంతాలలో) బ్రహ్మమతంలో రెండు తెగలుండేవి; సానుభూతిపరులు, అనుష్ఠానపరులూ అంటూ. ఈ సానుభూతి

పరులకి నాయుడుగారి ప్రాపకం, పిఠాపురం రాజాగారి అభిమానంకావాలి. నిజంగా వారికి బ్రహ్మమతం అంటే అభిమానం ఎంత మాత్రంలేదు. ఈ సానుభూతి పరులను తగ్గించి నిష్ఠాపరులైన వారిని మాత్రమే వుండనివ్వాలని చలం పట్టుదల. చలం సెక్రటరి, నాయుడుగారు ప్రెసిడెంట్. రాత్రింబవళ్ళు బ్రహ్మసమాజాన్ని ఎలా అభివృద్ధిలోకి తీసుకురావాలనే చలం చింత ట్యూటర్‌గా కాలేజీలో రెండు క్లాసులకు హాజరు తీసుకోవడం, మిగతా పుణ్యకాలమంతా బ్రాహ్మలసేవ, చింతనామృతపాన విశేష మత్తచిత్తమేరీతి యితరంబుచేరనేర్చు, అన్నట్లుండే వాడు చలం. 'తను హృద్భాషల శ్రవణమున్, దాసత్వమున్, వందనార్చనముల్సేవయు-' అన్న భాగవతంలోని ప్రహ్లాదుడికి భక్తుడిగా చెప్పిన లక్షణాలన్నీ చలం పుణికి పుచ్చుకున్నట్లు వుండేవాడు. ఆకాలంలో మొక్కపాటి రామమూర్తి దివానుగారి తమ్ముడు బలే రౌడి. మొదట్లో బ్రహ్మ సమాజానికి వ్యతిరేకి. తరువాత బ్రాహ్మమతావలంబియై మంచి వ్యక్తిత్వాన్ని. సౌశీల్యాన్ని, సాహసాన్ని పెంచుకుని కృష్ణశాస్త్రికి గొప్ప మిత్రబంధువయాడు బ్రహ్మమత సానుభూతి పరులలో ముఖ్యుడయిన పిఠాపురం దివాను సుబ్బారాయుడుగారు తన తమ్ముడు రామమూర్తి. కొత్త మతంలో ప్రవేశించగానే ఆయనను ఇంట్లోంచి వెళ్ళగొట్టారు. ఆయన ఇంటరు చదువుతున్నాడు. దండయాత్రలు చేస్తున్నాడు అనంతాకాశంలో సూర్యచంద్రుల్లా బ్రహ్మ సమాజ ఉద్యమానికి వీరేశలింగంగారు, నాయుడుగారు నిలిచారు. ఆరోజుల్లో కృష్ణశాస్త్రి. రాసిన బ్రహ్మసమాజ భక్తి గీతాలు గొప్ప ఉద్వేగ తో వచ్చాయి కృష్ణశాస్త్రి గొప్పకవి కావడానికి సూచనలు ఆ రాతల్లో కనిపిస్తాయి అతనినించి వచ్చిన గొప్ప కవిత్వానికి వెనుక యీనేపథ్యం పనిచేసింది చలంలో సంస్కరణ భావం ముందువుంటే శాస్త్రిగారిలో అది వెనక్కునెళ్ళి సాహిత్యాంశ ముందుకు తోసుకు వచ్చింది. కాకినాడలో చలం యిల్లు హరిజన విద్యార్థులకు నిలయమైంది. ఎవరు వచ్చినా తిన్నగా చలం యింటికే వచ్చేవారు. చలం చుట్టూ బ్రహ్మసమాజం పరిభ్రమించసాగింది చలం అభిప్రాయాల తీవ్రతను నాయుడుగారు సవరించాలనే వుద్దేశంతో "ఇది కాదు నాయనా! బ్రాహ్మమతమంటే జందెం వున్నదా లేదా అన్నది కాదు. అది కేవలం ఏకేశ్వరోపాసన అందరిని అభిమానించే దయాగుణం. అది అలవరచుకోవలసింద"ని (కేవలం అనుష్ఠాన పరులయుండే అభిమానం కాక) బోధించినా. యవ్వనావేశంలో చలం వినిపించుకునే వాడుకాదు.

రంగనాయకమ్మగారు మాలతీబాయి అని పేరు మార్చుకుని బ్రహ్మమత ప్రచారానికి యింటింటికీ వెళ్ళేది బ్రహ్మమత బోధకురాలుగా ఆవిడ మిషనరీలను

మరపింపజేసింది. అసలు ఆ రోజుల్లో స్త్రీలు ఎలాటి ఉద్యమాల్లోనూ చేరి పనిచేసేవారు కాదు. బ్రాహ్మమత స్త్రీలలో ముందంజవేసినది చలంగారి భార్య రంగనాయకమ్మ గారే. స్త్రీ పురుషులు కలిసి వూరంతా తిరిగి నగర సంకీర్తనం చేసేవారు. యువకులు ఫిడేలు వాయిస్తూ—

'వెడలుదమూ ! వెడలుదమూ !
తడయక యిప్పుడె వెడలుదమూ !
విశ్వవిభుని పావన పద సరోజ
సౌరభముల మోదము గననా !
వెడలుదమూ !!
జాగ్రత! జాగ్రత! మాయజగత్తని
శాస్త్రము లెల్లను విప్పెదవు!
భాగ్యము ప్రేమము పయఃకణములని
బైరాగి ధర్మము చెప్పెదవు
ఇది యంధకూప మిది యస్థికార
బ్రదుకంత గోలపాడందువు
పది దిక్కులంటు మహ పల్లివనము
తుదిలేని పల్లకాడందువు!
ఎవ్వారు నమ్మగలరో హో విరాగీ!
ఈలాటి ఘోరవాక్యమ్ము
ఏదోయి చోటు హాలహాలమ్మునకు
అక్షయమమృత భాండమ్ము
తాటాకు ముసలి దస్త్రాలు విప్పు
వేదాంత ఘోషలిక విసము
సాటేదిలేని సంసారము స్వర్గము
జగమంత పెద్ద బృందావనము!

ఇలా పాడుకుంటూ హడవిడిగా తిరిగేవారు. ఈ యువజన బృందానికి మార్గదర్శి.. మామగారు వెనారసు. పట్టుకుంటువా పెడితే దానిని వంచి బ్రాహ్మమత

జండాలుగా కుట్టించాడు. కండువా కంటె జండా గొప్పదికదా! ఆదివారాలు ప్రార్థనా సమావేశాలకు అటెండెన్స్ పెట్టాడు చలం. హాజరు కాని వారిళ్ళకు మేళతాళాలతో వెళ్ళి రమ్మని భక్తిపూర్వకాహ్వానాన్ని పంపేవాడు. చలం జనాన్ని ఆకట్టుకోసాగాడు. మత ప్రచారంలో సంఘసంస్కరణను చలం ఎలా జోడించాడంటే పెద్దల యిళ్ళకు పిన్నలు వెళ్ళడం కాకుండా ధనికులు, పేదలు, చదువుకున్నవారు, లేనివారు, అనే తారతమ్యం విడనాడి మాఘ భోజనాలకు అందరిళ్ళకూ అందరూ వెళ్ళడం అలవాటు చేశాడు. పైతరగతుల వారికీ పెద్దలకు కించిత్తు కష్టం కలిగించినా, పిన్నలకు క్రింది వర్గం వారికీ చాలా ఉత్తేజాన్ని కలిగించింది. చలం పట్ల అభిమానం పెరిగింది. విద్యార్థులు, యువజనులు, స్త్రీ పురుష భేదం లేకుండా యీ కార్యక్రమాల్లో పాల్గొనడం పెద్దల గుండెల్లో బేజారెత్తించింది ముఖ్యంగా తలిదండ్రులవర్గంలో. ఆ అలజడి అలావుండగా- నాయుడుగారి దర్శనానికి ఆయన ఆంగ్లంలో చేసే సర్వీసు వినితరించడానికి జనం విపరీతంగా వచ్చేవారు. చలం తెలుగులో సర్వీసు చేసినపుడు ఆయన ఆవేదన భావవేశం చూపరులను వూపివేసేది. ఇంకా కొండితలమంది జనం చలాన్ని వినడానికి వచ్చేవారు. అతని తహ తహ అతని ఈశ్వరచింతన అలాంటివి. ఈశ్వర సాక్షాత్కారం కొరకు తపించి నాయుడుగారిని, బ్రహ్మమత ప్రచారకుడైన హేమచంద్ర సర్కార్‌ని అడిగేవాడు. దైవసాక్షాత్కారం కలగజేసే శక్తి వారికి లేకపోయినా అతని అభినివేశానికి వారు ముగ్ధులయి అతనికి త్రోవ చూపడానికి సందేహాలను తీర్చడానికి ప్రయత్నించేవారు. ఆ కాలంలో చలం ధర్మసాధనకి వ్యాసాలు రాస్తూవుండేవాడు.

# వీర బ్రాహ్మదశలో చలం - ఒక లేఖ

బందరులో బ్రహ్మోపాసనా మందిరంలో శ్రీ ముట్నూరి కృష్ణారావు 1918 మే 3 ఆదివారం నాడు "ఈశ్వరతత్వము" పేరుతో చేసిన సుదీర్ఘ ప్రసంగం మే 18 నాటి 'కృష్ణాపత్రిక' సంచికలో అచ్చుకెక్కి కొంతకాలం సాగింది తాత్విక విషయాలే ప్రస్తావనకు వచ్చినా, "బ్రాహ్మమత ఖండనము" జరిగింది కాబట్టి బ్రాహ్మసమాజం నొచ్చుకోవడం సహజమే. దీనికితోడు 1918 జూన్ 15 నాటి 'కృష్ణాపత్రిక' తన సంపాదక వ్యాఖ్యల్లో, కాకినాడ బ్రాహ్మసమాజ సభ్యులలో బయలుదేరిన కలహాలను బయటపెట్టి, బ్రాహ్మసామాజికులలో నానాటికీ

ముదరసాగిన అసహనాన్ని విమర్శించింది తమతో భేదించేవారిని కపటులనీ, దుష్టులనీ, పిరికివారనీ నిందిస్తూ కాకినాడలోని 'ధర్మసాధని' మద్రాసులోని 'హ్యూమేనిటీ' పత్రికలు రాయడం, తమ ఆశయమైన సర్వమత సమన్వయానికే భంగకరమని మందలించింది. కాకినాడలో బ్రాహ్మోపాసనా మందిరంగా ఉన్న భవనంలో పిఠాపురంరాజా తన వ్యాజ్యానికి సంబంధించిన సాక్ష్యాలను వినిపించడం, "దాసీలను" కూడా దింపారనే నిందకు అవకాశం కలిగించడం— యిప్పుడు ప్రస్తావనకు వచ్చాయి.

"విగ్రహారాధనను ఖండించు బ్రాహ్మలు స్వాభిప్రాయములనే విగ్రహములుగా నొనర్చి, మూఢ విశ్వాసముతో పూజించుట యెట్లు సమంజసమో యోజించు కొనెదరు గాక!" అని హెచ్చరించింది.

"ఆధునిక ధర్మ జిజ్ఞాస" శీర్షికతో రాజారామమోహనరాయలు ప్రారంభించిన సందర్భంగా (సెప్టెంబరు 27) 'కృష్ణాపత్రిక' తన 21-9-1918 సంచికలో సుదీర్ఘమైన సంపాదకీయం ప్రచురించింది. ఆయన బోధలను, బ్రాహ్మసమాజికుల సాంప్రదాయకతా బుద్ధితోగాక ఉదారమై విశాలమైన బుద్ధితో సమగ్రమైన దృష్టితో పరిశీలించవలసి ఉందని ముట్నూరి రాశారు. బ్రాహ్మసామాజికులలో మతభేద దృష్టి అంతరించలేదని, "భిన్నమతములు గలుగుచున్న కలహ కోలాహలము సడలి దానును జేరి ఒక నూతన సంగీతముగ బాడవొదగిరి" అని విమర్శించారు. మానవుని బుద్ధికి అందని విషయాలు కొన్ని వున్నవని, "అపరోక్షానుభూతినొందిన మహాపురుషుల,



ముట్నూరి కృష్ణారావు

సిద్ధుల, ఋషుల, వాక్యములను" నిజమైన సాధకులు "శ్రవణ, మనన, నిదిధ్యాసల చేత" తలపోయవలెనని కోరారు.

బ్రాహ్మమత ప్రచారకులైన పాలపర్తి నరసింహం బందరులో 'నవయుగము-నవధర్మము' అనే అంశం గురించి ఉపన్యసించారు. 1918 డిసెంబరు

7నాటి 'కృష్ణాపత్రిక'లో ప్రసంగసారాంశం అచ్చయింది కూడా. నరసింహంగారు కూడా బుద్ధికిగల పరిమితులను సూచిస్తూ, అపరోక్షానుభూతిని ఉగ్గడించారు. బుద్ధి కంటే విజ్ఞానం గొప్పదన్నాడు. సదరు విజ్ఞానం అందరిలోనూ వుందిగాని అది కొందరిలోనే వికసిస్తుందని చెప్పారు.

"దేహము కంటె ప్రాణము, ప్రాణముకంటె మనస్సు, మనస్సు కంటె విజ్ఞానము, క్రమక్రమముగ జగత్పరిణామమున గభీరతత్వములు కలవు. కొందరు ఆధునిక పాశ్చాత్య తత్వశాస్త్రజులుకూడ బుద్ధికంటె అతీతమైన ఆత్మపదార్థము మానవునియందు కలదని ఒప్పుకొనుచున్నారు. ఏ ధర్మము బుద్ధికంటెను, అధిక శక్తియగు విజ్ఞానము కలదని విశ్వసించునో, ఆ ధర్మమే నవయుగమున కనుగుణ్యమైన ధర్మము."

బుద్ధిమూలకమైన హేతువాద ప్రాబల్యంతో బయలుదేరిన బ్రాహ్మసమాజం యిలా సంప్రదాయంతో రాజీపడి, బుద్ధిని కిందికినెట్టి 'ఇంట్యూషన్'ను పైకెత్తింది. దీన్ని బలపరుస్తూ ముట్నూరి తన సంపాదకీయం (1918 డిసెంబరు 21) "బ్రాహ్మమత ఖండనము" చేశారు. గత శతాబ్దిలో బయలుదేరిన "వివరీత సిద్ధాంతములు" గంగలో కలిసిపోయాయన్నారు. పాశ్చాత్యజ్ఞాన ప్రపంచంలో యీ శతాబ్దంలో జరుగుతున్న మార్పులకు ప్రాచీన ఋషులు చెప్పిన "సర్వంఖల్విదం బ్రహ్మమ్"కూ పొత్తు కలిపారు. ఇలా బందరు కాకినాడకూ, సాంప్రదాయక సంస్కరణవాదానికీ పోటీగా నిలిచాయి. ఈ ధోరణిని విమర్శిస్తూ చలం 'కృష్ణాపత్రిక'కు రాసిన లేఖ [1919 జనవరి 11] పూర్తి పాఠం.

## బ్రాహ్మసమాజము

జి. వేంకటాచలముగారు కాకినాడ నుండి మా కిట్లు వ్రాయుచున్నారు:—

"ఈశ్వరునకు సృష్టికిని సంబంధం యేకత్వమందు భేదత్వమని తెల్పుచు కృష్ణాపత్రిక యేకత్వమును సిద్ధాంతీకరించు చున్నది. బ్రాహ్మమతము ఈశ్వరు నుండి సృష్టి పూర్తిగ యేకమనిగాని బేధ (Sic) మని గాని చెప్పుటలేదు. కృష్ణాపత్రికయందు బ్రాహ్మమత ఖండనమును జదివినవారలు కూడ నీశ్వరుడు సృష్టియు ఏకమనెద రనుకొనను. భేదత్వము ఒప్పుకొనుచు కూడ ఏకత్వమే సత్యమని

ఎట్లనగలము? కృష్ణాపత్రిక అనుటయేగాని వారెవరినుండి కొన్ని భాగములను మన కొరకు తీసియున్నారో వారలందరును ఏకత్వమెంత సత్యమో భేదత్వమంత సత్యమే యనుచున్నారు.

"ధర్మసాధననేదో ఖండించునట్లు నటించి మాటల యుద్ధముచే నేదియో ప్రతిపాదించుచున్నట్లు మోసము చేయటయేగాని భేదత్వము లేదను సంగతి కృష్ణాపత్రిక చూపెనా? రెండును సత్యములే, ఒకటి మాత్రమే సత్యమనుట అసత్యము. చక్కెర నుండి తీపి వేరుగాదు. పాలనుండి తెలుపు వేరుగాదు. కాని రామకృష్ణ పరమహంసయైననుకృష్ణాపత్రికయైనను తీపియేచక్కెరనిగాని తెలుపునే పాలనిగాని యనియెదరా? అట్లే ఈశ్వరుడు సృష్టినుండి వేరుగాకున్నను సృష్టి ఈశ్వరు డెట్లగును? ఇంతకంటె బుద్ధిని తర్కమును, దురుపయోగపరచుట గాంచితిరా? దీపమును కాంతియును వేరుగాదనిరి. కాని చూచువారు లేకున్నను దీపము(జ్వాల) కలదు. కాని చూచువారు లేకున్న వెలుగు గలదా? ఇదియే భేదము. అందుచే దీపమును కాంతియు నొకటని యెట్లనియెదము? కాంతి దీపము నుండి వేరుగానున్నను, దీపముచేతనే కాంతికల్గినను కాంతి దీపమెట్లగును?

"కృష్ణాపత్రిక యిట్లనుచున్నది— బ్రహ్మ తానే ప్రకృతియై ప్రకృతిచే బంధింపబడక' ప్రకృతి బ్రహ్మయే గనుక ప్రకృతి బదులు బ్రహ్మయనుపదము నుపయోగించిన బ్రహ్మముతానే. (రామకృష్ణ పరమహంస తెచ్చిన పోలిక)

బ్రహ్మమై బ్రహ్మముచే బంధించబడక— దీని కర్థమేమి? ప్రకృతిచే బంధింపబడియుండుటకు ప్రకృతి వేరుగావలదా?

"తరువాత బ్రాహ్మసమాజము యింకను పూర్వ శతాబ్దముల అభిప్రాయములనే కలిగియున్నదని కృష్ణాపత్రిక అతి ధైర్యముతో జెప్పుచున్నది. సిద్ధాంతముల ప్రతిమలను జేయుట యోగపురుషుల తపోధ్యానమునందు ప్రతిమలను కల్పించు వారలకు గాక యితరుల కెట్లు సాధ్యమగును? సృష్టి ఈశ్వరుడని సిద్ధాంతములు జేయుటకీ ప్రయత్నములన్నియు ఆ విగ్రహారాధనమును సమర్థించుటకే గదా? ఈశ్వరునికి సృష్టికిని భిన్నముగాని సంబంధమున్నదని తెలుపుటకు ఇప్పుడు తానే కన్నులు విప్పవచ్చితి ననుకొనుచున్నదీ పత్రిక, అల్పులకు తక్కినవారెట్లున్నను యెవరేశక్తి సిద్ధాంతములను ప్రపంచముజ్ఞానమయమనుసత్యమును ప్రకృతిశాస్త్రముల ద్వారాదెల్పిరో ఆబోసుగారు(జగదీశ్చంద్రబోస్) బ్రాహ్మలే యనుట కృష్ణాపత్రిక

మరచినది కాబోలు ఎన్నడైనతత్వభూషనుగారి(సీతానాథ్ తత్వభూషణ్)ఆబ్రాహ్మ గ్రంథముల జదివి వ్రాసిన వ్రాతయేనా యది? వీరు వ్రాకుచ్చిన (sic) ప్రకృతిశాస్త్ర తత్వవేత్తలును భేదమును అజ్ఞానమనుచున్నారా? ఏకత్వమును దెలిసికొనక పోవుట అజ్ఞానమేగాని భేదత్వములేదనుటకూడ అంతఅజ్ఞానమే. బ్రహ్మసమాజము,లేదనుట అంధత్వమనుటచే,యేకత్వములేదనుచున్నదని యేదో బ్రాహ్మమతమును ఖండించు చున్నానని తలపోయుచు ఆడంబరముగ బహుప్రయాసపడి చర్వితచర్వణముగ 'బ్రాహ్మమత ఖండనము' వ్రాసిన నేమి ప్రయోజనము? ప్రకృతి 'న్యాయము' అను నదియు జడమును అంధమును కావని బ్రాహ్మసమాజికులకు తెలియదని వ్రాయు చ్చుట మిగుల సాహసము. ఇట్టి యారోపణలు జేయుట మొదలిడినను వానికి అడ్డు వారెవరని తెగించినచో నెంతవరకైనను పోవచ్చును. అందుచేతను కృష్ణాపత్రికయంత విద్వాంసులు కాకపోవచ్చును బ్రాహ్మసమాజమునందును కూడ విద్యావిహీనులు గలరు. కాని బ్రహ్మసమాజము యీ నూతనజ్ఞానము నిరాకరించునయెడల మనము వానిని నిందింపవలసియుండును. ఊరకుండనేల? అందని ద్రాక్షపండ్లను నక్క పుల్లనన్నట్లు బ్రాహ్మమతమున లేనితప్పులను మోపినో యెన్నియో పలుక నెవ్వరైన మోసపోయెదరా? నవీన శాస్త్రజ్ఞులచే సాధింపబడు నూతన జ్ఞానమును బ్రాహ్మ సమాజము నిరాకరించినచో బోనుగాక బ్రాహ్మములు యుండునా? బ్రాహ్మసమా జమున కొందరు మాత్రమే వానిని నిరాకరించుచుందురేని బ్రాహ్మమతమునే ఖండించుట పాడియా?

"అవిగాక మతము మనసులో యుండు నమ్మకమునకన్న ఆచరణయందే యెక్కువగ నుండును. ముఖ్యముగా నమ్మకములందు జీవితమున శక్తిని కలుగజేయు విషయములనేకమైన ఈశ్వర లోకతత్వములను ఏదీఏదీయని నిర్ధారణ జేయుటయందు వెంట్రుకల చీల్చు నీ వ్యత్యాసములతో పోరాడుట, బ్రాహ్మ సమాజము యొక్క ఆశయము కాదు. జీవితమును క్లిష్టపరచు ఆచరణను భంగపరచునంతవరకు మనుష్యు లను కుమార్గములకు లాగనంతవరకు యేవో నమ్మకభేదములపై పోరాడుట బ్రాహ్మ సమాజోద్దేశ్యము కాదు. గనుక యేవో యెందుకో పనికిరాని భేదములపై ముందు తమ కేమియు జోక్యములేని బ్రాహ్మ సమాజము నుద్ధరింపబూని సగము బ్రాహ్మ సమాజము సంగతి తెలిసియు తెలియకయు ఇట్టివ్రాతలతో వారు కష్టపడి మా కాలము వృధా చేయకుందురుగాక యని మా విన్నపము. ఏదో బ్రాహ్మ సమాజము నందలి అసత్యముల ఖండించుచున్నామని భ్రమకలిగించుటచే వారికేమి లాభమో?"

ఈ లేఖ మీద ఒకరిద్దరు తప్ప వివాదాల్లోకి దిగలేదు, కాకినాడ బ్రహ్మ సమాజ కార్యదర్శిగా యీ లేఖ పంపిన " . వేంకటాచలము" గారు మాత్రం మరెంతకాలమో ఆ సమాజంలో కొనసాగలేదు. దానికి కారణం 'ఈశ్వరతత్వము' గురించి భేదాభిప్రాయం కారణంకాదు. మనుష్యతత్వం గురించి భేదాభిప్రాయం, అభిప్రాయమే కాదు అచరణ, మరి యీ ఆచరణలోనూ "మనస్సును కుమార్గము లకు లాగడం" - యిదీ కారణం. చలం ఎన్నడూ ఈశ్వరుణ్ణి మరవలేదు. అట్లని, భౌతికాన్నీ విడవలేదు.

సేకరణ, వివరణ,
కె.వి. రమణారెడ్డి

## బ్రహ్మణేతరోద్యమం-జస్టిస్ పార్టీ

బ్రాహ్మణేతరోద్యమం జస్టిస్ పార్టీకి పట్టుకొమ్మ. రాజకీయాధికారంవారిదే. నాయుడుగారు ఆ పార్టీలో చేరితే దానికి నైతికబలం వస్తుందని ఆ పార్టీవారు వుచ్చులు పన్నారు. పిఠాపురం రాజావారి నైతిక ఆర్థిక సహాయాలు జస్టిస్‌పార్టీకి కావాలంటే నాయుడుగార్ని ముందు ఆ పార్టీలోకి లాగాలి. ఈ రాజకీయపార్టీ ద్వారా ప్రజాసేవ చేయవచ్చునని ఆయనను నమ్మించి తాము వారికి విధేయులమై వుంటా మని చెప్పి ఆయనను చెడగొట్టారు. నాయుడుగారు మీరెందుకు దీంట్లో చేరారంటే సరయిన జవాబు చెప్పలేక జస్టిస్‌పార్టీ అంటే 'డిప్రెస్సుడు కమ్యూనిటీ' అన్నారట. 'అయితే మేము కూడా చేరతామ'న్నారు వేమూరి రామకృష్ణారావు, యస్ వి.యస్. సుబ్బారావుగారలు ఎదురు తిరిగి. 'మీరు బ్రాహ్మణులు, మీరు చేరరాదు 'అని నాయుడుగారు జవాబిచ్చారట. అప్పుడు ఆ బ్రాహ్మసమాజానికి వేరే పేరు పెట్టుకో వలసి వచ్చింది.

కలకత్తాలోని బ్రాహ్మసమాజికులకంటె ఆంధ్రలోవారికిఎక్కువగా ప్యూరిటా నిజం వుండేది. 'యాంటీ-నాచ్ మూవ్‌మెంటు' వీరి ప్రభావంవల్లనే టోగంమేళాలు టోగంవాళ్ళని వుంచుకోవడం యీ రకమైన వత్తిళ్ళ వ్యవహారాలను నిర్మూలించారు.

అనాథ శరణాలయాల్లో స్త్రీ పురుషులకు మధ్యన ఎత్తయిన గోడలు కట్టినా వారు కలుసుకోవడం, గర్భాలు రావడం వాటిని సవరించడానికి తరవాత పెళ్ళిళ్ళు చేయడం తప్పలేదు. 'దేవా వారిద్దరూ ప్రేమించుకొన్నారు. వీరిద్దరినీ, ఆశీర్వదించ

మని కోరేవారు నాయుడుగారు. ఇలాటి ప్రేమలేని పెండ్లిండ్లవల్ల ప్రయోజనం ఏమిటని చలంలో విచికిత్స ప్రారంభమయింది.

నాయుడుగారు ప్రేమతో పెంచిన స్త్రీలు ఆయనతో చెప్పకుండా వివాహ మాడితే ఆ ప్రేమను ఆ పెళ్ళిళ్ళను ఆయన అంగీకరించేవారు కాదు. బ్రహ్మ సమాజికులపై చలం ప్రభావం ఎక్కువయాక స్త్రీ పురుష విభేదాలను వ్యత్యాసాలను అతను తిరస్కరించి అందరూ సమానులేనన్న భావనకు ప్రాబల్యంవచ్చింది. నాయుడుగారి బ్రహ్మసమాజం, చలం గ్రూపు రెండూ వేరువేరయాయి. చలం అనుష్ఠానపరుల వర్గానికి పీఠాధిపతి. ఇలా రెండు సంవత్సరాలు జరిగాక-రత్నమ్మ చలం జీవితంలో ప్రవేశించి అతడ్ని బ్రహ్మసమాజపు నీతులకి దూరంగా నెట్టేసింది. నాయుడుగారికి పాపం కులతత్వం, చలానికి స్త్రీకాంక్ష ఈ రెండూ అచెలస్ హీల్ లాటివేనంటారు సౌరిస్.

"స్త్రీ ప్రేమ తప్ప, ఎంత వెతికినా, స్త్రీప్రేమకి మించి ఈ లోకంలో అభిలషింప తగినది ఏదీలేదు.... ఈ స్త్రీ ప్రేమలో కూడా అనేక అంతర్యాలు ఉన్నాయి. స్త్రీని స్వార్థంగా సంకుచితంగా అనుభవించడంలో సుఖం చాలతక్కువ. తనను అర్పించుకుని స్త్రీని ఆరాధించినకొద్దీ ప్రేమ ఉజ్వలమౌతుంది. నన్ను ప్రేమించి నా బాధపై సానుభూతిచూపి, తనలో నన్నులాలించి నాకు సుషుప్తినిచ్చే స్త్రీ రాబోతుందని చాలా కాలం కలలుకన్నాను—" అంటాడు చలం.

బ్రహ్మసమాజం నుంచి విడివడ్డాక చలం జీవితం రత్నమయమయింది.

బ్రహ్మమతం క్షీణించిన దశను చిలకమర్తివారు యీలా చెప్పారు.

'.... ఆంధ్రదేశములో పెక్కు ప్రార్థన సమాజములు స్థాపింపబడెను. వీరేశలింగముగారును, నాయుడుగారును గతించిన తరువాత బ్రహ్మమతము క్షీణించుచున్నది. మనదేశములోనున్న బ్రహ్మమతస్థులను వ్రేళ్ళమీద లెక్కపెట్ట వచ్చును. ఎందుచేతనో మన దేశములో బ్రహ్మమత వృక్షమేపుగ పెరుగలేదు. అది మనదేశ విరుద్ధమైన మతముగాక పోయినను, మహర్షి సమ్మతమై యుప నిషన్మతమైనను, పూర్వము బౌద్ధమత, జైనమతములకు స్థానమిచ్చిన యాంధ్ర దేశము నేడీ పరిశుద్ధాస్తిక మతమునకు నాశ్రయమియ్యక పోవుట మిక్కిలి శోచనీయము "

ఆంధ్రదేశంలో బ్రాహ్మమతం నాయుడుగారు జస్టిస్‌పార్టీలో చేరడంతో అంతరించింది. ఆ మహాపురుషునికి 'ఎచలస్‌హిల్' చంద్రునిలో మచ్చలా కులం ఫీలింగ్ వుండేది. దాన్ని వుపయోగించుకుని జస్టిస్‌పార్టీవారు ఆయన్ను బుట్టలో వేసుకున్నారు. జస్టిస్‌పార్టీలో చేరడం వలన మద్రాసు విశ్వవిద్యాలయానికి వైస్ ఛాన్సిలర్‌గిరీ ఆయనకు కట్టబెట్టినప్పటికీ అది నాయుడిగారి వ్యక్తిత్వానికి తగినంత గొప్పపదవి ఏమీ కాదు.

చలం తన ఆత్మకథలో 'నేను బి.ఏ.ప్యాస్ కాగానే ఉద్యోగ ప్రయత్నంచేసికుంటోవుండగా వెంకటరత్నంనాయుడుగారు నన్ను తన కాలేజీలో ట్యూటర్‌గా చేరమని టెలిగ్రాం యిచ్చారు. ఆయనకి ప్రియశిష్యుణ్ని అయినాను. ఆయన ఎన్నివిధాల గొప్పవారో! ఆయన నా మొదటి ఆధ్యాత్మిక గురువు—' అన్నాడు. అంటూ, ఎట్లా పట్టిందో ఆయనకి పిఠాపురం మహారాజుగారిపై ప్రేమ. అదొక్కటే తప్ప ఆయన జీవితంలో ఎన్నతగిన లోపమేదీ కనిపించదు. ఆ ప్రేమ ఆయన్ని లోపభూయిష్టం చేసింది' అని నొచ్చుకున్నాడు.

'చలం మిత్రులు'లో తారకం గురించి రాస్తూ గాంధీజీ హరిజనోద్ధరణం అనే ఉద్యమం లేవదీయక ముందే నాయుడుగారు గొప్ప హృదయంతో సంస్కరణను చేపట్టిన సంగతి చలం చెబుతున్నాడు——

## తా ర క ం

(తారకం మొక్కపాటి రామ్మూర్తి మేనల్లుడు. పిఠాపురం దివాను మొక్కపాటి సుబ్బారాయుడిగారి కుమార్తెను తారకానికి చేస్తారనీ, బియ్యే ప్యాస్ కాగానే యితను దివాను అవుతాడని అనుకునేవారట. చలం బ్రహ్మసమాజం నుంచి వచ్చేశాక రామ్మూర్తి ద్వారా చలానికి తెలిసింది; తారకం నాయుడుగారు పెంచుకున్న పిల్లల్లో ఒకామెను పెళ్ళి చేసుకోబోతున్నాడనీ, ఆ పెళ్ళికి నాయుడుగారు వప్పుకో లేదని.ఆ పెళ్ళి రామ్మూర్తి సహాయంతో మద్రాసులో జరిగింది. బ్రహ్మ సమాజం వారంతా వ్యతిరేకించారు, నాయుడుగారు వ్యతిరేకించారుగదా అని).

'తారకం పెళ్ళాం సగుణమ్మ, నాయుడుగారు పెంచుకున్న అమ్మాయిల్లో ఒకమ్మాయి. పొన్నేరి రైల్వేస్టేషన్‌లో రైలు వక్కనే బిచ్చమడుక్కుంటున్న నలుగురు హరిజన బాలికలను చూశారు నాయుడుగారు. వాళ్ళకి దిక్కు లేదని

తెలిసి పోలీసులకి మేజస్ట్రేటుకి తాను పెంచుకుంటానని తెలియజేసి ఆ నలుగుర్నీ పెంచుకున్నారు నాయుడుగారు. వాళ్ళల్లో సగుణమ్మ ఒకతి. ఆమె బి. ఏ. పాస్ అయింది. నాయుడుగారికి భార్యలేదు. ఒక కూతురుంది. ఆమెకు పెళ్ళై అత్త వారింటికి వెళ్ళింది.

ఆ కాలంలో అడుక్కునే మాలపిల్లల్ని తీసుకొచ్చి తన యింట్లో తన స్వంత పిల్లల కింద పెంచుకున్నారంటే ఆ పనిలో ఔదార్యం, ధైర్యం, దయా యీనాడు వూహించుకోలేము. నాయుడుగారింటికి వెళ్ళి చూసినప్పుడు ఆ పిల్లలు ఒకప్పుడు రైళ్ళ దగ్గర అడుక్కునే మాలపిల్లలని దూరంగా కూడా వూహించుకో లేము. ఈనాడు కథలో, ఫిల్ములో, సంస్కారంగల కుటుంబాలలో, సంస్కారం లేని కుటుంబాల్లో పెళ్ళి చేసుకుంటే ఎట్లా ఆ భేదాలు బయటపడి ఆ వివాహాలు తెగి పోతాయాఅని వెక్కిరించటం పరిపాటైపోయింది. ఆనాడు తారకం చేసిన పని సులభమైన పనికాదు. అతను చేసిన పని పెద్ద త్యాగమూ కాదు.... తారకం సగు ణమ్మలతో తిరిగిన వారెవ్వరికైనా మొదట్లో వారికి కులసంస్కారం భేదాలు వుండేవని తెలుసుకోవటం చాలా కష్టం. నాయుడుగారి పెంపకంతోనే ఆ పిల్లల్లో ఏ లోపం ఎవరూ చూడలేక పోయేవారు. ఇంతతా కూడా గాంధీగారు హరిజనోద్ధ రణ అనే మూవ్‌మెంట్ లేవదీయక ముందే జరిగింది.

## నాయుడుగారి చివరి రోజులు

1937లో కళ్ళు జబ్బు చేసి నాయుడుగారు మద్రాసులో వైద్యం చేయించు కొనడానికివెళ్ళారు.వీరేశలింగంగారితోపాటు నాయుడుగారు వేశ్యానిరసనోద్యమాన్ని (ఆంటీనాచ్) నిర్వహించారు. శ్రీ రఘుపతి వెంకటరత్నము నాయుడుగారు కంటి జబ్బు మద్రాసులో కుదరక కాకినాడ వచ్చి రెండు మాసములు అక్కడ బాధపడి 1939 మే 26వ తేదీన రాత్రి చనిపోయారు. నాయుడుగారికి అంత్య క్రియలు జరిగిన విధం చిలకపర్తివారి స్వీయచరిత్ర నుంచి—

'— వారు పోయినచోట శిష్యులు ప్రార్థనలు చేసి, పిమ్మట బ్రహ్మ మందిరము వద్ద ప్రార్థనలు చేసి, శవము ననాథశరణాలయము వద్దకు గొంపోయి యచట ప్రార్థనలు సలిపి యూరేగింపుచు రుద్రభూమి చేర్చిరి. నేనుకూడా వెళ్ళి తిని. చాలా మంది జనులు వచ్చిరి, రుద్రభూమి కడకు శ్రీ దురిశేటి శేషగిరిరావు గారు, శ్రీ లక్కరాజు సుబ్బారావుగారు, చావలి రామసోమయాజులుగారు మొద

లగు పురప్రముఖులు వచ్చిరి. అచట డాక్టరు వేమూరి రామకృష్ణారావుగారు, పెద్దాడ రామస్వామిగారు, లక్కరాజు సుబ్బారావుగారు, చావలి రామసోమయాజులు గారు, నేనును (చిలకమర్తివారు)నాయుడుగారి పరిశుద్ధ జీవనమును గురించి యుప న్యసించితిమి. కోకా వెంకట సుబ్బారావునాయుడుగారు శవము తలక్రింద హారతి కర్పూరము పెట్టి పుత్రునివలె నగ్ని సంస్కారము జేసిరి. రెండు గంటలలో నాయుడుగారి శరీరము భస్మావశేషమయ్యెను.

## మొక్కపాటి రామ్మూర్తి

"ఓ మానవోత్తమా! ఓ వీర మూర్ధన్య!
ఓ యమృత భాసమా
నోన్నత ప్రేమసామ్రాజ్యైక చక్రవర్తీ!
స్నేహశీలి!
నీ హృదంతికములో నిరుపమానాఖాత
రత్నాకరామూల్య రాగసంపద మెఱయు!
నీయాశయమ్ములో నిర్మలోత్తుంగ ది
వ్యాకాశ సంకాశ భాగ్యరాసులు మెఱయు!
ఈయశ్రు ఝురులతో, ఇరులతో, రొదలలో
సొదలతో, ఈ హాసమృదుల వాసనలతో
విసముతో, సిగ్గుతో, కొసరు తేనియలతో
ఈపాటి బ్రతుకు నీకేపాటిదోయి, నా
నెచ్చెలీ! నెచ్చెలీ! ॥

అని ప్రవాసం కావ్యాన్ని రామమూర్తికి అంకితమిస్తూ పలవరించాడు కృష్ణ శాస్త్రి. వెంకటచలం 1921లో రాసిన తన తొలి నవల శశిరేఖను మిత్రుడు మొక్కపాటి రామమూర్తికి అంకితమిచ్చాడు. ముద్దుకృష్ణ వైతాళికులు సంకలనాన్ని యీ రామ్మూర్తికే అంకిత మిచ్చాడు. ఏ స్త్రీ కోసమై చలం బ్రహ్మసమాజం కట్టు డుల నుంచి తెంపుకుని వచ్చాడో ఆ స్త్రీ ప్రేరణ ప్రభావం శశిరేఖపై తప్పక వుండాలి. ఈ నవలలోని పాత్రలు పూర్తిగా కల్పితములు కావు. ఈ శశిరేఖ పాత్ర

చిత్రణకు ప్రాతిపదిక రత్నమ్మేనని రచయిత జీవితాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే తెలుస్తుంది. ఈ మొక్కపాటి రామ్మూర్తి ద్వారానే కృష్ణశాస్త్రి చలానికి పరిచయం అయాడు. చలం మిత్రులు పుస్తకంలో కష్ణశాస్త్రిని గురించిన వ్యాసంలో ఓం ప్రథమంలోనే రామ్మూర్తి ప్రస్తావన వస్తుంది. అందులో 'రామ్మూర్తికి అతను నైతిక శిష్యుడు కూడా. వారానికి ఒకటి రెండుసార్లు తలుపులువేసి రామ్మూర్తి అతన్ని ధారాళంగా ఓ గంట తిట్టేవాడు. అతను ఏడుస్తో బయటికి వచ్చేవాడు.రంగ నాయకమ్మగారు (చలం భార్య) మాత్రం చాలా ఎంజాయ్ చేసేది, ఇతన్ని తిట్ట డం. ఎందుకంటే కృష్ణశాస్త్రి భార్య, రంగనాయకమ్మగారి మిత్రురాలు. ఆమె ఎప్పుడూ ఈ భర్త మీద కంప్లయింట్ చేస్తో వుండేది రంగనాయకమ్మగారితో. రామ్మూర్తి చివాట్లు కృష్ణశాస్త్రిని బాగుచేస్తాయని ఆవిడ ఆశ.అతని భార్య ముఖ్యమైన కంప్లెయింట్ అతను ఇంటికి రాడని।

పిఠాపురం దివాన్ చేసిన మొక్కపాటి సుబ్బారాయుడుగారి తమ్ముడే యీ రామ్మూర్తి. మొక్కపాటి సుబ్బారాయుడుగారి మరొక తమ్ముడే మొక్కపాటి నర సింహశాస్త్రి, బారిష్టర్ పార్వతీశం రచయిత. తన తమ్ముడు చలం ప్రభావంలో పడి చెడిపోతాడని నరసింహశాస్త్రికి చలం మీద తీవ్రమయిన అక్కసు వుండేది.

"ఇంతలో రత్నమ్మ మూలంగా నేను బ్రహ్మసమాజానికి దూరమయ్యాను. తరవాత రామ్మూర్తిని కూడా బ్రహ్మ సమాజం వాళ్ళు వెళ్ళిపోమన్నారు. దాంతో కృష్ణశాస్త్రి కూడా దూరమయ్యారు బ్రహ్మ సమాజానికి....కృష్ణశాస్త్రిభార్య చచ్చి పోయింది. తక్కిన తెలుగు కవులమల్లేనే పున్నన్నాళ్లూ భార్య నేడిపించుకు తిన్నాడు కృష్ణశాస్త్రి. ఆమె చచ్చిపోగానే గొప్ప మరణగీతాలు రాశాడు."

(చలం మిత్రులు నుంచి)

చలం యింకా యిలా అంటున్నాడు— నేనూ రామ్మూర్తి వెళ్ళిపోయాక కృష్ణశాస్త్రి, ఆ వూళ్ళో వంటరిగాడై పోయాడు....కాని వెంకటరత్నం నాయుడుగారు ఎక్కడైనా పశ్చాత్తాపం కనబడ్డదా వెంటనే క్షమిస్తారు. రాజాగారు ఈ కవిని తన కోట వేపు రానీయవద్దన్నారట. పెళ్ళాం చచ్చిపోయినవాళ్ళు చాలా సులభంగా నాయుడుగారి సానుభూతిని పొందవచ్చు . భార్యా వియోగంలో దుఃఖితుడైన శాస్త్రిని నాయుడుగారు ఆలింగనంలోకి తీసుకున్నారు. కాలేజీలో తెలుగు ట్యూటర్ కింద వుద్యోగం కూడా దొరికింది శాస్త్రికి.

ఇంతలో నాకూ, రామ్మూర్తికి కూడా రాజమండ్రిలో వుద్యోగాలైనాయి. దూరదేశాల నుంచి తిరిగి వచ్చాం పిల్లల్తోసహా. రామ్మూర్తిభార్య చంద్రమతి సెంట్రల్ జైల్ ఆఫీసర్స్ క్వార్టర్సులో ప్రవేశించింది రామ్మూర్తి ధర్మపత్నిగా.

రామ్మూర్తిని చూడకుండా వుండలేక పోయినాడు కృష్ణశాస్త్రి. పగలు కాకినాడలో వుద్యోగంచేసి రాత్రులు రామ్మూర్తితో గడిపేవాడు. త్వరలోనే రామ్మూర్తితో పడలేక చంద్రమతి వెళ్ళిపోయింది. కాని త్వరలోనే రామ్మూర్తి అతని మరదలు రత్నమ్మా ఆ యింట్లోనే కాపురం పెట్టారు. ఆ యింటికి అంతటితో అపూర్వమయిన సంస్కారమూ, విశాలత్వమూ వచ్చాయి. కృష్ణశాస్త్రితో పాటు ముద్దుకృష్ణ మొదలైన నవీన కవులందరూ చేరారు, అక్కడ రత్నమ్మను కళా కేంద్రంగా చేసుకుని.

అవి పుజ్వలమైన రాత్రులయి వుండాలి. కృష్ణశాస్త్రి. వుండుండి నాకూడా దర్శన మిస్తూండేవాడు. అప్పటి కాయన కవిత్వంలో ప్రతిష్ఠితుడయ్యాడు. రత్నం నా దగ్గిరికి తరచూ వస్తూండడం వల్ల రామ్మూర్తి నాతో ఎక్కువ స్నేహంగా వుండేవాడు కాదు. అందువల్ల ఆ కవుల కంపెనీని మిస్ అయినాను నేను. సత్యవతి ప్రకాశం కూడా వాళ్ళలో చేరారు.

ఒకరాత్రి రామ్మూర్తి హఠాత్తుగా నన్ను చూడ్డానికి వచ్చాడు. "నీకేం తెలీదు యీ మూల కూర్చున్నావు హాయిగా. ఇప్పుడు రాత్రిళ్ళు కృష్ణశాస్త్రి. మాయింట్లోనే వుంటున్నాడని తెలుసానీకు? ప్రతి రోజూ ఒక గీతం రాసి తెస్తున్నాడు సత్యవతి మీద. భోజనం కాగానే ప్రకాశం, సత్యవతి కూడా వచ్చి మా ఇంట్లోనే వుంటున్నారు. రాత్రి మేం అందరం నిద్రకి పడుకున్నా వాళ్ళిద్దరూ వరండాలో వుండిపోతారు. "ఏమిటీ విపరీతం" అన్నాను. "విపరీతమే మరి" అని ఏమిటేమిటో చెప్పాడు అప్రస్తుతమైన సంగతులు. చివరికిదేదో పెద్ద ఘోరమయేట్టుంది అనుకున్నాను నేను.

కృష్ణశాస్త్రి గొప్పగీతాలు రాస్తున్న రోజులవి. నేనూ, రామ్మూర్తి. ప్రకాశం ముగ్గురం రాజమండ్రి వదిలేయడంతో కృష్ణశాస్త్రి దిక్కులేక కాలేజీలో తెలుగు ట్యూటర్ అయినాడు. పెద్దాడరామస్వామిగారింట్లో సెక్రటరీగా అప్పుడిగాకాలంగడుపుతున్నాడు. ఆకాలంలోనే బ్రహ్మసమాజపు బ్రహ్మ గీతాలకి అతనెంతో అలంకారమైన గొప్ప గీతాలు రాశాడు. ఒక్క బ్రహ్మ సమాజాని కేమిటి? ఆంధ్ర సాహిత్యానికే గొప్ప అలంకారమైన గీతాలవి." (మహతిలోవి)

ఈ రామ్మూర్తి, రత్నమ్మ, చలం వీరంతా అమీనా నవలలో (1924-1942 రచనా కాలం) ఆ పాత్రల బిహేవియరల్ పాటర్న్‌ను ప్రభావితం చేశారు. అది హోస్పేటా, రాజమండ్రి, ఏలూరా అనేది అనవసరం. ఎక్కడో ఓ చోట. ఈ అమీనా గురించి శ్రీ వెన్నవరం ఈదారెడ్డి 'చలం నవలలు-సామాజిక చైతన్యం' అనే పరిశోధనా పత్రంలో అమీనాలోని ఆత్మకథాంశాల గురించి యిలా వివరించారు—

"వివరణ-చలం మిత్రులు రామ్మూర్తి, నండూరి సుబ్బారావు ఈ నవలలో పాత్రలు. అమీనా కూడా చలం జీవితంలో తారసపడిన వ్యక్తియే. కథలో రచయిత మిత్రురాలైన డాక్టర్ ప్రస్తావన వస్తుంది. ఈమె చలంగారి వదినె డాక్టర్ రంగనాయకమ్మగా స్ఫురిస్తున్నది. ఈమెనే చలం తన ఆత్మకథలో 'వొయ్యి' అని ప్రస్తావించాడు. ఈమెతో చలం కొన్నాళ్ళు ప్రేమగా తిరిగాడు. రచయితభార్య సుబ్బులు. చలంభార్య రంగనాయకమ్మకు ప్రతీకగా గ్రహించి వుండ వచ్చునని తోస్తుంది. చలం స్వేచ్ఛా ప్రణయతత్వంలో చిక్కుకొన్నప్పుడు భార్య రంగనాయకమ్మ కూడా బాధపడింది. చలం రత్నమ్మ ప్రేమ వ్యవహారం భార్యరంగనాయకమ్మను కుంగదీసింది. అయితే విస్తార జీవనాంశాలతో కూడిన ఈ వ్యక్తుల జీవితాల నుండి చలం మోహవిషయాలలోని జెలసీలకు సంబంధించిన విషయాలను తన దృష్టితో వివేచించాడు. కాబట్టి ఆ వ్యక్తులు యథాతథంగా నవలలో వుండటానికి వీలులేదని గ్రహించాలి."

'శశిరేఖ' గురించి రాస్తూ శ్రీ శివశంకర శాస్త్రి తన పీఠికలో—

'ప్రేమ శాశ్వతమా చంచలమా అని కొందరు ప్రశ్నిస్తారు. గాఢానురాగము శాశ్వతముకాదని యెవరనగలరు? అయితే జీవితములో ప్రేమ ఒకసారి కలుగుతుందా, అనేక పర్యాయములు ఉదయిస్తుందా? ఈ విషయములో మతభేదాలున్నవి. ప్రేమామృత ఝరి హృదయములో నిరంతరమూ ప్రవహించేవారు ఎక్కువసార్లు ప్రేమించగలరు. ఏక కాలములో ఇద్దరు వ్యక్తులను మాత్రము సమానముగా ప్రేమించడం అసంభవము. ఒకరిమీద అనురాగము సడలిపోయిన తర్వాత ఇంకొకరిమీదికి ప్రసరించ వచ్చును' అని కథానాయికను జాగ్రత్తగా సమర్థిస్తూ 'ఈ కథానాయిక సామాన్య స్త్రీ కాదు. ఈమె ప్రేమైక జీవిని. అందుచేతనే తనకు యోగ్యుడైన ప్రియుని కోసమై ఎట్టి త్యాగమైనా చేసింది. స్వాతంత్ర్యములేని

సామాన్య స్త్రీలవంటి పతివ్రత ఈమె కాదు' అని రూలింగ్ యిచ్చారు. రామ్మూర్తి రత్నమ్మ, చలం—కృష్ణశాస్త్రి, సత్యవతి వీరి సంబంధాలను వ్యావహారిక జగత్తు నుంచి విడదీసి చూడడానికి తాత్త్వికమైన ప్రాతిపదికను శాస్త్రిగారు తమ పీఠికలో తెచ్చియిచ్చారు. ఎవరైనా వారెవరైనా కృష్ణశాస్త్రిని చలాన్ని ప్రభావితం చేసిన గొప్ప స్త్రీ మూర్తులు. రామ్మూర్తిని విషాదంలో ముంచిన చలంశృంగారరేఖ పొడిగింపు వెనక నేపథ్యం లీలగా యిది.

శశిరేఖ గురించి చలమే ముగింపులో దేవదూతచేత యిలా అనిపిస్తాడు—

'అవును, యీామె ఆ లోకంలో వుండ తగినది కాదు. ఎక్కడ ప్రేమకు అంతంలేదో, అంతా ప్రేమమయమో, యెక్కడ ప్రేమకు నీతిదుర్నీతి అనునవి లేవో, అట్టి లోకానికి వాస్తోందీమె. తన మనోకల్పితములైన దివ్య ప్రేమమూర్తులతో లీలలకై యీామెకు వరమీయబడినది. ప్రేమించినవారికి పాపములేదు. ప్రేమమూర్తి, ప్రేమాగ్నిలో తప్తమైన పరిశుద్ధమైన దీమె ఆత్మ. ధన్యురాలు. ప్రేమించినది!

## రత్నమయమైన చలం యవ్వనం

చలం తన ఆత్మకథలో రత్నమ్మ గురించి యిలా రాసుకున్నాడు—

'నేను బ్రహ్మమతంలో ప్రవేశించడంతో, ఆ సమాజానికి నవజీవనం పోసినట్టయింది. నేను, రామ్మూర్తి, ఇంకా మిత్రులు అతివాదులమైనాం.... ఇంతలో రత్నమ్మతో స్నేహమయింది. పరస్త్రీతో సంగమమేకాదు ఆ విధమైన మనో వాంఛ సహితం పాపం. నా Romance అనేది నా రక్తంలో కలిసి నాలోనే పుట్టింది. ఎంత ప్రయత్నించీ శృంగారవాంఛని ఈనాటి వరకూ జయించలేకపోయినాను. అదే లేకపోతే నేను ఎందుకు బతికి?.... ఈ శృంగార వాంఛనించి తప్పించుకోవాలి, జయించాలి అని ఎంత గట్టిగా ప్రయత్నించానో! పైగా యివి 'T'కి బాధాకరం. కాని ఆ శృంగారంలేనిది నేను బతుకుతున్నట్టు ఉండేది కాదు నాకు ...ఇది పాపమా? ఇంత ఆనందకరమైనది పాపమా? ఎందుకు పాపం? భార్యతోలేని పాపం ఇంకో స్త్రీతో పాపమెట్లా అయింది?.... క్రమంగా ఈ సందేహాలవల్ల నా మనసు బ్రహ్మ నిబంధనలనించి ఎదురు తిరిగింది.... రామ్మూర్తి, రంగనాయకమ్మగారు, రవి, నాగయ్య, చంద్రమతి, వీరభద్రరావుగారు అందరం ఒక ఇంట్లోనే వుండేవాళ్ళం. కవి కృష్ణశాస్త్రి రోజులో చాలా భాగం మాతోనే

గడిపేవాడు. ఆ రోజుల్లో మా యిల్లు బ్రహ్మసమాజానికి మూలస్థానమయింది. అది ఉజ్వలమైన కాలం. రామ్మూర్తి అత్తగారి యిల్లు మాకు చాలా దగ్గిర. అతని మరదలు రత్నం కాలేజిలో చదువుకుంటోంది. తరచు ఒక్కొక్క రాత్రి వరిగెత్తు కుని వొచ్చేది తనకి అర్థంకానిదేదో explain చెయ్యమని నా దగ్గిరికి.

రామ్మూర్తి, చంద్రమతి కలకత్తా వెళ్ళారు, అక్కడ చాలా కాలం వుండ టానికి. అప్పటికి రామ్మూర్తికి ఒక చంటిపిల్ల. ఆ పిల్లని కాకినాడలోనే అత్త వారింట్లో వొదిలేశారు. ఓ రాత్రి రత్నమ్మకి మా ఇంట్లో పాఠం చెపుతున్నాను. ఆలిస్యమయింది. మధ్యలో రత్నం వెళ్ళిపోతానంది, కాస్త వుండమన్నాను.

"ఆలిస్యమయింది. పాప ఏడుస్తోవుంటుంది" అంది ఆమె. నేనూ లేచాను "అక్కడికి వొచ్చి చెపుతాపద" అంటూ.

"మీ వాళ్ళు వున్నారుగా" అని అడిగాను.

"లేరు. వాళ్ళు వూరికి వెళ్ళారు"

"ఏమిటి? నిన్ను ఆ పాపని వొంటరిగా వొదిలి?"

తల ఆడించి మౌనంగా నడుస్తోంది తలఎత్తి చూస్తే ఆమె కళ్ళవెంట నీళ్ళు.

"ఏమిటి రత్నం ఎందుకు ఏడుస్తున్నావు?"

ఇంకా ఏడుస్తోంది నా రొమ్ములో తలదాచుకుని. ఇంటికివెళ్ళి లోపలికి పోయి ఆ ఏడ్చే పాపని ఎట్లాగో ఓదార్చి వొచ్చింది. నా ప్రశ్నకి జవాబు చెప్పక పుస్తకంతీసి చదువుతోంది.కన్నీళ్ళు మాత్రం చెక్కిళ్ళకిందకి కారుతూనేవున్నాయి. ఇంకేం అడగగలను? నేనూ మానవమాత్రుణ్ణి. ముందు ముందు పది పన్నెండేళ్ళ తనతోవలో నడిచిన ప్రతి శృంగార, ఆర్ద్రహృదయాన్ని మండించిన అందమంతా ఆమెలో అప్పుడే కొత్తగా వికసించటం ప్రారంభిస్తోంది. ఆమెని దగ్గిరగా తీసు కుని లాలించాను. ఆమె నా వొడిలో వొదిగి కావిలించుకుంది. ఏమిటిది? ఏం పని? పాపం! పాపం! అనేభీతితో తల్లడిల్లుతోనే వున్నాయి మా కళ్ళు. ఈశ్వరా! ఈశ్వరా! ఈ పాపంనించి తప్పించు అంటూనే వున్నాయి మా హృదయాలు. ఆ మన్మథుడు మా నియమాల్ని తృణప్రాయంగా తుంచేస్తున్నాడు. వెళ్ళే ముందు నేను అడిగాను.

"ఇందాక ఎందుకు ఏడ్చావు రత్నం?"

"అది యింటు (పాప పేరు) తెల్లార్లు ఏడుస్తోంది. ఒక్క రాత్రి సరిగా నిద్రపోదు"

"నీమీద పడేసి వెళ్ళారు అందరూ. ఏడవకు. నేను ఉన్నానుగా నే చూస్తానులే"

ప్రేమించే భార్యకి ఎంతసేపు తెలుసుకోటం? "పాతాలు చాలా కతినముప్పు తున్నట్టున్నాయి. మీరు ఎంతో రాత్రిపడ్డాకగాని రావటంలేదు" అంది T. ఆమె హ్యూమర్ తో నేనూ కలిసి నవ్వుతున్నాను. చప్పున ఏడ్చింది రంగనాయకమ్మ గారు. నేను మంచంమీద కూచుని ఏడ్చాను చాలాసేపు ఆమె దిగులు భరించలేక. మర్నాటినించి నా లోపల ప్రారంభమైంది వేదన. రంగనాయకమ్మగారిని 'చిట్టి' అని పిలిచేవారు. నేను చిట్టి అని పిలవటం బద్ధకమేసి 'T' అని పిలిచేవాణ్ణి. రత్నమ్మ మా జీవితంలో ప్రవేశించే వరకు మా ప్రేమ జీవితం గొప్పగా నడిచింది. రత్నమ్మని చూస్తే 'T' కి చాలా ముద్దు. రత్నంని చూసి ముద్దుపడనివారు అరుదు. హఠాత్తుగా నా జీవితం రత్నమయ మయింది. ఎంత శాంతంగా, సుఖంగా జీవితం గడుస్తోందో అంతవరకు తీరనివేదన పట్టుకుంది. దేనికో అందనిదానికి వెతుకుతో వుండేవాడిని.

రామ్మూర్తి కలకత్తా వెళ్ళకముందు ఓ సారి నేనూ అతనూ మాట్లాడు కుంటున్నాము.

"రామూర్తీ! నాకు తిరిగి తిరిగి ఓ సందేహం వొస్తోపుంటుంది.ఎక్కడైనా ఏ అందమైన స్త్రీలను చూసినా నేను చాలా attract ఔతాను. అది పాపమంటావా నువ్వు?"

"పాపమనే అంటాను నేను" అన్నాడు అతను.

"పాపకార్యాలమీద చాల రోతనాకు. ఒక అబద్ధం చెప్పాననుకో ఎంత బాధపడి పోతానో! నన్ను నేను అసహ్యించుకుంటాను, సిగ్గుపడతాను, పశ్చాత్తాప్పడతాను. ఏ పాప కార్యమైనా నా కంతే. కాని స్త్రీకై నేను పడే ఆకర్షణలో నాకు సంతోషం తప్ప ఏ బాధారాదు"

"ఔను, ఆ ఆకర్షణతో అంతమైతే అందాన్ని చూసిన appreciationతప్ప అంతకన్నా కోర్కెలేకపోతే దాంట్లో తప్పేముంది" అన్నాడు.

"అక్కడితో ఆగదే. ఆమెను కావిలించుకోవాలని, ముద్దులు పెట్టుకోవాలనీ గొప్ప ఆశ కలుగుతుంది. ఒకవేళ ఆమె కూడా నన్ను యిష్టపడ్డట్టయితే నా ఆనం దానికి మేరలేదు. ఇంత ఆనందమిచ్చే పని, పాపం, తప్పు అంటే నేను నమ్మ లేకుండా వున్నాను. పాపంలో అంత ఆకర్షణ ఉంటుంది అంటావా?"

"తప్పకుండా వుంటుంది"

"ఔను, నాకు తెలుసు. పురాణాలు, శాస్త్రాలు, పెద్దలు, మన బ్రహ్మ సమాజపు గురువులు అందరూ గట్టిగా ఖండిస్తారు. వారు చెప్పేదంతా నిజం కావొచ్చు. కాని నాకు నిజమనిపించదు. మనం కులాల్ని విగ్రహారాధనల్ని, తద్దినాల్ని, వీటన్నిటిని అతిక్రమించాం. ఈ నీతులకి మాత్రంఎందుకు లొంగిపోవాలి? ఎప్పుడన్నా దేవుడు ఈ పనులన్నీ చెడ్డవని చెప్పాడా?"

"కాని నీ అంతరాత్మ ఏమైంది?"

"నా అంతరాత్మ దీంట్లో ఏమీ తప్పు లేదని చెపుతోంది."

"ఏమోనబ్బా నాకు తెలియదు" అన్నాడు రామ్మూర్తి.

నేను చేసిన Statements లోని Implicatons తెలుసుకునేంత జ్ఞానం లేదు నాకింకా. క్రమంగా జీవితం నెత్తి మీద కొట్టి నేర్పితేనేగాని స్పష్టంకాలేదు ఆ సమస్య.

## చలం స్త్రీ పక్షంలో....

చలానికి రైల్వే ప్లాట్ఫాం మీద వచ్చేపోయే రైళ్ళని చూస్తూ తిరగడం యిష్టం. ఓసారి గోదావరి స్టేషన్లో మెల్లొంచి ఓ యువతి ఏమీ సామానులు లేకుండా దిగింది. రామ్మూర్తి కోసం వచ్చిందిట. ఆవిడ రామ్మూర్తిని నా ముద్దుల మురళీ అని సంబోధిస్తూ ఉత్తరాలు రాసేదిట. ఆవిడ పేరు వరలక్ష్మిగారు. చలం ఆవిడను తీసుకుని యింటికి వెళ్ళాడు గాని భార్య రంగనాయకమ్మగారు సుముఖంగా ఆహ్వానించలేదు. లోపలికి వెళ్ళమంది.

"నా పక్కన స్త్రీనిచూసి రంగనాయకమ్మగారి మొహం మీద భర్త ఇంటికి వొచ్చాడనే సంతోషం, షాని చూసిన ప్రేమ మాడి పోయాయి" రామ్మూర్తి లేక పోతే రత్నం యీమెను రానిస్తుందా అనే శంక వచ్చింది చలానికి. బండి ఎక్కించాడు. తిరిగి వస్తే ప్రకాశం చోటిస్తాడా యీమెకి?

అట్లా ఎవరన్నా రంగనాయకమ్మకి ఇష్టం లేనివారు చలంతో వచ్చినప్పుడు భోజనాలు వరండాలో పెట్టేదిట. ఆ మసకలో గోదావరిని చూస్తూ అన్నం తినటం ఓ పండుగ.... పిల్లలు లోపలికి వెళ్ళాక—

'—తరవాత ఆ కొత్తామె నేను పచ్చపాము పాకలోకి వెళ్ళేవాళ్ళం. ఇల్లు అమ్మది (రంగనాయకమ్మగారిది). పచ్చపాము కుటీరాన్ని (అది అసలు పందులు గుడిశగావున) ఓ నాలుగు అణాలకి అద్దెకి యిచ్చారు.... ఎదురుగా గోదావరి, దాని కప్పులో ఓ పచ్చపాము తిరుగుతో వుండేది. దాన్ని చూస్తే భయం కన్న అసహ్యమెక్కువనాకు. నాకు దేవుడిలో నమ్మకం లేదు. కాని తెలీని ఓ మహాశక్తో, జ్ఞానమో, ఏదో నన్ను కనిపెట్టి రక్షిస్తోందని ఓ వెర్రి నమ్మకం నాకుండేది.'

'—ఇంక సత్యవతి అంటే కళ్ళు కనబడని ప్రేమ అతనికి. (ప్రకాశం) అతన్ని అతని కుటీరందగ్గిర వొదిలి,నేనూ పిల్లలూ ఇంటికి చేరేవాళ్ళం.ఒక్కొక్క సాయంత్రం రామ్మూర్తిని, రత్నమ్మని వొదిలి వొస్తోవుంటే ఓ పంద గజాల్లో నావెనకనే చప్పుడు కాకుండా బయలుదేరేది రత్నమ్మ.రామ్మూర్తి బంగళా ఆవరణ గుమ్మంలో ప్రతిమలాగ నిలబడి వుండేవాడు చూస్తో.అతన్ని చూడటమే భయంగా వుండేది. అది కాకుండా అతనిలో పొంగే Passions ఎప్పుడు బయటికి బద్దలవుతాయోనని.'

ఈ గోదావరి ఒడ్డున గడిపిన సాయం కాలాలలో అతను అనుభవించిన సంఘబహిష్కరణను తనతోపాటు పొట్లుపడుతున్న రంగనాయకమ్మగారి పట్ల జాలిని వ్యక్తం చేస్తాడు చలం! ఆమెకు కావలసింది జాలి మాత్రమేనా—

'నా మీద ఎంత కోపం వుండనీ, నన్ను నమ్మి ఈ నిర్భాగ్య జీవితంలో నాతో నిలిచి వుంటుంది రంగనాయకమ్మగారు. లోపల పిల్ల కదిలే పెద్ద పొట్టతో అన్ని పనులు చేసుకుంటోంది. వెలిపడ్డ మాకు దాసీ వుండదు. చాకలి వుండదు. కొన్ని సమయాల్లో విరోధం తక్కువగా వున్నప్పుడు నవ్వుకుంటూ యిద్దరం అంట్లు తోముకునే వాళ్ళం. బట్టలు వుతుక్కునేవాళ్ళం. స్నేహంగా పలకరింపులు లేకుండా అర్థం చేసుకునే చూపైనా లేకుండా బతుకుతున్నాము. ఏటి పొడుగునా మమ్మల్ని పలకరించే వాళ్ళులేరు. మమ్మల్ని విజిట్ చేసేవాళ్ళు అసలు లేరు. తను వొంటరి. నన్ను వొదిలిపోదామంటే తనకి ఎవరూలేరు తన బంధువుల్లో, నన్ను నమ్మి నాతో తను వెలిపడ్డది. నాకు మాత్రం ఎవరు తోడు!'

నాకు దేవుడూ లేడు.

గది గుమ్మంలో కూచుని అంతా నిద్రపోయాక చీకట్లోకి చూస్తూ చావు పుటకల సమస్య గురించి కనపడని అర్థం కోసం తర్కిస్తూ ఆలోచిస్తూ గడిపే వాడు చలం.

## చలం కలగన్న స్వేచ్ఛా ప్రణయం

'పూర్వం నా మనసులో ఒక Utopian dream వుండేది. అంటే ఊహా చిత్రము. కొంత మంది Say a dozen భార్యాభర్తలు కొన్నాళ్ళు పిల్లలు లేకుండా చేసుకొని Rotation of wives నెలకో. మూడు నెలలకోసారి wives ఎక్కువ Convenient husbands కన్నా ఎప్పుడూ ఆ freshness keep up చెయ్యడానికి ఆ dream నా పైని పుట్టిన scandals లోంచే evolve అయింది. ఆ plan ఇంకా excitingగానే వుంది.

నువ్వు కూడా అట్లాంటి scheme ఒకటి propose చేస్తున్నట్లుగా వుంది ఎవరన్నా అనవచ్చు give me the pain and let the woman goఅని'

(6-12-56 ప్రసాద్‌కి రాసిన ఉత్తరంలో—)

## రత్నాకరం

....పాపం 'T' చాల బాధపడుతోంది. ప్రతిరాత్రి నేను పాఠాలు చెప్పడానికని రత్నం ఇంటికి వెళ్ళే వాడిని. కాని పాఠాలులేవు ఏమీలేవు.ముద్దులతో కావిలింతలతో సరిపోయేది. ఇంటికి వెళ్ళేముందు మేమిద్దరం ఈశ్వరుణ్ని ప్రార్థిస్తాం. ఎట్లానన్నా ఈ సంబంధాన్ని పవిత్రం చెయ్యమని. కాని ప్రయోజనం లేక పోయింది. వొకరినొకరం కాసేపు విడవలేక పోతున్నాము. నేను ఏ మతానికి నా జీవితాన్ని అర్పించానో ఆ మతంలో యిది అవినీతి. ఆ వ్యామోహంలో నేను రవిని కూడా మరుస్తున్నాను. నాన్న ఏ గొడవలో కొట్టుకుంటున్నాడో రవికి తెలిసినట్టుంది. తనే వాళ్ళ నాన్నని అతని మధురమైన పిచ్చికి వొదిలి ఎవరెవరో కుర్రాళ్ళని స్నేహం చేసుకుని వాళ్ళతో ఆడుకుంటున్నాడు. 'T' గాని ఏమన్నా గట్టిగా అడిగితే నా సాధ్యం కావటం లేదని కళ్ళ నీళ్ళు పెట్టుకుంటాను. చివరికి ప్రాణం విసిగి 'T' తాను వెళ్ళి పోతానంది. కాని ఎక్కడికి? తన వాళ్ళెవరూ లేరు. చివరికి

తెనాలి నా వాళ్ళ దగ్గిరికి వెళ్ళితే మంచి దనుకున్నాం యిద్దరం. రవి నాతో వుండి పోయాడు.

తరవాత 'T' గారు అడ్డు లేకపోవడం వల్ల ఆ యిద్దరు కాముకులు మరింత దగ్గిరయినారు. దాసీది ఏం వొండి పడేసేదో, ఏం తింటున్నామనే ధ్యాస లేకుండా ఓ కంచంలోనే రెండు నిమిషాల్లో తినేసేవాళ్ళం మంచం మీద కూచుని. ఆ మంచం మీదనే తిండి, మాటలు, చదువులు, కబుర్లు, ఒకరి వంక ఒకరం చూసుకుంటూ అన్నీ మర్చిపోవడం. రవి ఆడుకుని ఆడుకుని వొచ్చి మమ్మల్నీ మాట్లాడించకుండా అక్కడే నిద్రపోయేవాడు. నేను వుత్త నిర్వీర్యుణ్ణి. దైవ ద్రోహి నవుతున్నాననే పాప భారం నాలో హెచ్చుతోంది, రత్నానికి ఒక చీటీ రాశాను. ఇంక విడిపోదామని. ఆ చీటీ రాసి ఎట్లా తప్పించుకోడం? వెళ్ళి పోవాలి. కాని ఉద్యోగం ఎట్లా వొదిలి పోవడం? ఆ చీటీ చూసి ఆమె రాలేదు. నా దగ్గిరికి వొచ్చి పెద్ద గోల చేస్తుందనుకున్నాను. ఆమె ఏమయిందో చూడ్డానికి సాయంత్రం వెళ్ళాను రత్నం ఓ మంచం మీద పడి వుంది. ఇందు గుక్కతిప్పుకోకుండా ఏడుస్తోంది. ఆమెకి వినపడుతున్నట్టు లేదు. వెళ్ళి గట్టిగా వూపి పిలిచాను. ఆమె కళ్ళు తెరిచి వెర్రిగా చూసింది చుట్టూ.

'పియొనీ అని నావేపు వాలింది. కాని ఓపిక లేక వెనక్కి పడిపోయింది. ఏడ్చే యిందుని ఓదార్చడానికని ఖాళీబుడ్డి నోట్లో పెట్టి.

"ఏమిటీ రత్నం?" అన్నాను ఆదుర్దాగా మాట్లాడకుండా ఏడుస్తోంది. ఆమెని కావిలించుకుని "చెప్పవూ?" అని బతిమాలాను. హీనస్వరంతో జవాబు చెప్పింది

"మీ కింక రత్నంలేదు. నేను చచ్చిపోబోతున్నాను."

"ఛ ఏమిటది? చచ్చిపోవడమేవిటి? ఏవిటిరత్నం?"

"నేను విషం తాగాను."

"విషం తాగావా? ఎందుకు?"

"నిన్ను చూడకుండా నేనెందుకు బతికి? నేను చచ్చిపోతున్నాను భయమేస్తోంది నన్ను వొదలకండి"

"నిన్ను చచ్చిపోనీను. నేను నిన్ను వొదలను, ఏడవకు. నా కోసం బతకవా?"

నాకు తెలిసిన first aid ఉప్పునీళ్ళు తాగించాను. డాక్టరు దగ్గరికి పరిగెత్తాను.

మర్నాడు రామ్మూర్తికి రత్నం విషం తాగిందని. అపాయం తప్పిందని ఉత్తరం రాశాను. వెంటనే రామ్మూర్తి కలకత్తానించి బయలుదేరి వొచ్చాడు. రోజూ వొచ్చి నాకు నీతి ఉపన్యాసాలిచ్చాడు రామ్మూర్తి. నువ్వీపిల్లని ఆకర్షించి, innocent virgins ని రత్నాన్ని కలుషితం చేశావు. అది క్షమించరాని పాపమన్నాడు రామ్మూర్తి. ఆమె గార్డియన్ తానని, ఆమె conductకి తను responsible అని నేను చేసిన ఘోర పాపం సంగతి ఉపన్యాసాలుగా మా బ్రహ్మమిత్రులందరికి ఇంటింటా పోయి చెప్పి నామీద ఆగ్రహాలు తెప్పించాడు.

"అఫ్‌కోర్సు. మీరు గిల్టీగా ఫీల్ ఐ మొహం దాచేసుకున్నారు గదూ" అన్నాడు ప్రకాశం. కాని నిలవలేక, రత్నమ్మని ఒకసారిచూడనిమ్మని రామ్మూర్తినే బతిమాలుకున్నాను. అది విని బిగ్గరగా నవ్వాడు ప్రకాశం

"పూర్ వెంకట చలంగారు" అన్నాడు మళ్ళీ.

"ఇప్పుడు వినండి రామ్మూర్తి confusion. తాను కలకత్తా వెళ్ళకముందు కొన్ని నెలలకిందట నించి తాను రత్నమ్మ lover. మీకు రత్నమ్మ తెలియక ముందునించి కూడా. మీరు అతనికి రత్నమ్మ విషం తాగిందని రాస్తే? ఆమెకి తనవల్ల కడుపు వొచ్చిందేమోనని అనుకుని పరిగెత్తుకుని వచ్చాడు. అతను రాగానే పిచ్చివారు మీరు రత్నమ్మమీది మీ ప్రేమను చెప్పారు అతనికి. అతనేమైపోయినాడో యోచించుకోండి. తన reputation ని రక్షించుకునేందుకు ఆ Perfidious ప్రాపగాండా చేశాడు మీ మీద. రత్నమ్మ ఎంత ఏడ్చినా మిమ్మల్ని చూడనియ్యలేదు. మీకు అతనిచ్చిన నీతి ఉపన్యాసాలు ఆమెకి యిచ్చి ఇవన్నీ తన Unforgivable guiltఅని నాతో చెప్పుకుని ఎంత ఏడ్చాడో. అంతేకాదు ఎప్పుడో పూర్వం అతనితో మీరు Discuss చేసిన విషయాలు కూడా చెప్పాడు. జ్ఞాపకం వుందామీకు?" అని అడిగాడు. "పోనీలెండి అదంతా, ఆ విషయాలన్నీ జ్ఞాపకం వున్నాయి. నేను కాకినాడ వొదిలి వొచ్చింతరవాత ఏం జరిగింది చెప్పండి?"

"రత్నంతో రామ్మూర్తి సంబంధం క్రమంగా సమాజంలో అంతా అనుమానాలతో పాకింది. తన భర్త ప్రవర్తన భరించలేక చంద్రమతి ఇంటింటా చెప్పకుంది సింపతీకోసం."

"మరి రత్నమ్మ సుఖంగా వుందా?" అని అడిగాను వుండబట్టలేక.

"ఎవరికి తెలుసు? ఆమెని అట్టా బైటికి తిరగ నీయటం లేదు రామ్మూర్తి. ఓ సారి రత్నం మార్వాడీ గుడి ఎదురు వున్న కోనేరులో పడ్డది. ఎవరో చూసి బైటకి లాగారు. ఆ పనితో బ్రహ్మ సమాజపు ప్రతిష్ట దెబ్బతిన్నది. చంద్రమతి

ఇంటి దగ్గిర పరిస్థితులు భరించలేక పుట్టింటికి వెళ్ళింది. తిరిగి రామ్మూర్తి దగ్గిరికి వెళ్ళనంది. ఆమె తల్లిదండ్రులు రామ్మూర్తితో పెద్దతగాదా ప్రారంభించారు. రత్నమ్మని తిరిగి పుట్టింటికి రమ్మనిపిలిస్తే ఆమె తిరిగి రానంది.చివరికి రామ్మూర్తి మీద పోలీసు రిపోర్టు యిచ్చారు. వాళ్ళ మైనరు కూతుర్ని సెడ్యూస్ చేశాడని. అది కేసయింది. రత్నమ్మని ఎంతో నీచంగా ట్రీట్ చేశారు ఆ పోలీసులు. చివరికి రత్నమ్మ మేజర్ అని ఆ కేసు కొట్టేశారు. రామ్మూర్తి డబ్బు అయిపోయింది. అంత కాకినాడ పట్నంలోను వాళ్ళు Out-Caste అయినారు. వాళ్ళని ఇంట్లోంచి పొమ్మన్నారు. అసలే బ్రహ్మ సమాజం వాళ్ళకి ఇళ్ళుయివ్వరు. వాళ్ళిద్దరికి తిండి కూడా కరువైంది."

"మీరు" అని అడిగాను ప్రకాశాన్ని.

"నాకు మాత్రం ఎక్కడ వుంది డబ్బు? అయినా;నా సుకుమారి సత్యవతిని అట్లాంటి వాటిల్లోకి దింపుతానా?"

"ఇంక మీరేదిక్కు అనుకున్నాడో ఏమో.లేక మీకు పశ్చాత్తాపం తెలపాలను కున్నాడో, నన్నుపోయి అంతామీతో చెప్పమన్నాడు. చెప్పి యిక్కడికి రత్నం తానూ రావొచ్చునా? అని అడగమన్నాడు."

"మరి చంద్రమతి పిల్లలు ఏమైనారు?"

"వారి తాతగారి దగ్గర వున్నారు. వాళ్ళకేం? అందరికి చంద్రమతి మీద' పిల్లలమీద సింపతీ"

"రమ్మని టెలిగ్రాం యిద్దాం రేపు"

*　　　*　　　*

'నాకు డబ్బు వుంటే నీ పుస్తకాలు అచ్చువేయించి వీధి మూలమూలలా అందరికి పంచిపెడతాను. నేను 'స్త్రీ' నయితే నీ హృదయ తృప్తికై నా శరీరాన్ని అర్పిద్దును' అన్న రామ్మూర్తి చలం, కృష్ణశాస్త్రి, ముద్దుకృష్ణ యీ ముగ్గుర్నించీ అంకితాలు పొందాడు.

సౌరిస్ జీవితం మొదటి భాగంలో చలం- మొక్కపాటి రామ్మూర్తిగారల చివరి కలయిక గురించి యిలా వుంది; (ఏలూర్లో కావచ్చు)

'ఒకరోజు మొక్కపాటి రామ్మూర్తిగార్నించి ఉత్తరం వొచ్చింది చలం గారిని స్టేషన్‌కి రమ్మనమని. ఆ రాత్రి స్టేషన్‌కి వెళ్ళారు షా, నంతి, చలం. రామ్మూర్తిగారు రైల్లో గుమ్మంలో నుంచుని చలంగారి వైపు తదేకంగా చైలు

కదిలేదాకా చూస్తూనే వున్నారు. మాటామంతీ లేదు, పలకరింపూ లేదు. సంతికి, షాకి, చెరో కమలాఫలం ఇచ్చారు. అదే ఆయన్ని చివరిసారి చూడటం చలం గారికి. త్వరలో మహాభినిష్క్రమణంలోవున్న రామ్మూర్తి చలంగారి నుంచి వీడ్కోలు తీసుకోడానికే స్టేషన్‌కి రమ్మన్నట్లున్నారు. ఈ జీవనయాత్రలో తమ మజిలీ దగ్గరయిందనీ, అలసిపోయాననీ, సెలవనీ, మౌనంగా కళ్ళతో చలంగారికి చెప్పారేమో!

....కొద్ది రోజుల్లోనే రామ్మూర్తిగారి పిల్లలు ఇందు, ఉషా-షా వాళ్ళతో వుండి పోవడానికి వొచ్చేశారు. తరువాత ఆ పిల్లలకి వాళ్ళ నాన్ననించి ఉత్తరాలు వొచ్చాయి. వాళ్ళు అవి చదివి మూలల వొదిగి ఏడ్చేవాళ్ళు. వాళ్ళకి ఉత్తరాలు వొచ్చినప్పుడే చలంగారికి కూడా యీ పిల్లల్ని నీకు యిచ్చేస్తున్నానని వుత్తరం వచ్చింది రామ్మూర్తిగారి దగ్గర్నించి. చలంగారు చెబితే తెలిసింది 'షా' వాళ్ళకి రామ్మూర్తిగారు ఆత్మహత్య చేసుకున్నారని. (1927లో మద్రాసులో రామ్మూర్తి ఆత్మహత్య చేసుకున్నాడు).

(రత్నమ్మ మీద చలం ప్రవాసం వుంది. ఆమెది చాలా గొప్ప అందం. మగాళ్ళు ఆమెకోసం ఒకర్నొకరు పొడుచుకు చచ్చేటంత గొప్ప**ravishing beuty.** ఆ అందంతో లోకాన్ని ఆడించగల జాణతనం రత్నమ్మకి వుంది. ఆమె జయంతి గంగన్నగారి కుమారుడు జయంతి సుబ్రహ్మణ్యంగారనే డాక్టర్ని పెళ్ళాడింది. ఈ నిర్ణయం రామ్మూర్తికి భరింపరానిదయింది. వాళ్ళ కళ్ళ ముందే ఆత్మహత్య చేసుకుని తన్ను అంతం చేసుకున్నాడు.ఈ రత్నమ్మ సూళ్ళూరుపేట రైలు ప్రమాదంలో పోయిందిట.)

పాపం! రామ్మూర్తి. తన ప్రేమకోసం-తనని ప్రేమించని వ్యక్తి కోసం-తన ఆరాధ్యమూర్తి ఇతరులని వరించబోతుందని తెలిసి ఆ బాధ నించి విముక్తి కావడం కోసం- ఈ మురికిలోకం నించి- ఎంతో విలువైన జీవితాన్ని- అనంత వైశాల్యంతో నింపే ప్రేమకోసం- శాశ్వతమిధ్యకి అంకితం చేసుకొన్నాడు. లోకం గీతాలు పాడకపోవచ్చు. వెంట తిరిగిన మిత్రులు అర్థం చేసుకోలేక పోవచ్చు-కాని రామ్మూర్తిది పిరికిచావు కాదు- ప్రేమకోసం వీరునిగా మృత్యువు నెదిర్చిన మహామనీషి ఆయన....ఆయన పోయారన్న దిగులు 'షా'కి కలిగినా ఇందూ ఉషా తమతో వుంటారనే ఆనందం దాన్ని మాయం చేసింది. వాళ్ళు వుండి పోయారు, అంతా కలిసి తెనాలి వెళ్ళిపోయారు.

తెనాలిలో ఇంటి వెనకాల భోజనహాలు తీసేసి పెద్ద హాలు కట్టిస్తున్నారు చలంగారు. ముందు భాగంలో 'హొయ్యో' డిస్పెన్సరీ తెరిచింది. అందుచేత 'షా' వాళ్ళు ఒక కరణంగారింట్లో అద్దెకుండేవారు. ఇంతలో పూనా నించి తాతయ్య, అమ్మమ్మ, రవీ, లలిత, మోహన వచ్చేశారు బుచ్చి పిల్లల్తో సహా, ఇందూ, ఉషా, చలం పిల్లలూ అంతా అమ్మ పెంపకంలో పడ్డారు. ఇంత మంది పిల్లల పెంపకం హొంటా అన్నీ తనే చూచుకునేది అమ్మ. ఇంతలో రవికి, షాకి తప్ప అందరికీ హొంగు చూపింది. హాలులో వరుసాగ్గా మంచాలు. ఆ పిల్ల మేళానికి మొత్తం ఒక నౌకర్ని పేరుకు పెట్టినా అమ్మే సేవ చేసేది. హొయ్యో వైద్యం. ఇల్లు దాదాపు ఒక హాస్పిటల్లాగ తయారయింది. ఇల్లా వుండగా ఇందు, ఉషా వాళ్ళమ్మ చంద్రమతిగారు వచ్చారు. ఆవిడని చూడగానే ఇందూ, ఉషా అమ్మ అంటూ కావలించుకున్నారు. నయం కాగానే పిల్లల్ని తీసుకుని ఆమె వెళ్ళిపోయింది. ఇంత అమ్మకిఎంత కోపమో చెప్పలేం. ఇన్నాళ్ళూ పిల్లల్ని హొదిలేసి—ఇప్పుడు హాయిగా ఇక్కడ పెరుగుతున్న వాళ్ళనెత్తుకు పోయిందని చాలా రోజులు సాధించేది."

*  *  *  *

మ్యూజింగ్స్‌లో రామ్మూర్తి ప్రస్తావన విశేషంగా వస్తుంది.

'కాని చావడానికి రామ్మూర్తి చెప్పిన కారణాలు పూర్తిగా నాకు నచ్చలేదు' అతనిబోటి వాళ్ళు బతికే అవసరం అమితంగా వుంది. ఏకాకినయిన నాకు ధైర్యమిస్తో వుండడానికి, నాతో సమస్యలు ఏవర్యవసానం లేకుండా చర్చించడానికి, నారొద వినడానికి రామ్మూర్తి బతికి వున్నాడని చుట్టు పక్కల నిరంకుశ భర్తలకి పక్కలో బల్లెం కావడానికి,పారిపోయిన భార్యలకి ఆశ్రయమివ్వడానికి, కాంతి నెరగని చీకటి హృదయాలకి శృంగారపు గవాక్షాలు తెరవడానికి, శాశ్వతంగా సత్యమనుకునే హక్కులో విలువలో నిద్రపోయే మొద్దుల్ని వూపి లేవతన్నడానికి—ఎంత మంది నీవంటి వాళ్ళు అవసరం ఈనాటికీ కూడా- వున్న హొక్క నీ వుండనక్కర్లేదని సులభంగా అనుకున్నావుగాని;

"Is it a love sordid desire to fell I must be loved ?" అని వ్రాశావు. ఏ మాత్రమూ కాదని నిశ్చయంగా మాకు తెలీవి ఆ వెతుకులాట రోజుల్లో. మా నియమాన్ని హృదయాలు ధిక్కరించి ఆరాట పెట్టే రోజుల్లో ఎన్ని సార్లు ఇట్లాంటి ప్రశ్నలడిగాము కాదూ పెద్దల్ని, శాస్త్రాల్ని, ఒకళ్ళొకర్ని? సంఘంలోంచి బ్రహ్మ సమాజంలోకి అక్కణ్నించి ఎవరూ పలకరించని ఎడారి

త్వంలోకి అడుగుతో సౌందర్యాన్ని వాంఛించడం తప్పా? నీతి అంటే ఏమిటి? దేవుణ్ని చూశారా? మాకు చూపిస్తారా? కర్మ అనేది వుందా? మీకు తెలుసా? వుంటే న్యాయమా? లేచి పోవడం లోభత్వం కన్న ఎక్కువ నేరమా? భర్త లేకుండా గర్భవతి కావడం ఎవరి తప్పు?పెళ్ళివాగ్దానాలు ఎంత వరకు binding? జెలసీ నేరమా కాదా? హృదయాల్లోని ఈ రసికత్వాలకి అర్థమేమిటి?....

....వింటే రామ్మూర్తి జ్ఞాపకం వస్తాడు. నిష్కారణంగా ఆత్మహత్య చేసుకుని పవిత్రుల సంతోషానికి తృప్తి నిచ్చినవాడు. ఆత్మహత్య అంటే జీవితంలో అపజయం. (యీ Economic, social, physiological హృదయ Factors లో ఏదో మనని లొంగ దీసుకున్నదన్నమాట) అనే విశ్వాసాన్ని మర్చి ఆత్మ హత్య చేసుకోగలిగిన వాడే ధీరుడా అనిపించిన వాడు

"నేనీ సమస్యను- జీవితమంటే ఏమిటి? అవతల ఏముంది? కాలానికి అర్థం? అనే వాటిని నేను వెళ్ళి చూడబోతున్నాన"ని ఒక్క షెల్లీ మాత్రమే అన గలడు అనుకున్నాను.

"ఈ జీవితం ఏమీ సంతోషంగా లేదు.నేనెవరికీ వుపయోగం లేదు. అవతలి గట్టుకి ప్రయాణమౌతాన"న్నాడు రామ్మూర్తి. జీవితాన్ని ఓ చిన్న ఏటు అను కున్నంత సులభంగా.... ఆ పొద్దున ఏం కనుక్కున్నాడో! ఏమీ లేదు- అనే సంగతన్నా కనుక్కోగలిగాడా?

—అన్ని విశ్వాసాలనూ వొదిలి, మతాలనూ, అధికారాలనూ ధిక్కరించి, అన్ని బంధాలనూ, సంఘం, కులం, బంధుత్వం, స్నేహం అన్నీ మా అన్వేషణ కోసం ఆచరణ కోసం త్యజించి యీ జీవితపు అగాధాలను కొసలను విడతీసి మనసు ఎంత వరకు తెలపగలదో అంత వరకు చర్చించి తరిచి- తక్కింది అబద్ధ మని నిర్ణయించిన వాళ్ళం. మిగిలాడా? తెలియచేశాడా? తెలియచేశాడని తెలీకుండానే నాకు తెలిచేశాడా?

....సాధారణులకీ పొరుగూరు ప్రయాణం ఎంత తేలికో రామ్మూర్తికి ఆ లోతులికి ప్రయాణం అంత సులభంగా కనపడ్డది.

కాని పొరుగూరి ప్రయాణం కూడా యింత కష్టమైన నాకు ఆ చివరి ప్రయాణం యింకా బద్ధకంగావుంది! అందుకు నే బతికి వున్నానా? (చలం 1979 మే 4వ తేదీన పోయాడు. 1927లో రామ్మూర్తి పోయాక తను యాభై మూడేళ్ళు జీవించి అలజడి అశాంతి నుంచి శాంతి మహాసాగరంలో లీనమయాడు నిశ్చలంగా నిర్మలంగా—)

తన చావుని అంత ధీరంగా తీసుకున్న ధీరుడు...."చచ్చిన ఎలికని కిటికీ లోంచి పారేసినట్టు గిరాటెయ్యండి ఈ దేహాన్ని" అని వ్రాశాడు. ఆ రాత్రి తన గదిలోని ప్రియులకి,తమ ప్రేమతో అతని చావుకి కారణమైన ప్రియులకి.

"నాకు నడవాలనిలేదు ఈ అంధకారంలో ప్రయాణానికి అర్థంలేదు. నా కేదో దోవ కనబడుతోంది. Art ...stories....children....women.... ఈ గోతులలో నాకేం కనపడవు నీకు కనబడే ఆ సన్నని వెలుగు నాకు కనపడదు. నేనిటు అంధకారంలోకి పోతున్నాను."

'చలం మిత్రులు' పుస్తకంలో డాక్టరు అహోబలరావు గురించి రాసిన అధ్యాయంలో రామ్మూర్తి మరణం గురించి చలం యిలా వివరించాడు—

'ఒకసారి నేనూ, పెద్దమ్మాయిగారు, డాక్టరుగారు ప్రేమ సంగతి మాట్లాడుతున్నాం. నేను రామ్మూర్తి సంగతి చెప్పాను. రామ్మూర్తి, రత్తమ్మకోసం చేసిన త్యాగం సంగతి చెప్పి, ఆమెలేని లోకంలో తను వుండలేనని, ఆ ప్రియులు ఇద్దరి మధ్య తాను పడుకుని అర్ధరాత్రి విషం తాగి చచ్చిపోయిన కథ చెప్పాను. డాక్టరుగారు ఒక నిమిషం యోచించినట్లు ఆగి "రత్తమ్మ చచ్చిపోయి వుంటే, మీ రామ్మూర్తి చచ్చిపోయి వుండేవాడా?" అని అడిగారు.

నేను ఒక నిమిషం యోచించి "చచ్చిపోయి వుండడనుకుంటాను" అన్నాను. డాక్టరుగారు "ఇంకేం" అని తల వూయించి వెళ్ళిపోయినారు.

[జయంతి గంగన్నగారి కుమారుడు జయంతి సుబ్రహ్మణ్యంగారు డాక్టర్. ఆయన్ని పెళ్ళాడింది రత్తమ్మ]

రత్తమ్మ మరొకర్ని పెళ్ళి చేసుకుంటున్నది గనక రామ్మూర్తి చనిపోయినాడు గాని రత్తమ్మ చనిపోయివుంటే ఆమె కోసం తను ప్రాణత్యాగం చేసి వుండేవాడా-కాదు అని అహోబలరావుగారి తాత్పర్యం!

అతని చివరి ఉత్తరం చావుకి గంట ముందు వ్రాసింది.

"నువ్వు.... అది చివరి దెబ్బ-ఆమెకు అంత వ్యధలోనూ నేను అవసరం లేకుండా పోయినానని- ఆ రాత్రే చచ్చిపోయినాను. డబ్బు దొరికించుకుని ఆమె పాదాల దగ్గరికి వెళ్ళి చావడానికే బతికాను యిన్ని రోజులూ! ఇంకెక్కడ బతకను ఇంకెక్కడ చావను?.... అంత ఫీలింగూ సెంటిమెంటూ చచ్చింది నాలో. అందువల్ల ఏమీ వ్రాయలేను. అయినా.... నువ్వు నా దగ్గిర వుండాలనిపిస్తోంది. నా జీవితంలో క్షమించలేనివన్నీ నా మృత్యువుతో క్షమించమను మా.... గారిని.

పిల్లల్ని నీ ఛార్జికి వొప్పచెపుతో ఒక దస్తావేజు వ్రాసి రిజిస్టరుచేసే బలం వుంటే బావుండును. కానీ ఏదీ చెయ్యడానికి బలంలేదు నాకు. వాళ్ళు జీవితంలో చాలా దుఃఖాలు పడతారని తెలుసునాకు. నేను బతికివుంటే బహుశా వాళ్ళని యింకా దుఃఖపెడతానేమో! నాకే శక్తివుంటే వాళ్ళని ముందు గొంతుపిసికి అఖరుచేసి వుండవలసింది. కాని నాకు బలంలేక పోయింది. చివరికి గుడ్‌బై చెప్పడానికి కూడా. వాళ్ళు నిద్రపోతూవున్న మంచంవేపు కూడా తిరగలేక పోయినాను. వాళ్ళు నన్ను చిన్న గ్రామఫోనూ, సైకిలు కొనిపెట్టమన్నారు. ఈ దరిద్రపు తండ్రి బీదవాడు ఋణాలవాడై చచ్చిపోతున్నాడు యివాళ. నేనే బతికివుంటే ఎవరి దగ్గిర్నించో డబ్బు తన్నిలాక్కొని అవన్నీ వాళ్ళకి కొనిపెట్టి ఖైదుకువెళ్ళి వుందును. కాని- కాని- బలంలేదు. శక్తిలేదు దేనికీ. చచ్చిపోయినాను....చచ్చి పోయినాను.

....వాళ్ళ శరీరాలు ఎదిగి, వాళ్ళ హృదయాలు పక్వమైనపుడు, ఎంత వుపయోగపడుదామనుకున్నాను వాళ్ళకి! వాళ్ళకి నెక్సు విజ్ఞానాన్నిచ్చి, నిర్భయంగా నిశ్చింతగా ప్రేమించడం బోధించి, వాళ్ళ అధర్మ సంతానానికి ఆశ్రయమివ్వాలనీ ....డార్లింగ్స్, భగ్నమైన నా హృదయాన్నెట్లా చీలుస్తున్నారు! చలం, చలం, నా కోసం వాళ్ళకి సహాయపడు. వాళ్ళకి చేస్తున్న యీ ద్రోహాన్ని క్షమించమని చెప్పు.

ఈ గుడ్డిలోకం ర-నీ, సు-నీ నిందిస్తుంది. నిందనించీ, అపవాదునించీ వాళ్ళని కాపాడు.

నీకు -నీకేం చేప్పాను నా కృతజ్ఞత- నా గుడ్‌విషెస్, నా ఫేర్వెల్ "సుఖంగా వుండమని కోర్కె" నా ప్రేమ.

కానీ, సాగనీ, నువ్వు చేస్తున్న మంచిపని. స్త్రీ పురుషులకి రక్తమూ మాంసమూవున్నా హృదయాలు వున్నన్నాళ్ళు నీ పుస్తకాలు జీవిస్తాయి. అటు తరువాత కూడా....

బాధలుపడే స్ట్రగుల్‌పడే స్త్రీలందరి కోసం కన్నీటితో చచ్చిపోతున్నాను. ఎప్పటిమల్లేనే వాళ్ళకి సహాయం చేస్తోవుండు.

జీవితంలో నాకు ఏమీ పని వున్నదని తోచదు. కొరగాని ముసలితొక్కకింద పెరగడం నాకు యిష్టంలేదు. నువ్వు ఆరిస్టువి. జీవితంకన్న ఎక్కువకాలం బతకాలి నువ్వు" "ఆశీర్వచనం పంది మూడు ఏళిన్నాటి శనుల్ని జాతకంలో దాటాడు చలం. జ్యోతిష్కుల అంచనాలనుమించి వున్నాడు రాత, చూపు, నడత మాట ఒక్కటొక్కటే మందగించినా"

రామ్మూర్తిబతక్కపోవటానికి చలం మ్యూజింగ్స్‌లోయిలాకారణంచెప్తాడు

'బతికితే తన కోపం ఎక్కువై యే నీతిమంతులు- యే భర్తల- యే భాగ్య వంతుల, యే అధికారుల తలలు బద్దలు కొట్టాల్సి వస్తుందోనని-దూరంగా వెళ్ళాడు మీ కోసం.

రామ్మూర్తి మాటల్లో—

"After all, are not our own wild tactics, meaning lessdreams un realised hopes and broken experiences- are not these our greatest achievements?"

ఏం చేశాడు రామ్మూర్తి అనే దానికి జవాబు చలం మాటల్లో—

'కొన్నేళ్ళు పిల్లల్ని బాధించే తండ్రులకు, భార్యల్ని పాలించే భర్తలకు, చుట్టుపక్కల నీతి అధికారులకు సింహస్వప్నమైనాడు. అనాథలకు. సంఘంవుమ్మి పులుముకున్న దీనులకు, మతిచెడ్డ మిత్రులకు అందరికీ తలుపు తెరిచివుంచాడు. హృదయాన్ని పరిచాడు-ప్రేమకోసం లోకాన్ని వెతికాడు.

'My sin is the desire to be loved' అన్నాడు. అంతకన్న ఘోర పాపం ఎరగదు యీ లోకం....

రామ్మూర్తి మరణంపై చలం మోనొలాగ్!

"రామ్మూర్తీ!

నాకు వొకటే బెంగ. మనం దేవుడిమీదా, నీతిమీదా. అధికారులమీదా తిరగ బడ్డ వాళ్ళం. ఎంత అసహ్యంగావున్నా భూమిని "సంఘాన్ని" వొదిలి ఎగురుదా మంటే వినాశం తప్పదని నమ్మి హేళనగా చూసే ప్రజలు— "చూడండి రామ్మూర్తి, అన్నిటినీ ధిక్కరించి, ఏమైనాడు?" అనడానికి వీలునిచ్చావు. మన స్వేచ్ఛని భరించలేనివాళ్ళు, మన పేరువిని గొణిగే సంఘాధికారులు, వీళ్ళచేతుల్లో అపజయం పొందావని నీ వంక చూపుతున్నారు అందరూ. దిక్కుమాలిన స్త్రీలని యినుప ముక్కులతో పొడిచి చంపడానికి జంకిన రాబందులన్నీ నీ శవం చుట్టూ వోగై వుత్సవాలు చేసుకుంటున్నాయి రామ్మూర్తీ! తిరగబడ వుత్సహిస్తున్న యువకుల్నీ, అధికారాల్నీ ఎదిరించే వీరుల్నీ, సంఘానికి బలిఅయ్యే నిర్భాగ్యుల్నీ' అందరినీ హేళనగా నవ్వి నీ వంక చూపుతున్నారు.

క్రూరుడైన రాజు వేళ్ళాడే అస్థిపంజరాల్ని-జాగ్రత్త అని చూపుతున్నట్లు, సంఘకాళి తెల్లబడ్డ నీ యెముకల్ని చూపుతోంది.

నీ మరణం అపజయంకాదని- సంఘంమీదనేకాదు; మనుష్య స్వభావంమీద మరణంమీద జయధ్వానమని చెప్పడానికి మిగిలాను నేను!

వాడిన తీగకె గడియ గడియకొక
వసంత కాలము దేవా!
మాడిపోవు నెడ కారునేలకె
మధుర వర్షమో దేవా!!

# 4

## బాలకాండ

'ఆత్మ కథలంటే నా కసహ్యం' అంటూ చలం 'ఎందుకు పుట్టానా? పుట్టిన వాణ్ని చప్పున చావక ఎందుకింత కాలం తన surroundingsని ఇంత కల్మషం చేశామా అనుకునే నా వంటి వాడు తన కథను సిగ్గులేకుండా చెప్పుకొంటున్నాడంటే ఏ మాత్రం క్షమింపదగిన విషయం కాదు—' అంటాడు. చలం యిది మోడిస్టీ (వినయం) కోసం అన్నమాట కాదు. నిజంగా తన్ను తాను సహించలేక అన్న మాటే.

బుద్ధ జయంతినాడు మద్రాసులో 1894లో కపిలేశ్వరాలయానికి చేరువలో వున్న ఒక వీధిలో యింట్లో ఫలానా పుణ్యదంపతులకు జన్మించాను అని చెప్పు కోవడం ఆతనికి రోత. అందుకే ఆత్మకథ - కల్పనతో యిలా ఎత్తు కుంటాడు.

'మొదలంటూలేని ఈ సృష్టికైన ప్రథమ చలనం శూన్యంలో స్పందించి నపుడు పంచ భూతాలతోపాటు అవ్యక్తంగా నేనూ జన్మించాను. ఈ లక్షన్నరకోటి ప్రాణులతో కలసి కాంతికి, శబ్దానికి, స్పర్శకి క్రమంగా స్పందించి, స్పందించి వ్యక్తిత్వాన్ని ప్రతిష్ఠించు కున్నాను.

నిరవధికమైన ప్రేమ ప్రవంతిలో స్వల్ప వీచికలమైన మేము నూతన సృష్టి నిర్మాణంలో నర్తించే నక్షత్రాల మధ్య ఆ కొత్త కొత్త కాంతులలో ఆనం దాన్ని పట్టలేక, ఉల్లాస ఉద్రేకాలతో కొన్ని యుగాలు విహరించాము.

ఆ నాటి నుంచి జలధుల్లో, ప్రభంజనాలలో, తీవ్ర భానుదీప్త కిరణాలలో యుగయుగాలు క్రీడించి, శయనించి, నిద్రించి ఈ నేనుని నిర్ణీతం చేసుకున్నాను. జలచరాన్నై ఆకాశాన్ని ఆశించి ఆశించి విహంగాన్నై భాస్కర తేజోస్పందితానల పక్షాల దూర ప్రదేశాల తేలితేలి, వృక్షాగ్రడోలికలనూగాను, అరణ్యాలలో మృగ మాంసభక్షణతో విపరీత దర్పాల్ని పెంచుకుని జనన, మరణవలయాల్లో పరిభ్రమిస్తో ఆశతో కలలుకని చివరకి నరుణ్ణి అయ్యాను. ఆ జన్మ సోపానాల మధ్య ఆశతో అశాంతితో పూర్వలోకాల్ని అందుకోవాలనే యత్నంలో అలసి అలసి సుషుప్తిలో మునిగి పాతజ్ఞాపకాలతో తిరిగి ఏ దేహ రూపంలోకో జారి పోయేవాణ్ని!' యిలా సృష్ట్యాది నుంచి వుంటున్న అస్తిత్వంలో తన్ను వూహించు కుంటూ ఈ అనంతసృష్టిలో భాగమై పరవశించాడు. తన అవతారానికి ఓ కర్త వ్యాన్ని దేవత నిర్దేశించి తననీ లోకానికి పంపినట్లు కల్పన చేస్తున్నాడు- 'నీ కర్తవ్యం మరవకు. శోకదగ్ధమానసులైన బహిష్కృతుల దీనుల కన్నీళ్ళు తుడవగలననే ఆశతో వెళుతున్నాను. కాని ఆ కన్నీళ్ళ నునుపులోంచి అందమైన చంపలమీది మమతతో జారిపోకు, నీ గమ్యం గుర్తుంచుకో' అని తనకు కర్త వ్యాన్ని నిర్దేశిస్తూ వార్నింగ్ యిచ్చినట్లు వూహించు కుంటున్నాడు. పుట్టటంతో కెవ్వున కేకవెయ్యడం, ఒక పెట్టెలో పెట్టినట్లుగా శరీరంలో బంధింప బడినట్లు వుండటం— యిదంతా చలానికే కాదు ఎవరి పుట్టుకకైనా వర్తింప చేయవచ్చు. అది అంతంలేని దాంట్లో నే నిదివరకటి నుంచి వున్నాను అనే తాత్పర్యం.

## కొమ్మూరి వారి పూర్వ కథ

కొమ్మూరివారి యింటిపేరు అసలు గంగరాజువారు. వీరంతా ఉద్యోగాలకై కొమ్మూరి నుంచి కాకినాడకు తరలి వెళ్ళినట్టు చెపుతారు. నియోగులు, లోహితాస గోత్రం. చలంగారి తండ్రి పేరు కొమ్మూరి సాంబశివరావు. వెంకట చలాన్ని తాతగారు దత్తత చేసుకున్నారు. ఆయన గుడిపాటి వెంకట్రామయ్యగారు. గుడి పాటివారిది మొదట్లో గుడివాడ తాలూకాలోని వెంకటాపురం. ఈ వెంకట్రామయ్య గారు శ్రీమంతులు, చిన్న జమీందారీ ఫాయాలో కాస్త గొప్పగా బతికారు. వర్లే

డిపార్ట్‌మెంట్‌లో పనిచేసి, సెటిల్‌మెంట్ ఆఫీసర్‌గా రిటైర్ అయారు. ప్రభుత్వ ప్రాపకం కలిగి దివాన్ బహదూర్ పొందారు. దాన ధర్మాలకి సనాతన సంప్రదాయాలకీ ఖ్యాతి చెందిన కుటుంబం. ఈ వెంకట్రామయ్యగారి కుమార్తెనే సాంబశివరావు కిచ్చి పెళ్ళిచేసి అల్లుడ్ని తమ వద్దనే అట్టే పెట్టుకున్నారు. తోట్లవల్లూరులోనే చలానికి అక్షరాభ్యాసం జరిగింది.

## బాల్య స్మృతికేళి

తన బాల్యస్మృతుల్ని గురించి చలం—

'ఇంకా చిన్నతనంలో తోట్లవల్లూరులో వుండే వాళ్ళం. ఆ జమీందారుకి మా తాతగారు రిసీవర్. మేము ఆ వూరికి princes గుర్రాలు, ఏనుగులు, నౌకర్లు. కృష్ణానది దాని వొడ్డున తోటలు, ఇసికలంకలు. ఆ లంకల్లో అడువులు.మా యింటి ముందే కోట. ఆ కోట ఎన్ని అంతస్తులో! పై అంతస్తులన్నీ మూసి వుండేవి. జనంలేని ఆ గదుల్లో కూచుని ఎన్ని కలలు కనేవాణ్నో. అంతఃపుర జీవితాన్ని గురించి మా పెద్దవాళ్ళ కథల ఆధారంతో అమ్మమ్మ మంచం కింద పడుకుని కలలుకనే చలం, వీలయినప్పుడల్లా నాన్న చెప్పే చదువుని తప్పించుకుని అమ్మమ్మ వెనక కూచుని భారతం వినే చలం, పురాణాల్నివింటూ ఆటల్లోకి వెళ్ళని చలం, దొరికినప్పుడల్లా తన్నులుతింటూ అందమైన బాల్యాన్ని క్రూరమైన స్మృతులుగా మాత్రమే దక్కించుకున్న చలం, ప్రేమలోతప్ప స్నేహంలో వికసింపలేదు నా హృదయం అన్న చలం, బాల్యంలో తల్లిదండ్రుల నుంచి పొందవలసిన ప్రేమను పొందక పోవడం వలన father hatredతో పెరిగి సొసైటీలోకి వెళ్ళలేక ఆడపిల్లల్తో స్నేహాలు మరిగి మానసికంగా వారికి మరింత సన్నిహితుడయాడు. అతని ఒంటరితనం, తల్లిదండ్రుల నిరాదరణ, చిన్నప్పటి నుంచి అనారోగ్యం తలనొప్పులు అతని వ్యక్తిత్వ వికాసానికి అడ్డుతగిలి అసాధారణ ప్రవృత్తుల్ని ప్రేరేపించాయి.

చలం రచనలు ప్రారంభం చేయడానికి కారణం, ఆ బాల్యదశలోనే ఎలా కలిగిందో, ఆ ప్రవృత్తికి మూలం ఆయన మాటల్లో....

'నాకో బావ వుండేవాడు, అతనిది కాకినాడ. చూసుకోగానే ఒకర్ని ఒకరం కొట్టుకున్నాం నా కన్న పెద్దవాడు బలం కలవాడు, మా వూరు వొచ్చేసినా అపజయం నా మనసులో రగులుతోనే వుంది.అతన్నేం చెయ్యలేక అతన్ని ఒకకథలో

ఎక్కిద్దామను కున్నాను. అదే నా రచనలకి ప్రారంభం (ఘోర్తుఘారంలోవుండగా) నేను చదివిన ఒక ఇంగ్లీషు నవలని (హెన్రీవుడ్డు నవల) తెలుగుచేసి దాంట్లో విలన్‌కి అతని పేరు పెట్టాను. అప్పటికి నేను కొంత పెద్దవాణ్ణి అయ్యాను. కొంతరాసి ఆంధ్రప్రచారిణి గ్రంథమాల వారిని 'నా నవలను ప్రచురించమని' అడిగాను. ఎట్లావుందో చూస్తాం కొన్ని పేజీలు పంపమన్నారు. ఎవరో పెద్ద రచయిత పంపారనుకుని చాలా బావుంది ఆ పుస్తకమంతా పంపమన్నారు. అడుకునే వయస్సులో ఆ పుస్తకం ఎక్కడ పూర్తి చేయగలను? పూరుకున్నాను. నేనేమీ చెయ్యలేని నా బావమీది కోపమే అంతర్భూతంగా నా కథల్లో పలికిందేమో!' సంఘాన్ని ఏం చెయ్యలేక నాలోని కోపాన్నంతా ఆ కథల్లో ఒలకపోసినట్టున్నాను!

సంఘాన్ని ఏం చెయ్యలేని కోపంతోనే చలం దాన్ని కలంతో పొడిచిపొడిచి రెచ్చగొట్టి దాని హిపోక్రసీని బట్టబయలు చేశాడు.

'చిన్ననాడే సీత ఏడ్చి ఏడ్చి భూమాతలో ప్రవేశించడం, భారతం చివర పాండవులు నరకంలో కాలడం' విని ఎందుకట్లా జరిగిందని గుండె దహించుకు పోయే వేదనతో ప్రశ్నించేవాడు.

ఆ జన్మవిరోధి తన తండ్రి గురించి యిలా అంటాడు చలం-

'ఆయనకి సంపాదనలేదు,ఉద్యోగంలేదు,తాను, భార్య,పిల్లలు అత్తవారింట్లో వుండేవారు. ఆ అత్తమామలు ఉత్తములు, ఎంతహీనుడో, ఎంత నీచుడో ఆ మనిషి. ఆయన దెబ్బలతో నేను చచ్చిపోతున్నాను అనుకున్నప్పుడు భరించలేక వాళ్ళగదిలో వొచ్చి నుంచునేవారు ఆయన అత్తమామలు.అప్పుడన్నా ఆకిరాతకుడు కొట్టడం మానతాడేమోనని. వాళ్ళిద్దరు గూడా ఆయనతో ఎన్నడూ మాట్లాడలేదు.

నేను పడుకున్నది మా అమ్మమ్మ మంచం కింద. ఆమెకి నన్ను చూస్తే దయ. కొంచం ముద్దు. ఆమె ఇంటికంతా అధికారిణి, మా అమ్మ ఆమెకి ఒకతే గారాబాల కూతురు. అల్లుడ్ని పొమ్మంటే కూతుర్ని లాక్కుపోతాడనే భయంతో ఆయన్ని భరిస్తోంది.।

స్వశాఖాభిమానంతో, జమీందారీ దర్జాతో, ఆశ్రితులతో గుడిపాటి వెంకట్రామయ్యగారి లోగిలి కలవారి లోగిలిగా కలకల్లాడేది.చలం అమ్మమ్మకి బంధుప్రీతి ఎక్కువ, అక్కలు, అన్నల పిల్లల్ని యింట్లోపెట్టి చదివించి ఉద్యోగాలు యిప్పించేది. చలం తండ్రి పిల్లల్ని స్తంభాలకి కట్టి వరసగా బాదుతూంటే, ఆ

పిల్లలు ఓర్చుకోలేక బిగరగా అరుస్తోంటే అదంతా శిక్షణ కింద బంధువులు మెచ్చు కునేవార్ట. ఇంకా బాదమని తల్లి ప్రోత్సాహించేదట. పరమవైష్ణవ హిందూ సంప్ర దాయ కుటుంబంలోంచి వచ్చిన చలం, తాతగారికి తదనంతరం అపరకర్మలు తద్దినాలు వగైరాలు పెట్టడం కోసం విడదీసి పెంచుకున్న చలం, కాలేజి చదువుకి కాకినాడ వెళ్ళి వీరేశలింగంగారు,నాయుడిగారి ప్రభావంలో పడి బ్రహ్మసమాజంలో చేరి-తిరిగి తెనాలి వచ్చినపుడల్లా కొంత మంది మిత్రులతో కలిసి ఈశ్వరప్రార్థ నలు చేయడం- కుల వ్యవస్థను నిర్మూలించడం కోసం సంస్కరణలు ప్రారంభిం చటం ఇతరకులస్థుల యిళ్ళకు వెళ్ళి వారితో కలిసి భోజనాలు చేయడం సాగించాడు. కార్యక్రమాల్లో తమ్ముళ్ళు, చెల్లెళ్ళు చలానికి అండగా వుండి మంత్రాంగం నడ పడం చలం తండ్రికి కంపరం పుట్టించింది. అందుకని విపరీతంగా కొట్టేవాడు పిల్లల్ని.సాంబశివరావు యిల్లరికం వుండియింట్లో చేయని అప్రాచ్యపు పనిలేదు.సాని వాళ్ళతో సంపర్కం వుండేది. పిల్లలు కులభ్రష్టులవుతున్నట్లు ఆయన భావించి రెచ్చిపోయేవాడు. కొంత కాలానికి అమ్మమ్మ పోవటం వలన చలం తాతగారు ఆ విషాదంతో అన్నీ వేదాంతిలా చూస్తో పడుకుని వుండేవారట. మొదట్లో బాల్యంలో చలం సంధ్యావందనం, గాయత్రి చేయడం నియమ నిష్ఠ అదీ చూసి యితను అపరకర్మలకు పుపయోగిస్తాడనే భ్రమతో తాతగారు పెంచుకుని సగం ఆస్తి యితని పేర రాశారు. బంధువులంతా హిందూమతం శ్రేష్ఠత్వం గురించి నూరిపోశారు. చలం అప్పటికే విగ్రహారాధన, గుళ్ళలోకి వెళ్ళడం, కులభేదాలను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాడు. వీటిని మించి స్త్రీ గౌరవం పట్ల అభిమానం, వ్యవస్థ పట్ల ఆగ్రహంగా మారింది. ఆ ఇంట్లో ఇంటి కోడలు వంట వాళ్ళకికూడా లోకువే. చలం తన తమ్ముళ్ళు, చెల్లెళ్ళ సాయంతో కొత్తకోడల్ని కోడంట్రికాలు హింసల నుంచి కాపాడి వారివారి ఆజ్ఞలకు ఎదురు తిరిగేలా చేశాడు. అంతేగాక యింటికి దూరంలో వున్న తోటలో ఓ బాడ్మింటన్ కోర్టుపెట్టి ప్రతి సాయంత్రం తన తమ్ముళ్ళ భార్య రంగనాయకమ్మతో చెల్లెళ్ళతో బాట్స్ చేతుల్లో పట్టుకుని వీధి లోంచి వెళ్తూంటే- కొందరు తిట్టేవారు, కొందరు వుమ్మి వేసేవారు. ఇవన్నీ భరిస్తూ స్త్రీ స్వేచ్ఛా యజ్ఞాన్ని యింట్లోనే ప్రారంభించాడు చలం.

'హిందువుల అబద్ధం, మోసం, క్రౌర్యం, బాల్య వివాహాలు, నిర్బంధ వైధవ్యం ఇవన్నీ నన్ను ఎంతో కలతపెట్టాయి. పసుపు ముద్దల్ని, రాళ్ళని, పటాల్ని, దేవుళ్ళు అనుకొని పూజచేయటం హైన్యమనిపించింది. నాకు నీతివర్తన

మీద పట్టుదల ఎక్కువైంది. నీతి విషయమై, మతం విషయమై. నేనెరిగిన మనుష్యులు, బంధువులు యెంత ధూర్తులో,ఎంత అబద్ధీకులో. ఎంత దుర్మార్గులో అర్ధమయింది, ఈ అబద్ధపునీతులుగాక, నిజమైన నీతిని కనుక్కొని దాన్ని జీవితంలో అనుష్ఠించాలని దృఢ నిశ్చయం చేసుకున్నాను. నాకు సత్యం మీద అంత గట్టి అభిమానముండబట్టే, నేను తెనాలి వెళ్ళినపుడు, మావాళ్ళని ఎదిరించి అన్ని కష్టాలు పడవలసి వొచ్చింది.నేను బహిరంగంగా నా ఉద్దేశ్యాలు ప్రకటించినందుకు నా తల్లిదండ్రులు, బంధువులూ అందరూ మా తాతగారి ప్రక్కనచేరి నన్ను ఇంట్లోంచి పంపివెయ్యమని రొద ప్రారంభించారు.'

చలం యిలా మారడం ఆయన తాతగారికి చాలా వ్యధను కలిగించి వుంటుంది. ఆయన బాధపడడం చలానికి బాధే, కాని అతని ప్రిన్సిపు ్ల వేరయేసరికి ఘర్షణ అనివార్యమైంది. డబ్బు ఆస్తి దక్కనివ్వకుండా చేయాలనే వత్తిడి తాతగారి మీద ఎక్కువవుతుంది. ఇంతలో మరో సమస్య-యింటా వంటాలేని ఆలోచన పెళ్ళాన్ని చదివిస్తానని పట్టుబట్టాడు,ఆ సమస్యని ఒక ఉద్యమం స్థాయికి పెంచాడు. తనకు తగిన భార్య ఎవరయినా చదువుకుని వుండాలనే పట్టుదల చలానికి వచ్చింది. చిట్టి రంగానాయకమ్మను చదివిస్తానని క్రూరచలం పట్టు పట్టేటప్పటికి అతని మీది ద్వేషాలు శిఖరాన్ని అందుకున్నాయి. పెళ్ళి అయినప్పటి నుంచి గొడవ చేయడం మొదలెట్టాడు. చలం తెనాలి వచ్చినప్పుడు పెళ్ళయాక తనకో గది కట్టించమని తాతగారిని అడిగాడు, కార్యం అయాక మేడ మీద గది కట్టించమంటే 'నీవు దీంట్లో నీ భార్యతో వుంటావటరా? వీళ్ళను (ఈ తమ్ముళ్ళను చెల్లెళ్ళను) వదిలి పెట్టివుంటావా? నీకు గది ఎందుకురా? నీవు గట్టిగా కావలెనంటే కట్టిస్తాను, అన్నారట తాతగారు. కార్యం చేశాక కాపురానికి వచ్చిన చలం భార్య తాతగారికి సేవలు చేస్తూ తెనాలిలోనే వుండి పోయింది. ఈ రంగనాయకమ్మ కూడా చలం మద్రాసులో వుంటూండగా హాస్టల్లో వుండి చదువుకోవాలంటే నెలకు ఇరవై రూపాయలు కావాలి ఆ డబ్బు ఆమె తల్లిదండ్రులు యివ్వ నిరాకరించారు. అంతేగాక ఆమె నగల్ను కూడా లాక్కున్నారు. ఒక అమ్మాయి హాస్టల్లోవుండి చదువు కోవడం చెప్పరాని ఘోరం. తాతగారితో మారాంపట్టి ఆమె హాస్టల్లో వుండకపోయినా వేరే యింట్లో వుండటానికి వొప్పించాడు.

'రెండు రోజుల్లో కాలేజి తెరుస్తారు. నేనా రాత్రి బయలుదేరాలి. నువ్వు యీ అమ్మాయిని చదివించేట్టయితే డబ్బు యివ్వం అన్నారు మా తాతగారు. అర్ధ

రాత్రి అయింది, బండివొచ్చి వాకిట్లో నుంచుంది. నా దగ్గిర ఏమీ డబ్బులేదు. ఎక్కడికి పోతానో ఏమి చేస్తానో తెలియదు. ఇల్లంతా నిద్రపోతోంది. వెళుతున్నానని చెప్పటానికి మా తాతగారి గదిలోకి వెళ్ళాను. ఆ పెద్దగదిలో మా అమ్మమ్మ పెద్ద మంచంమీద పడుకుని నిద్రపోతున్నట్టున్నారు మా తాతగారు. ఆయన వీపు వెనకాలే నేను నుంచుని "తాతగారూ! మేము వూరికి వెళుతున్నాము" మాటాడకండా ఆయన ఓ చేత్తో నన్ను దగ్గిరికి లాక్కుని రొమ్ముకి గట్టిగా అదుముకుని కావిలించుకున్నారు. ఏమి మాట్లాడకుండా, కన్నీళ్ళు కార్చాటు. ఈనాడు తెలుస్తోంది నాకు, ఆయనకి నా మీద ఎంత ప్రేమో! ఆయన హృదయం,మనస్సు ఎంత విశాలమో! ఆయనలో ఎంత క్షమో, ఆయన నన్ను వొదిలిన తరువాత నేను లేచి నుంచున్నాను. నా చేతిలో ఒక నోట్లకట్ట పెట్టి ఒక్క మాట లేకండా తిరిగి పడుకున్నారు. నేను గద్గద కంఠంతో వెళుతున్నాను అని వొచ్చేశాను.'

మద్రాసులో ఒక ఇల్లు తీసుకునివుంటూ రంగనాయకమ్మను సెయింట్ థామస్ కాన్వెంట్ స్కూల్లో చేర్పించి రెండేళ్ళు చదివించాడు చలం.

చలం మద్రాసులో తాను చదువుకుంటూ భార్యను చదివిస్తున్న కాలంలో తారసపడ్డ ఆత్మారాం గురించి-అతను టీలో చక్కెరలాంటి వాడు-మిస్సవడం కష్టం అంటాడు. రంగనాయకమ్మగారూ చలం ఆత్మారాం మద్రాసులో వీరితో వుండేవాడు. అంతా విపరీతంగా చెప్పుకునేవారు, ఆత్మారాం వీరితో వుండడం గురించి, ఆత్మారాంకి ఆలోచనలు తక్కువ. తాబేలుమల్లే తిరుగుతూ వుండేవాడట. అంతా వెక్కిరిస్తున్నా వీళ్ళు ముగ్గురూ వంట చేసుకుని తిని ఎవరి స్కూల్‌కి కాలేజీకి వాళ్ళు పోయేవారు. ఆ రోజుల్లో హిందూ కుటుంబాల నుంచి పిల్లలుగాని, పెద్దలుగాని ఆడవాళ్ళు చదువుకోటానికి వస్తే గొప్పగా చూచుకునేవారట విద్యాధికారులు. చలం మాటల్లో 'మేము ముగ్గురం కలిసి వండుకునేదాన్ని వంట అనటానికి వీల్లేదు. దానికో పద్ధతికాని రుచికాని వుండేది కాదు- 'ఆత్మారాంకి ఇంట్లోవారితో వున్నా బాధ్యతలేవీ వుండేవికాదు అతనికి- కూరల్లోకి వుప్పులేదు బజారుకెళ్ళి తీసుకు రమ్మంటే వెళ్ళి మూడు రోజులకి వచ్చేవాడు.

మద్రాసులో వాళ్ళ చదువులై పోగానే ఆత్మారాం వాళ్ళ వూరెళ్ళి పోయాడు. అతనికి పెళ్ళి ప్రయత్నాలు జరుగుతున్నాయని తెలిసి వాళ్ళ వాళ్ళ బలవంతానికి

రాత్రి అయింది, బండివొచ్చి వాకిట్లో నుంచుంది. నా దగ్గిర ఏమీ డబ్బులేదు. ఎక్కడికి పోతానో ఏమి చేస్తానో తెలియదు. ఇల్లంతా నిద్రపోతోంది. వెళుతున్నానని చెప్పటానికి మా తాతగారి గదిలోకి వెళ్ళాను. ఆ పెద్దగదిలో మా అమ్మమ్మ పెద్ద మంచంమీద పడుకుని నిద్రపోతున్నట్టున్నారు మా తాతగారు. ఆయన వీపు వెన కాలే నేను నుంచుని "తాతగారూ! మేము వూరికి వెళుతున్నాము" మాటాడకండా ఆయన ఓ చేత్తో నన్ను దగ్గిరికి లాక్కుని రొమ్ముకి గట్టిగా అదుముకుని కావిలించుకున్నారు. ఏమి మాట్లాడకుండా, కన్నీళ్ళు కార్చాటు. ఈనాడు తెలుస్తోంది నాకు, ఆయనకి నా మీద ఎంత ప్రేమో! ఆయన హృదయం,మనస్సు ఎంత విశాలమో! ఆయనలో ఎంత క్షమో, ఆయన నన్ను వొదిలిన తరువాత నేను లేచి నుంచున్నాను. నా చేతిలో ఒక నోట్లకట్ట పెట్టి ఒక్క మాట లేకండా తిరిగి పడుకున్నారు. నేను గద్గద కంఠంతో వెళుతున్నాను అని వొచ్చేశాను.'

మద్రాసులో ఒక ఇల్లు తీసుకునివుంటూ రంగనాయకమ్మను సెయింట్ థామస్ కాన్వెంట్ స్కూల్లో చేర్పించి రెండేళ్ళు చదివించాడు చలం.

చలం మద్రాసులో తాను చదువుకుంటూ భార్యను చదివిస్తున్న కాలంలో తారసపడ్డ ఆత్మారాం గురించి-అతను టీలో చక్కెరలాంటి వాడు-మిస్సవడం కష్టం అంటాడు. రంగనాయకమ్మగారూ చలం ఆత్మారాం మద్రాసులో వీరితో వుండే వాడు. అంతా విపరీతంగా చెప్పుకునేవారు, ఆత్మారాం వీరితో వుండడం గురించి, ఆత్మారాంకి ఆలోచనలు తక్కువ. తాబేలుమల్లే తిరుగుతూ వుండేవాడట. అంతా వెక్కిరిస్తున్నా వీళ్ళు ముగ్గురూ వంట చేసుకుని తిని ఎవరి స్కూల్‌కి కాలేజీకి వాళ్ళు పోయేవారు. ఆ రోజుల్లో హిందూ కుటుంబాల నుంచి పిల్లలుగాని, పెద్దలు గాని ఆడవాళ్ళు చదువుకోటానికి వస్తే గొప్పగా చూచుకునేవారట విద్యాధికారులు. చలం మాటల్లో 'మేము ముగ్గురం కలిసి వండుకునేదాన్ని వంట అనటానికి వీల్లేదు. దానికో పద్ధతికాని రుచికాని వుండేది కాదు- 'ఆత్మారాంకి ఇంట్లోవారితో వున్నా బాధ్యతలేవీ వుండేవికాదు అతనికి- కూరల్లోకి వుప్పులేదు బజారుకెళ్ళి తీసుకు రమ్మంటే వెళ్ళి మూడు రోజులకి వచ్చేవాడు.

మద్రాసులో వాళ్ళ చదువులై పోగానే ఆత్మారాం వాళ్ళ వూరెళ్ళి పోయాడు. అతనికి పెళ్ళి ప్రయత్నాలు జరుగుతున్నాయని తెలిసి వాళ్ళ వాళ్ళ బలవంతానికి

ప్రేమలోతప్ప వికసించలేని చలానికి ప్రేమే కరవైంది బాల్యంలో. అతి గారం వలన చెడిపోయిన పెద్దింటి పిల్లలుండటం లోక సహజం. పెంపకం, చదువు పేరిట అతిహింస వలన చలంలో ప్రతీకారేచ్ఛ ప్రబలి అన్ని రకాల క్రూరత్వాలు దేన్నీ సహించి వూరుకోని తిరుగుబాటు తత్వాన్ని అతనిలో మేల్కొల్పినాయి. చిన్నతనం చాలా గొప్పకాలమనే మాట చలంపట్ల అర్ధవిహీన మయింది. బుద్ధ జయంతినాడు పుట్టిన చలాన్ని బుద్ధునిమీద పెంచుకున్న కసితో చలం తండ్రి హింసించి వుంటాడు.

1941లో రాసిన నరసింహావతారంలో తన తండ్రికి వ్యతిరేకమైన రూపాన్ని హిరణ్యకశిపునిలో సృష్టించి తండ్రిమీద తనకుగల అసహ్యాన్ని తీసేసు కున్నాడు చలం. జాగ్రత్తగా పరిశీలిస్తే—

భక్త కుచేల నాటికలో—

"కృష్ణుడు : ఎందుకు అంత మంది బంధువుల్ని పోగుచేసుకున్నావు?

కుచేలుడు : బంధువు లేమిటి? నా పిల్లలు.

కృ : పిల్లలూ? ఎంత మంది?

కు : ఇరవై య్యేడుగురు.

కృ : ఇరవై య్యేడుగురా?నాకు మల్లేనే నువ్వూ పదహారు వేలమందిని పెళ్ళి చేసు కున్నావా యేం? నాకన్నా లేరే అంత మంది పిల్లలూ? అరే.... చూడ్డానికి యిట్లా వున్నావు. భక్తి వేదాంతాలు మాట్టాడ్తావు. ఇంత కాంతాసక్తి యేమిటి నీకు?

కు : హరిహరీ; ఏక పత్నీవ్రతుణ్ని.

కృ ; నీ భార్యకే! ఉద్దండుడివిలాగున్నావే! చూడ్డానికి యెముకల పోగువి. అరె! అరె! మరి పాపం ఆమె.... నీ భార్య ఇరవయి ఏడుగురిని కని, మీ అంద రికి చాకిరీ చేస్తుందా? ఇప్పుడు మళ్ళీ గర్భమా?

కు : మరి ఏం చెయ్యమన్నావు? అదృష్ట దేవత నాకు పిల్లల రూపాన సాక్షాత్క రించింది.

కృ : ఎప్పుడూ నీ భార్యమీద జాలికలగలేదా? ఆమెకీ కనడం సంతోషమేనా?"

కృష్ణుడు అడిగిన ఈ ప్రశ్నను చలం తన తండ్రికి వేస్తున్నాడు. ఇక్కడ కుచేలుడి మీద సాంబశివరావు ప్రభావం వుండే వుంటుంది. ఇక్కడ చలం ప్రదర్శించిన హ్యూమర్ వెనుక తన తల్లి పడ్డ బాధలున్నాయి.

చలం తల్లి గురించి రాసుకున్న మాటలు—

'మా తల్లి వరసగా పిల్లల్ని కని అర్భకురాలై పక్క మీదనే పడుకుని వుండేది. ఒకటి రెండు సార్లు చావుకి సిద్ధమయింది. ఐనా వొదిలేవాడు కాదు ఆ దయగల భర్త. అర్ధరాత్రులు నా పసి తమ్ముళ్లు, చెల్లెళ్ళు ఏడ్చేవారు. ప్రతిరాత్రి తప్పకుండా అంత బలహీనంలోను అలసిన నిద్ర కళ్ళతో మా అమ్మ జోల పాట పాడేది వుయ్యాలలూపుతూ.'

తను కాకుండా నలుగురు తమ్ముళ్ళూ నలుగురు చెల్లెళ్ళూ పుట్టారు. మొత్తం తొమ్మిది మంది. కళ్ళు తెరచి కసితో బిడ్డల శిక్షణ, స్త్రీ రాయడానికి చలానికింత కంటే ప్రేరణ యింకేం కావాలి? చలానికి వేదాంత మంటే అసహ్యం అంటాడు "భగవాన్ వేదాంతం కూడా గిట్టేది కాదు" మళ్ళీ పురాణాలంటే యిష్టం. తర్కబద్ధం కాని ఈ వైరుధ్యం చలంలో ఆదినుంచీ వుంది.

'ఆ పరబ్రహ్మలో నీళ్ళలో నీళ్ళలాగా, నూనెలో నూనెలాగా కలిసి పోతాం' అని బొర్ర బ్రాహ్మడు కంఫర్టబుల్‌గా భోజనం చేసి, self righteousగా వేదాంతం మాట్లాడితే ఓ కర్ర తీసుకుని బుర్ర మీద కొట్టాలనిపిస్తుంది. అందుకనే వేదాంత మంటే అంత అసహ్యం' అంటాడు.

'ఇంట్లో ఈ పురాణాల గోష్ఠి ఎక్కువగా వుండేది. అదీగాక మధ్యాహ్నాలు ఒక పండిత శాస్త్రిగారు వచ్చి ఆ పురాణాల్ని వేదాంత పుస్తకాల్ని సంస్కృత మూలం లోంచి చదివి తెలుగులో explain చేసేవాడు. వీటన్నిటి వల్లా నాకు దైవభక్తి అప్రయత్నంగా ఏర్పడింది. విష్ణు అన్నా విష్ణు కథలన్నా చాలా యిష్టం. ఆ కథలే మననం చేసుకునే వాణ్ని. వాటిని తక్కిన పిల్లలకి చెప్పేవాణ్ని. ఏదో ఓ రూపంలో విష్ణు దేవుడికి పూజలు చేసేవాణ్ని. నా పూజకి నాకో ఆలయం వుండాలనిపించింది. కొన్ని యిటికలు పోగుచేసి ఓ చిన్న గుడిలాంటిది కట్టాను. కొన్ని డబ్బులు సంపాయించి హారతి కర్పూరం, ఖర్జూర కాయలు కొని ఆ ఆలయములోనే దాచేవాణ్ని. ఆ పూజ నాకెంతో ఆనందాన్నిచ్చేది. బళ్ళో కూర్చున్నా సరే. ఆలయాన్ని దాంటో దేవుడిని తలచుకుంటే నా మనసు సంతోషంతో నిండి పోతుంది. ఈనాడు తలచుకొన్నా నా మనసుకి సంతోషం కలుగుతుంది.

నాకు చిన్న తనంలోనే ఉపనయనం చేశారు. నేను శ్రద్ధగా సంధ్యావందనం నేర్చుకుని మూడు పూటల సంధ్య వారుస్తున్నాను. ఇంకా అంతకుముందు శ్రీరాములు అనే స్నేహితుడికి ఉపనయనమయింది. అతను చెప్పాడు నిజమో, అబద్ధమో, కొన్నాళ్ళు శ్రద్ధగా గాయత్రి చేసేటప్పటికి గాయత్రీదేవి అమ్మవారు అతనికి ప్రత్యక్షమయిందని. ఆమెను వర్ణించాడు. అప్పట్నించి నేను ఆ అమ్మవారిని ప్రత్యక్షమయ్యేట్టు చేసుకోవాలని సంధ్య వార్చటమే కాకుండా తీవ్రంగా గాయత్రి నేనూ చేశాను. వేషంలో, అలవాట్లలో నేను గట్టి శ్రోత్రీయ బ్రాహ్మడుగా తయారయినాను. జుట్టు చిన్న ముడి వేసేవాడ్ని. తక్కినదంతా గొరిగించి స్వయంగా బావి దగ్గర నీళ్ళు తోడుకుని స్నానం చేసి మడి కట్టుకునేవాడ్ని. నా చిన్న ఆలయం ముందు కూచుని సంధ్యావందనం, గాయత్రీ జపం చేసేవాడ్ని. నా కాలమంతా అట్లా సరిపోతుంది. నా జీవితానికి ఒక లక్ష్యమే లేకుండా విష్ణుని, నా ఆలయాన్ని తలచుకుంటే చాలు ఒక అప్రమేయానందం నింపేసేది నా మనసుని- బ్రాహ్మలు కాని వారు కనపడితే భోజనం వొదిలి లేచి పోయేవాడ్ని. తీరుబడి అయినప్పుడల్లా పురాణాలు చదివేవాడ్ని. అట్లా గడిచింది నా తెనాలి జీవితం.

ఈ నేపథ్యంలో comfortableగా self righteous గా బొర్ర బ్రాహ్మడు మాట్లాడే వేదాంతం మీద మంట. పురాణ కథల మీద కల మక్కువలో నుంచే చలం శశాంక, పురూరవ, సావిత్రి, భానుమతి యింకా యితర పౌరాణిక నాటకాలకు ప్రాతిపదిక ఏర్పడింది.చలంలోనికోపం క్రమంగా వ్యంగ్యంగా నిశితమైన రూపు దిద్దుకుంది

మచ్చుకి 'శశాంక'లో——

ఆహల్య: -మెల్లిగా- శశీ నిన్ను చూశాక నీతో యెట్లా మాట్లాడాలో తెలీటం లేదు. ఎందుకంటే నువ్వు ఇట్లా వుంటావనుకోలేదు.(ప్రయత్న పూర్వకంగా) శశీ నువ్వు పసివాడివి, కులీనుడివి,ప్రతిభావంతుడివి. నువ్వే ఈ విధంగా మాయకు లోబడి నీతి విచక్షత లేక-

శశాంక: -బాధతో- అహల్యాదేవీ! మీరూనా! మీరు! మీరూ ఆ విధంగానే మాట్లాడుతున్నారా?

(అహల్య పులిక్కి పడింది. శశాంకుణ్ని చూచినప్పుడు మొదట అతని మాటలు విన్న కొద్ది ఆమెకు యెన్నడో మరిచి పోయిన రసిక భావాలు మొలకెత్తి కలవర పెడుతున్నాయి.)

అహల్య: (మెల్లిగా) ఏం మాటలు?

శశాంక : లోకం వలె. ఆ ఋషుల వలె....

అహల్య: వలె-?

శశాంక : నీతి వాక్యాలు? మీరూనా?

అహల్య: నేను భిన్నమని ఎందుకనుకున్నావు?

శశాంక ; మీ నేత్రాల్లోకి చూసి. అవి మీ మాటలు కావు. మీరు నేర్చుకున్నవి.
[అహల్య చాలా అభినందింపబడినట్లు అనుభవిస్తోంది]

అహల్య: [తననే మరచి పోతో] శశీ నిన్ను చూసిన కొద్దీ నిన్ను వొళ్ళో కూచో పెట్టుకుని రెండు చెంపలూ వాయించాలని పిస్తోంది.

శశాంక : సరే. కానీండి.
[ఆమె వొళ్ళో కూచో బోయినాడు.]

అహల్య : [నవ్వుతో] ముందు నేను నీ చంపలు తాకడానికి అర్హత తెచ్చుకో.
(శశాంకుడు కుంగిపోయినాడు)

అహల్య : (అదే సమయమని) నేర్పాదయ్యా మాటలు! విను ముందు నేను చెప్ప దలుచుకుంది, ఏ నియమమూ లేక స్త్రీ లోలుడవై తేనెటీగవలె పుష్పా న్నించి పుష్పానికి—

శశాంక : నాది అసాధారణ జాతకం

అహల్య: నీ వంటి వారిని చాలామందిని చూశాను.

శశాంక : చూసి—

అహల్య: సాధారుణులకు నే జ్ఞానమిచ్చి పంపాను

శశాంక : నన్ను పంప ప్రయత్నించకండి, నేను వెళ్ళను

అహల్య: నా మాట విని, బుద్ధిమంతుడివై పాపం, అనూరాధ—

శశాంక : (ఆలోచనగా) అనూరాధా! నా తీవ్ర నిరంతర నిరాటంక వాంఛని మీ రెరుగరు. నా సౌందర్యాశయం యే వొక్క వ్యక్తివల్లా సంతుష్ట పడదు. అదే యోచిస్తున్నాను.

అహల్య: తారవల్ల —

శశాంక : మీ వల్లనైనా సరే!

(సగం ఆశ్చర్యంతో- సగం నవ్వుతో అతనివంక చూస్తోంది. కొంచెం భయం కూడా కనపడుస్తోంది అప్రయత్నంగా)

ఈ 'శశాంక' చలం తన గురించి తనకోసం తను రాసుకున్నదే. ఇందులో సామాజిక చైతన్యం కంటే 'కామాజిక చైతన్యం', 'స్పృహ' ఎక్కువ. నాది అసాధారణ జాతకం అని చలమే ఢంకా బజాయించి చెప్పుకుంటున్నాడు. అనుష్ఠాన బ్రాహ్మ సామాజికుల నీతి సూత్రాల కాఠిన్యాన్ని తిరస్కరిస్తున్నాడు చలంలోని శశాంకుడు, రత్నమ్మ తారకాకపోవచ్చు 'వొయ్యి' అహల్యాకాదు. చిట్టి రింగనాయకమ్మగారు అనూరాధ అంతకంటెకాదు. ఆ అనూరాధ చిన్ననాటి రమణో, సుందరమ్మో మరెవరో- నా సౌందర్యాశయం యే వొక్క వ్యక్తి వల్లా సంతుష్టిపడదు (ఆఖరికి లీలగారివల్ల కూడా) అని చలం చెప్పుకుంటున్నాడు. చలం పొడిగిస్తున్న శృంగారరేఖని శశాంకలో స్పష్టంగా చూస్తాం. ఈ వ్యాఖ్యలు చలం జీవితం మీద మ్యూజింగ్స్. శశాంకలో అహల్య చలం సౌందర్యాశయానికి అతని పురాణ వైరి నాటకంలా పైకి స్ఫురించినా. లోపల స్త్రీ పురుష సంబంధాలయెడ అతనివ్వదలుచుకున్న తత్వానికి కావలసిన తర్కం యిందులో వుంది.

అహల్య మాటల్ని గమనిస్తే—

'మబ్బు కమ్మిన నల్లని ఆకాశంలో చాతకంవలె ఆ శ్యామల లావణ్యంలో ఆ ఆత్మ విశాలత్వంలో నా హృదయం లీనమయింది. గృహోన్ముఖుడు కాగలడు నా మనోహరుడని అక్కడే ఆ కంట కావృత అరణ్య మార్గాన్నే నిలిచి వున్నానెంతకాలమో! నా ముందు రథాలు, వుత్సవాలు, మేఘ పరంపరవలెనడుస్తున్నాయి. కాని మలిన, జీర్ణవస్త్ర, పతితయైన అనాథ స్త్రీ యెవరికి లక్ష్యము.... చివరికి ఒక మధ్యాహ్నము నా మనోహరుడి వేగదృష్టి నా దౌర్భాగ్యముపై నిలిచింది. పతిత త్రాణుడు, సకల కలుష హరణుడు, సుందరమూర్తి సీతా సమేతుడై దర్శనమిచ్చాడు. నా హృదయాన్ని రథ చక్రాలముందు పారవేసి నిలుచున్నాను. కంపిత శరీరనై నా బాధ నా అసంతుష్టి ఆత్మాంతరనిగూఢమై నా వాంఛా, నా సంసార దుర్భరత్వం అన్నీ ఆయనముందు కన్నీటిధారలుగా వ్యక్తపరచాలని సాగిలబడే నా చేతిని మృదువుగా గ్రహించి నా భర్త హస్తములో వుంచాడు శ్రీరాముడు.

'ఈ మహా పతివ్రతను అహల్యను చిరకాలము ధర్మపత్నిగా పాలించమ'ని నా సమస్త శక్తులూ ఘోషించాయి "అన్యాయ"మని. "ఇదేమికమిణ" అని ప్రార్థించ బొయ్యే నా పెదవులమీది ఆర్తనాదము, సీత శీతల దృష్టులతో అక్కడే నశించింది ముందుకుసాగిన రథ చక్రాల కిందనలిగి "సీతా స్త్రీవి నీవనుభవింప కాకళంకము" అని అరిచింది నా హృదయము' అహల్య చలం ఆత్మఘోషను ప్రకటిస్తూ- తన స్వభావం అధమమని విశ్వసించి, అహల్యముఖమే దౌర్భాగ్యనిలయమని ప్రకటించి, ఆమె మలిన అనీ, పతిత అని భావించి శిక్షించి శపించిన భర్తతో సంసారం చేయమని రాముని హితవు. అహల్య రాముడిని విమర్శిస్తుంది- 'సర్వ బంధనాతీతుడగు శ్రీరాముడి ఔదార్యము కూడా సంకుచితమయింది. వివాహ శాసన గ్రస్తమై' అని ఈమె ఈ అహల్యకు జరిగిన అవమానం పరాజయం శశాంకుడికి తీవ్రమైన వ్యథను కలిగిస్తుంది. చలమే శశాంకుడి చేత యిలా అనిపిస్తాడు

శశాంక: దేహాన్నేగాని హృదయాన్నంటలేదు గాపును శ్రీరామ పాదరజము. ఏక పత్నీవ్రత గర్వితాంధమైన శ్రీరాముడి సంకుచితాత్మయే మెటుగును, సుందర పాపత్రివతలోని సుఖము:ఆ దుర్భరానందాగ్నిలో తపన పొందిన స్వభావౌన్నత్యము! సీత క్షుద్ర మందహాసాలతో తృప్తి చెంది, తదర్థ హీన స్వార్థ త్యాగ నియమాలతో సంతోషపడ్డ రాముడి శిల్పస్వభావాని కర్థం కాగలదా కలలోనైనా శిలనైనా కంపింప చేయగల ప్రయోగ పటుత్వము?

చలం అహల్యద్వారా శశాంకుని ద్వారా పాయింట్ కౌంటర్ పాయింట్ చెప్పకు పోతున్నాడు.తన గురించే, తనలోని మోహావేశాన్ని సంఘర్షణను బయట పెట్టుకుంటూ తర్క నైపుణ్యంతో సంప్రదాయ వైవాహిక నీతి సూత్రాలకు కాల దోషం పట్టిస్తున్నాడు. అహల్య శశాంకుని లెక్చర్ విని 'నీ దొంగ మాటలకి లేని వాస్తవ గుణాన్ని సాధిస్తోంది నీ కంఠంలోని మార్దవం' అని మెచ్చుకుంటుంది. శశాంకుడు అహల్యని యింకా flatter చేసి పుబ్బేస్తాడు. 'ముఖస్తుతి అనుకుంటు న్నారు కదూ? మీరు కనపడగానే, పూర్వజన్మాల ఆనందస్వప్నాలను కనే మీ నేత్రాల సౌందర్యం కోసమే మీ దేహంలోని ప్రతి చిన్నినాళాన్నీ వెలిగించి జీవింపజేసే మీ ఆత్మోన్నత్యం కోసమే స్త్రీ లోకమంతా అన్వేషించి చంచలుడనే అపకీర్తి అనుభవించాను' అని.

ఈ నాటకం చివరలో బృహస్పతి సంసారాన్ని సంస్కరించడానికై వచ్చిన అహల్య చలం శశాంకుని ద్వారా అనిపించిన మాటలకి, చేసిన చేష్టలకి మారిపోయి వీరితో వుండిపోతానని నిర్ణయిస్తుంది. 'వొయ్యి' వచ్చి చలంతో వుండిపోయింది కదా! దానికి సంబంధించిన తాత్వికమైన మీ మాంస యిందులో కనిపిస్తున్నట్లుంది.

శశాంకుడు అచ్చం చలంలాగ సంతోషిస్తాడు 'ఆమె మనతో వుంటుందా— అద్భుతమైన కాలాన్ననుభవించ పోతున్నాము. నువ్వు నేను అమ్మగారు గురువు గారు' అంటూ. ఫ్రీలవ్ సొసైటీ అనేది వున్నా లేకపోయినా ఏ ప్రణయస్వేచ్ఛ నూతన జీవిత స్వర్గద్వారాలను తెరుస్తుందో దానికి శశాంక నాటిక ఓ ప్రాతిపదిక. చలం చిన్నప్పుడు ఆటలకు పోకుండా పురాణాలు వినడం వలన వచ్చిన గోలయిది. 'మాది చాలా పెద్దయిల్లు, పెద్దడాబా, పెద్దతోట. కనక పూరి ఆడపిల్లలందరూ మా చెల్లెళ్ళతో ఆడుకోటానికి వచ్చేవాళ్ళు. నా విరామకాలమంతా వాళ్ళ స్నేహాలతోనే గడిచింది. నాకు మొగ స్నేహితులులేరు. సాయంత్రాలు ఏ ఆటలకీ బయటికి పోయే వాణ్నికాదు. ఎదుగుతున్న ఆడపిల్లలతో ఆటలతో, సరసాలతో, నాటకాలతోనే గడిచింది కాలం. చిన్నప్పటినుంచి దూరంగావుండే నా బాల మిత్రురాళ్ళకోసం ఏడ్చేవాణ్ని డాబామీద ఒంటరిగా పడుకుని, తేలిపోయే మేఘాలని చూస్తో ఉత్తరంగా పోతున్నారు గదా! నా వేదనని, విరహాన్ని, మా రమణికి వినిపించరా అని బిగ్గరగా పిల్చేవాణ్ని.

చలం Calf love గురించి మ్యూజింగ్స్‌లో కూడ ప్రస్తావన వుంది. అందులో—

'నేను చూసే చి—లో లావణ్యమంతా నిజంగా చి—లో వుందా? లేక సాధారణ బాలికతో యీ అరాధననంతా నేనే కల్పించుకున్నానా? (మన ప్రేమంతా ఆత్మకల్పితం suggestive నా sublimation కి చి—సౌందర్యం ఆధారం.... ఇంత సౌందర్యాన్ని కల్పించుకోగలిగిననా మనసు ఇంత ఆనందాన్ని కల్పించుకో గలిగిన నాహృదయం చి— అనే వ్యక్తి లేకుండానే కల్పించుకోలేదా యి ఆనందాన్నంతా?' అని శృంగార రేఖని పొడిగించి ఆధ్యాత్మికం లోకి తొంగిచూస్తూ ప్రశ్నిస్తాడు.

'చి—ని చూసిన కొద్దీ ఆమెలో నాకీ ప్రపంచ సౌందర్యం కనిపిస్తోంది. ప్రపంచ సౌందర్యంలో ఆమె కనబడుతుంది. యిట్లా రెండు రూపాలూ కలిసి

పోకూడదా? అప్పుడు ఆమె సంసారమూ నీతినిబంధనలూ, లోకమూ, ఆమె విచారమూ యేమీ నాకు ఉండవు, అంటావు.'

సబ్జక్టివ్ ధోరణిలో ఆలోచించడం చలం బాల్య స్నేహితురాళ్ళ విషయంలోనే కాదు—అప్పటికే అంత. అలా తన బాధలు తను ప్రేమించినస్త్రీలు తనకోసం పడుతున్నారని వూహించుకుని 'ఎన్ని అపాయాల్లోకి నడిచాను, వేదనలతో గడిపాను అర్ధరాత్రులు' అంటాడు.

ఆమె నిరాకరిస్తే చూసే భాగ్యం పోతుంది. అంగీకరిస్తే అతని కల బద్దలై పోతుంది. అది భయంట. 'ఆమె నా వంటి క్షుద్రుల్ని అంగీకరించకూడదని మరో నియమం పెట్టుకున్నాడు.

తన ఊహా ఊర్వశికై చలం పడుతున్న తపనలోని గొడవయిది.

చలానికి యిష్టమైన రచయిత మైకేల్ ఆర్లెన్. ఇతను "Love is just a trick of the heart- to fool the mind" అంటాడు. నేటి యువకులచరిత్రలు ఒక గర్భాదానం అంటే రేప్‌తో ప్రారంభమవుతాయి, వారికి ప్రేమ అంటే యేమి తెలుస్తుంది అని తీవ్రంగా అసహ్యంచుకుంటాడు చలం. స్త్రీ సౌందర్యంలోని మిస్టరీని చర్చిస్తూ చలం- 'టాగూర్ వర్ణనలవలె, వుడ్‌హౌస్ చక్కలిగింతలువలె, మైకేల్ ఆర్లెన్ ఉపమానాలవలె, జపాన్‌దేశపు రేడియో సంగీతంవలె, నరాల్ని అందంతోలాగి బాధిస్తాయి ఆ స్త్రీ సౌందర్యాలు' అంటాడు.

చలం కొల్లూరు మాన్‌షన్స్‌లో ఇసికలో పడుకుని వుండగా ఓ రోజు అట్ల తద్దికి ఆడుకునే పిల్లలు గోల చేస్తున్నారు- అప్పుడు తనకి గుర్తుకొచ్చింది—

'నా పాత స్నేహితురాళ్ళలో సుందరమ్మ ముఖ్యమైంది. ఆ అమ్మాయిని 'సీడిల్' అని పిలిచేవాళ్ళం. ఆ రోజు మా పాఠంలో "క్లియోపాత్రాస్ సీడిల్" అని రాబోతుంది. ముందే సైలెన్ట్‌గా వాడికి చూపించాను "వస్తోందిరా" అని. ఇంక నవ్వు ఆపుకోలేక పోయాం.........కొన్నాళ్ళలో సుందరమ్మ పేరు నా పేరు కలిపి స్కూల్ గోడలమీద రాస్తున్నారు. అక్కడితో సుందరమ్మ మా యింటికి రావడం మానేసింది. నాకు విరహబాధ ఎక్కువైంది. సుబ్రమణ్యాన్ని బతిమాలాను.అతను సరేనని సుందరమ్మ యింటికి వెళ్ళాడు సంతోషంగా.

ఆ స్కూల్‌ఫైనల్ క్లాసులోకల్లా మేమిద్దరమే చిన్న వాళ్ళం. పొట్టి వాళ్ళం. నాకు తెలిసినట్టు సుందరమ్మ యిల్లు వాడికి తెలియదు. వెళ్ళి వెతుకుతున్నాడు సుబ్ర

మణ్యం. వాళ్ళకి ఘోషా. వాళ్ళమ్మగారు "ఎవరి కోసం అబ్బాయి?" అంది. "సుందరమ్మ కోసం" అన్నాడు సుబ్రమణ్యం. "సుందరమ్మతో నీ కేం పని? ఇట్లారా" అని లోపలకు పిలిచి "నువ్వేనా గుడిపాటివారి అబ్బాయి" అంటూ, వాడు కాదని గోలపెడ్తున్నా వినిపించుకోకుండా దవడలు వాయించి పంపించింది. గొప్ప "ఎడ్వెంచర్" చేసివచ్చినట్టు గర్వంగా వచ్చాడు నా దగ్గిరికి వాడు. నాకు మాత్రం యిప్పటికీ అది తల్చుకుంటే దిగులు వేస్తుంది.

చలంకథకు దయాక 'సీత తల్లి' అనే చాలా చమత్కారమైన కథ యీ సన్నివేశాన్ని ఆధారంగా చేసుకుని కాబోలు అల్లాడు. చలానికి ఓ ఆడపిల్లల క్లబ్ అని పిల్చుకునే నేస్తురాళ్ళ గుంపు వుండేది. అందులోకి సుబ్రమణ్యానికి ప్రవేశం దొరికింది. ఈ సుబ్రమణ్యాన్ని చలానికి రామ్మూర్తి పరిచయం చేశాడు. 'చలం మిత్రులులో' యీ స్నేహితుడ్ని గురించి వివరంగా వుంది.

'చిన్నప్పుడు యెన్నేళ్ళయిందో- అట్లతద్ది ముందు సాయంత్రం నన్ను చూడ్డానికని వొచ్చింది క్రూరమయిన అభ్యంతరాలు తప్పించుకుని. కనపడగానే యెదుటు వెళ్ళి జాజిపొద వెనక యింకా చిన్నవిగావున్న ఆ బుజాలు- మజిలిన్ చొక్కా కింది ఆ లేత బుజాలు- కావిలించుకున్నాను. అట్లతద్దీ, చిన్ని తెల్లని జాజి పువ్వులూ, సుందరమ్మా యీ మూడు చిక్కుపడి పోయినాయి నా హృదయంలో. గోరింటాకు టోపీలు పెట్టుకున్న వేళ్ళు చూపి నన్ను బెదిరించింది, నా మెడ వెనక కలిపి గోరింటాకు అంటిస్తానని. నేను వెనక్కి తగ్గితే "మొగపిల్లల ధైర్యం" అని నవ్వింది. ....చంద్రుడు వొచ్చిందాకా డాబామీద కుచుందామన్నాను. చీకట్లో మెట్ల మీద యెత్తుకుని తీసికెళ్ళి కూచోపెట్టాను. పొద్దుపోయిందని భయపడే పిల్లని.... సుందరమ్మ లేచి నిల్చుంది. బిక్క మొహం వేసుకుని మాట్లాడకుండా చూస్తున్నాను ఆమె వంక. మెట్లతలుపు దగ్గర ఆ అమ్మాయి నా వంక జాలిగా చూసి నా గడ్డంకింద చెయ్యేసి "రేపు పొద్దున్న తెల్లారగట్ట....తప్పకుండా" అని వెళ్ళి పోయింది ...నన్నని చంద్రకాంతిలో ఆడుతున్న పిల్లలగుంపుల్ని వెతుకుతున్నాను. సన్నని వొళ్ళూ, చంప అంతా కళ్ళూ, సూదివంటి ముక్కూ. వెన్నెలని మింగే జడా, గాలిలో కొట్టుకుపోతున్నట్లు పరిగెత్తే నా ప్రియురాలి కోసం- దగ్గిరిగా వెళ్ళి మొహాలుచూసే నా వంక ఆడపిల్లలు 'స్కాండలస్'గా చూస్తున్నారు. చాలా మంది తమ హృదయాలకి తగిన ప్రియులు కోసం జనాన్ని వెతికే ఉదారులకి దుర్మార్గుడనే అపకీర్తి యిట్లాగే కలుగుతుంది.

కనపడ్డది. నా వంక చూడదు. పిల్లలతో కేకలేస్తుంది నవ్వుతుంది. దూరంగా పరిగెత్తి దగ్గిరగా రాసుకుంటూ పోతుంది. తలెత్తదు. పంకజాక్షి- 'బాబు వచ్చాడు సుందరమ్మా' అన్నా వినిపించుకోలేదు.

ఇదే హృదయాన్ని మండించే మధుకీలః "ఈ చంచలమే. ఈ non dependability, variable qualityయే కదూ స్త్రీమీద పురుష ఆగ్రహాన్ని గుమ్మరింప జేసింది. కాని యీ ఆటలే, ముందు నిమిషం ఏం చేస్తుందో ఎట్లా మారుతుందో తెలీని ఈ మిస్టరీయే లేకపోతే స్త్రీ ఎంత un interesting,tame inspid వ్యక్తిఐ పోయివుండును?" అనుకుంటాడు చలం.

ఇక 'చి' గురించి పొడిగిద్దాం.

"ఆత్మకోసం కళ్ళు వెతుకుతాను. నా ప్రేమకి ప్రవేశ మార్గాలు నేత్రాలు. నీ నేత్రాలంత అందమైన వాటిని నేను చూడలేదు నీ కళ్ళ వంటి దయగలపావలూ అన్నాను 'చి'తో".

ఈ 'చి' ఎవరో ఒక్క కలం గీటుతో దూరమైపోయిందట లాసన్స్‌బేకి నాలుగు మైళ్ళ.

ఆ బాల్య ప్రేమస్మృతుల్ని గురించి- 'సుందరమ్మా నేనూ కలుసుకోడం, ప్రేమించడం యెట్లా తటస్తపడ్డాయి? ఎందుకు వెర్రికలలు కన్నాము? మా భవిష్యత్తును గురించి ఒకరితో ఒకరం ఆ విషయమయి మాట్లాడగల ధైర్యమన్నా లేక; విధికి, కులాలకి యెదురీదాలని యెందుకు సాహసించాం?'

చలం బాల్య స్నేహితురాళ్ళ స్మృతులని పొదుగుతూ రాసిన కథల్లో చలం గారి కలం అనే సంకలనంలోని మణికథ ఒకటి. చలం calf loveకి యిది ఓ మచ్చుతునక. 'ఈ కథ పూర్వార్థంలో అంతా చలం నవయవ్వనపు శోభ— ఈ మణికథ ఉత్తరార్థంలో ఆ చిన్ననాటి ప్రేయసి స్మృతుల్ని చిదిమివేస్తే భయంకరమైన గడ్డు వాస్తవికత మణిని మాయంచేసి ఆమె స్థానే ఒక వికృతమైన గృహిణి స్వరూపాన్ని మన ముందుంచుతుంది. చలం దారుణంగా మన మనసుల్ని విషాదంతో పిండి తడిపి ఆరవేస్తాడు. ఈ కథలోని పూర్వార్థం స్త్రీ. బిడ్డలశిక్షణ రాయడానికి చలాన్ని పురికొల్పడానికి యిటువంటి అనుభవాలు చాలవా అని అనిపింప జేస్తుంది.

చలం నిజంగా నసయవ్వన ప్రణయవిలాసాన్ని తెలుగువారికి చెప్పవలసి నంత చక్కగా తీవ్రంగా చెప్పిన మొదటి రచయిత. తెలుగు సాహిత్యానికి చలం యింకా చాలా చేర్చాడు- అందులో ముఖ్యమైనది ఆలోచించడం, ప్రశ్నించడం!

మ్యూజింగ్స్‌లో బంగారమ్మ అనే యువతిని గురించిన చిన్ననాటి స్మృతుల్ని చలం చెబుతున్నాడు—

'నేను పసివాణ్ణి, అంటే యెనిమిదేళ్ళు. ఆమెకి యిరవై యేళ్ళు. ఆమెని చూసిన మొదటి నిమిషాన్నే అద్భుతమైన భక్తి కలిగింది ఆమె సౌందర్యం మీద.

చిన్నప్పుడు నేను నిద్ర పోయ్యే స్థలాని కెదురుగా రవివర్మ వ్రాసిన లక్ష్మి పఠం పెద్దది వుండేది, పొద్దున్నే బడి పుందనే వొణుకుతో మేలుకునే నా విషాద నేత్రాలకి ప్రథమ దర్శనం లక్ష్మి. ఆమెని ఆ లక్ష్మిని ప్రేమించాను. పెద్ద పద్మం లో నుంచుని కనపడేది నిశ్చలమైన నీటి మధ్య. ఆ పద్మంలో లేత ఎరుపు రంగు తల్చుకుంటే యీనాడూ ఏ నాడూ నా మనసు యీ దృశ్య ప్రపంచాన్ని వొదిలి యేదో సగం యెరిగినదీ యెరగరానిదీ ఐనయేదో వివిధ వర్ణాల నూత్న ప్రపంచాన్ని అందుకోవాలని బాధపడుతుంది. మరి చిత్రకారుడు ఆ పుష్పంలో ఏ అనుభవాన్ని సూచించాడో! పద్మం చూస్తేనే నాకేదో మధురమైన అసాధరణ మైన పరిమళం తట్టుతుంది. అందువల్లనే ఆలోచిస్తాను. ఇంతకు పూర్వ జన్మ వుంది గావును, లేక పూర్వ లోకాలు వున్నాయి గావును- అక్కణ్నించి తెచ్చు కున్నానేమో యీ జ్ఞాపకాన్ని! అంతకు తప్ప కారణం కనపడదు. ఉంటే సైకో ఎనలిస్టులు కనిపెట్టి చెప్పాలి. ఆ లక్ష్మి ఆ పద్మంలోని భాగంలాగు తోచేది. ఆ యెర్రని చీరనే ముద్రించక ఆ పద్మం రంగులోనే ఆమె దేహాన్ని కలిపేసివుంటే!

బంగారమ్మని చూడగానే నాకు చిరపరిచితురాలు లక్ష్మి జ్ఞాపకం వొచ్చి బంగారమ్మని ప్రేమించాను. కొన్ని రోజులు తలుపు సందులోంచి.కొన్ని రోజులు మా వాళ్ళ కాళ్ళ సందుల్నించి ఆమె ముఖం మీది చిరునవ్వుతో ఆడుకున్నాను. అంత చిన్న తనంలోనే నా పురుషత్వం నన్ను సిగ్గు పెట్టి బాధించేది. ఆ సిగ్గు వల్లనే ఎన్నో ఆనందాలు పోగొట్టుకొన్నానా అని దిగులు వేస్తుంది. ఆమెకీ సంతోషమే. సగం దాక్కునే నా మొహంతో దోబూచు లాడడం! నన్ను మరచి పక్క స్త్రీలతో ఆమె మాట్లాడితే తలుపుకి ముఖాన్నానించి బాధపడేవాణ్ణి. ఆ చిన్న శరీ రంలో పురుష హృదయం జెలసీ అంకురాలు అప్పుడే. ఎట్లాగో ఒక రోజు ఆమె

వాళ్ళో చేరాను, నన్ను మరచి ఆమె నవ్వుతోంది చుట్టూ స్త్రీలతో, ఆమె చుట్టూ మూగేవారు ప్రజ. ఆమె సౌందర్యానికి సంపద సాయపడ్డది. నా లక్ష్మి!........ వాళ్ళో కూచున్న బాలుడి హృదయంలో అర్థం గానివీ, భయం కలిగించేవీ, సగం కళ్ళు విప్పుచున్నవీ అయిన emotions ని ఆమె యెరుగదు. నా చెయ్యి ఆమె కంఠాన్నీ, చంపల్నీ, exploer చెయ్యడం, నా కళ్ళు పైకెత్తి ఆమె చిరునవ్వు కోసం నేను వెతకడం ఆమె యెరుగదు. నేనెవరు? అనేక స్త్రీ పురుష హృదయాల్నించి ఆరాధనని నిరంతరం పొందే ఆ లావణ్య విగ్రహానికి నా వెర్రి మమత ఏం లక్ష్యం? అలా బంగారమ్మ నిలిచింది చలంలో మొదటి ప్రణయ జ్యోతిగా.

'ఇంతలో నా పెళ్ళి దగ్గిరికి వచ్చింది. కారణం లేకుండానే నాకు పెళ్ళి అంటే అయిష్టం. అదిగాక అప్పటికే నాకు ముగ్గురు చిన్న పిల్లలమీద ప్రేమ. కుల వివాహ పట్టింపుల వల్ల చేసుకోలేదు. వాళ్ళతో కలిసి వుండటానికి వీల్లేదు. ఎంతో బాధపడుతున్నాను. గుంజుకున్నాను. అప్పటి కింకా 16 ఏళ్ళు లేవునాకు. శృంగేరి పీఠం వారికి రాశాను. మా పెద్ద నాన్న గారితుటు రమణితో నా పెళ్ళికి exempetion యిప్పించమని. మతం మీద, శాస్త్రాల మీద, ఇః బంధుత్వాలమీద నాలో ఎంత తిరుగుబాటు రేగిందో!

నాకు పెళ్ళి వద్దని గోలపెట్టాను. పారిపోదామనుకున్నాను. ఇల్లు కదలని వాడిని. సుకుమారిని, అర్భకుణ్ణి. అనారోగ్యుణ్ణి. నేనెక్కడికి పోగలను? ఈ పెళ్ళి వలన నాకు సరదా అయిన, ప్రేమమయులైన యిద్దరు వదినెగార్లు తటస్థించారు. వాళ్ళని చూసి తృప్తి పడి పూరుకున్నాను. వాళ్ళిద్దరు జీవితాంతం వరకు దగ్గిరి మిత్రులుగానే వుండిపోయారు. చదువుతో కాలం గడిచింది.

## చలం తండ్రి

చలం తండ్రి పోలిక, సౌరిస్, పెదనాన్న కొమ్మూరి సరసింహారావు అచ్చం చలం లానే వుండేవారని అంది. చలం తండ్రి ఇంటర్మీడియెట్ దాకా చదివి రెవిన్యూ డిపార్ట్‌మెంట్‌లో చేరాడు. కాని, పని చేయలేదు. ఉద్యోగం వద్దు అని మానేశాడు. వ్యాపారాలు చేస్తాననేవాడు. తెనాలికి మొదటిసారి మోటర్‌కారు, మోటర్ సైకిలు, ఫోనోగ్రాఫ్, గ్రామఫోను తెచ్చి ప్రవేశపెట్టింది చలం తండ్రి సాంబశివరావే. అందరికి అమ్మేవాడు డబ్బు తీసుకోకుండా. వసూలు చేసుకోడం తెలీక దెబ్బతిన్నాడు. ఏడాదికోసారి స్నానం చేసినా శరీరం ఏ కంపు కొట్టకుండా

వుండేదట. అరవయి ఏళ్లు వచ్చాక కూడా ఇటిక పొడుంతో పళ్ళు తోముకోడం. పంటితో మేకుల్ని వంచడం చేసేవాడట. చలం వాళ్ళ తమ్ముళ్లు చెల్లెళ్ళని కొట్టి కొరత వేసి హింసించినా, చలం పిల్లలంటే ఎంతో ముద్దు చేసేవాడట. మనవలు మనవరాళ్ళ కోసం బుట్టలకు బుట్టలు మామిడి పళ్ళు తెప్పించి మంచంకింద వున్నా యని చూపించేవాడట. ఓసారి మోటర్ సైకిల్ ప్రమాదంలో కాలు విరిగితే ఆరు నెలలు గదిలో వుండి స్వంత వైద్యం చేసుకుని నడుచుకుంటూ వచ్చాడట బయ టికి.అద్దం పెట్టుకుని బ్లేడుతో తన టాన్సిల్ తనే కోసుకున్నాడట ఓసారి.ఆయుర్వేద వైద్యం తెలుసు. చాలా బలాఢ్యుడు. ఆస్తులన్నీ తాగేసి చివరికి తాగుడు కోసం యింట్లో నగల్ని దొంగిలించేవాడట కూడా. ఆ రోజుల్లో లక్ష రూపాయల ఆస్తిని స్వాహా చేశాడు చలంది కూడా గుంజుకుని. మంచి రసికుడు. సంగీతాభిరుచి బాగా వుండేది తెనాలిలో పాట కచ్చేరీలు పెట్టించేవాడు.

చలం తన తండ్రిని ఎవరో ఏదో అంటున్నారని తెలిసీ తెలియకుండా ఫీ లయిన ఉదంతం ఓటి వుంది! అది చలం మాటల్లో— 'మా నాన్న ఒక ధనికు డయిన కమ్మాయనను టీ. బీ. కుదర్చడానికి మద్రాసు తీసుకు వెళ్ళాడు. అక్కడ ఆయన చచ్చి పోయాడు. ఆయన చచ్చిపోగానే ఆయన డబ్బంతా మా నాన్న కాజేశాడని తెనాలిలో ఓస్కాండల్ బయలుదేరింది. అది నా స్నేహితులు చెప్పు కుంటూ వుంటే నేను విన్నాను. ఆ స్నేహితులలో పట్టాభిరామయ్య ఒకడు. ఆ సంగతి నేను మా నాన్నతో చెప్పాను. మా నాన్న రౌడీ ఫ్రండ్స్ వెళ్ళి వాళ్ళం దర్నీ పట్టుకుతన్నారో, తన్నబోయారో! పట్టాభిరామయ్య మాత్రం నా దగ్గరికి వచ్చి గోలపెట్టాడు- "నేనేమన్నాను" అని, నాకింకా అపాలజైజ్ చెయ్యటం ఎట్లానో ఆనాడు తెలియదు. మా నాన్న నంటున్నారని తప్ప.'

చలం తండ్రి గురించి తెలిసిన దానిని బట్టి అతను ఆ పని చేసినా ఆశ్చర్య పోనక్కర్లేదు. చలానికి తండ్రి మీద యింకా పూర్తి ద్వేషం ప్రబలలేదు. తన తండ్రిని ఏదో అంటున్నారనే అభిమానం రావడం కూడా విశేషమే!

చలం వెలిపడటం తమ్ముళ్ళు చెల్లెళ్ళకు సరయిన సంబంధాలు రాక పోవడం, పెళ్ళిళ్ళకు యిబ్బంది కలగడం జరిగింది. చలం వల్ల చిన్నప్పుడు తిరుగు బాటు చేయడం యింట్లో కొందరికి అలవాటయింది. చలం చాలా indiferent గా వుండేవాడు. తండ్రి చేసిన అప్పులన్నీ ప్రోనోట్లు, బాకీలు రద్దు చేయడం కోసం

ఇల్లు వాకిలీ ఆస్తులు అమ్ముకోవలసి వచ్చింది. తండ్రి తల్లి ద్వారా అడిగించి ఆస్తుల్ని చలం చేత అమ్మించేవాడు. చలం తల్లి పట్ల చాలా డ్యూటిఫుల్‌గా వుండే వాడు. నిజానికి ఆ స్తంతా ఆమెదే కదా అనే నిర్లిప్తతతో ఆమె ఏదడిగినా యిచ్చేసే వాడు చలం. తను ఇవ్వకపోతే తల్లిని ఏం బాధలు పెడతాడో తండ్రి అనే వుద్దే శంతో తన గురించి ఏమీ మిగల్చకుండా అంతా వారికే అంచబంచెలుగా ధార పోశాడు ఆస్తి డబ్బు అన్నీ.

## అత్తగారి మృతి

అత్తగారు చచ్చిపోయిందని చలం బందరు వెడితే ఎట్లా వచ్చాడో ప్రకాశ రాయుడు కూడా అక్కడ తటస్థ పడ్డాడు. చలానికి అతడి స్నేహితునికి యిద్దరికీ తిండి ఎక్కడో బయట పారేసేవారు కోపంతో, చలానికి వెలిగనుక. ఎందుకో ఓ రోజు కోపం వచ్చి ఎక్కడో ఏ హోటల్లోనయినా భోం చేద్దాం అక్కడ వద్దను కున్నారు చలం ప్రకాశరాయుడు యిద్దరూ ఆ ఎండలో నెత్తి మాడ్చుకుంటూ వూరంతా తిరిగారు. కులంలేని వారికి హోటల్లోనూ భోజనం పెట్టవన్నారు. ఒంటి గంట దాకా తిరిగి ఎండలో పడి పడుకుందామని యింటికి వచ్చి వారికి తెలీక లోపలికి వెళ్ళారిద్దరూ. కర్మకు వచ్చిన వారంతా లేచి వెళ్ళి పోయారు ఆ యింట్లో వుండడం అవమానకరంగా తోచింది చలానికి. ఆయనతో మాట్లాడడం కూడా మానే శారు వారంతా. శలవుల్లో చలం [అత్తారింటికి] రంగనాయకమ్మగారింటికి వెళ్తే అక్కడికీ వెళ్ళేవాడు ప్రకాశరాయుడు చలాన్ని వదల్లేక.

చలం మామగారు ఉప్పులూరి రామశేషయ్యగారికి మగ పిల్లలులేరు. మూడ పాటి వెంకటేశ్వరరావు తోబుట్టువు మొదటి భార్య. ఆమెకు కలిగిన ఆడపిల్లే పెద్ద రంగనాయకమ్మ. ఈమె పోయాక రెండవ భార్య వల్లూరి గోపాలంగారి కుమార్తె. ఈమెకు డాక్టర్ రంగనాయకమ్మ (చిట్టి రంగనాయకమ్మ [చలం భార్య]) కలిగారు. ఈ రామశేషయ్యగారు భార్యకు ఆస్తి రాయలేదు. మైనర్ వ్యాజ్యం వేయించారు. చలం భార్య వెళ్ళి సాక్ష్యం చెప్పింది. చలం మామగారి ఆస్తి అంతా ఒకగుమస్తా వీళ్ళ వంశీకుల్ని చంపి హత్యలు చేసి ధారాదత్తం చేసుకున్నాడట. తన కుటుంబ వైద్యుడు వైద్యం చేసి పసిపిల్లల్ని, అల్లుళ్ళని, అందర్నీ కథల్లో మాయావి మాంత్రికుడిలా మట్టు పెట్టేశాడు. ఇద్దరు అల్లుళ్ళు అత్తవారింట్లో చచ్చిపోయారు. ఆఖరికి చలం మామగారిని కూడా విషం పెట్టి చంపేశాడని వారి కుటుంబంలో

అనుకుంటారు. రామశేషయ్యగారికి కుమార్తెలమీద ద్వేషం విరోధ భావం కలగ చేసింది ఆ గుమాస్తాయే. ఈ ఉప్పులూరి రామశేషయ్యగారు మంచివాడు,అమాయకుడు. ఆయన మూడవ భార్య లేచిపోయింది. వీళ్ళ చరిత్రలే చలం కథల్లో రాసింది. చలం మూడవ అత్తగారు జగన్మోహిని. అపురూప సుందరి. చలం వెలిపడకపోతే. అత్తవారింట్లో ఒక వేళ వుంటే ఆయన్ని కూడా ఆ గుమస్తా ఏ మందో మాకో పెట్టి చంపివేసేవాడు. ఉప్పులూరి వాళ్ళింట్లో ఒక మాలవాడ్ని కొడితే వాడు. చచ్చిపోతూ శాపం పెట్టాడట. పుట్టిన మగ పిల్లలు బతకరు, వుంటే పిచ్చో వెర్రో ఎత్తుతుంది. ఈ కుటుంబ చరిత్ర నిండా శాపాలు, హత్యలు, ఘోరాలే. చలం భార్య రంగనాయకమ్మకి డాక్టర్ రంగనాయకమ్మకి నగలు ఏవీ యివ్వనీకుండా చేసింది యీ గుమాస్తాయే. ఈయనని వఝుల గుమాస్తా అనేవారట తన కోడలిని తమ్ముడి పిల్లల్ని మందు పెట్టి చంపించేశాడు. చలం మావగారి చెల్లెలు అబ్బత్త గొప్ప అందకత్తె. ఆవిడ్ని కూడా గొంతుపిసికి చంపించేశాడుట ఆ గుమస్తా, తండ్రికీ కూతుళ్ళకి పడనివ్వకుండా చేసి ఆ వంశాన్ని సర్వనాశం చేసి ఆస్తి చేజిక్కించుకున్నాడు ఆ వఝుల గుమస్తా.

## వాయ్యి

ఈ కుటుంబంలో నుంచి 'వాయ్యి'ని చలం దగ్గరకుతీసి వ్యక్తిత్వం యిచ్చి చదువు చెప్పించి మట్టిలోంచి మాణిక్యాన్ని మలిచినట్టు డాక్టర్ని చేశాడు.

డాక్టర్ రంగనాయకమ్మ వైధవ్యం పొందడానికి కూడా కారణం అల్లుళ్ళని చంపించేసిన గుమస్తాయేనట. ఈ బాల వితంతువు పంచకావ్యాలు చదువుకుంది. రెండవ భార్య సంతానంలో డాక్టర్ పెద్ద కూతురు. పెద్దక్కయ్య అనే ఆవిడకు నైజాం సంబంధం చేశారు. చలం ఈ వదినగారి భవిష్యత్తు గురించి చింతించాడు. తన సహాయం వుంటుందని హామీ యిచ్చాడు. ఉప్పులూరి రామశేషయ్యగారి రెండవ భార్య మరణానికి ముందే మూడవ పెండ్లికి కావసిన ఏర్పాట్లు జరిగిపోతున్నాయి. తల్లి మరణ వార్త తెలిసి చలం చిట్టి రంగనాయకమ్మ వెళ్ళినప్పుడు వారికి అప్పటికే వెలిగనుక ఇంట్లో అన్నంపెట్టకుండా బయట పెట్టారట. 'మీ అమ్మ పోయింది గనుక ఆవిడ స్థానంలో మరొకావిడ వస్తుందని'

మారుటి తల్లి రాక గురించి ఆ తండ్రి కూతుర్ని 'హెచ్చరించగా ఈ బాల వితంతువు నీవు యీ తృతీయం చేసుకొనకుండా వుంటే ఈ ఇల్లు కనిపెట్టు కుని వుంటా- లేకపోతే వెళ్ళి పోతా'నని అల్టిమేటం యిచ్చింది. తాను పెండ్లి చేసుకోనని బొంకి, మూడవ భార్య వచ్చే సమయానికి వితంతువయిన పెద్ద కుమార్తె అడ్డు తొలగిపోతున్నందుకు లోపల సంతోషించినా 'నన్ను వదిలి వెళ్తావా' అని పైకి కోపం ప్రదర్శించాడు. ఆ తండ్రి ఆమె తల్లి నగలు, ఆమె నగలు ఆస్తి అంతా తనే తీసుకుని ఎక్కడున్నా నెలకు నలభై రూపాయలు పంపుతానని వాగ్దానం చేశాడు. ఆమె చలం ఆశ్రయం పొందాక ఒక్క నెలకూడా పంపలేదు. ఇదంతా ఆ గుమాస్తా కుట్ర- అతని చేతిలో యీయన కీలుబొమ్మ.

## చలం స్కూలు రోజులు

హైస్కూలు రోజుల్లో ఓ ఆడపిల్లకి ప్రేమలేఖ రాసి తగూలు తెచ్చుకోవడం మాత్రమే కాక- ఆ రోజుల్లోనే ప్రతాపరుద్రీయం, కన్యాశుల్కం, నాటకాలు రాయడం వేయడం, భారత భాగవత రామాయణాలతో పాటు ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల ప్రచురణలు, వేదం వేంకటరాయశాస్త్రిగారి గ్రంథాలు అన్నీ యింటి వద్దనే చదివాడు. పెండ్లి అయ్యేనాటికి చలం స్కూలు ఫైనలు చదువు తున్నాడు. చదువులో శ్రద్ధ తక్కువ. అత్తెసరు మార్కులు వస్తుండేవి. 1911లో స్కూలు ఫైనలు తరువాత కాకినాడలో పిఠాపురం మహారాజాగారి కళాశాలలో చేరాక విద్యార్థి దశలో బ్రహ్మసమాజపు ప్రభావం చలం మీద పడింది.

అమ్మణ్ణి చలానికి పెద్ద చెల్లెలు. చలానికి స్త్రీ జీవనస్మరణ సమస్యగా మారడానికి చిన్నతనంలో వారి కుటుంబంలోని అమ్మణ్ణి వృత్తాంతం ఎక్కువ దోహదం చేసింది. పెళ్ళి నిశ్చయం కాగానే పెళ్ళి కొడుకు గుర్రాన్నెక్కి విడిదికి రావడంతోనే పెళ్ళి కూతురు ఏడుపు ప్రారంభించింది. చలం అమ్మణ్ణి మంచి స్నేహితులు. ఓదార్చినా వూరుకోలేదు. ఆ పెళ్ళి కొడుకు చదువుకున్న గాడిద. అటువంటి భరింప శక్యం కాని వ్యక్తితో నాజూకైన పిల్ల అమ్మణ్ణి జీవితమంతా ఎలా గడపగలుగుతుందనేది అతని చింత. ఎవరితో చెప్పకోలేక ఎంత మంది ఆడపిల్లలు ఇట్లా బాధపడుతున్నారో? తరవాత అమ్మణ్ణికి కార్యం. ఆ పిల్ల మొదట్లో వొప్పుకోనంది. ఏడ్చింది. బలవంతాన గదిలో తోశారు.

'పొద్దున్నే అమ్మణ్ణి గదిలోంచి వొచ్చి నన్నెరగనట్లే నడిచిపోయింది. అంతే మా స్నేహం ఈ జీవితంలో యిన్నేళ్ళలో మళ్ళీ మేము మాట్లాడుకోలేదు.

గర్భాదానం గదిలో ఆడపిల్లలు ఎట్లా మారిపోతారో మొదట ఆశ్చర్యం వేసినా చివరికి అర్థమయింది' అంటాడు చలం.

అమ్మణ్ణిభర్త గురించి చెబుతూ అంత దుష్టుడైన మా నాన్న కూడా అల్లుడితో ఒక్కమాట మాట్లాడలేకుండా వున్నాడు అంటాడు. అమ్మణ్ణి దుఃఖం వల్ల పిల్లలంతా కుంగిపోయినారు. ఎలా ప్రతిఘటించాలో తెలియని వయస్సు. అప్పుడు అమ్మణ్ణిని దాచేసి ఆ కార్యం జరగనివ్వకుండా ప్రతిఘటించబోతే ఆ రాత్రి చలాన్ని బైటకు గెంటారట. ఆ కార్యం అయాక ఆ అమ్మాయి తనని భర్త, అత్తగారు చేసే అవమానాల గురించి ఉత్తరాలు రాయనారంభించింది మద్రాసులో వున్న చలానికి. ఆ అమ్మాయిని ఉత్తరాలు రాయనివ్వకుండా కట్టడిచేశారు. తన భార్యకి (అంటే చెల్లెలుకి) ఉత్తరాలు రాస్తే ప్రోసిక్యూటు చేయిస్తానని చలానికి నోటీసు యిప్పించాడు ప్లీడరుచేత. ఆ అమ్మాయి చిత్తుకాగితాల మీద రాపిస్టాంపులు అంటించకుండా పోస్టులో పడేసేది. చలం చెల్లెలుకి ఉత్తరం రాసినప్పుడల్లా భర్త ఆ అమ్మాయిని కొట్టేవాడట. అమ్మణ్ణిని పుట్టింటికి తెచ్చెయ్యమని చలం అల్టిమేటం యిచ్చాడు. పదిహేనురోజుల్లో ఆ అమ్మాయి (రక్షించకపోతే చచ్చిపోతానని రాసింద)ని తేకపోతే చలం తీసుకొచ్చి క్రిస్టియన్ బోర్డింగు స్కూల్లో చేరుస్తానన్నాడు. 'వాడిమొహం'అని వూరుకున్నా చలం వెనకాల వీరేశలింగంగారు, నాయుడుగారు పిఠాపురంరాజా వున్నారనే పక్కబెదురుతో-చలంతల్లి వియ్యాలవారింటికి వెళ్ళి వాళ్ళని జాగ్రత్తపడమని వార్నింగిచ్చింది. దాని పర్యవసానం ఏమంటే ఆ యింతోటి బావగారు అమ్మణ్ణి కాళ్ళు పట్టుకుని వంశ ప్రతిష్టని నిలబెట్టమని వెళ్ళిపోవద్దని బ్రతిమాలి ఆమె పెట్టిన షరతులన్నిటికీ తలవంచాడు. ఆ అమ్మాయి చలం బంగారం వంటి తన కాపరాన్ని పడగొట్టాలని చూశాడని, తాను తెలివినపడి చలం పన్నాగాల నుంచి బయట పడ్డానని చెప్పిందట.

'అది మొదలు అత్తవారింట స్త్రీ ఏం బాధ పడుతుందో, ఏ విధంగా వాళ్ళ మెదళ్ళని అత్తవారు ఆపరేట్ చేస్తారో అర్థమయింది. ఆ రోజున నా స్త్రీ జనరక్షణోద్యమానికి ప్రారంభోత్సవం జరిగింది. స్త్రీ సంస్కరణ అంటే ఏమిటో తెలిసి వొచ్చింది నాకు. తమకి సహాయం చెయ్యాలని ప్రయత్నించే వారిని స్త్రీలు చివరికి ఏమంటారో తెలిసి వొచ్చింది' అని రాసుకున్నాడు తన ఆత్మకథలో. Man and Woman అనే సుదీర్ఘమైనవ్యాసాన్ని ఇంగ్లీషులోరాసి చలం బందరునోబుల్‌కాలేజి ఇంటర్నేషనల్ బ్రాంచిలో 1924తరవాత చదివాడు.1926లో అది అచ్చయింది.స్త్రీల సమస్యల మీద దృష్టి ఏకాగ్రం కావడానికి అమ్మణ్ణి ఉదంతం ఒక ప్రేరకం.

ఏ నీలి పందిళ్ళ నే నిదుర పొదిగిళ్ళ
నీ తార లలసెనో దేవా ।
నీ నందనమ్ములో నేటి యర్చనములో
బూవులై విరిసెనో దేవా ॥

# 5

## చలం చంచలం

ఆ కాలంలో ఇళ్ళనుంచి వీరేశలింగంగారు వితంతువుల్నిదొంగిలించి పెళ్ళిళ్ళు చేస్తున్నారని భయంకరమైన వార్తలు దేశాన్ని ముఖ్యంగా చలం కుటుంబాన్ని కలవర పెట్టేయి చలం మేనత్త, కొమ్మూరి సాంబశివరావు చెల్లెలే పారిపోయి వితంతు వివాహం చేసుకుంది. ఆమే అబ్బత్త. 'మా అత్తయ్య వితంతు వివాహం వీరేశలింగం గారి చరిత్రలో ముఖ్యమైన ఘట్టం- దాంతో మా వాళ్ళకి భయం పట్టుకుంది' అంటాడు చలం అమ్మణ్ణి గురించి తను వార్నింగ్ యిచ్చినపుడు. వీరేశలింగంగారి సహాధ్యాయి కనపర్తి సంజీవరాయుడు గారికోడలు, కొంతకాలము సహాయ కరగ్రాహిగా వున్న కొమ్మూరి వెంకటా చలము పంతులుగారి కుమార్తె శ్రీ మహాలక్ష్మమ్మే చలంగారు పిలిచే అబ్బత్త. ఈ కొమ్మూరి వెంకటా చలంగారు చలం గారికి తాతాగారయివుంటారు. ఈయన పేరే చలం గారికి పెట్టుకునివుంటారు. చలం తండ్రి కొమ్మూరి సాంబశివరావుకి ఈ శ్రీ మహాలక్ష్మమ్మ స్వయానా చెల్లెలు. ఈ అసాధారణ సౌందర్యవతి 'పూర్వ చరిత్రమును గూర్చి కొన్ని ప్రవాదములుండెనుగాని' అని వీరేశలింగంగారే అన్నారు. ఆవిడ మద్రాసులో పంతులు గారివద్ద రెండు సంవత్సరాలుంది. ఏ అందాలకీ చెదరనంత ఉన్నతమైన నైతిక నిష్ఠ కల నాయుడుగారే **"That Woman is devasta ting"** అన్నారట.

## అబ్బుత్త

చలం ఒకచోట మొదటసారి మేనత్తను చూసినప్పుడు ఓ Phantom of Love బయటకి వచ్చింది. నేనే చిత్రకారుణ్నైతే చిత్రించమంటే ఆ రూపాన్ని చిత్రించ కలిగేవాడ్ని కాదు అంటాడు, ఆ మేనత్త తన మాటలో తన కథని చలానికి చెప్పగా చలం ఆ కథను—

"చిన్న తనంలో పెళ్ళయిన భర్త చచ్చిపోయినాడు. ఆమె ఆజన్మాంత. వైధవ్యాన్ని తలచుకుని భరించలేక తండ్రితో విరోధం వచ్చినా సరేనని మా పెద్ద నాన్న ఆమెని లోకమంటే ఎరగని పిల్లని వీరేశలింగంగారి వితంతు శరణాలయంలో దిగపెట్టాడు. శరణాలయంలో చేరిన వితంతువుల్ని వీరేశలింగంగారు ఎట్లా treat చేసేవారో తెలిసిందే కదా! మొగుడో మొగుడో అంటూ ఇళ్ళ నించి పారిపోయి వచ్చిన ఈ స్త్రీలని పెళ్ళి చేసుకోడానికి ఎవరు వస్తారు? వాళ్ళకి ఎక్కడా దిక్కులేని నీచులు, ఎక్కడా భార్యలు దొరకని దరిద్రులు, ఎందుకు కొరగాని వాళ్ళు వరుల కింద తయారయ్యేవారు. అప్పుడు వీ రే శ లిం గం గా రు పురుష స్వయంవరం ఏర్పాటు చేసేవారు; వారు యిష్టపడ్డ పిల్లల్ని, ఆ ఆడ పిల్లలకి యిష్టమున్నా, లేకపోయినా, ఆ వరుడుకుకట్టి పంపేవారు. అవును. నిజమే-కాకపోతే ఆ సంస్కరణ ఉద్యమం ఎట్లా సాగుతుంది? ఆ వరుళ్ళ మొహాలు చూసి ఏ ఆడది అతన్తో వివాహానికి వొప్పుకుంటుంది? అట్లా చూసుకుంటే, వొస్తున్న ఈ స్త్రీలని ఎంత మందిని అట్టిపెట్టి పోషించగలరు ఎంత దయామయుడైనా! దాంటో అర్థమేముంది? తక్కిన కథ జగద్విదితమే. నా అత్తయ్య అదృష్టం కొద్దీ గొప్ప ఆఫీసర్ న్యాపతి శేషగిరిరావుగారు హోముని దర్శించ వొచ్చారు. ఈమెని చూసి వరించారు.

ఇన్నాళ్ళు వీరేశలింగంగారి ఉద్యమానికి ముఖ్యమైన supporter న్యాపతి సుబ్బారావుగారు. తన తమ్ముడే వితంతు వివాహం చేసుకుంటే భరించలేక, వీరేశలింగంగారికి ప్రబల విరోధి అయ్యాడు.

అబ్బుత్త మాటల్లో "ఇది చూడు నాయనా! ఈ ఉద్యమాన్ని ప్రారంభించడం ఒక యెత్తు, సంఘాన్నంతా ఎదిరించి ఒక టీచర్ యిటువంటి ఉద్యమం ప్రారంభించారంటే, ఆయన దయ, సాహసం, ఎంత ఘనమైనవో! కాని ఆ వుద్యమం అప్పుడప్పుడే పాతుకుంటోందన్న కాలంలో ఒక అభాగిని వివాహం

కోసం ఆయన తనకివున్న ఒక్క supporter ని, తన principle కోసం వొదులు కున్నాడంటే ఆయన ఆత్మ ఎంత గొప్పదో ఆలోచించు"

ఆమె వైవాహిక జీవితం గొప్ప ఆనంద మేఘ రథాలమీద సాగిపోయింది. ఆమె ఐశ్వర్యానికి భ్రమిసి ఆమె సోదరులు,బంధువులు రహస్యంగా ఆమె దగ్గిరకు రావటం ప్రారంభించారు. ఆయన వుద్యోగరీత్యా, ఆయనతోపాటు దక్షిణ భారత దేశమంతా వైభవంగా ఆమె పర్యటించి; పెద్ద పెద్ద ఉద్యోగస్తుల అభివందనలందు కుంటూ, ఆమె అందాన్ని చూడటానికి ఎంత ఉబలాటపడుతో గొప్ప గొప్పవారు ఆమె భర్త సాంగత్యం అభిలషించేవారు. రైళ్ళలో పోతూవుంటే ఆమె ఎవరో తెలీకండానే ఆమె అందానికి కట్టుబడి ప్రయాణీకులు గుమిగూడేవారు. రైలాగిందా గార్డు వాళ్ళని వంపే మిషతో అక్కడే నిలబడి వుండేవాడు ఆమెని చూస్తూ. ఆమె అందాన్ని అందంగా గుర్తించక, అందరు వితంతువులలో ఒక వితంతువుగా చూసింది ఒక్క వీరేశలింగంగారే.

ఇంతలో ఆమె భర్త చచ్చిపోయినాడు, ఆయన గొప్ప ఆస్తినంతా ఆమెకి వొదిలి. తన మొదటి భర్త ఆస్తి పెద్దది. దానికి తోడు యిప్పుడీ ఆస్తి. భరించలేని సౌందర్యవతి. ఆమెని బంధువులు ఎవరూ వాళ్ళయిళ్ళకి రానీరు. రానిచ్చే ధైర్యం లేదు. మానవులకే కాదు, దైవాగ్రహానికి కూడా జడిసే రోజులవి. ఆమె మద్రాసు చేరింది. ఆ నగరంలోని ఆంధ్రులు, విద్యాధికులు, సంస్కారులులైన శృంగార పురుషులందరూ ఆమె చుట్టూ చేరారు. ప్రతివారికి ఒక కన్ను ఆమెమీద, రెండో కన్ను ఆమె ఆస్తిమీద.

అబ్బూత్త చలంతో చెప్పిన మాటల్లో తన కథ—

"ఈ మొనగాళ్ళు బాబూ! ఎంత వుత్తములైన వారి దృష్టి కామినీ కాంచ నాలని వొదలదు. నువ్వు అట్లా తయారు కాబోకు బాబూ! ఆనాడు నా చుట్టూ చేరిన వాళ్ళు నీతివేత్తలు. ఎంత గొప్ప నీతిపరులు, దొంగలూ, ఖ్యాతివరులైనారూ తరవాత కాలంలో. ఎందుకులే వాళ్ళ పేర్లు. చెపితే నువ్వుకాదు ఈ లోకమంతా గుర్తుపడతారు. వాళ్ళలో ఒకరికి ఒకరికి పంతాలు, విరోధాలు. వాళ్ళలో యెవరు యెవర్ని వొంటరిగా వొదలరు నా దగ్గర. ఋతువులో రోడ్డుమీద కరుచుకునే కుక్కలు నయం బాబూ"

గొప్ప సౌందర్యం స్త్రీలో గొప్ప విషాదానికి హేతువు కావడం యీమె జీవితంలో చూస్తాం.

"యెట్లాగైనా నన్ను వొదుల్చుకుంటేగాని వాళ్ళలో వాళ్ళకి శాంతిలేదు. చివరకి వాళ్ళతో తిరిగే ఓ దూర దేశపు జమీందారుకి అమ్మేసారు నన్ను."

"We do not even know whether she was married to that Jamindar Venkatachalam" అని క్రూరంగా మాట్లాడేవారు నా గురువుగారు. ఒకప్పుడు పెళ్ళి అయింది అనేది. ఇంకో అప్పుడు కాలేదనేది. మరీ అడిగితే, "చిన్నతనం నాకేం తెలుసు? ఏదో ఆఫీసుకి తీసుకెళ్ళారు. దండలు మార్చారు, సంతకం చెయ్యమన్నారు. అంతే-సాయంత్రం కలకత్తామెయిల్లో ఎక్కించారు. "ఆ కమలని కూడా ఒకప్పుడు తన కూతురేననేది ఇంకోసారి ఇది నా కూతురేమిటి? పెంచుకున్నాననేది. "నన్ను తనకి అమ్మిన మహా పురుషులు వెంబడించి వొస్తున్నారు, వాళ్ళకి అందకుండా నా కోసం ఓ భవనం బాగుచేయించి, అరణ్యం మధ్యలో దాచుకున్నాడు. ఆ మూడో భర్త." ఆ అడివిలోంచి ఉత్తరాలు రాయటానికి వీలు పడదు. యెట్లాగో రాసేది.

"అక్కడ నన్ను బంధించి వుండుండి ఏవో కాయితాలు తెచ్చి సంతకాలు చేయించుకునేవారు. అప్పుడు నాకేం తెలుసు, క్రమంగా నా రెండు ఆస్తులు అతను హరిస్తున్నాడని? ఇంతలో కమల పెద్దమనిషి అయింది. ఇంక దాని వెంట పడటం ప్రారంభించాడు. పెద్ద పులిమల్లే యెగిరి వాడిమీద పడి పీకేదాన్ని. నాకు ఈ పెళ్ళి చేసి పంపిన గొప్పవారందరికీ ఉత్తరాలు రాశాను నన్ను రక్షించమని. ఒక్కరూ పలకలేదు ఇంక గతిలేక వీరేశలింగంగారికే మొరపెట్టుకున్నాను. కాని ఎవరు దిక్కు? వాళ్ళందరి దృష్టిలో నేను బహూ పాపిని. నా సౌందర్యమే నా పాతకం. నేను చేసిన దేమిటి? నా మొదటి భర్తను నేను చచ్చిపొమ్మనలేదు. ఆయన చచ్చిపోతే, మళ్ళీ నేను పెళ్ళి కావాలని గోల పెట్టలేదు. నా రెండో భర్తని నేను చంపలేదు. తరువాత మళ్ళీ పెళ్ళి కావాలని నేను అనలేదు. నా పేరు ఎత్తితే మూడో పెళ్ళి చేసుకున్న ముండ అని ప్రతివారు ఉమ్మి వేస్తున్నారు. ఇంత మంది బంధువుల్లో నువ్వు తప్ప నన్ను పలకరించేవారులేరు. చివరికి పాపి అని అసహ్యించుకోని మహాత్ముడు నాయుడుగారు జ్ఞాపకం వొచ్చి ఆయనకి ఉత్తరాలు రాశాను.

ఏం జరిగిందో ఏమో, ఓ రోజు రాత్రి డిస్ట్రిక్ట్ సూపరెంట్ ఆఫ్ పోలీస్ సిబ్బందితో వొచ్చి నన్ను రైలెక్కించారు. నన్ను యిక్కడ ఈ యింటో దించి వెళ్ళారు నాయినా! నన్ను ఈ యింటో, ఇదీ యిల్లేనా. దిక్కుమాలిన స్త్రీ యెంత లోకువో అంది" అత్తయ్య- అంటాడు చలం.

# ఆనంద గార్డెన్స్

రత్నమ్మతో ప్రేమ వ్యవహారం, బ్రహ్మసమాజం నుంచి విడిపోవడం జరిగాక చలం 1919లో యల్.టి. చదవడానికి రాజమండ్రి వచ్చి వీరేశలింగంగారి ఆనంద గార్డెన్స్‌లో ప్రవేశించడం గురించి ఆత్మకథలో—

'వీరేశలింగంగారు చచ్చిపోయినారు. అంతటి యోధాగ్రేసరుడూ నియమ శీలి. 'చలం' కాకినాడ నుంచి రాజమండ్రి నివాసానికి వొస్తున్నాడని సంతోషిస్తు న్నారు రాజమండ్రి బ్రహ్మవీరులు. కాని చలం ఆ శిఖరాల నుంచి కిందబడి అవి నీతి బురదలో పొర్లుతున్నాడని వాళ్ళకి యింకా తెలియదు. ఆయన తోటలోనే నా నివాసానికి ఓ చిన్న బంగళా నిచ్చారు. మేము మా పక్కచుట్టల్ని విప్పుకున్నామో లేదో, "ఈ పులిని గొర్రెల మందలో ప్రవేశపెట్టారేమిటి?" అన్నారు కొందరు కాకినాడవారు. వెంటనే యిల్లు ఖాళీచేసి పొమ్మన్నారు అధికార్లు. వీరేశలింగం శ్రాద్ధానికి నన్ను వాళ్ళ కళ్ళలో పూరేగించినవారు, ఆ వుదయాన సర్దుకున్న పెట్టెమీద వరండాలో కూచుని "ఏ తావునరా నిలకడ నీకు చలం?" అంటున్నాను. నా భుజంమీద ఓ చల్లని చెయ్యి పడ్డది. ఆమె అబ్బత్త. అప్పుడామె చలంతో అంటుంది- "అంతా విన్నాను. నువ్వు నాకేం చెప్పనక్కరలేదు. హిందూ సంఘాన్ని తిట్టిపోస్తారుగాని వాళ్ళలో ఒకరు కాకపోతే ఒకరి హృదయమన్నా కరుగుతుంది. ఈ సంఘ సంస్కర్త(లైన) నీతి వంతులలో ఒక్కరికి హృదయ మన్నది లేదు. "ఆ తోటలో ఆమె వుంటున్న ఇంటికి తీసికెళ్ళింది. అది పాడైన ఓ పశువులశాల. అబ్బత్త తన వెంటబడిన గొప్పవారి గురించి చెబుతూ 'ఈ మొన గాళ్ళు బాబూ, ఎంత ఉత్తములైనా వారి దృష్టి కామినీ కాంచనాలని వొదలదు. నువ్వు అట్లా తయారు కాబోకు బాబు' అని మేనల్లుడిని హెచ్చరించింది. మరి చలం ఎట్లా తయారయాడు?

## వొయ్యి ప్రవేశం

కొంచం వెనక్కి వెళ్ళి చూస్తే- మద్రాసులో వొయ్యి చలం బీచ్చిఇసుకలో సూర్యోదయాన్ని చూస్తూ కూచున్నారు (చలం ఆత్మకథ 8వ అధ్యాయం) లోక మంటే తెలీని అమాయక యువతీ యువకులు తనని లోకం నించి రక్షించమని (ఆమె) అడుగుతున్నట్టుంది.

"నడుం చుట్టూ చెయ్యివేసి ఆమెని తనకు వొత్తుకున్నాడు. ఆమె తల అతని భుజాన్ని బుజ్జగిస్తోంది. తూర్పుగాలి ఆమె జుట్టుతో అతని మెడని మధురమైన

చక్కిలిగింతలు పెడుతోంది. అతను ఆమె ముఖంమీదికి వొంగి మృదువుగా సూర్య కిరణాన్ని తొలగించి ముద్దు పెట్టుకున్నాడు. ఆమె పెదిమలు అంత నాజూకుగా అతని పెదిమల కింద కదిలాయి. ఇంక ఆమెని సంరక్షిస్తానని (దేహాన్ని కాదు) కోర్కెతో ఆమె మనస్సు నలిపేస్తాననే భయంతో వొణికాడు "అంటూ" ఆ నాటి మద్రాసునగరపు వొంటరివీధిలో ఏకాంతంలో తిరిగి తిరిగి కావిలించుకున్నారు. ఆ నాటి నించి ఈనాటి వరకు చలం ప్రణయచరిత్ర చెట్లకింద పర్వత శిలల నీడలలో ఏటి నీళ్ళమీద పంగిపడే చెట్లకింద సాగింది" అని డిక్లేర్ చేస్తాడు. వొయ్యికి వాళ్ళ వాళ్ళు పెళ్ళి చెయ్యరు మళ్ళీ. ఇంటో కూచుని ఏం చేస్తుందామె- (ఈమె తనకి దూరమైపోతే తానెట్లా కాలం గడపడం అనుకుంటాడు చలం)- తను వొస్తే తన్ను చదివిస్తాడా చలం అని అడుగుతుంది. చదివిస్తాను చదువు చెపుతానని హామీయిస్తాడు.

"చెపుతారా? నేను-డాక్టర్ని కావాలని వుంది నాకు" అంటుందామె. వాగ్దానం చేస్తాడు చలం. 'తాను బతకడమెట్లాగో తెలీని నేను, యీామెని డాక్టర్ని చేస్తానా- కాని, స్త్రీల ఎడల, పిల్లల ఎడల అతని సాహసానికి అంతులేదు....చదివిస్తాను' అన్నాడు.... ఆమె అతన్ని గట్టిగా కావిలించుకుంది. అతని రక్తంలోని రొమాన్స్ అతన్ని అన్ని సాహసాల వైపూ పురిగొల్పి పరుగెత్తిస్తుంది. తన వదినగారి సాధన గురించి చలం 'మ్యూజ్' చేస్తాడు- 'ఆమె చిన్న చేతులుమీదుగా ఎంత మంది దిక్కులేని స్త్రీలు- ఆపదలో వున్నవారు. దుఃఖితులు, వోదార్పు కోసం అల్లాడేవారు, నాకో తల్లి వుండదా అని ఏడ్చేవారు, ఈ లోకంలో ఎక్కడా దిక్కు అనేది లేని దీనులు, సంఘ బహిష్కృతులు, ఎంతమంది స్త్రీలు, తల్లుల్ని వొదిలి వచ్చినపిల్లలు, నన్ను తీసుకో, తీసుకోమని గర్భంలోనే చేతులు జాచే శిశువులు ఎంత సంతోషంతో వారి జీవితాలు ఒక గొప్ప fulfilment జరిగినట్టు తృప్తిపడ్డారో!"

గోరంత దీపం కొండంత వెలుగైనట్టు-వొయ్యి జీవితం తన కోసం కాక తనవారి కోసం లోకం కోసం పెద్ద వెలుగై విచిత్రపు నీడల్ని పరచింది.

'వొయ్యి' బెజవాడ నుంచి రాజమండ్రిలో యల్.టి. ట్రైనింగ్ చదువుతూ అబ్బూత్త వర్గీలో వున్న చలాన్ని వచ్చి కలుసుకుంది. ప్రైవేటుచెప్పి వీరేశలింగం హైస్కూల్లో వదినగారిని 5వ ఫారంలోనూ, భార్య రంగనాయకమ్మను 4వ ఫారం లోను చేర్పించారట. చలం కుమారుడు రవికి మూడో ఏడు. ఆ మూడేళ్ళ పిల్లవాడు ఒక్కడూ ఇంట్లో వుండేవాడు, తల్లీ తండ్రీ పెత్తల్లి అంతా చదువులకు పోతే.

ఆ రోజుల్ని చలం యిలా స్మరిస్తాడు.

"అది చాలా పెద్ద తోట. వీరేశలింగంగారు ఆ తోటపైన తన శరణాలయం వితంతువులమీద కన్నా ఎక్కువ శ్రద్ధ చూపించారు. ఎన్నో రకాల అపురూప మైన మొక్కల్ని నాటించి జాగ్రత్తగా పెంచారు. మిరియాల తీగెలు, కదంబ వృక్షాలు, లవంగ, యాలుక, జాజికాయ, జాపత్రి పొదలు, చందనం, కామిని మొదలైన పూలమొక్కలు, ఇంకా ఎన్నో పేర్లు తెలీని ఆకర్షణమైన పూలు. వాటి నన్నిటిని వొదిలి ఇంకో లోకానికి వెళ్ళడానికి ఎంత బాధపడి వుంటారో ఆయన. వీలైనంత కట్టుదిట్టాలతో శరణాలయం నడపాలని పత్రాలు రాశారుగాని. ఈ పుష్పాల్ని చావకుండా పోషించేందుకు ఏ ఏర్పాటు చెయ్యలేదు.

ఆ తోట అధికారి సాధువు, ఉత్తముడు, అబ్బూత్త నోటికి దడిసో, నన్ను చూసి జాలివల్లనో, నా జోలికి రాలేదు. అబ్బూత్తకి కొన్ని రహస్యాలు తెలుసు. ఆ వితంతు శరణాలయాన్ని గురించి. అందువల్ల ఆమెను కదల్చటం భయమను కుంటాను. ఆ తోట ఆదాయానికి వొకరు వారసులైతే, ఆ తోట అందాన్ని అనుభ వించటానికి నేను వారసుణ్ణి అయ్యాను....పెద్ద చెట్లు, పరిమళించే మొక్కలు, నా హృదయాన్ని ఆకాశం నీలం వేపుగా లాగేసేవి. నా ఏక్‌తార తీసుకుని నిర్జన మైన ఆ అడివి మధ్య పాడుతూ నృత్యం చేసేవాణ్ణి. ఆ కాలేజి నేను ఎగ వేస్తున్న home work ఇది లేకపోతే ఎంత ఆనందమయమైన కాలమో!"

ఈ తోటలో చలం అబ్బూత్తతో పాడుతూ ఆడుతూ గడుపుతున్న కాలంలో 'వొయ్యి' తనవారితో బెజవాడలో తెగదెంపులు చేసుకుని వచ్చేసింది యింట్లోంచి.

'వొచ్చేప్పుడు నన్ను కట్టుబట్టలతో పంపేశారు. డబ్బు పంపుతామన్నా రులే, కాని పంపుతారా' అని చలాన్ని అడుగుతోంది. (దుష్యంత సభలో శకుంతల వలె). అబ్బూత్తని వెంకటచలం ఏదని అడిగితే 'నాకేం తెలుసు-ఎక్కడ వుంటాడో అట్లాపోయి ఆ అడివిలో వెతుకు' అందిట నిర్లక్ష్యంగా. ఈ అమ్మాయికి పాపం ఏడుపు వచ్చేసింది ఎట్లా పట్టుకోవాలి అని.

మద్రాసులో ఇలియట్స్ రోడ్డులో వదిలేసిన కథ యిక్కడ ఈ రాజ మండ్రిలో ఈ తోటలో మళ్ళీ అందుకుంది. ఇద్దరూ దరిద్రులే-లోక బహిష్కృ తులే. అప్పుడు చలం భార్య రవి తెనాలి వెళ్ళారు. తన రాకతో తోటలో కాంతిని వెలిగించిన వదినగార్ని అబ్బూత్తకి పరిచయం చేస్తే ఆమె కావిలించుకుని దగ్గరకు తీసుకుంది. For bidden apple [నిషిద్ధ ఫలం] తిన్నాక, ఈడెన్‌లో యాడమ్

ఈవ్‌లు గడిపినట్లు కాలాన్ని గడిపారు వదినా, మరుదులు, ప్రయివేట్ సంగతి సరేసరి. అంతసేపూ మనస్సు ఆమె కుచ్చెళ్ళలో దాక్కుని వుండేదట కాలేజికి వెళ్ళిన చలానికి. చలం వొయ్యిలను అబ్బాత్తే పోషిస్తూండేది తిండిపెట్టి. ఆవిడ వంటగిన్నెలు అమ్మేసి మట్టిపాత్రలు కొనేది. ఈ అబ్బాత్త నగలని కూతురు కమల పెళ్ళి కోసం నాయుడుగారు భద్రం చేశారు. ప్రతి నెలా యిద్దరికి సరిపడే బియ్యం ఖర్చు నాయుడుగారిస్తారు. వీరేశలింగంగారు రోజుకో పావలా భత్యం యిచ్చే ఏర్పాటు చేసిపోయినార్ట. 'మూడు పెళ్ళిళ్ళు చేసుకున్న ఆమె నైతిక విలువ అంతేగావును ఆయన దృష్టిలో' అని చలం రిమార్కు విసురుతాడు. చలం భత్యం నెలకు 15 రూపాయలు. అతను కొంత యివ్వబోయినా ఆమె తీసుకోలేదు. ఈ అబ్బాత్తకు త్వరలో వొయ్యి చలం ఎన్ని రెట్లో ఉపకారాలుచేశారు ఒకరోజు ఆమె దారిద్ర్య భారంతో విరక్తి చెంది "ఇంక చాలు వెళ్ళిపోండి నాయినా" అంది. వొయ్యి "ఇంతేనా? ఏదో గుడిశలోకి పోదామ"ని అంది యిల్లి వ్వరని తెలుసుకుని. అప్పుడు లక్ష్మీంవారపు పేటలో మాలవాళ్ళ గుడిశల్లో ఖాళీగా వున్న ఓ కుటీరం ఏర్పాటు చేసుకు వచ్చాడు చలం. రెండు బట్టలు, రెండు పుస్తకాలతో వెళ్ళిపోయారు. ఆ రోజుల్లో జీవితాన్ని గురించి చలం—

'మా ఇంటి పక్కనే మా హోటల్. తెల్లారేప్పటికల్లా కానీకి ఒక ఆపం. ఒక అణావి తినే వాళ్ళం. మళ్ళీ నేను కాలేజీకి, వొయ్యి స్కూలుకి వెళ్ళేముందు గోదావరి రైల్వే స్టేషన్ రోడ్డు ప్రక్కనే అమ్మే మినస రొట్టె ముక్కలు రెండు తినేవాళ్ళం. రవికి పెట్టేవాళ్ళం. అతను యింటి దగ్గరే వుండేవాడు పిల్లలతో ఆడు కుంటూ. ఎప్పుడో మధ్యాహ్నమప్పుడు ఒక భోజనం వచ్చేది హోటల్ నుంచి. అదేమాకు రోజుకంతా భోజనం. స్నానం గోదావరిలో. అదిగాక శనివారాలు డరోతీస్టీమర్‌లో ఒక ట్రిప్ షికారు. దోనెలో కొవ్వూరు గట్టు కెళ్ళటం, తిరిగి రావటం. రైల్వే బ్రిడ్జిమీదనించి గోదావరి దాటి కొవ్వూర్లో ప్రకాశాన్ని చూడ్డానికి వెళ్ళేవాళ్ళం. అవేమాకు లగ్జరీ, ఎన్‌టర్ టైన్‌మెంట్స్, కాస్లు లెక్కపెట్టుకునే దరిద్రకాలమది. కాని జీవితంలో ఎప్పుడన్నా అంత సంతోషంగా వున్నామా?' అని అడుగుతాడు.

ట్రయినింగు అయింది. ఇంక ఆ పదిహేను రూపాయలు కూడా రావు. రాజమండ్రి వదిలి మద్రాసు వెళ్ళాలి. జీవితంలో మరో పుట తిరగబడుతోంది. నెలకి కావలసిన ఓ పది రూపాయలు సంపాదించుకుని రాజమండ్రిలో వుండగలరు కాని డాక్టరు కావాలని వదినగారి ఆశయం వారిని మద్రాసుకు నెట్టివేస్తోంది. చలం భార్య ఒక స్థిరాదాయం యిల్లు కాపురాన్ని కోరుకుంటోంది. రవి భవిష్యత్ గురించి

ఆలోచనలు వస్తున్నాయి. తెనాలి వెళ్ళారు, విరోధి వర్గం చేతులోకి. ఆచారాలు, ఆగ్రహాలు, ముట్టయి బయట కూచోడాల్లోకి. వాళ్ళని చూస్తే అసహ్యించుకునే వాళ్ళ దగ్గిరికి వెళ్ళేరు, పక్షులు వలలోకి దూకినట్టు. వాళ్ళ ప్రేమే వాళ్ళని కాపాడింది. ఉద్యోగమవుతుంది వెళ్ళిపోదామని అనుకుంటూండగా తెనాలిలో చలానికి హక్కు వున్న యింట్లోంచి వాళ్ళవాళ్ళు వెళ్ళి పోమన్నారు.మాట్లాడకుండా ట్రావెలర్స్ బంగళాకి పోయారు. అది 1921 చలం హోస్పేటలో వుండి మునిసిపాలిటీ తోనూ వూరి పెద్దలతోనూ తగూలు పడుతున్నాడు. విద్యార్థులంతా చలం పక్షం. సరిగ్గా అదే కాలంలో 'సౌఖ్య' మద్రాసులో చదువుకొంటున్నది.

## హోస్పేట యుద్ధభూమి

చలానికి హోస్పేటలో ఉద్యోగం అయిన కొత్త రోజులు. సౌఖ్యని తీసుకుని మద్రాసు వచ్చాడు. మద్రాసులోనే ఆడవాళ్ళకు హాస్టల్సు వున్నాయి. అవి క్రిష్టియన్స్ నిర్వహించేవి. ఒక క్రైస్తవుడు రాయపురం గరల్స్ హైస్కూలులో ప్రయత్నించమని చలానికి సలహా యిచ్చాడు. అక్కడకు వెళ్ళగానే ఆ ప్రిన్సిపాల్ ఈమెను ఏమీ యిబ్బంది లేకుండా చేర్చుకున్నారు. అక్కడ భోజనం యిబ్బంది. నెలకు 17 రూపాయలు ఖర్చు సౌఖ్యకి. వాళ్లు క్రిష్టియన్ మతంలో చేరమంటే చేరనా అని అడిగింది వదినగారు. 'నీ వెనక నేనూ అవుతే-హిందూ పీడ వొదిలి పోతుంది' అన్నాడు చలం. అప్పటి పరిస్థితి గురించి చలం- 'అదేమి అదృష్టమోగాని కారణం లేకుండా సహాయం చేస్తామని ఎవరు వచ్చినా వాళ్లు క్రిష్టియన్లే. హిందువులు కల్పించిన ఈశ్వరుడు అనుకోవటానికి నేను సిగ్గు పడుతాను. ఐనా మొదట ఈశ్వరుడు పేరు ఎత్తింది యూదులుట. నవ్వుతూ నా స్నేహం కోరి నా దగ్గర చేరిన వారందరూ ముసల్మాన్లే. నేను ఎవర్నో తెలియకుండా ఇంతలో ఏం పోయింది. అవి ఒక రాయి- నా మీద రాయి విసిరిన వారందరూ హిందువులే, ముఖ్యం బ్రాహ్మలే' అని వివరిస్తాడు. హోస్పేట అతను 1921లో మొదటసారి ఉద్యోగం చేసిన చోటుని యుద్ధభూమి అన్నాడు. చలానికి స్త్రీ వ్యామోహం వల్ల ఏర్పడిన తిరుగుబాటులో ఈశ్వరుడు వున్నాడా లేడా, వుంటే ఈ స్త్రీ శృంగారంపై తనకి విరోధం ఎందుకు? ఒక సర్వ రక్షకుడిమీద భారం వేసి వుండ గలిగితే అలా బ్రహ్మ సమాజంలో వుండి పోగలిగేవాడే కాని అశాంతి. ఆవేదన అవే చలం జీవితాన్ని నమిలి మ్రింగాయి.

మద్రాసు నుంచి సౌఖ్యని స్కూల్లో చేర్పించి తిరిగి వస్తూంటే ప్రయాణంలో- 'ఈ స్త్రీ శృంగారం ఇవి కూడా తానే కాకూడదా? వీటిపైన తనకి విరోధ

మెందుకు? ఈ మాటలనుకోగానే, వంటరిగా ఆ మురికి బళ్ళో చదువుకునే వొయ్యి ఆమె కళ్ళు వొదలలేక, వొదలలేక ముద్దు పెట్టుకోడానికన్నా వీలులేక నేను వొది లేసిన చివరి నిమిషాల మాధుర్యం—' యివన్నీ జ్ఞాపకం చేసుకుని ఫీలవుతాడు.

అక్కడ 'వొయ్యి'కి అంతా క్రిస్టియన్లే అయినా మతంలో చేరమని వత్తిడి రాలేదు. అంతా మంచి వాళ్ళే. వారానికోసారి రెండు చెంబులే నీళ్ళు స్నానానికి- భోజనానికి ఘోరంగా వుండేది. ఆమె రాక కోసం చలం రవి కలలు కనేవారు. ఆమె వచ్చి వుంటే కాలం ఆనందమయం అవుతుందనే ఆశ. 'మద్రాసులో వున్న వొయ్యిని తలచుకున్నంత మాత్రాన నా మనసు పరవశమై పోయేది' అంటూ నేను దైవాన్ని కాంక్షించినన్నాళ్ళు అన్నిటి కన్నా ఆయనే వాంఛనీయం నాకు. ఆయనే శరణ్యం. ఆ ఈశ్వరుడిని గురించి ఎప్పుడు సందేహాలు ఏర్పడ్డాయో ఆనాటి నుంచి స్త్రీయే నా దైవం అయింది. ఆమెలోనే నా జీవితానికి సాఫల్యం-' అంటున్నాడు. చలం తన బుద్ధి చంచలం అని ఒప్పుకుంటున్నాడు. 'నా మనసు, హృదయం వొకరి మీద నిలిచి వున్నా ఈ లోపల ఎవరన్నా నావేపు చెయ్యి జాచినా, నన్ను చూపుతో ఆకర్షించినా నిలవలేక ఆమెవేపు పారిపోయేవాణ్ణి. ఈ చాంచల్యం వల్ల నా ఆదర్శ ప్రేమకి ఏ భంగమూ కలిగేది కాదు. ఈ చాపల్యాన్ని చూస్తే నాకెంతో రోత. ఈ గుణంతో నా జీవితమంతా యుద్ధంచేశాను, ఈ నాటికీ యుద్ధం చేస్తున్నాను. కాని నన్ను వొదలదు ఆ దోషం. దాంతో ఎన్ని చిక్కుల్లోకి దిగానో! అసహ్యమైన పరిస్థితుల్లో యిరుక్కున్నాను' అని చెప్పుకున్నాడు.

హోస్పేటలో ఉద్యోగం మానుకున్నాక మద్రాసులో రామస్వామినాయకర్ సత్రంలో చేరి తాను రామ్మూర్తి బుట్టల్లో అన్నం తెచ్చుకు తింటూ కష్టాల కోర్చి ఉద్యోగ ప్రయత్నాలు చేయగా రాజమండ్రి ట్రైనింగు కాలేజీలో ఉపాధ్యాయుడుగా నియామకం జరిగింది.

## కోడి వా కోడి

చలం రాజమండ్రిలో వున్నప్పుడు పెద్ద సాహెబ్ గారింట్లో వుండేవారు. వారికీ వీరికీ ఇళ్ళ మధ్య ఒకటే గోడ. అప్పుడు 'షౌ' వయసు రెండేళ్ళ లోపు. చలం మీద కోపగించి రంగనాయకమ్మగారు వూరికి వెళ్ళిపోతే 'షౌ' ఆ సాయిబు గారింట్లోనే వుండేది. చలం యింట్లో ఎవరూ లేక పోవటం ఆ యింటికి వచ్చే పోయే ఆడపిల్లలు ముఖ్యం అబ్బుత్త యింటి వెనక కట్టేసిన బోట్ ఇవన్నీ ఆ

సాయిబులకు వింతగా వుండేవి. చలం కాలేజి మిత్రుల్లో రహ్మాన్. భద్రాచలం పోలీసు డి. యస్పీ. తన ఆఫీసర్స్ బోట్‌ని చలం బోటు ప్రక్కనే కట్టేసుకునే వాడు. సాయంత్రం అయేటప్పటికి వీళ్ళందరూ గోదావరి ఒడ్డున చలంగారి తోట లోకి టీకి వచ్చేవారు. రాత్రి భోజనం టైము అయ్యేదాక అంతా అట్లా కబుర్లు చెప్పుకునేవారు.

ఆ రోజుల్లో సాయిబుగారి కూతురి పెళ్ళి జరిగినప్పుడు వచ్చిన ముఖ్యుల్లో ఖాజీసాహెబ్ ఒకరు. ఆయన పాటకు ఓరోజు చలం చూస్తూండగా సాయిబుల ముఖాలన్నీ ఉద్రేకంగా మారిపోయాయి. చలం కూడా భయపడ్డాడు. అది వీర గానం. అంత బాగా పాడగలడు ఖాజీసాహెబ్. ఆయన మంచి విగ్రహం. భారీ మనిషి. చలానికి ఆయనకు స్నేహం. ఏదీ లక్ష్యం చేసేవాడు కాదు. ఒకసారి ఖాజీ సాహెబ్ పాడ్తూండగా అర్ధరాత్రి లేచి చలాన్ని పిలిస్తే వెళ్ళాడు. ఆయన ప్రేమ కవిత్వం, పర్షియన్ కవిత్వం పాడుతున్నాడు. హార్మోనియం వాయిస్తూ, మధ్యలో చేయి తీసి మౌనంగా ఆ చేత్తో మిగతా కథ చెప్పేసేవాడు. ఆ రోజు ఆయన తెల్లారే వరకూ పాడుతున్నాడు. చివరన చలం 'కోడి నా కోడి' పాడమని అన్నాడు. 'కోడి నా కోడి' అంటూ సాయిబు లందరూ లేచారు పైకి ఏక కంఠంతో. అందరూ చిందులు తొక్కుతూ పాడారు గోలగా.

చలాన్ని హిందూ సంఘం తరిమేసి వెలివేసి హింసించినప్పుడు అతన్ని చేరదీసి తమలో కలుపుకుని ఆదరించి అభిమానించి గౌరవించినవారు ముసల్మాను మిత్రులే!

మాటలు సరిగారాని వయసులో చిన్నప్పుడు, చలం తమ్ముళ్ళు రంగనాయ కమ్మను 'వదినా' అనడం నోరు తిరగక 'వొయ్యి' అని పిలిచేవారట. చలం అలాగే పిలిచేవాడు. ఆమెను అలాగే రిఫర్ చేసేవారు చలం కుటుంబం వారంతా. వొయ్యి గురించి సౌరిస్ జీవితం మొదటి భాగంలో, "ఈమె డాక్టర్ రంగనాయ కమ్మగారు. ఈమె ఆంధ్ర దేశంలో మొదటి హిందూ Lady Private Medical Practitioner. సౌరిస్‌తల్లిగారికి అక్క. చలం ఎరిగిన స్త్రీలలో ఉత్కృష్టమురాలు. ఆమెలో nobility మూర్తీభవించింది. చలాన్ని ఎన్నో గండాలనించి తప్పించి మనిషిని చేసింది ఈమె. చలం, తన ఆత్మవిశాలత్వం కోసం చేసిన సంఘ విప్లవ కార్యాలకి, రచించిన సుందర కావ్యాలకి Inspiration ఈమె. ఈమె సహాయం

వల్లనే సహృదయత వల్లనే తమ కలలు కన్న ఎన్నో ఆశయాల్ని Materialise చేసుకో గలిగాడు చలం. ఈమె మృతితో చలం సన్యసించాడు.'

సౌరిస్ దృష్టినుంచి 'వొయ్యి ఎవరో చాలా కాలం 'షౌ'కి తెలియదు. ఎంతో Charming గా వుండే ఆమె, తమతో గడపడానికి వచ్చిన హాసాధి దేవతా అని పించేది'ట 'షౌ' కి. బాల్యంలో చలం పిల్లలకు-అందరి పిల్లలకీ తమలాగ అమ్మ నాన్నా కాకుండా ఒక వొయ్యి కూడా వుంటుందని అనుకునే వాళ్ళు. దాంతో ఎవరన్నా పిల్లలు స్నేహమైతే, వాళ్ళ అమ్మ నాన్నల గురించి అడిగి 'మీకు వొయ్యి వుందా'అని అడిగే వాళ్ళుట. వాళ్ళు తమకి 'వొయ్యి'లేదంటే 'అయ్యో పాపం' అని దిగులు పడేవాళ్ళు.

## చిత్రాంగి

తనను వెలివేసి తనకు నిలువ నీడ లేకుండా తరిమికొట్టిన సంఘంపై రాజ మండ్రిలో చలం కత్తి కటారీ నూరుతున్నాడు. అది 1921 కావచ్చు. శుక్రవారం, శనివారం, ఆదివారం-మూడు రోజులూ ముసురు. పిల్లలు మంచాలమీద నిద్రపోతు న్నారు. ఆదివారం రాత్రి నాటకం పూర్తయింది. చిత్రాంగి మేడ పక్కన యింట్లో వుండడం వలన చిత్రాంగి గురించిన ఆలోచనలు వచ్చి ఈ నాటకం రూపుదాల్చి వుండవచ్చు. ఈ చిత్రాంగి నాటకంలోంచి కలాన్నే కత్తిగా చేసి చలం సంఘం పైకి దూకుతున్నాడు. తనను బహిష్కరించి ముప్పుతిప్పలు పెట్టిన సనాతన హిందూ సభ్య సమాజంమీద, కరడు కట్టిన బ్రహ్మ సమాజికులు రత్నమ్మ వ్యవ హారంతో తనను ఇమ్మోరల్‌గా చిత్రించి తరిమినందున వారిపైకి చిత్రాంగిని మం త్రించి పాశుపతాస్త్రంలా వదిలాడు చలం అనిపిస్తుంది. చలానికి పితృద్వేషం బాగా వుంది. చిత్రాంగిలో రాజరాజనరేంద్రుడి పాత్ర చలం father hatred కి బాగా సరిపోతుంది, మనస్సుచేత సారంగధరుడు చిత్రాంగి దంపతులు కాని పెళ్ళితంతు వల్ల రాజరాజుకి భార్యఅయిన చిత్రాంగి స్టేటస్‌లో మార్పు వారిగాఢమైన ప్రేమకు అడ్డువచ్చినా వారి సంబంధం పవిత్రమైనదే అందుకే "చిత్రా నాకు చేతులులేవు నిన్ను కావలించుకుందామంటే" అని చలం అనిపిస్తాడు సారంగధరుడిచేత చివ రిలో. సారంగధరుడి పాత్రలో చలం ఆనాటి వేదన (రత్నమ్మ వ్యవహారం వలన ఏర్పడినది) స్ఫురిస్తుంది. ఈ కథని ఎన్నుకున్నది స్త్రీ పురుష సంబంధాలనికొత్తగా బలంగా స్పష్టంగా సంఘం ముక్కుమీద గుద్ది చెప్పడానికే. అతను పాత విషాద

సారంగధర కథలోని హిపాక్రసీతో యుద్ధం చేస్తున్నాడు. అదే హిపోక్రసీతనను బహిష్కరించిన సమాజంలోని పెద్ద మనుషులలోను వుంది. దానిని తన కలంతో తూట్లుపొడుస్తున్నాడు. అందుకే పాత కథలని పౌరాణికాలుగాని, చారిత్రకాలుగాని తిరిగి రాయడం-తన వ్రేలితో గాక వారి వ్రేలితో వారి కన్ను పొడవడానికే. 'ఆ రాత్రి ఆ నాటకాన్ని ఎవరికన్నా వినిపించంది నేను నిలవలేను' అంటాడు చలం. 'నా రాత ప్రతిని చేత్తోపట్టుకుని ఆ రాత్రి చీకట్లో గోదావరి ఈదురు గాలిలో దిబ్బ మీద మా ఇంటి నించి ఊళ్ళోకి వెళ్ళాను నేను.... వూళ్ళోకి రెండు మైళ్ళు నడిచి చింతాదీక్షితులుగారి తలుపు తట్టాను. దీక్షితులుగారు బైటికి వొచ్చి, ఆశ్చర్యంతో చూశారు. ఆయన చేతిలోని గుడ్డి దీపాన్ని అక్కడే పెట్టించి మాట లేకుండా నా నాటకాన్ని చదివి, వినిపించి ఇంటికి వచ్చేశాను'—చిత్రాంగి నాటకాన్ని దీక్షితులు గారి వంటి Veteran మెచ్చుకునేటప్పటికి చలం కథలు కూడా ఎందుకు రాయ కూడదని అవీ ప్రారంభించాడు.

## చిత్రాంగికి గిడుగు వారి పీఠిక

ఈ నాటకానికి గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు పర్లాకిమిడి నుంచి రక్తాక్షి సం॥కార్తిక బ౧ (నవంబరు 1924)లో పీఠిక రాశారు. చలం చిత్రాంగిలో (1921-24 మధ్యకాలం) ప్రయోగించిన భాష గురించి గిడుగువారు——

'—నియమ నియమములు లేని స్వేచ్ఛ స్వాతంత్ర్యములవల్ల కీడు గలుగు తుందన్న మాట నిజమేకాని స్వాతంత్ర్యాభిలాష గలవారికి ఆత్మ నిగ్రహముండక పోదు. స్వాతంత్రము వల్ల పారతంత్రమువల్ల కలిగిన నిర్బంధము అనుభవించిన వారు కొందరు. అది తొలగిన వెంటనే,బడి నుండి వెడలి వచ్చిన పిల్లలవలె, కొం చెముసేపు,విచ్చలవిడిగా క్రీడించడమునసహజమే:దానివల్ల సారస్వతమునకుగాని పం ఘమునకుగాని హానికలుగదు సరేగదా అది వినోదకరముగా ఉంటుంది. ఎవరికి ఏలాగున మాట్లాడడము అలవాటయినదో ఆలాగుననే పిల్లలతోనే కాక పెద్దలతోనూ సంభాషించే వారు కొందరుంటారు వారి భాష కొందరికి ఇంపుగానే ఉంటుంది, మన కవిగారి సంకల్పము అట్టిది, వారి భాషలో అసాధారణమైన వ్యత్యాసములు కొన్ని ఉన్నవి; ఉంటేనేమి? వారు వ్రాసినా ఆలాగుననే వ్రాయక మానరు. కృతక భాషవల్ల కలిగేకీడు అట్టి భాషవల్ల కలగదని నా అభిప్రాయము.'

రామ్మూర్తి పంతులుగారిచ్చిన ఈ యోగ్యతా పత్రం చలంవాడే సజీవమైన శక్తివంతమైన తెలుగు వ్యవహారికానికి మాత్రమేకాదు-చలం చిత్రాంగిలో వెల్లడించిన భావాలకు కూడా వర్తిస్తుంది. అదే పీఠికలో గిడుగువారు-'మన హిందూ సంఘములోని స్త్రీ పురుషులకు ప్రాచీనా చారములు యెడల గౌరవము ఇంకా అపరిమితముగా ఉన్నది ...విధవా వివాహములు, రజస్వలా వివాహములు, సంఘాలవారు ఇంకా అంగీకరించడము లేదు. బ్రహ్మసమాజమువారు బహిష్కృతులు....ఇట్టి స్థితిలోవున్న హిందూ సంఘం వారికి ప్రస్తుత నాటకంలోని చిత్రాంగిచర్య వింతగానూ వక్రముగానూ హేయముగాను ఉంటుందని ఆక్షేపిస్తే-అలాగున ఉంటుందని తెలిసే సంఘమునకు సుపరిచితమైన చిత్రాంగిని విచిత్రముగా మార్చిసంఘము యొక్క గౌరవమునకుఅర్హురాలుగా ఉండేటట్టు ఈ కొత్త నాటకములో మనకొత్త కవిగారు వర్ణించినారు. కొత్త చిత్రాంగి పాత చిత్రాంగి వంటిది కాదు. మునుపటి చిత్రాంగి అశోకునిచిన్న భార్య తిష్య రక్షిత వలెనే మనోవల్లభుని మీద పగ తీర్చుకొన్నది. ఈ చిత్రాంగి సహగమనము చేసిన సతి పరమపతివ్రత అని ఆమెను పుట్టించినవారి నమ్మకము. అత్యద్భుతమైన ఉదారభావములు గల దానినిగా తర్ఫీదు చేసినారు. పాశ్చాత్య నవనాగరికుల దాంపత్య భావములు సంస్కృత ప్రబంధముల ద్వారానే కవిగారు ఆమెకు నేర్పినారు.... సావిత్రి చిత్రాంగికి ఆదర్శము ... అట్లే చిత్రాంగి సారంగధరులు ఒకరినొకరు 'మనమునగై కొన్న' దంపతులు 'రాజరాజనరేంద్రుడు బ్రాహ్మల చేత చదివించిన మంత్రాలు తనకు చిత్రాంగిని భార్యగా చేయగల శక్తిగలవే అయితే చిత్రాంగికి అతనియెడల అనురాగాలు పుట్టించవలసి ఉండెను, అని చిత్రాంగి వాదిస్తుంది. అట్టిశక్తి వాటికిలేదు, గనుక వాటివల్ల రాజరాజనరేంద్రునికీ చిత్రాంగికీ దాంపత్యము కలుగలేదట. సారంగధరుడు రాజభక్తి పితృభక్తి గలవాడు; పరువు ప్రతిష్టలు కావలసిన వాడు. లోలోపల దుఃఖ పడేవాడు; కాని తండ్రిని ఎదిరించేవాడు కాడు. తనకోసం తెప్పించిన గుర్రాన్ని గాని, చీనాంబరాలుగానీ తండ్రి వాడుకొంటే పోనీ అని ఊరుకొన్నట్టు తాను ప్రేమించిన చిత్రాంగిని పెళ్ళాడితే ఊరుకోవలసినదేనా? చిత్రాంగిని ఆలాగున ఊరుకోలేదు.... మన పూర్వులు ధర్మ శాస్త్రములలోను, పురాణాలలోను, దాంపత్య ధర్మములను గురించి చర్చించినపుడు మనకంటె ఎక్కువగా భూతదయ ఉదారబుద్ధి గలిగి ఉండినట్టు నాకు తోచినది. ఇప్పటి

మన సంఘములోని చిత్రాంగులున్నూ సారంగధరులున్నూ దాంపత్య ధర్మములను గురించి వేసే ప్రశ్నలకు తగిన సమాధానాలు చెప్పుటకు ఇప్పటి పెద్దలు ప్రయత్నిస్తేనే కాని ఇప్పటి రాజరాజుల నిరంకుశాధికారుల వల్ల హిందూ సంఘమునకు గొప్ప విపత్తు కలుగుతుందని హెచ్చరించుటకు కవిగారు ఈ నాటకము రచించినట్టు నాకు తోస్తుంది వారి సద్భావము మెచ్చుకోదగినది కాదా?' 1924లో రామ్మూర్తిగారు చిత్రాంగికి పీఠిక రాస్తూ చలం కొత్తగా రాస్తున్న భాషను అతని కొత్త భావాలను ఎంతో ఉదారంగా చిత్తశుద్ధితో మెచ్చుకోవడం గొప్ప విశేషం కాదా? తన భాషా విప్లవానికి గురజాడ తరవాత అంతకంటె మించి రాయగల చలాన్ని గిడుగు కనుగొనడం ఒక చారిత్రక విశేషం। రచయితగా చలం ఆవిర్భావం 1921 శశిరేఖతో ప్రారంభమయి మొదటికథ రుక్మిణి రాశాక, పద్మరాణి నాటకం, రెండవ నవల (హెచ్.జి. వెల్స్-passionate friends ప్రేరణతో) దైవమిచ్చిన భార్య నవల రాయడంతో ఓ దశకు చేరుకొంది. అయితే 1924లో రాసిన 'పద్మరాణి' నాటకం చిత్రాంగి (1921) కంటె ముందు రాసి వుండాలని అనిపిస్తుంది. పద్మరాణిలోని రచనా పద్ధతి, వాడిని భాష శశిరేఖ నవలలోని భాషను పోలి వుంది. 1921లో చలం హాస్పేటలోనూ తరువాత రాజమండ్రి వచ్చి అక్కడ 1934 వరకు వున్నాడు.

## పద్మరాణి

పద్మరాణి నాటకంలో 'పద్మరాణి' చలం సృష్టించిన 'బ్రేవ్‌గర్ల్' సాహసవతి. అప్పటి తెలుగు సమాజానికి షాక్ యిచ్చే కొత్త తరహా కథానాయిక 'పద్మరాణి' పురుషునితో సమానంగా కంటె యింకా ఎక్కువగా తెలివి, చొరవ, సాహసం అన్నీవుండి స్వేచ్ఛకోసం పోరాడ గలిగే వ్యక్తిత్వం కలస్త్రీ మనకు కనిపిస్తుంది. రత్నమ్మ నీ వొయ్యీనీ కలిపితే చిత్రాంగి రావచ్చు, పద్మరాణి కూడా వస్తుంది. చలం కలల్లో విహరించే ఆదర్శ స్త్రీ పోలికలు కూడా పద్మరాణిలోనూ చిత్రాంగిలోనూ వున్నాయి. పద్మరాణి నాటకంలో ఈమెకోసం సగరరాజు, అప్పటికే శారదతో వివాహితుడై తల్లి నర్మద పర్దీలోంచి బయట పడ లేకుండా వున్న అభయవర్మ, తిరుగుబాటుకై ప్రయత్నించి తల్లి నర్మద కుట్రవల్ల హతులవుతారు. ఆమె కోసం మరణించిన వీరుల్ని తలుచుకుంటే ఈమెలోంచి రత్నమ్మ తొంగి చూడటం లేదుకదా అనిపిస్తుంది. ఈ పద్మరాణి, చిత్రాంగి రెండు నాటకాల్లోనూ

స్త్రీ స్వేఛ్ఛా యజ్ఞానికి చలం సమకూర్చుకొంటున్న ఆయుధ సంపత్తి అంతా వుంది. ఇవి రాజ కుటుంబీకుల చారిత్రక కథలా పైకి కనిపించినా భావాలలో ఆధునికమే.

## శశిరేఖ

శశిరేఖకు పీఠిక రాస్తూ శ్రీ శివ శంకరశాస్త్రి 'ఈ నవల నీతి బాహ్యమని కొందరంటారు, కాదనిమరికొందరంటారు. సాహిత్యానికి నీతితో పనిలేదు; రమణీయార్థము ప్రతిపాదించడమే కావ్యోద్దేశము ... సాంఘిక ధర్మముల వంటి మానవ ధర్మములు ఉత్తమమైనవి.... ఈ కథానాయిక సామాన్య స్త్రీ కాదు. ఈమె ప్రేమైక జీవిని.అందుచేతనే తనకు యోగ్యుడైన ప్రియుని కోసమై ఎట్టి త్యాగమైనా చేసింది.స్వాతంత్రములేని సామాన్య స్త్రీలవంటి ప్రతివ్రత ఈమెకాదు స్వధర్మ ప్రకారము ఈమె నిస్సంశయముగా ప్రతివత' అని చెబుతూ శశిరేఖ చదివితే కలిగే ఆందోళన వల్ల యీ నవలలో జీవం వుందని ఆయన ప్రస్తుతిం చాడు. చలం 'శశిరేఖ' నవల విక్టోరియాక్రసీ ప్రభావంతో రాశాడని సౌరిస్ గారు అన్నారు.

పద్మరాణిలో ఈ సంభాషణని పరికిస్తే చలం రత్నమ్మ మాట్లాడుకుంటు న్నట్లే వుంటుంది. పద్మరాణి అభయవర్మతో యిలా అంటుంది—

పద్మ :- (అభయుని కౌగలించుకొని) ఎప్పుడూ నిన్ను వదలకుండా నీ దగ్గరగా వుంటా. ఎన్నడూ నిన్ను వొదలను, స్నేహం మన యిద్దరి జీవనాలనూ వెలిగిస్తుంది, ఎందుకంత సౌఖ్యాన్ని యీ పాడు మోహంతో చెరుపు కుంటావు? నా మాట విను.నువ్వంటే చాలా యిష్టం నాకు. ఇంక నాకు ఎవరున్నారు నువ్వుగాక? సగర రాజు కూడా లేడు. (సగర రాజు రామ్మూర్తి ఏమో?) నా మాట వినవూ? నా మీద ప్రేమ వుందం టావే? యిదేనా? పెళ్ళి చేసుకుంటే వున్నట్టు లేకపోతే లేనట్టునా?

(పద్మరాణి, వొయ్యి అయితే శారద చలం భార్య రంగనాయకమ్మ గారు కావచ్చునేమో.జీవితంలో ఆయా వ్యక్తుల ప్రభావంతో మలిచిన పాత్రలు కావచ్చు నని వూహించడానికి అవకాశం వుంది. నండూరి సుబ్బారావుకి ఎంకి పాటలతో ఒక్కసారి తెల్లారి లేవగానే వచ్చిన కీర్తి 'హైరానిక్ కీర్తి'. చలానికి వచ్చినకీర్తి

అలాటిది కాదు. చలంలా నండూరి సుబ్బారావు 'రెబెల్' కాదు. మొహమాటస్థుడు (1929 నాటి పరిస్థితి) భావకవితా ఉద్యమం (కాల్పనికవాద కవితా యుగం) ఆవిర్భస్తున్న కాలమది. అప్పుడో మిత్రుడు చలంతో అన్నాడు 'తెలుగు దేశం డిజనరేట్ అయింది. కొత్తరకం ప్రవేశమైతేనేకాని శాశ్వతమైనదీ ఉత్తమమైనదీ ఏదీ స్పృజించలేదు' అని చలం అతనితో ఏకీభవిస్తూ తన అభిప్రాయాలను (దీక్షితులుకి చలం ఉత్తరాలు 20-1-29 తెనాలినుంచి రాసిన లేఖ) యిలాచెప్పాడు- 'రచయితలు రెండురకాలు. ఒక ఉద్గ్రంధాన్ని (master piece) కు కది లిపోయే వారు. తాము స్వంతంగా గొప్పది ఏదీ వ్రాయకపోయినా, సారస్వతానికి కొత్త జీవాన్నిచ్చేవారు.

ఏ కొందరో ఈ రెండూ చేయగల వారుంటారు.

దేశం ఇట్లానే గొడ్డుపోయి, ప్రస్తుతం వొచ్చిన గ్రంథాలకన్నా గొప్పవి రాకపోతే తప్ప, 1900 సంవత్సరం తరువాత ప్రచురించిన పుస్తకాలలో ఒకటి కూడా కొంతకాలం తరవాత నిలవదు

మన సారస్వతంలో (New channels of thought and path of art) అభిప్రాయాలలో కొత్త కాలవలూ, కళలో కొత్త మార్గాలూ ప్రారంభించిన వాళ్ళు కొద్ది మంది వున్నారు. వాళ్ళలో నేనొకణ్ణి. ఈ కాలపు రష్యను ఫ్రెంచి కథలూ నాటకాలలో ప్రశస్తమైన వాటి రకాల్ని తెలుగులోకి ప్రవెశపెట్టాను పశ్చిమ సార స్వతం లోంచి స్కాట్ తరువాతి ఉద్దేశ్యాలేమీ తెలుగులోకి రానేలేదు, ఇంతవరకు. నేను కొన్ని చాలా మంచివి వ్రాశాను. కాని నా టెక్నిక్ and ఐడియాస్, చాలా పాశ్చాత్య వాతావరణాన్ని సూచిస్తాయి. కనక మన నేలమీద ఆరోగ్యంగా అభివృద్ధి చెందవు.

రాజకీయంగా సాంఘికంగా ముందు దేశం ఏ విధంగా మారబోతుందో, దాన్ని బట్టి వుంటుంది నా పుస్తకాల విలువ. టర్కీ మల్లే చేతల్లోను ఆలోచనల్లోను యూరప్‌ని అనుకరించబోతే, నేను గొప్ప పూజల్ని పొందుతాను. అట్లాకాకపోతే, నాకు స్తానమే వుండదు కాని ఈనాడు వాస్తవ జీవితంలో, మాటల్లో చాలామంది చూపుతున్న పోకడలనే నేను కళారూపంలో వ్యక్తం చేశాను. ఇంక నా భాష ఒక ఆటంకం. Force of sincerety, సూన్నృత శక్తి, weight of passion— నా ఉద్రేకపు ఉధృతలు- తప్ప నాకు శైలిలేదు. కాని 'పైను' జాగ్రత్త పరిచే పాత్ర శైలి ఈ పగులు జాడీలో యీ పైను చాలా ఏళ్ళు నిలవదు.

నా పుస్తకాల్లో ఏదీ కూడా నిజమైన గొప్పదనం కలది లేవు. ప్రస్తుతం. పాశ్చాత్య దేశాల్లో అమలులో వున్న కళా విజృంభణ కన్న గొప్పతనం నా పుస్తకాల్లోలేదు.

1929లో చలానికి వచ్చిన అనుమానాలే 1981లోనూ ఆ తరవాత కూడా సాహిత్యకారులకు వస్తాయి. అసలు శాశ్వత ప్రయోజనం గల గొప్ప రచన కలగడం అనేది ఒక myth. ఎప్పటి సామాజిక జీవిత వాస్తవాలకి సంబంధించి ఆనాటి సాహిత్యం వుంటుంది. జనాన్ని కదిపి కుదిపి ఆలోచింపచేసి ఉత్తేజపరచి భావాల్లో మార్పు కలిగించడానికి సాహిత్యం ఉపయోగ పడుతుంది. అవసరం తీరినా అది జనం స్మృతుల్లో నిలిచి గతం వర్తమానాన్ని ప్రభావితం చేసినట్లు ఉత్తేజ పరుస్తూ వుంటుంది. జనం యిచ్చే విలవ కూడా మారుతూ వుండవచ్చు. సార్వకాలికమైన వాటిన ఆశించడం కూడా పాత ధరలవాటేనేమో!

దీక్షితులు గారికి రాసిన ఆ 20-1-29 ఉత్తరంలో చలం యింకా యిలా రాస్తున్నాడు—

'మంచి సారస్వతం రెండు రకాలు—

1. అందమైన పటమల్లే గోడని వేళ్ళాడుతో— మనసుని అందాలతో నింపేది.

2. ఉరిమి చించి, చెండాడి, మంచికో చెడ్డకో, జీవితాన్ని Influence చేసేది.

మొదటి రకపు సారస్వతం యిప్పుడు బళ్ళకొద్దీ తయారవుతోంది. రెండో రకం చాలా స్వల్పం. రెండో రకం సారస్వతాన్ని దేశాని కిచ్చేది నేను వొకణ్ణే. కాని నాకు వుండవలసినంత force లేదు. ఏదో ఓ దేశంలో ఇంతవరకు లేని కొత్తదనం ఎక్కువలేదు నాలో....'

చలం వొప్పుకుంటున్నాడు తనూ దీక్షితులుగారూ యిద్దరూ సిన్సియర్‌గా ఫీలయి ఫీలయింది రాస్తున్నామని కాని తమలో కావలసినంత force వుందా అని చలానికి సందేహం.

'ఆదర్శం కోసం అవసరమైనంత త్యాగం చేసి కష్టాలకి సిద్ధమౌతామా? కష్టాలతో కాలిపోక, మిగిలి, అగ్నిపరీక్షకి తాళగల సత్తువ వుందా మనలో? తేన ప్పుడు గొప్ప వాదం చెయ్యగలం, సృష్టించగలం?'

మార్క్సిస్ట్ దృక్పథంతో ఆలోచిస్తే యివన్నీ చలం బూర్జువా మేథావి చింతన కిందకు వస్తాయి. రచనా వ్యాసంగం ఒక సామాజిక బాధ్యత అనడం సులువే కాని, అనుభవించి sincere గా feel అయి ఎంత మంది రాస్తున్నారు? అసలు రాసేవాళ్ళకు సెన్సిబిలిటీస్ వున్నాయా? లేవు. రాసేవాళ్ళు కష్టాల్లో కాలి నిప్పుల్లోంచి నడిచి రాస్తే, చదివేవారు? వారికే బాధ్యతా ప్రయత్నాలు లేవా, అక్కర్లేదా? పాఠకులు ఉత్త కన్స్యూమర్స్ తప్ప మరేమీ కారా? వర్గస్వభావాన్ని బట్టి వారి చైతన్యం ముందే నిర్ధారితంగా వుంటుందా? అయితే సమాజం అనేది ఓ పెద్ద ప్రచారంలో వున్న అబద్ధమవుతుంది. అప్పుడు ఏ వర్గ ప్రయోజనాలకి ఆ వర్గం రాసుకునే సాహిత్యంవచ్చి దాని మూసలోకి అది వెళ్ళిపోతుంది. చలానికి ఈ స్పృహ వుంటే చాలా నేలబారు రచనలు చేసి మర్యాదస్థులైన అభ్యుదయ రచయితల గుంపులో చేరిపోయేవాడు. చలం ఆత్మకథలో' నా కథలద్వారా నేను కొట్టేదెబ్బలకి ఎవ్వరూ ఎదురు పలకక, దిమ్మతిరిగి పడుకుంది తెలుగు పాఠక ప్రపంచం. కాని దానిమీద నాకు వినబడుతోనే వుంది—' చలంతో స్నేహం చెయ్యాలని దగ్గరకు వచ్చే యువకులు చలం రాసిన శృంగారపు భావాలకి వాటిలోని విప్లవ తీవ్రతకు వాటి ఆచరణకు తట్టుకోలేక వెక్కిరించి భయపెట్టేవారి ధాటికి తాళలేక బావురుమంటూ భయపడి చలాన్ని వదిలి పోయేవారట, దీక్షితులుగారు ప్రోత్సహిస్తే రామ్మూర్తి గొప్పగా చలం రచనల్ని ఆరాధించేవాడు ప్రచురించే పత్రికల వద్దకు వెళ్ళి వాదించి బెదిరించి రచనలు అచ్చవనివ్వకుండా చేసేవారు. అందరితో అకారణ వైరమే. అధికారంచేతిలో వుంది గదా అని అబలల్ని హింసించుకుని తినేవారి మీదనే చలం దాడి, అతని జీవితం సంఘ సమ్మతమైనది కాకపోవడం వలన నోటెడ్ శాస్త్రిలు, శర్మలు, అవధానులు అతనిచుట్టూచేరేవారు కారు.చలం నివాసం హరిజనవాడల్లో, బీద ముసలమాన్ వాడల్లో. తక్కువ జాతి కిరస్తానీ వాడల్లో కావడం చేత అక్కడికి వెళ్ళడానికే భయం వారికి, ఆనాటి రచనల్లో అతని కలలు ప్రతిఫలించేవి. చలం సౌందర్య వాంఛ, ఆదర్శాలు అన్నీ వాటిలో పలికేవి. చలం మాటల్లో—'నేను నా కథల్లో, నాటకాల్లో, సంఘనీతిని attack చేస్తున్నాను, నన్నెరిగిన వాళ్ళందరికీ నాజీవితమే ఒక విప్లవ ఉద్యమమని తెలుసు. పైగా నా వడవడికి భావాలకి నా సాహిత్యం తోడ్పడ్డది....వాళ్ళు ఏడ్చిన కొద్దీ నేను విప్లవకరమైన సాహిత్యం సాగించాను—'అంటూ తిరిగి 'నేను చెప్పేదాంట్లో అంత మహా విప్లవకరమైనది ఏదీలేదు. వాళ్ళ పాత నీతుల్నీ కొత్త light లో చూసాను. వాళ్ళ

లోని మోసాన్ని, అన్యాయాల్ని, స్వార్థచర్యల్ని ఎత్తిచూపాను, వాళ్ళ హృదయాన్ని ఏ మాత్రమైనా తెరవగలనేమోనని చూశాను-' యిదే చలం సాధించినది. దీని రహస్యం ఏమిటంటే అంత ధైర్యంగా ఈ సమాజం ముక్కుమీద కళ్ళు బైర్లు కమ్మేలా గుద్ది 'మీరంతా వుత్త వెధవలు' అని చెప్పిన వాడు చలమే. అందుకే అంత రొష్టు!

## డాక్టర్ అహోబలరావు

చలం గోదావరిని దీక్షితులుగారిని రాజమండ్రిని వదలలేక తప్పనిసరిఅయి ప్రమోషన్‌మీద బందరు వెళ్ళాడు. బందరు జీవితంలో చలాన్ని ఎక్కువగా ప్రభావితం చేసినది డాక్టర్ అహోబలరావు, పెద్దమ్మాయిగారు. చిన్నమ్మాయిగారు అని పిలవబడే యిద్దరు సంస్కారంగల స్త్రీలు. ఇక్కడే గొప్ప వయొలిన్ విద్వాంసుడు జంగం సుబ్రహ్మణ్యదేవరతో స్నేహం లభించింది.

చలంగారి మాటల్లో ఆ రోజుల్లో బందరంటే అహోబలరావుగారు. అహోబలరావుగారంటే పెద్దమ్మాయిగారు చిన్నమ్మాయిగారు. బందరు వెళ్ళాక 1924లో చిన్నమ్మాయిగారి వాటాలో చలంగారు అద్దెకుండే వాడు. ఆ యింటి కళ అంతా డాక్టరుగారేనట. జీవితంమీద ఆయనకు వుండే ప్రేమ మనుష్యులమీద దయ అలాంటివి. ఫ్రెంచిపేటలో ఓ మైదానం మధ్య వుండే ఆయన యిల్లు పాత నవాబు లది. ఆ యింటికి తలుపులున్నా లేవనిపించేటంత ఔదార్యం. అన్నీ హాల్సుగదులు కావు. ఆయన్ని ఏం అబ్బాయి అనిపిలిచే పెద్దమ్మాయిగారు, డాక్టరుగారే- యింటి కంతకీ యిద్దరు. ఈవిడ చెల్లెలు చిన్నమ్మాయిగారు భర్త రంగూన్‌లో. ఈవిడ వుండుండి వచ్చి బందర్లో యీ యింట్లో వుండేది. వీళ్ళంతా బందరు వాళ్ళు. డాక్టరుగారి యింట్లో ఎప్పుడూ మతి తప్పిన సంగీత పాఠకులు, పట్టాలు తప్పిన రచయితలు. జీవితంలో సగం దెబ్బతిన్న పిచ్చివాళ్ళు వుండేవారు. చలం కథలూ నాటకాలూ చదవడం వలన వారికి వీరు దగ్గరయారు. ఆయన చుట్టూ ఓ డజను మంది శిష్యులు-వూళ్ళో ఎక్కడ ఏ అక్రమం జరిగినా వీరి సైన్యం వీరూ అక్కడ హాజరు. గాంధీగారి కార్యక్రమాల్లో డాక్టర్ పాల్గొనేవారు. పెద్దమ్మాయి గారి చిరునవ్వు, ఆమె చుట్టూవున్న వాతావరణం ఆ యింటిని ఓ ఆశ్రమం అనుకునేట్లు చేసింది. ఆ ఆశ్రమం వారిద్దరి ఆత్మ నివాసంలా వుండేది. ఆమె ఎంతో మార్దవంగా వుండేది. డాక్టరు మాట తీరు అంత కటువుగా ఉండేది. బందరులోని

గాయకులు కవులు చిత్రకారులు ప్రభుత్వోద్యోగులు పోలీసు వారంతా అక్కడ గుమిగూడేవారు. ఆయన ఆవిడ మధ్యవున్న ఐక్యత ఆ బందరు పట్నాన్ని వెలిగించిందని చలం అన్నాడు. చలం వారికి అర్ధ రాత్రులు ఆ పెద్ద మైదానంలో ఎంకి పాటలుపాడి వినిపించేవాడు. చలం తను అప్పట్లోరాసిన కథలను వీరికి చదివి వినిపించేవాడు.

ఈ పెద్దమ్మాయిగారు అని చలం రిఫర్‌చేసే వ్యక్తి ఎవరంటే - బందర్ నోబుల్‌కాలేజీకిపట్టిన గొప్పదశలో-కోపల్లి హనుమంతరావు,ముట్నూరి కృష్ణారావు, పట్టాభి సీతారామయ్య, పెద్ద అహోబలరావు, చిన్న అహోబలరావు, పెద్దమ్మాయి, చిన్నమ్మాయి, Mrs. సత్యనాథన్. సీతారామస్వామి, పిల్లలమర్రి ఆంజనేయులు వీరంతా అక్కడ చదువు కొంటున్నారు. పెద్దమ్మాయిగారిని చూసి కొన్ని యువక హృదయాలు తబ్బిబ్బులయాయి. పెద్దమ్మాయిగారికి ఇంగ్లండులో డాక్టరు చదువు కుంటున్న ఒక ఆయనతో పెళ్ళయింది. ఇండియా వచ్చాడాయన. ఒక కూతురు పుట్టింది. త్వరలో ఆ భర్త, ఆ కూతురూ యిద్దరూ చనిపోయారు. Mrs. రామ చంద్రయ్య, అని ఆమెను బ్రహ్మసమాజికుడైన పిల్లలమర్రి సుబ్రమణ్యం పలక రిస్తూ వుండేవాడు. ఈ పిల్లలమర్రి సుబ్రమణ్యం ఆవిడ ఆరాధకుడు. అరవింద రాసిన సావిత్రి దగ్గర నుంచి టెన్నిసన్ రాసిన ఇన్ మెమోరియందాకా అతనికి కంఠోపాఠం. వీరి నుంచి చలం అహోబలరావు పెద్ద అమ్మాయిగారల కథ విన్నాడు. చలం బాల్యంలో తెనాలిలో బడికి వెళ్ళే తోవలో ఓ చక్కని కుటీరం వుండేది. అందులో ఒకామె వుండేది. ఆవిడ పెద్దమ్మాయిగారు. చలం ఆ కుటీ రానిక్కి అంకుల్ టామ్స్‌కేబిన్ అని పేరు పెట్టారు. చలం ఆమెకేసి నిదానించి చూడడానికి భయపడేవాడు లేదా బిడియపడే వాడు. ఆమె గురించి ప్రస్తావిస్తూ చలం 'ఆమె మా తాతగారికి దగ్గిరిగా అంటుకుంటూ కూచునే మాట్లాడుతోంది. ఏ స్త్రీ (చివరకు మా అమ్మమ్మ) దగ్గిరిగా కూచుని మాట్లాడని మా తాతగారు,ఆమె సరసన కూచుని మాట్లాడటం పరమ ఆశ్చర్యం అంటాడు.

పెద్దమ్మాయిగారి గురించి భర్తపోయాక చెబుతూ చలం-'ఆమె తన తండ్రి ఇల్లు చేరుకుంది. ఆమె రాగానే ఆమె పాతస్నేహితులందరూ ఆమె చుట్టూ చేరారు. ఈ లోపల పెద్ద అహోబలరావుగారు చచ్చిపోయారు. చిన్న అహోబలరావుగారు మెడిసిన్ చదవటానికి ఇంగ్లాండులో వున్నారు. ఇంతలో పెద్దమ్మాయిగారి తండ్రి చచ్చిపోయినారు. భర్త పిల్ల చచ్చిపోవడంతో పెద్దమ్మాయిగారికి జబ్బు చేసింది.

ఆమె బంధువుల మీద ఆధారపడక మిత్రులని అండచేసుకుని తెనాలి వచ్చింది.' సరిగ్గా అదే సమయంలో ఇంగ్లండ్ నుంచి తిరిగి వచ్చిన అహోబలరావుగారు యీమె యింటిని అద్దెకు తీసుకున్నారు. ఈమెకూడా ఆ యింట్లోనే వుండిపోయిం దిట. బందరు నుంచి ట్రాన్సఫర్ అయి ఏలూరు వెళ్ళాక కూడా చలాన్ని పిలి పించుకుని 'చిత్రాంగి' నాటకం బందర్లో వేయించారు. బందర్లో అహోబలరావు గారి ఇంటిలో చలం వున్నకాలం అతని భావిజీవితంపై పైకి కనపడని ప్రభావాన్ని చూపించింది. చలం తన యింటిని భవిష్యత్తులో అలా ఆశ్రమంలా, బాధితులకు ముఖ్యంగా స్త్రీలకు ఆశ్రయంగా, రక్షణకేంద్రంగా మలుచుకోవడానికి డాక్టర్‌గారిల్లు మంచి నమూనాగా వుపయోగపడింది.

## బందరు ముట్నూరితో

ముట్నూరి కృష్ణారావుగారు చలంతో మాట్లాడిన మొదటివి చివరవీ అయిన మాటలు (ఇంగ్లీషులో)—

ఓసారి ముట్నూరి (Famous) కృష్ణారావుగారు ధిక్కరించారు నన్ను. "Do you mean to say that any wife can leave her husband over night, leaving a chit under the pillow that she is quitting?"

"Of course I did not mean that She will go no leaving even that chit" అనే ఆయన నాతో జీవితంలో మాట్లాడిన firstand last words.

(ప్రసాద్‌కి ఉత్తరం 5-8-56)

## సుబ్రహ్మణ్యదేవర

సుబ్రహ్మణ్యదేవర జంగంకోటయ్యగారి కొడుకు. చిన్నమ్మాయిగారికి వీణ నేర్పించడానికి వచ్చేవారు కోటయ్యగారు. చాలా ప్రసిద్ధి కెక్కిన సంగీత విద్వాంసులు. వారు ఆమెకు రోజు నేర్పే 'సరోజ దళనేత్రి' కీర్తనతో చలానికి కోటయ్యగారి పరిచయం అయింది. కోటయ్యగారు చలాన్ని తన కొడుకు సుబ్రహ్మణ్యదేవర దగ్గరకు పంపించేవారు. ఆయన కొడుకు లిద్దరూ ఒకరు ఫ్లూట్, ఒకరు ఫిడేలు వాయిస్తారు. చిన్నప్పటి నుంచి వారు కచేరీలు చేస్తూవుండేవారు. అప్పుడు కోటయ్యగారికి జబ్బు. తన కొడుకులు తనకి విషం పెడుతున్నారనితిండి మానేసేవాడుట. సంగీతం ఆగిపోయి సుబ్రహ్మణ్యదేవర చలానికి స్నేహితుడయి

నాడు. ఎక్కడ బడితే అక్కడ యిద్దరూ తిరుగుతూ వుండేవారు. ఏ అరుగుమీదో ఎక్కడో పాఠాలు నేర్పుతో వుండేవాడు దేవర చలానికి. తను గొప్ప సంగీత విద్వాంసుడినని ఆయనకు స్ఫురణలేదు. సంగీత సారవంతా వాళ్ళ చర్చల్లో చలం గ్రహిస్తూనే వచ్చాడు. అన్ని కచ్చేరీలకి హాజరయ్యేవాడు. తన్నెవరూ గుర్తుపట్ట కుండా దేవర తలకి తువ్వాల చుట్టుకుని రూపం మార్చుకునేవాడు. దేవర అభి ప్రాయం ఆ కాలంలో సంగీతం అరవ సన్నాయి వాళ్ళలో మాత్రమే వుందనే వాడు. గొప్ప సన్నాయి మేళం ఏ పెళ్ళిళ్ళలో వచ్చినప్పుడు తెల్లార్లూ వాళ్ళతో కలిసి తిరిగి ఏం పాడుతున్నారో, ఎట్లా పాడుతున్నారో తెలుసుకుని చర్చిస్తూవుండే వారు. సుబ్రహ్మణ్యదేవర కచేరీల్లో వెనక అర్థంలేని ఎకస్ట్రాగా చలం కూర్చునే వాడు. ఓసారి ఓ నాయుళ్ళ యింట్లో సమర్త పేరంటానికి కచేరీ పెడితే చలం సుబ్రహ్మణ్యదేవరతో పాటు లోపలకి వెళ్ళి ఆయన వెనక దాగి కూర్చున్నాడు. వరండాలో వెలమదొరలు నాయుడు ప్రభువులు మీసాలు మెలేస్తూ కుర్చీలో కూచు న్నారు. లోపలంతా గొప్పింటి రకరకాల స్త్రీలు. చలం దేవర శిష్యుడిగా లోపలికి ప్రవేశించాడేగాని ఏం గొడవ జరుగుతుందో అనే జంకు చలానికి వుంది. ఆడ వాళ్ళలో తన నెవరూ గుర్తు పట్టలేరనుకున్నాడుగాని పెద్దమ్మాయిగారు, చిన్న మ్మాయిగారు చూశారు. చిన్నమ్మాయిగారు 'అదేం రాగమండీ వెంకట చలం గారూ' అని ఓ పెద్ద కేక పెట్టేసింది. ఆవిడ ఈ కచేరీలో ఏమేమి పాడాలో ఆజ్ఞా పిస్తున్నారు. ఎట్లాగో ఆ పేరంటం ఏ గొడవ లేకుండా జరిగింది. ఆయన మద్రా సులో మీర్జాపురం సినిమా కంపెనీ ఆర్కెస్ట్రాలో ఫిడేలు వాయించేవారు. ఆయనకి తాగుడు బాగా అలవాటు. చాలా బీదరికం అనుభవించాడు. తాగుడికి డబ్బులడిగే వాడు చలాన్ని. దేవరగారు ఆయన పిల్లలిద్దరూ కూడా చనిపోయారట. చలం విన్న గొప్ప ఫిడేలు వాయిద్యాల్లో ఎప్పటికీ దేవరగారిది గొప్ప వాయిద్యం అంటారు.

## దీక్షితులుగారితో

'హిందూమత ఖండనలో నేను miss అయిన సత్యాల వేపు నా దృష్టిని చల్లగా మరల్చాలని ప్రయత్నించేవారు దీక్షితులుగారు' అంటాడు చలం. 1920లో దీక్షితులూ చలం గుంటూరులో కలిశారు. జాతకాలు నిజమవునో కాదో వచ్చి చూడరాదా అని దీక్షితులు చలాన్ని దృష్టి మళ్ళించారు. వెళ్ళి చూడకపోవడం మూఢత్వమేనని చలం వెళ్ళాడు, శుకనాడి చూసేవాని దగ్గరికి. అక్కడ తన ఉభి

తాన్ని గురించి అనాడిలో చెప్పిన విషయాలు చలం కళ్ళు తెరిచాయి. అతి ప్రయత్నంచేసి కొన్నాళ్ళు ఆ శుకనాడి విషయాన్ని పరీక్షించి భవిష్యత్తును చెప్పగల శక్తి లోకంలో వుందని చలం విశ్వసించక తప్పలేదు. ఆ జాతకాలలో చలాన్ని శాంతులు వగైరా చెయ్యమని కూడా వుంది. తల నొప్పులు పోవటం ఆరోగ్యం కోసం చలం సూర్యనమస్కారాలు, ఆసనాలు కూడా వేస్తున్నాడు. 6-2-30న గుంటూరు నుంచి దీక్షితులుగారికి రాసిన ఉత్తరంలో—'ఆ ముసలాడు శుకుడు మాలతీబాయిగారి జాతకంలో రెండు శాంతులు విధించాడు. వారంలో అన్ని రోజులూ ఆశాంతుల అనుష్ఠానంతో నిండిపోయాయి. శుకుడి ఆసరాచూసుకుని నా నిరీశ్వర అహంభావాన్ని గాయపరచడం ఆమెకి సంతోషంగావున్నట్టుంది. ఇప్పుడు మాయింటి నిండా పవిత్రులైన బ్రాహ్మలు, భోజనానికి వచ్చినవాళ్ళు, దాహానికి వచ్చినవాళ్ళు. ముష్టికి వొచ్చినవాళ్ళు, శాంతులు.చేత చూడడానికి వొచ్చినవాళ్ళు, అపరయుధిష్టరుడు యీ పురంలో రాజసూయం తల పెట్టాడని, యీ మూలనించి ఆమూలకి, ఈ బ్రాహ్మడినించి ఆ బ్రాహ్మడికి, నా కీర్తి పాకిపోతోంది.

## ఆచారాల గొడవ

నా జీవితంలో యీ ఆచారాల గొడవ ప్రవేశపెట్టి, పిచ్చి అయ్యారు కలం గీతకి లొంగి మాయమైనారు మీరు 'అంటాడు చలం. ఈ సూర్య నమస్కారాల్లో పాపం చిన్నపిల్ల సౌరిస్‌నికూడా దించారు. బానల్లోనిలవ వుంచిన చన్నీళ్ళలో చలి కాలంలో తెల్లవారకట్ల మూడు గంటలకి లేచి తలారా స్నానాలుచేసి సూర్యనమస్కారాలు చేసేవారు. పాపం 'షౌ' గోలపెట్టేది. చలికి. శుకనాడి గురించి తన జాతకంలో చెప్పిన సంగతులను ప్రస్తావిస్తూ చలం—

## శుకనాడి జాతకం

'—వొచ్చి చూడమన్నారు వెళ్ళాను. అతనికేదో కొంచెం డబ్బు యివ్వాలి. డబ్బుయివ్వగానే నా జాతకం తాటాకులు తీశాడు. అద్భుతంగా నా జీవితమంతా దాంట్లో రాసివుంది. రాసి వున్నా నాకు సందేహాలు వొచ్చాయి. దాంట్లోనా శృంగార జీవితం గురించి లేనే లేదు. నేను పుస్తకాలు రాస్తానని లేదు. నేను చాలా డబ్బు సంపాయిస్తాననీ, బంగారపు నగలు చేయిస్తాననీ నా డబ్బును వడ్డీలకిచ్చి ఎక్కువ చేసుకుంటాననీ రాసివుంది. నాఉద్యోగం సంగతి లేనే లేదు. అంత డబ్బు సంపా

యించడమనేది నా జీవితంలో ఎన్నడూ జరగదని శుభ్రంగా తెలుసు. ఇతర్లకి అప్పిచ్చే డబ్బు నాకెన్నడూలేదు. ఏకష్టమన్నా పడతాగాని ఎప్పుడూ అప్పుఅడగను అడగలేదు.ఎవరికన్నా, ఏ చిన్న అప్పన్నా యిస్తే వడ్డీకి ఎన్నడూయివ్వను. అసలు యిచ్చింది తిరిగి యిమ్మని కూడా అడగను. నా జీవితంలో అది ఎన్నడూ జరగదని నా మీద నాకు నమ్మకం. బంగార మంటే పరమ అసహ్యం. ఎవరైనా బంగారం నగలు పెట్టుకుంటే వారిమీద మంచి అభిప్రాయం పోతుంది నాకు. నేను నగలు చేయిస్తానా? కాని నేను జాతకం తీసుకున్ననాటి వరకు జరిగిందంతా చాలా correct గా చెప్పాడు. నేను పూర్వజన్మలో చేసిన పాపాల వల్ల నాపిల్ల లెవరూ బతకరన్నారు. ఈ శాంతులనే వాటిలో నీకు నమ్మకం లేదు. ఇవి చెయ్యవు. నీ పిల్లలు బతకరు'అన్నాడు.

అంతకు ముందు రవి పెద్దకొడుకు చనిపోయాడు. పిల్లలు ఒక్కొ రొక్కరే చనిపోతారేమోనని చలానికి భయం పట్టుకుంది. ఈ వదిలేసిన పూజలు శాంతులు వీట్లన్నిటినీ ఎట్లా చెయ్యడం వాటిలో విశ్వాసం లేకుండా ననే ఆలోచన పట్టుకుంది, చివరికి వాళ్ళ జీవితం మీద తనకేమీ అధికారం లేదని నిర్ణయించుకుని అవన్నీ చేయదలుచుకున్నాడు చలం.

దీక్షితులుగారికి రాసిన 6-2-30 ఉత్తరం చివరలో 'మా హెడ్మాష్టారు కూతురు చచ్చిపోయింది. Assistant గోపాలాచారి కొడుకు చచ్చిపోయినాడు. నా సంగతి సరే. ఈ ఏడు మా బడికి పుత్రదోష జాతకంగా వుంది, మీరు వెళ్ళిపోవడం అదృష్టమే' అంటాడు. ఈ భయం చలాన్ని జాతకాలు శాంతులు పూజల వైపు తిప్పింది. (మార్క్సిస్టులు తిరపతి వెళ్ళడంలాగ)కొడుకు పోయిన విరక్తి చలాన్ని red hot నిరీశ్వరవాదిగా చేసినట్లే.

నరసారావుపేట నుంచి రాసిన 22-7-30 ఉత్తరంలో చలం దీక్షితులుగారికి రాస్తూ 'నా దని ఇచ్చిన శుకనాడి జాతకం నాది కాదని రూఢి అయింది. చూశారా నాభావి ఔన్నత్యం మారిపోయింది. ఏం చెయ్యమూ?' అంటున్నాడు.

నాడీ జాతకంలో చలంగారికి పిల్లలు బ్రతకరని రాసివుంది, శాంతులు చేయిస్తేతప్ప అని రాసివుంది నాడిలో, అందుకని చలంగారు సేతువుకి వెళ్ళి శాంతులు చేయించుకుని రావాలని నిశ్చయించుకున్నారు. చలంగారికి ఆ శాంతులు మీద విశ్వాసంలేదు. కానీ చివరికి పిల్లల జీవితం మీద తనకేమీ అధికారం లేదని, శాం

తులు చెయ్యదలుచుకున్నారు. ముఖ్యంగా అప్పట్లోనే షౌకి తీవ్రంగా తలనెప్పులు ఆరంభమైనాయి. దాంతో చలంగారు శాంతులు చేసి తీరాలని దృఢంగా నిశ్చయించు కున్నారు.

## యాత్రానందం

చిన్నతనంలోనే తన తల్లితండ్రులతో దక్షిణాది యాత్రలు చేసారు చలం గారు. అందువల్ల ముందుగానే పిల్లలందరికీ యాత్రల గురించి కథలుగా చెప్పేవారు చలంగారు. పిల్లలు యాత్రల కథలు వింటో కలలు కంటో కులాసాగా గంతులు వేసేవారు.

తొలిగా మధుర వెళ్లారు చలం కుటుంబీకులు. అక్కడ T. B. ఖాళీలేదు. వొయ్యి పేషెంట్ ఒకరిది అపూరే. మీనాక్షి దేవాలయం ముందే వాళ్ళ ఇల్లు. చలం గారి కుటుంబం అక్కడికి వెడుతోంటే మీనాక్షిదేవి ఊరేగింపు వాళ్ళకెదురయింది. తెల్లవారి చలంగారి కుటుంబం ధనుష్కోటికి బయలుదేరారు. అక్కడ T. B. లో మకాం చేశారు. రైలు T. B. గుమ్మం దగ్గరే ఆగేది. బంగాళా దగ్గర ఒక సముద్రం ఉండేది దాని పేరు రామరాజ్యం అది నదిలా ఎంతో ప్రశాంతంగా ప్రవహిం చేది. దగ్గిర దగ్గిర మైలు దూరంలో ఇంకో సముద్రం ఉండేది. దాని పేరు రావణ రాజ్యం. అది నిలువెత్తు అలలతో ఎంతో పెద్దగా హోరు పెట్టేది. దాని హోరు బంగళాదాకా అహర్నిశలూ వినబడేది. ఆ రెండు సముద్రాల కలయికే 'సేతువు', ఆ సేతువు దగ్గర చలంగారు తన పూర్వీకులకి తర్పణాలు వొదిలారు. సంతి, తాను దర్భాంగుళీయం పెట్టుకుని తర్పణాలు ఆయనతోపాటు వొదిలేవాడు.

నిశ్చలంగావున్న రామరాజ్యం బంగళా దగ్గరలోనే వున్నా షౌ చలంగారూ పిల్లలూ "రావణరాజ్యం"కి షికారుగా వెళ్ళి అక్కడే స్నానాలు చేసేవారు. ఈత లాడే వాళ్ళు షౌకి ఈతరాదు సంతి ఆ నిలువెత్తు అలల్లో తేలడం నేర్చుకున్నాడు తేలి వొడ్డుకి వొచ్చేవాడు కెరటాలతో బాటుగా సునాయాసంగా, ప్రతి విషయంలో సంతితో పోటీ పడేది షౌ. అలా పోటీపడకపోతే తానతని కళ్ళల్లో వుత్త ఆడ పిల్ల అయిపోతాననీ. అలా అయిపోతే అతను తనని అణగత్రొక్కేస్తాడనీ షౌకి తెలుసు. సంతిలా తానూ ప్రయత్నించింది-సముద్రంలో తేలి వొడ్డుకి రావడానికి. అక్కడ తరంగాలెంతో ఉధృతంగా వచ్చేవి. ఆ ప్రయత్నంలో షౌ మధ్యలో

మునిగి ముక్కుల్లో, కళ్ళల్లో, నోటిలో నీళ్ళుపోయి ఎగిసిపడే ఇసుకతో వొళ్ళంతా
దోక్కుపోయి వొడ్డుకి వొచ్చిపడింది.

అక్కడనించి చలంగారి కుటుంబమంతా రామేశ్వరం వెళ్ళారు. రామేశ్వరంలో ఆలయం ఎంతో అందమైనది. అక్కడ పెద్ద పొడుగాటి మండపం, ఆ మండపానికి ఒకవైపు అంతా కొలనులు చివరన గర్భగుడి వుంది. రోజూ సాయంత్రం ఆ గుళ్ళో ఎంతో శ్రావ్యంగా అందంగా సన్నాయి వాయించేవాళ్ళు. షౌ, చలంగారు, పిల్లలు సాయంత్రాలు ప్రసాదాలు తింటూ, సన్నాయి వింటూ గుడిలోనే గడిపేవాళ్ళు. ఆ తరువాత చలంగారు ఒక బ్రాహ్మడిని పిలిచి నాగప్రతిష్ఠకి ఏర్పాటు చేసుకున్నారు. ఆ రోజు అమ్మ. చలంగారు కొంగులు ముడి వేసుకుని ప్రతి తీర్థంలోనూ సరిగంగ స్నానాలు చేశారు. షౌ వాళ్ళు మా అమ్మకీ నాన్నకీ పెళ్ళి' అంటూ రోడ్డుమీద గంతులు వేసారు. పునీతం అయేందుకు మద్రాసు నుంచి అబ్బత్తకూడా వచ్చి వాళ్ళను కలుసుకుంది. ధనుష్కోటినించి మండపం అనేవూరు వెళ్ళారు. దాన్ని గురించి Railway guide లో చదివి అది ఎంతో మంచి 'sea resort' అని చలంగారు వర్ణించి చెప్పారు పిల్లలకి.అక్కడికి వెళ్ళేసరికి ఎవరూ లేరక్కడ Resort లేదు; ఏమీలేదు. ఏదో ఒకటి రెండు బంగళాలు సముద్రపు వొడ్డున వున్నాయి కానిజనం అసలు లేరు, షౌకి నిరాశతో ఏడుపోచ్చింది. 'resort' అంటే ఇదేనా?' అని. కాని మండపం నిజంగానే ఎంతో అందమైన ప్రదేశం. చలంగారు పిల్లలు అక్కడ వున్నన్నాళ్ళు రోజూ సముద్ర స్నానాలు చేసేవారు. ఎంతెంత అలలు వొస్తున్నా-ఏడాదిపిల్ల చిత్రని నీలమైన సముద్రజలాల్లో ముంచెత్తేవారట చలంగారు. అక్కడ పుదయాలు దోసెలు అమ్మకానికి వొచ్చేవి. అవెంత రుచిగా వుండేవో! అక్కడే చలంగారు వాళ్ళకి ఒక క్వారంటైన్ ఆఫీసర్ స్నేహం అయ్యాడు. ఆ క్వారంటైన్ ఆఫీసర్ ద్వారా కన్సెషన్ సంపాదించి సిలోన్ స్టీమర్ డెక్ ప్యాసింజర్సుగా టిక్కెట్లుకొని బయలుదేరారు. చలంగారు, కుటుంబం.అంత స్టీమరు ఎక్కారు అది సిలోను పొలిమేరలకి పోతుంది. మళ్ళీ మరునాడు వెనక్కి వచ్చేస్తుంది. చలంగారు వాళ్ళకి సముద్రం మీద అదే మొదలు స్టీమరు ఎక్కడం, అబ్బత్తకీ, వొయ్యికీ సీసిక్‌నెస్‌తో వాంతులు వచ్చాయి. అబ్బత్త నెత్తురు కక్కుకుంది. సాయంత్రం తలైమన్నార్ చేరేసరికి ప్రయాణీకులంతా దిగిపోయారు. చలంగారు వాళ్ళు స్టీమరు కెప్టెన్, సరంగులు మాత్రం మిగిలారు, స్టీమరు సరంగులు, కెప్టెన్ తాము వండుకున్నది చలంగారు వాళ్ళకి పెట్టారు. వంటి ఆ

Captain తో స్నేహం చేసుకున్నాడు. తెల్లారే సరికి కనుచూపు మేరలో కనవచ్చే సిలోన్ కొండల కొబ్బరి తోటల అనిర్వాచ్య సౌందర్యాన్ని చూస్తూ కూర్చున్నారు, చలంగారు షా. మళ్ళీ స్టీమరు బయలు దేరి ధను ష్కోటి చేరుకుంది. అక్కడినించి కుర్తాళం వెళ్ళారు చలం గారి కుటుంబం. అక్కడొక పోకతోటలో చిన్నచిన్న బంగళాలు వున్నాయి. అందులో ఒకదానిలో చలంగారు దిగారు. రోజూ కొండమీదికి వెళ్ళి కుర్తాళం జలపాతం సంగీతం వింటూ దానిలో స్నానాలు చేసేవారు. అది ఎంతో అందమైన ప్రదేశం. ఆ కొండ మీదనే చంపకాదేవి ఆలయం వుంది. ఆలయం మండపం చంపక పూలతోర ణాలతో అలంకరించి వుండేది. ఆలయం వెనుక జలపాతం. అది ఎంత అందమైన దేవాలయమో! ఆ అందాల్ని చూస్తూ పరవశించిపోయేది షా. ఆ అందమైన చోటు లోనే స్త్రీలందరికి ప్రత్యేకంగా ఒక విశ్వవిద్యాలయం నెలకొల్పాలని కలలుకనేది. ఆ విద్యాలయం స్త్రీలు పురుషుల మీద ఆధారపడక తమ కాళ్ళ మీద స్వతంత్రంగా నిలబడే ధైర్య సాహసాలిచ్చే శిక్షణ నివ్వాలనీ, ఒక బలీయమైన వ్యక్తిత్వంతో వాళ్ళు సంఘాన్ని ఎదిరించేలాగ చేయాలని షా ఆశయం. ఎన్నో వూహల్లో తేలి పోయేది ఆమె. ఆ విద్యాలయం ఆ కొండమీదనే పెట్టాలన్న తన ఆశయాన్ని చలంగారికి చెప్పింది.

ఒకరోజు షా వాళ్ళంతా కొండమీద Picnic చేసుకోవాలనుకున్నారు, మరు నాడు వంట సామానుతో పైకి వెళ్ళి కిచిడీ తయారు చెయ్యడం మొదలుపెట్టారు. అబ్బుత్త, అమ్మవాళ్ళంతా జలపాతంలో స్నానం చేశారు. అందరూ వొళ్ళుతుడుచు కుని బయటికి వచ్చినా షా ఇంకా అక్కడే నీళ్ళలో వుండిపోయింది. జలపాతానికి ఇవతల బల్లపరుపు నేల వుంది. ఆ బల్లపరుపు నేలమీద పిక్కలవరకూ వచ్చే నీళ్ళు- కానీ మధ్య మధ్య పెద్దపెద్ద సొరంగాలు ఏర్పడివున్నాయి. షా ఆ బల్ల పరుపు నేల మీద వున్న నీళ్ళలోనే ఆడుకుంటోంది.

షా పరధ్యానం సంతికి తెలుసుగనక ఒక గడకర్రతో సొరంగంలోతు చూపుతూ "జాగ్రత్త సుమా వీటిల్లో పడేవు" అని హెచ్చరించి చలంగారితో చేతో కలిసి కొండమీద ఆలయానికి వెళ్ళిపోయారు. అమ్మ, వొయ్యి, అబ్బుత్త చెట్టుకింద వంట చేస్తున్నారు. షా నీళ్ళలో పడి తానొక మొసలినని ఆ నీళ్ళలో తేలుతో ఆడుకుంటోంది. కొంతసేపటికి గట్టెక్కబోతూ దాని చుట్టూ వున్న పాచి పలన కాలు జారి ఒక సొరంగంలోకి జారిపోయింది, జారిపోతూ చేతులు పైకెత్తి

"మునిగిపోతున్నాను" అని అరిచింది. లోపల వచ్చు నీళ్ళలోకి వెళ్ళి పోతోంది షౌ. ఆమె శ్వాస దానంతట అదే ఆగిపోయింది అప్రయత్నంగా. ఆ ఆకుపచ్చని చల్లని నీళ్ళలో లోతుకి పోతోంటే- మృత్యువింత సుందరమైనదా- మృత్యువింత ఆనందమైనదా?- అనిపించిందామెకు. ఈ లోగా వొయ్యి 'సిరికిన్ చెప్పడు' అన్నట్లుగా ముతక ఖద్దరు చీరతో రిష్టువాచీ బెల్టుతో షౌని రక్షించేందుకు చెయ్యందివ్వబోయి తనూ జారి ఆ సొరంగంలో పడిపోయింది. అదృష్టవశాత్తు సొరంగం వెడల్పు చాలా తక్కువ అవడంచేత, వొయ్యి చాలా లావు అవడంవల్ల ఇద్దరూ ఆ సొరంగంలో పట్టలేదు. ఒకళ్ళు మునిగితే ఇంకోళ్ళు తేలడం జరిగింది. ఇంతలో ఇద్దరు తురక కుర్రాళ్ళు బట్టలుతుకుతూ-షౌ వాళ్ళను చూచి ఒక తువ్వాలు వేశారు. షౌ దాన్ని పట్టుకుని చెక్కు చెదర కుండా బైటికి వొచ్చేసింది. వొయ్యికి కూడా ఆ తురక పిల్లలు తువ్వాలు వేసినప్పుడు ఎల్లా వొచ్చిందో వొడ్డుకి వచ్చిపడింది. స్పృహ లేకుండా నీళ్ళు తాగేసి- పొట్ట వుబ్బి పోయి, అప్పుడు అమ్మ first-aid ఇచ్చేసరికి ఆమెకి తెలివి వొచ్చింది. షౌకి అప్పుడు తెలిసింది మునిగేవాడికి ఏ ఆధారం దొరికినా పట్టుకుని వెలికి వచ్చేస్తాడని. అసలా పట్టు దొరకాలేగాని ఈ భవ సాగరాన మునిగిన వాళ్ళకైనా అంతే- ఇసుమంత ఈశ్వర విశ్వాస ముందో అభయహస్తం చిటికినవేలు అందినాసరే అవతల పడిపోతారు. విచిత్రమేమిటంటే వొయ్యి 2,3 నిమిషాలలోనే అంతగా నీటిని మింగేసింది. అలసిపోయింది. కాని షౌ నీటమునిగి 10 నిమిషాలున్నా చెక్కు చెదరలేదు.

షౌ, వొయ్యిల మునగడం సాహసకృత్యాన్ని కొండమీంచి వచ్చిన చలంగారికి చెప్పారు అమ్మవాళ్ళు. అక్కడ ఒక్కక్షణం వుండబుద్ధికాక ఆదరాబాదరాగా తినేసి ఎన్నాళ్ళో ఆ వూళ్ళో వుండాలనుకునే వాళ్ళు కాస్తా ప్రయాణం అయి త్రివేంద్రం వెళ్ళిపోయారు చలం కుటుంబం. అబ్బాత్త మద్రాసు వెళ్ళిపోయింది.

చలంగారు వాళ్ళు రాత్రికి రాత్రి ప్రయాణం అయ్యారు. తెల్లవారేసరికి వెస్టర్న్ ఘాట్స్‌లోంచి రైలు పోతోంది. ఆ సౌందర్యం మాటల్లో ఇమడ్చలేనిది. క్రింది పెద్ద లోయలు రైల్వేటన్నెల్స్ ఎంత గొప్ప దృశ్యాలో ఎంత గొప్ప అందాలో, ఆ పడమటి కనుమలు. ఆ ఘాట్స్ నానుకుని పోవలూరు అనే చిన్న వూరు వుంది. ఆ వూరి అందాన్ని రైలులోంచి చూచి అక్కడ దిగారు చలంగారి కుటుంబం. వాళ్ళు ఘాట్స్‌ని ఆనుకునివున్న ఒక బంగళాలో దిగారు. అక్కడ పక్కనే ఒక ఏరు వుంది. తెల్లవారుతో వుండగానే పనివాళ్ళు వించి వండుమునలి

వాళ్ళ దాకా- మళయాళీలు ఆ యేటికి స్నానాలకి వచ్చే వాళ్ళు. స్త్రీలకి ఎంత నిడు పైన వెంట్రుకలు-నీలాలకల అలకలా యేట అల్లల్లాడి ఆ యేరొక వేణీ సంగ మమా అన్న భ్రాంతిని కల్పించేవి. మలయాళ వనితలెంత బావుండేవారో? కురూపం అన్నదెక్కడా అక్కడ కనిపించేది కాదు స్త్రీలు కదలి వస్తోంటే-ఎంత విలాసమో! ఎంత సొగసో వారి కదలికల్లో! వాళ్ళ ముఖాల్లో ఎంత గ్రేసో! ఆ వూరు వాళ్ళ ఇళ్ళు ఎంత శుభ్రంగా వుండేవో!

అక్కడ నించి త్రివేండ్రం వెళ్ళి అక్కడ ఒక హోటల్లో దిగారు. షౌకి మొదట్నించీ మహానగరాలంటే ఇష్టం లేదు. ఆమె ఇష్టపడిన నగరమల్లా హైదరాబాదు- త్రివేండ్రమే. త్రివేండ్రం చాలా అందమయింది. city busలో ఆ మూల నించి ఈ మూలదాకా తిరిగేవాళ్ళు, అదే పనిగా చలంగారు పిల్లలు. ఆ వూళ్ళో అనంత పద్మనాభస్వామి ఆలయం వుంది. ఆ ఆలయానికి అమ్మ వొయ్యి మాత్రం వెళ్ళారు. మొగవాళ్ళు ఆ ఆలయంలోకి చొక్కాలు లేకుండా వెళ్ళాలని ఒక నియమం వుంది. అందుకని నాన్న పోలేదు. ఆయనతోబాటు పిల్లలూ మాను కున్నారు. అక్కడ నించి కన్యాకుమారి వెళ్ళారు- ఒక Taxi లో, అది సరాసరి కన్యాకుమారి ఆలయం దగ్గర ఆగింది సంతి అక్కడ దిగగానే "నేను భారత దేశం కొసన నిల్చున్నాను అన్నాడు గర్వంగా. ఆలయం సముద్రం కొసని కట్టి నట్లుంది ఎంత అందమైన దేవాలయమో? అది! చలంగారు కుటుంబం అక్కడ మహారాజా Guest House లో దిగారు. దాని హాలు కొండరాళ్ళల్లోంచి సముద్రం లోకి Project అయి వుంటుంది. నాలుగు వైపుల కిటికీలు, సముద్రం చూస్తూ కూర్చునేందుకు చుట్టూతా సీట్లు.

## పిల్లలకే ప్రాధాన్యత

పిల్లలకి ఇంగ్లీషు భోజనం ఏర్పాటు చేయించి తమకి బ్రాహ్మణ భోజనం తెప్పించుకునేవారు చలంగారు. అలాగే త్రివేండ్రంలో ఒక హోటల్‌కి తీసుకువెళ్ళి కేక్‌లాంటి అయిస్‌క్రీం పెట్టించారు పిల్లలకి పిల్లల ఆనందం కోసం ఎంత తాప త్రయం పడేవారో చలంగారు. తాము IIIrd classలో ఎక్కి పిల్లల్ని Ist classలో ఎక్కించి వాళ్ళకి ఆసుఖానుభవం, ఒంటరిగా ప్రయాణం చేసే ధైర్యాని కల్పింప జూచేవారు. ఏ అందమైనా, ఏ ఆనందమైనా పిల్లలకే, పిల్లల తరవాతే తమకి-ఏదైనా,

ఏ విషయంలోనైనా ప్రాధాన్యత వాళ్ళదే. వాళ్ళ ఆనందమే తన ఆనందం చలం గారికి. పిల్లలు అడిగేవాళ్ళు "నాన్నా నువ్వెందుకు మాతో తినవు? అన్నీ మాకే ఇస్తావేం? అని. అప్పుడు చలంగారు "మీరు పిల్లలు. మీరే అనుభవించాలి, మేము అన్ని సుఖాలు ఇదివరకే అనుభవించేశాం కదా షౌ" అనేవారు. ఇదంతా నిజమే అనుకునేది షౌ. కాని చలంగారు, అమ్మ స్వతహా భాగ్యవంతులైనా వాళ్ళ నోటి దగ్గరదాకా పండు, ఫలం అంటూ వచ్చేవి కావని యౌవనంలో తిండికి కష్టపడ్డా రనీ, సంపాదన వచ్చి ఏదన్నా Effort చేయగలిగిన వయసులో తామంతా బయల్దే రామనీ షౌకి తెలియదు. అయినా చలంగారి స్వభావం అంతే, పిల్లలకే ప్రాధాన్యత.

దేవి కన్యాకుమారి ఆలయం ఎత్తుమీద వుంది. ఆలయసోపాన పాదాల్ని అభిషేకిస్తూ సముద్ర, ఒడ్డునించి మెట్లెక్కి ఆలయం చేరారు. షౌ వాళ్ళు. పై మెట్టు ఎక్కిందో లేదో అకారణంగా మెట్లమీంచి దొర్లిపోయింది వేగంగా షౌ. ఎవరూ ఇంకేం చెయ్యలేక-చూస్తూ ఊరుకుండి పోయారు. దొర్లి, దొర్లి చివరమెట్టున నిలిచింది. చలంగారు వచ్చి పైకి తీసుకు వెళ్ళారు షౌని.ఇంకో మెట్టుదొర్లితే సముద్రంలో మునిగిపోయేది షౌ.

ఆ ప్రాంతంలో దేవిమీద ఒక కథ వుంది. ఫలానా ముహూర్తాన వివాహం చేసుకునేందుకు కన్యాకుమారిని వస్తానని ఈశ్వరుడు కన్యాకుమారికి వాగ్దానం చేశారు. ఆ సమయానికి ఆవిడ నూతన వధువుగా అలంకరించుకుంది. ఈశ్వరుడి రాక కోసం ఎదురు తెన్నులు చూడసాగింది. ఎంతకీ ఈశ్వరుడు రాలేదు. శివుడు లేని సింగార మెందుకని పసుపు కుంకాల్నీ తలంబ్రాలనీ-సమస్త అలంకారాల్నీ సముద్రంలో పారవేసి తానూ సముద్రంలో దూకింది. ఆమె సాగరంలో లీనమైన తావునే ఆలయం వెలిసింది అందువల్లనే అక్కడి ఇసుక పసుపు పచ్చని రంగులో కొన్నిచోట్ల కుంకుమలాగ మరికొన్నిచోట్ల తలంబ్రాలలాగ గుండ్రంగా తెల్లగా, వుంటుంది. వీటిని చెరిగి వేరుచేసి అక్కడివాళ్ళు అమ్ముతారు అస్తమాన సంధ్య లలో, ప్రత్యూష వేళలో సముద్రమంతా కుంకుమపొడి జల్లినట్లుంది. మంకెనపూ లని పూజ చేసినట్లూ పగడాలు వారుబోసినట్లూ రక్తాభిషేకం చేసినట్లు-అరుణకాంతి అంతటా నిండి వుంటుంది.

శివుని వియోగంవల్ల కన్యాకుమారికాదేవి కళ్ళల్లో జాలువారే కన్నీరే, నెత్తు రుగా మారి సముద్రంలో కలిసిపోస్తోందా అనిపిస్తుంది షౌకి. వౌయ్యి ఆరోగ్యం బాగాలేక అంతా బెజవాడ వచ్చేసారు.

సొగసి మునిఁగే పడవ, ఎగసి యాడె పడవ—

..................................

రేపువై, నిలుచు చుక్కానివై, చుక్కవై,
భావి కాలానుకూలానంద వాయువై
పడవ నడుపుము కర్ణధారీ!

## సంసార సాగరాన—

### జంపరు

గుంటూరులో వుండగా చలం ఓ సారి గవర్నరు వచ్చినపుడు ఉపాధ్యాయులంతా మంచి డ్రస్సులు వేసుకు వెళితే, చలం స్త్రీలు ధరించే 'జంపర్' వేసుకు వెళ్ళి డిపార్ట్‌మెంట్‌లోని పై ఉద్యోగస్థుల ఆగ్రహానికి గురయాడు. వెంటనే బదిలీ చేసి నరసరావుపేటకు వేశారు (1930). తిరిగి నరసరావుపేట నుంచి బెజవాడకు మార్పించినప్పుడు చలం భార్య గట్టి ప్రయత్నాలు జరిపి చలాన్ని అధికారులు విధించిన కొన్ని షరతులకు వొప్పించింది.

ఈ విషయాల్ని గురించి చలం దీక్షితులుగారికి రాసిన ఉత్తరంలో—

మాలతీబాయి (చలం భార్య) నా తరపున ఆఫీసులో ఈ వాగ్దత్తాలు చేసి వొచ్చారు నాకీ పని తెప్పించేందుకు.

1. సరైన సూట్సు వేసుకుంటాననీ,

2. ఎక్కువగా నవ్వననీ,

3. అరవై ఏళ్ళవాడికి మల్లే నడుస్తాననీ,

4. నా కింది టీచర్లని జవాన్లనీ రోజూ చివాట్లు క్రమంగా వేస్తో వుంటాననీ.

5. జీవితంలో బాధల్ని గురించి నా గతి సంగతీ రోజుకు మూడుసార్లు కనపడ్డ వారితో ఏడుస్తాననీ—

(బెజవాడ నుంచి 12-1-31 ఉత్తరం)

చలం ఉద్యోగం గొడవల్లో పడినప్పుడల్లా ఆయన భార్య, ఆయన్ని కేక లేసి వెళ్ళి అధికారులతో మాట్లాడి సర్ది వచ్చేది, వచ్చి చలాన్ని తిట్టి సరిగా వుండ మని కేకలేసేది. చలం తన భార్య తన తరఫున వాదించడాన్ని పై ఉత్తరంలో దీక్షితులుగారికి రిఫర్ చేస్తూ ఆమె మాటల్ని యిలా ఉటంకిస్తున్నారు—

"ఈ హెడ్మాష్టర్లకి ఈర్ష్య అందుకని ఈయనమీద పైకి వ్రాస్తారు. ఈయన సంగతి వాళ్ళకి ఎక్కువ తెలుసా, నాకు ఎక్కువ తెలుసా ? ఎవరికి బాగా తెలుసు నా కన్న ? ఎంత మ చివారు" అన్నారట ఆవిడ.

సంఘంలో చలామణి కాని వారిని ప్రిన్సిపాల్ నాయుడుగారు చేరదీసి జాగ్రత్తగా చూసేవారు. శంకర్‌సింగ్ అటు వంటి అబ్బాయి. అతన్ని Lame duck అనేవారు. కాని పరీక్షలు బాగా ప్యాసయేవాడు. చలం బ్రహ్మసమాజంలో చాలా యాక్టివ్‌గా పాల్గొనే కాలంలో శంకర్‌సింగ్ అనాథశరణాలయం సూపరింటెండెంటు వి.పి. రాజుగారి కుమార్తె కన్నమ్మను పెళ్ళి చేసుకుందుకు వచ్చి ఏమీ ఎరగనట్టు నటించాడు చలానికి కనిపించి ప్రకరిస్తే. అతను అన్నాళ్ళూ పెళ్ళయాక నాయుడి గారింట్లోనే వున్నాడు. శంకర్‌సింగ్ చలం రాజమండ్రిలో పనిచేశారు. అప్పుడు యిద్దరూ దగ్గరయారు. తరువాత అతను మద్రాసులో కనిపించాడు చలం ట్రాన్స్ఫర్ కోసం వెళ్ళినపుడు. శంకర్‌సింగ్ చెప్పగానే గుమాస్తా అతని మాటమీద ట్రాన్స్ఫర్ చేశాడు. పైగా మద్రాస్‌లో పీళ్ళతో ఏం పని వచ్చినా ముందర నా దగ్గిరకిరా' అని చలానికి హామీ యిచ్చాడు. అతని infuelnce కి కారణం అతను ప్రెసిడెన్సీ కాలేజీలో జూఆలజీ ప్రొఫెసరట తరవాత ఏ ఆఫీసులతో పని వచ్చినా ఏ రిపోర్ట్ చలంమీద వెళ్ళినా శంకర్‌సింగ్ దగ్గరకి వెళ్తే చలానికి పని అయిపోయేది. అతను చనిపోయాక కూడా చలంమీద ఏ రిపోర్టు వెళ్ళినా అధికారులు చర్య తీసుకునేవారు కాదు.

# ఏలూరులో చలం

చలం ఏలూరులో వున్నప్పుడు చుట్టూ కొంత మంది admirers పోగైనారు. ఆ admirersలో ఒకతను బెజవాడ రావడం మొదలు పెట్టారు. అతను చలంగారి పుస్తకాలమీద ఎంతో శ్రద్ధ తీసుకునేవాడు-చలంకన్నా షౌ చాలా గొప్ప రచయిత్రి అని కొనియాడేవాడు-అతనంటే చలానికి చాలా ఇష్టం-జన్యూయిన్‌గా ఎంతో అభిమానం-అతను చాలా చదివిన ఇంటిలిజెంట్ మేన్-గొప్ప అభిరుచులు వున్నవాడు.

ఆ రోజుల్లో షౌ వాళ్ళ ఇల్లొకద్వీపం- వాళ్ళకి పరిచయస్తులేకాని దగ్గర స్నేహితులనే వాళ్ళు లేరు. ఇక శాస్త్రి. అతని అభిరుచులూ ఇంటెలిజెన్స్ చూచేసరికి షౌ వాళ్ళ కెంతో సంతోషం వేసింది-కళాశక్తి,గొప్ప అభిరుచివున్న ఉత్తములెవరన్నా తమ ఇంటికి వస్తే షౌ వాళ్ళు ఎంతగానో ఆనందించేవారు.

అతను చలంగారు వూళ్ళో లేకపోయినా వచ్చేవాడు. ఒకరోజు షౌని "నేను చాలా ఒంటరివాడిని-నాకు స్నేహితులు లేరు-నేను మీ ఇంటికి రావచ్చా" అని అనుమతి కోరాడు. అతని ఒంటరితనం చూచి జాలితో అనుమతించింది షౌ. రాను రాను అమ్మకి అతను ఇష్టుడై, ఇంట్లో ఒక మనిషిగా మసిలేవాడు. చలంగారికి P.A గా పనిచేసే వాడు. రచనలకి శుద్ధప్రతులు వ్రాయడం, వుత్తరాలు రాసి పెట్టడం అన్నీ చేసేవాడు.

అతను చలంగారు లేకపోయినా షౌతో ఎన్నో పుస్తకాలమీద, ఎందరో కవులమీద మాట్లాడుతూ వుండేవాడు. వారిది Intelectual friendship. వారు భగవాన్ గురించే ఎక్కువగా చర్చించేవాళ్ళు. భగవాన్ గురించి షౌ ఎంతగా చెప్పినా కన్విన్స్ అయేవాడు కాదతను. 'చే' కూడా 'షౌ'తో వచ్చి కూర్చొనేది. 'షౌ', 'చే' ఏదన్నా సినిమాకి వెడితే అక్కడ కనిపించేవాడు అతను వాళ్ళకి. 'వొయ్యి'కి అతన్ని చూస్తే గిట్టేదికాదు.

'సంతి'కి శాస్త్రి అంటే చాలా కోపం చలంగారు ఏలూరు వెడుతుంటే షౌ. సంతి, చే, రంగా, శాస్త్రిగారు కూడా బయలు దేరారు. నిజానికి వొయ్యికి, అమ్మకి. షౌ వాళ్ళకి యిలా నాన్నతో ప్రయాణం అవటం యిష్టంలేదు. కానీ వూరుకున్నారు.

చలంగారు ఏలూరులో మైదానం దగ్గర ఒక చిన్న యింట్లో వున్నారు. ఆయన ఆరాధకులందరికీ ఆయన పిల్లల్ని చూడాలని కుతూహలం. వాళ్ళంతా

వచ్చేవారు. షౌ వాళ్ళంతా కలసి ఇంట్లో పనులు పంచుకుని చాలా హాయిగా గడి పారు అక్కడ వున్నన్ని రోజులు

భగవాన్ గురించి షౌతో మాట్లాడటానికి చలంగారి వాళ్ళ head master వచ్చారు. ఆయన ఘాటైన కస్తూరి అత్తరు పులుము కొచ్చారు. షౌ చాలా sensi-tive. ఘాటైన పరిమళాలు అవీ భరించలేదు. ఆ వాసనకి మత్తువచ్చి పడిపోయింది. పాపం ఆయన నిరాశతో వెళ్ళిపోయారు.

ఆయన చలంగారితో శాస్త్రిగారి గురించి ఒంటరిగా వున్నప్పుడు చెప్పారు. "ఈ దుర్మార్గుడిని మీ ఇంట్లో అట్లా వదిలేశారేమిటి?" అని అడిగారు. ఏం దుర్మార్గం చేస్తాడా అని షౌ వాళ్ళకి ఆశ్చర్యం. అతనికి పెళ్ళయినట్టుగా కూడా అప్పుడే తెలిసింది.

సరదాగా అలా ఏలూరులో కొన్నాళ్ళు గడిపి షౌ వాళ్ళంతా బెజవాడ వచ్చే శారు. శాస్త్రిని గురించి అమ్మకూడా అలజడి పడసాగింది-ఒకరోజు అమ్మ షౌని పిలిచి "చూడు షౌ అతను నీకూ, చేకి మధ్యన ఆటలాడుతున్నాడు- నీ Diary చదువుతున్నాడు. నీకేమన్నా తెలుస్తోందా?" అని అడిగింది. "అతను ఏం అడితే నాకేం? నన్నేమీ effect చెయ్యవు-అతనితో నాది ఉత్తస్నేహం- ఇంకో ఉద్దేశ్యం లేని నాకేం పడుతుంది? నా Diaryలో రహస్యాలంటూ ఏవీలేవు. చదువుకోనీ. నాకేం?" అంది షౌ.

అప్పటి నుండి 'చే' అంటే షౌకి ఎంతో జాలి. ఆమె చిన్నపిల్ల అని. శాస్త్రి తన admirer కనుక అతనిమీద జాలే. చే, షౌ కోసం జాలిపడేది, షౌ ఏమై పోతుందో అని. ఎందువల్ల నంటే చేకి తెలిసినట్లు షౌకి ప్రపంచ విషయాలు తెలి సేవి కావు. అమ్మ చేని ఏ మడిగినా చే ఏమి మాట్లాడేది కాదు.

అమ్మ, వొయ్యిల వత్తిడివల్ల చలంగారు షౌని serious talkకి పిలిచారు. "చూడు షౌ, అతనికి పెళ్ళయిందని నీకు తెలుసా?" "అయితే ఏం నాన్నా! స్నేహానికేం అభ్యంతరం?" "కాదు షౌ పాపం అతనా విధంగా అయిపోతే అతని భార్య ఎంత బాధ పడుతుందో" అని నాన్న అనే సరికి, షౌకి తెలిసింది వాళ్ళేమనుకుంటున్నారో.

"మీరేం భయ పడకండి! నేనేం అతన్ని ప్రేమించడంలేదు. ఇది వుత్త స్నేహం మట్టుకే!" అని స్పష్టంగా చెప్పింది. దాంతో షౌ విషయం ఎంతో నిశ్చింత అయిపోయింది అమ్మవాళ్ళకి.

అమ్మ అతనితో మాట్లాడింది. "పిల్లల మధ్యన ఎందుకు యిట్లా ఆడుతున్నావు?" అని. దానికి అతను "షా ఏమనుకుంటోంది" అని అడిగాడు. "షా ఏమీ అనుకోడంలేదు" అని అమ్మ అనే సరికి "నేను చేని ప్రేమిస్తున్నాను" అని తెలిపాడతను.

అతనిమీద అమ్మకి అమితంగా సానుభూతి వచ్చింది. ఆమెకి అతనంటే ఎంత ఇష్టమో చెప్పలేము ఇంక షాతో నువ్వు మాట్లాడవద్దని అతనికి చెప్పింది. ఇది షాకి తెలియదు.

మర్నాటినించి షాతో మాటలు మానేశాడతను. అంత స్నేహంగా వుండి అలా ignore చేస్తే ఎవరికయినా చాలా బాధ. ఎదుటివాళ్ళు ఎందుకలా ప్రవర్తిస్తున్నారో అర్థంకాక, షా అతనిలో కారణం తెలియని మార్పుకి ఎంతగానో బాధ పడింది. ఎందుకంటే మా యింట్లో అతనికి చోటిచ్చింది, యింతదాకా సానుభూతి చూపిందీ తనే. అతను హఠాత్తుగా నిష్కారణంగా, మైత్రిని వదులుకున్నాడనేసరికి బాధతో ఆమె మనసు విరిగిపోయింది. ఎందుకు కలగాలి తనకీ బాధ? తనకేం కావాలి? అతని స్నేహమా? ఏమిటి? అని తనలో తను తర్కించుకున్నది. ఎవరినైనా తనని ఒకరు ఆరాధిస్తూ, తనని ఉన్నతంగా భావిస్తూంటే ఎంత wonderfulగా వుంటుందో! ఆ ఆరాధన హఠాత్తుగా, అకారణంగా మటుమాయమైనప్పుడు దెబ్బతిన్న అహం బాధ పడుతుంది అన్న తాత్విక సత్యం ఆమె ఆలోచనకి అంది రావడంతో హృదయం తేలికపడి పోయింది. ఆ తర్వాత అతను వచ్చినా రాకున్నా షాకి ఏమీ పట్టేది కాదు.

అతను వచ్చినా చే ఏమీ మాట్లాడేదికాదు. ఆమె మనస్సు ఎవ్వరికీ తెలియదు. ఇలా కొన్ని నెలలు జరిగిపోయాయి. షాకి చిన్నప్పటి నుంచీ చే అంటే చాలా ముద్దు, ఎంతో ప్రేమ. ఆ అమ్మాయిలో ఎంత అందమో! ఎంత charm వో! తన అంతరాంతరాల్లో ఎవరి మీదైనా తనకి ప్రేమాభిమానాలు వున్నా వాటిని బయటికి ప్రదర్శించడం షాకి తెలియదు. చే అట్లాకాదు. గంతులు వేస్తో, నవ్వుతూ అందరినీ కావలించుకుంటూ ఎంతో హడావిడిగా వుండేది. ఇద్దరిలో తేడా చూసి నాన్న షాకి North pole అని, చేకి South poleఅనీ పేర్లు పెట్టారు. ఆఅమ్మాయి తనమీద ప్రేమ చూపితే అది పై....పై సంగతే అనుకునేది షా.

ఒకరోజు షా, చే మనసులు విప్పి మాట్లాడుకున్నారు. వాళ్ళిద్దరికీ ఒకరి మీద ఒకరికి ప్రేమని తెలుసుకున్నారు. అప్పుడు తెలిసింది షాకి, చే దృష్టిలో

శాస్త్రి తన charm లో పడ్డ మొదటి యువకుడని తప్ప, చేకి అతని యెడల యింకే అభిప్రాయం లేదని.

ఆ రోజు నుంచి షౌ, చే ఎంతో దగ్గరయ్యారు. ఆ తర్వాత శాస్త్రి చాలా రోజులు వచ్చేవాడు. చేని పెండ్లి చేసుకుంటానని కూచ్చునేవాడు. అతని జిడ్డుతనం చూచి అందరికీ పెద్ద ఏహ్యభావం పుట్టుకొచ్చింది. చివరికి 'చే'నే వెళ్ళి అతనితో మాట్లాడమన్నారు. చే పెండ్లి, గిండ్లి లాంటి పిచ్చి.... పిచ్చి ఆలోచనలు పెట్టుకో వద్దని అతనికి స్పష్టంగా చెప్పేసింది. తనకు అతనిమీద ప్రేమలేదని.

ఇంక షౌ వాళ్ళంతా షికారు వెళ్ళాక అమ్మని చూడ్డానికి వచ్చేవాడు. అమ్మ ద్వారా అ పెండ్లికి ఒప్పించాలని అతని తాపత్రయం.

చే కాలేజీలో చేరింది. చేరినప్పుడు ఒకసారి ఆమె ప్రయాణం చేస్తున్న రైలు పెట్టెలో హఠాత్తుగా చొరబడ్డాడట శాస్త్రి. ఆ సంగతి తెలిసి చలంగారు అతన్ని యింటికి యిక రావద్దు అన్నారు. దాంతో అతను చలంమీద పెద్ద ద్వేషంతో విషం కక్కడం ఆరంభించాడు. చలం లోకానికి ఆదర్శాలు చెబుతారనీ, తన కుటుంబాన్ని మాత్రం జాగ్రత్తగా చూచుకుంటారని ప్రచారం చేశాడు. వెళ్ళి పిన్నిని శరణు జొచ్చాడు. చే మీద గీతాలు పద్యాలు వ్రాసి పత్రికలో వేసేవాడు.

ఆ తర్వాత తెలిసింది ఎలాగో ఒకలాగు చలం అల్లుడు అనిపించుకోవాలని ఆ శాస్త్రి తాపత్రయమని. దాంతో షౌకి మనుషులంటేనే ఒకరకమైన disillusionment పుట్టుకు వచ్చింది. ఇతని వల్ల ఎదుగుతున్న షౌ, చే లకు గొప్ప పాఠం నేర్చుకున్నారు. ఈ శాస్త్రి ప్రముఖ పత్రికా సంపాదకుడు గోరాశాస్త్రి.

## కార్తీక సోమవారం

ఒకమాటు చలం ఆత్మారాం యింటికి వెళ్ళినప్పుడు 'నాకు పదింటికే భోజనం కావాలని' అన్నాడు. ఆ రోజు వాళ్ళింట్లో మడి—కార్తీక సోమవారం. 'ఇవ్వాళ కార్తీక సోమవారం పదింటికే ఎట్లా భోజనం?' అంటూ వెళ్ళారు లోపలికి (చలానికి హరిమీద గిరి పడ్డా గిరిమీద హరి పడ్డా పదింటికి భోజనం అయిపోవాలి. ఈ నియమాన్ని జీవితం అంతా తప్పకుండా పాటించాడు). ఆత్మారాం బయటికివచ్చి 'నువ్వు వెంటనే భోజనం చేస్తావా?' అన్నాడు. 'మా అమ్మ కార్తీక బ్రాహ్మణ్ణి పెట్టుకుంటుంది. నువ్వా బ్రాహ్మడి కింద వస్తావా?' అన్నాడు. నన్ను బ్రాహ్మ

దంటున్నాడిన్ని ఏళ్ళకి మొట్టమొదట వళ్ళు మండినా తరవాత జోక్ చేశాడు చలం– 'ఏం? ఇంక యీ వూళ్ళో బ్రాహ్మణులు లేరా?' అన్నాడు. 'అట్లా కాదు వెంకట చలం? నీకు తెలీదు యీ సంగతి. కొంచెం జాగ్రత్తగా చూసేవాళ్ళకి నువ్వే బ్రాహ్మడివి' అన్నాడు. 'సరేలే ఏం చెయ్యను. కార్తీక బ్రాహ్మడిగా వుండటానికి నేనీ బట్టలు కూడా మార్చుకోను' అన్నాడు చలం. 'నువ్వేం చెయ్యక్కర్లా. చేసే దంతా మా అమ్మ చేసుకుంటుంది' అన్నాడు ఆత్మారాం. విచిత్ర మేవిటంటే చిన్న ప్పటి నుంచి ఆత్మారాంని బంధువుల మాట వినకుండా పాడుచేస్తున్నాడని చలం గురించి ప్రచారం వింటున్న వాళ్ళమ్మ చలాన్నెంతో ఆదరించింది.

చలానికి కన్నడ, శహనా అలాటి రాగాలన్నీ నేర్పింది క్లాస్‌మేట్ పట్టాభి రామయ్య– బాగా పాడేవాడు. చలం భాగ్యవంతుల బిడ్డ– పట్టాభి రామయ్య చలం యింటికి కూడ వెళ్ళేవీలులేసంత బీదవాడు అతనుక్లాసులో టాలెంటెడ్ బోయ్. "షి స్టూప్స్‌టు కాంకర్" అని చలం వాళ్ళు వేసిన నాటకంలో అతను హీరో, అతనికి బట్లర్ చలం. తెనాలి నివాసం తరువాత జీవితాలు చీలి పోయినాయి. చలం బ్రహ్మ సమాజపు ఉద్రేకంతో హిందువు లందర్నీ తిట్టి, యిచ్చిన ఉపన్యాసాలు అతనికి జ్ఞాపకమే. చలం స్నేహితులు అప్పట్నించీ చలానికి దూరంగా వుండడం మంచి దనుకున్నారు. (చలం మే 1979లో పోతే ఈ పట్టాభి రామయ్యగారు సరిగ్గా నెల తిరక్కుండా జూన్‌లోనే విజయవాడలో పోయారు).

## కులం లేని చలం

చలం ఒకసారి బెజవాడ రైల్వే స్టేషన్ భోజనాల హాల్లో భోజనం చెయ్యా లని వెళ్ళాడు. ఆ హోటల్ మేనేజర్ అడక్కముందే చలం తనకి కులం లేదని చెప్పాడు అతను సరిగ్గా విన్నాడో లేదో లోపలికి వెళ్ళండి అన్నాడు. రైలుకి వెళ్ళడానికి యాభై అరవై మంది భోజనం చేస్తున్నారు. చలం అక్కడ అడుగు పెట్టగానే అతని మొహం వంక చూసి ఆ యాభై మంది ఒక్కసారిగా భోజనం మానేసి లేచి వెళ్ళిపోయారు. తర్వాత గందరగోళం. వాళ్ళ భోజనం ఖర్చంతా చలాన్ని ఇమ్మంటాడు ఆ మేనేజరు. ఏమీ తోచక కులం లేని చలం దిక్కులు చూస్తున్నాడు. ఇంతలో వాటి ధర్మమా అని రైళ్ళు కూతలు వేశాయి. ఇంతలో ఎక్కడి నుంచి వచ్చాడో పట్టాభిరామయ్య వచ్చాడు. చాలా ఏళ్ళయింది యిద్దరు మిత్రులూ కలుసుకుని– "ఏమిటి? వెంకట చలం ఇదంతా" అన్నాడు. అక్కడ

ఏం జరిగిందో విని, పట్టాభిరామయ్య మాటల్లో ఆ హోటల్ మేనేజరుతో కలియ బడ్డాడు. ముందు కాలంలో బెజవాడ బార్‌కి లీడరు కాబోయే ఆయనతో వాదించలేక అతను తల వొంచుకుని మాటాడకుండా కూర్చున్నాడు. చలం ఇట్లా అయిపోవడం అతని కేమీ ఆశ్చర్యంగా లేదు. చాలా సహజంగా తీసుకున్నాడు పట్టాభిరామయ్య అంటాడు చలం. అతను బెజవాడలో వకీలయినాడు. చలం బెజవాడలో ట్రెయినింగు స్కూలు హెడ్‌మాష్టరయినాడు. డాక్టరు రంగనాయకమ్మగారు ప్రాక్టీసు పెట్టడంతో చలానికి కూడా కొంచెం యోగ్యత అబ్బింది.

చలం మిత్రులకు చలం మీద ఎంత ప్రేమో అతని రెపుటేషన్ వల్ల ఆయన విరోధులకు అంత ద్వేషం. అతని జీవన సరళి వల్ల చలం దగ్గిరికి చేరాలనుకునే మిత్రులకు అది ఇంపాసిబుల్ అయేది. అతను తినే భోజనం, అతని చుట్టూ నిరంతరం వుండే ఆడ పిల్లలవల్ల చలం చేరడానికి వీలులేకుండా అలా వుండేవాడు తను కలిపించుకున్న ఒంటరి తనంలో, బాధలో తీరని అశాంతిలో.

తన స్నేహితుడు పట్టాభిరామయ్య యిల్లు కట్టుకుని గృహప్రవేశానికి పిలవడానికి వస్తే చలం 'సో యూ ఆర్ బిల్డింగ్ యువర్ మసోలియం' (నీ కోసం నీ సమాధి కట్టుకుంటున్నావా) అని అన్నా అతను 'హర్ట్' కాలేదు. బెజవాడలో ఆ రోజుల్లో చలాన్నెవరూ భోజనానికి పిలవరు. కాని గృహప్రవేశానికి ధైర్యంచేసి అతను చలాన్ని పిలిచాడు. ఈ సందర్భాన్ని గురించి చలం– 'నన్నెవరూ భోజనానికి పిలవరు ఆ వూళ్ళో....ఇదే సందు కదా అని నేను అతని యింటికి అయిదు గంటలకే వెళ్ళి కూచున్నాను. అప్పుడే యింటి మేస్త్రీలు, కూలీలు భోజనాలు చేస్తున్నారు. ఆ గుమ్మడికాయ పులుసు వాసన తగిలి నేను వాళ్ళ పంక్తిలోనే కూచున్నాను. నన్ను బతిమాలి తీసుకుపోయాడు పట్టాభిరామయ్య అక్కడి నుంచి.... చాలాసార్లు నేనమర్యాద పనులవల్ల స్కాండ్రిప్స్‌లోకి వెళుతుంటాను. అతను జనరస్‌గా నన్ను తప్పించేవాడు' అని అంటాడు.

చలాన్ని ఎంత క్రూయల్‌గా యిబ్బంది పెట్టారో విశాలాంధ్రులు! బెజవాడలో తగిలిన అతని గాయాలపచ్చి రమణాశ్రమం చేరుకున్నా ఆరలేదు. బెజవాడ రైల్వే భోజన శాలలోని సంగతి చలాన్ని ఎలా ట్రీట్ చేశారో తలుచుకుంటే కులతత్వానికి నేటికీ బానిసలయి దాన్తో రాజకీయాల్ని జీవితాన్ని మొత్తం కలుషితం చేస్తున్న మన వాళ్ళ వెధవాయిత్వం గురజాడ కనిపెట్టిన నాటి నుంచి యిప్పటి వరకూ అలానే వుంది. చలానికి అన్నం పెట్టకుండా యాభై మంది తిన

కండా లేచిపోయిన వారి బిల్లు చెల్లించ మనడం ఎంత దారుణం? అందుకే చలం రాతలోని తీవ్రత అతని శైలిని బట్టి వచ్చినది కాదు. అతని కసి, వేదన తన మనస్సుని కాల్చిన మంటల్లోంచి వచ్చినది.

చలం జీవిత పద్ధతి వల్ల, తిరుగుబాటువల్ల జీవిత కాలమంతా నష్టపోయిన వ్యక్తి చలంభార్య రంగనాయకమ్మగారు. చలం బ్రహ్మ సమాజంలో చేరినపుడు తన తల్లిదండ్రుల్ని, బంధువుల్ని వాళ్ళ పెద్ద ఆస్తిని అన్నిటిని వొదులుకుని చలాన్ని నమ్మి అతన్ని 'ఫాలో' అయింది. చలం త్వరలో రత్నమ్మ ప్రేమ వ్యవహారంలో చిక్కుకునేటప్పటికి తనకి దిక్కులేక అణిగిపోయింది. చలం నైతికంగా సంఘం మీద తిరగబడి ఈశ్వరుణ్ణి కూడా నిరాకరించి ఎడారిదారిన పడేప్పటికి ఆమె ఇంక గతిలేక ఎదురుతిరిగింది. చలంతో తప్ప చలం మిత్రు లందరితో విరోధించింది. చలం నుంచి కూడా దూరమైంది. అట్లా ఒంటరిగా నిలబడి ధర్మయుద్ధం సాగించింది. అప్పటికీ చలాన్ని విడవక చలంతోనే వుండ టం వల్ల ఆమె ఎవరి సానుభూతిని పొందలేకపోయింది. చలం ఒంటరితనానికి అల వాటు పడినవాడు. ఏకాకిగా నిలబడి పోరాటంసాగించగలడు. అది ఆమె స్వభావంలో లేదు; ఆమె సంఘజీవి. చలం ఆమె జీవితానికి ఆమె అభిప్రాయాలకి, ఆమె ఆచ రణలకి గౌరవమిచ్చి వొదిలేశానంటాడు. ఇల్లంతా ఆమెదే. ఇంట్లో అధికారం అంతా ఆమెదే.

దేవతలు పూజలు ముసలమ్మలు బ్రాహ్మణులు యధేచ్ఛగా విహరించేవారు చలం గారి యింట్లో - కాని ఇవేమీ చలం జీవితానికి అడ్డురాకూడదు రంగనాయ కమ్మగారు పబ్లిక్ సోషల్ వర్క్ చెయ్యడం ప్రారంభించింది. స్త్రీల ఉద్యమంలో ముఖ్యమైన పాత్ర తీసుకుంది. ఆమెలోని వివేకాన్ని, తెలివిని, సూనృతాన్ని భరించలేక 'నవనాగరిక కుహనా పురంధరీమణులు' చలం చేసిన పాపాలకి చలం వాళ్ళకి దొరకడు గనుక ఆమెను హేళన చేయడం ప్రారంభించాడు.

'భర్తలు నా స్నేహితులు ఎడ్మైరర్స్ అయితే ఆ భార్యలు వ్యతిరేకులై, ఆ భర్తల్ని నన్ను కలుసుకోకుండా ఆ భార్యలు జాగ్రత్త పడేవారు. భార్యలు నా ఎడ్మైరర్స్ అయితే ఆ పిచ్చి వొదిలిచ్చేసేవారు భర్తలు.' అంటాడు చలం.

ఆమెకి ఇంగ్లీషు బాగా వచ్చు. ఇంగ్లీషు స్కూల్లో చదువుకుని మద్రాసులో చలంతో వున్నప్పుడు హిందీ బాగా చదువుకుంది. చలం సాహసం వలన ఆమె

దృక్పథం విశాలమయింది. సహజంగా ఆమెకు నైతిక బలం వుంది. అయినా అంతా ఏకమయి దాడి చేసి హేళన చేయడం వలన ఆమె ఎప్పుడూ వారితో యుద్ధం చేయక తప్పేది కాదు. తాను అలా ధైర్యంగా నిలబడి పోరాడగల శక్తి చలం యిచ్చినదేనని గుర్తించలేక మరిచి తను పడుతున్న కష్టాలు నష్టాలు చలం నెత్తిన రుద్ది అతన్ని తిట్టేది.

'అయ్యో పిల్లలున్నారన్న యోచనన్నా లేకుండా అంతా మీ అమ్మమ్మ కిచ్చేశారు అని దెప్పి పొడిచేది చలాన్ని ఆయన భార్య (అమ్మమ్మ అంటే నాయనమ్మ అని అర్థం- చలం భార్యకు పొయ్యికి తల్లి లేదుగా) అమ్మమ్మకి ఆస్తి ఇవ్వడమే కాకుండా చలం ఎందుకో నెలకో పదిరూపాయలు తల్లికి పంపే వాడు. పంపిస్తే బాగానే వుండేది. చలం భార్య ఏమీ అనేది కాదు, ఇంకా ఒకటో తేదీ రాకుండానే 'పెద్దబాబూ నా పది రూపాయలు మాత్రం మరిచిపోకు' అంటూ కార్డు రాసేదిట చలం తల్లి. దాంతో చలం భార్య మండిపడేది 'ఏమిటండీ యీ దురాతకం? మీరావిడకేమన్నా బాకీయా?' అంటే చలం మాట్లాడకుండా వూరు కునేవాడు. దాంతో చలాన్ని రంగనాయకమ్మ నానా తిట్లు తిట్టి చివరికి ఇంక 'సత్య హరిశ్చంద్రుడా' అని గట్టిగా అరిచేది. ఇంత చక్కగా జాతీయంగా తిట్టినఇల్లాళ్ళు తెలుగుదేశంలో చాలా అరుదు.

## నాన్న పిల్లలు

ముఖ్యంగా చలం భార్యని కుంగదీసింది ఆపిల్లలు. వాళ్ళకి జ్ఞానం వచ్చి నప్పటి నుంచి నాన్న పిల్లలేకాని అమ్మ పిల్లలు కారు నాన్నమీదే ప్రేమ. నాన్న వెంటే తిరుగుతారు. వాళ్ళ పెంపకం విషయంలో బిడ్డల శిక్షణ రాసిన చలానికి అతని భార్యకి పెద్దపెద్ద తగూలు జరుగుతుండేవి. ఏం చేసినా వాళ్ళని కొట్టడానికి వీల్లేదు. ఒకవేళ కొడితే తల్లిని. పిల్లలచేత చేతులు పట్టుకుని కొట్టించేవాడు. తిడితే ఆ మాట మళ్ళీ వాళ్ళచేత అనిపించేవాడు చలం తల్లిని.వాళ్ళ జుట్టు కత్తిరించడంలో బట్టలు వేయడంలో యిద్దరికీ భేదాభిప్రాయాలు. పిల్లలకి స్నానాలు, ఇరుకుబట్టలు, తలంట్లు యివన్నీ తప్పిపోవడం చేత వాళ్ళు తండ్రి వైపు వుండే వారు. బంధు వులు వచ్చి అక్రమంగా పలకరిస్తే వాళ్ళని ముఖం మీద తిట్టేవారు. పెద్దయాక కూడా ఆ పిల్లలు వేటిలో ఆమె మాట వినలేదు. ఆవిడ బంధుమిత్రులకు 'వీళ్ళు నా పిల్లలు అని చెప్పుకోవడానికి సిగ్గుగా వుండేదిట. అంత కఠినంగా చలం వాళ్ళ

స్వేచ్ఛ కోసం పోట్లాడకపోతే ఆమె అధికారాలకి, ఆచారాలకి మర్యాదలకి పిల్లలు దాసులై పోవలసివచ్చేది. పిల్లలకోసం తల్లిని చలం బలియిచ్చాడు

కొంచెం వాళ్ళు పెద్దయాక బోధించి వారిని తన వైపు లాక్కోవాలని ఆమె చూసింది. రెండవ కుమార్తె 'చే' (నిర్మల) సమయానుకూలంగా తన సుఖం కోసం తల్లివేపు ఒకప్పుడు తండ్రివేపు ఒకప్పుడు చేస్తూవుండేది. పిల్లలు త్వరలో చదువులు మానేశారు. కాని మెల్లిగా 'చే' చదువులో చేరిపోయింది. చలం ఎంత అడ్డుపడుతున్నా ఎంత మంచి సంబంధాలు వచ్చినా 'పిల్లలు పెళ్ళిళ్ళు చేసుకోము' అన్నారు. చలం వసంత్ కలిసి పిల్లనిస్తామని (వసంత్‌కి) వచ్చిన వారిని ఆటలు పట్టించి పంపించేవారు. చదువులూ పెళ్ళిళ్ళు ఉద్యోగాలు యివేమీ లేక అన్ని వేపులా ఆవిడ ఓడిపోయేసరికి ఆమెకు మనస్సు చెదిరింది సగం పిచ్చి రకంగా తయారయింది 'మర్యాదైన మొగుడితో పాపం సుఖ పడేదిగదా' అని చలానికే జాలి వేసిందట. చలాన్ని పిల్లల్ని భరించలేక ఆమె రమణాశ్రమం వెళ్ళిపోయింది.

రంగనాయకమ్మగారు(T)తన చెల్లెలు అలా వెళ్ళి పోవడం డాక్టరు రంగనాయకమ్మగారికి పెద్ద దెబ్బ. అన్నివిధాలా ఆమెని ఆదుకుని సంతోషపెట్టాలని చూసింది. చలాన్ని మార్చలేదు. తన చెల్లెలిని మార్చలేదు. తను నలిగిపోయి దిగులుపడి వూరుకుంది. ప్రతి వాళ్ళు ఈ పిల్లలు పాపం వీళ్ళకెంత సమస్య అయినారను కునేవారు. 'మా యింటికొచ్చి పెళ్ళిపేరు ఎత్తడం భయం వాళ్ళకి' అంటాడు చలం.

పిల్లలు చదువుకోరు. పెళ్ళి చేసుకోరు. ఆస్తిలేదు, డబ్బులేదు, పైగా కులం లేదు. మర్యాద లేదు. ఈ పిల్లలు పెద్దయాక వాళ్ళ గతేమిటని దగ్గిర మిత్రులు ప్రేమతో అడిగేవారు. దీనికి చలం సమాధానం—

'ఏదో మర్యాదగా నలుగురిలో బతుకుతున్నాం. డబ్బు సంపాయిస్తున్నాం ఆస్తి పేర పెడుతున్నాం, అని తప్ప మీ లోపల్నించి, ఏమన్నా సంతోషంగా తృప్తిగా వుందా? ఇంతేనా బతుకంటే, వెతికి వెతికి ఎవర్నో తెచ్చి ఆడపిల్లకి కట్టడం, పెళ్ళంటే ఒక లాటరి. పిల్లల్ని కనడం. వాళ్ళని చదివించడం, పెళ్ళిళ్ళు చెయ్యటం ఇంతకన్నా గొప్పగా బతగలడు మనిషి అని మీ మనసుకు ఎప్పుడూ తట్టదా? ఆ గానుగెద్దు గాడినుంచి నా పిల్లల్ని తప్పించాలని చూస్తున్నాను. వాళ్ళ నించి నాకేమీ అక్కర్లేదు. వాళ్ళనించి వాళ్ళకే ఏమీ అక్కరలేకుండా చూస్తున్నాను. పెళ్ళిచేసి వాళ్ళ మెడలు కట్టివెయ్యను. ఎవరికీ లొంగిపోనీను, లొంగిపోకుండా

నేను అడ్డునుంచుంటాను వాళ్ళకి ధైర్యమిస్తో. నేను బతికివున్నన్నాళ్ళు కష్టమనేది ఎరక్కుండా పెరుగుతారు. తరవాత కష్టపడతారంటారా? మీ పిల్లలు యిప్పటినించి కష్టపడటంలేదా చదువులని, మొగుళ్ళని? ఆ మాత్రం వాళ్ళూ కష్టపడతారు అవసరమైతే. జీవితం దుర్భరమవుతుందా? వాళ్ళకి సులభంగా ఈ లోకాన్ని వొదిలిఎట్లా పోవాలో వాళ్ళకిప్పుడే తెలుసు అనే వాడ్ని. బతుకుఅంటే ఎన్ని భయాలుపెట్టారు? చదువుకోకపోతే ఏమౌతావు ? నలుగురిలో మంచివాడి ననిపించుకోకపోతే ఏమౌతావు ? ఉద్యోగం లేకపోతే ఏమౌతావు? పెళ్ళి చేసుకోకపోతే ఏమౌతావు? డబ్బు లేకపోతే ఏమౌతావు? ఇన్ని భయాలతో, భారాలతో, ఎట్లా జీవంపీల్చి శవాల్ని చేస్తున్నారో పిల్లల్ని'

## మూల సూత్రాలు

ఇవి చలం జీవితాన్ని నడిపించిన మూలసూత్రాలు. తనూ పిల్లలూ ఒక ప్రపంచం, అందులోకి భార్యకి కూడా ప్రవేశంలేదు. సంఘంతో వుండే సంబంధాల్ని, సంఘజీవితాన్ని వ్యతిరేకించడమే కాదు నరుక్కున్నాడు, అది పిల్లలకు అక్కరలేకుండా చేశాడు. ఈ సంఘంలో ఏమీ లేకుండా వుండడం, ఏమీ చెయ్యకుండా వుండటం, అదే చలానికి కావలసినది.

28-6-55న నాగపూర్ ప్రసాద్‌కి రాసిన ఉత్తరంలో—'నా బిడ్డల శిక్షణ ప్రకారం పెంచబడిన పిల్లలు ప్రపంచ ప్రకారం పెద్ద disappointment అవుతారు. ఆ తల్లిదండ్రులకి కూడా చాలా విశాలమైన దృష్టివుంటే తప్ప పశ్చాత్తాపపడతారు' అన్నాడు.రంగనాయకమ్మగారి విషయంలో ఇదే జరిగిందా ?

## చలం కథలో పద్మావతి

మా తమ్ముణ్ని చూస్తే నాకు చాలా ప్రేమ. ప్రేమే కాకుండా అసలు తను ఎంత ఉత్తముడో, విష్కల్మషుడో! అతన్ని లోకం చాలా క్రూరంగా treat చేసింది. అతని భార్య పిన్ని మా పిన్ని అతని భార్య కావటం అతని జీవితానికి పట్టిన గొప్ప అదృష్టం. మా పిన్ని అతని భార్య కావడం అతని జీవితానికి పట్టిన గొప్ప దురదృష్టం కూడా. ఆమెవల్ల అతను మంగలంలో వేగుతున్న పకోడీమల్లే ఉడుకుతో వుంటే నేను అనేక సార్లు-

"ఎందుకు నీకు ఆమెతో, పోనిద్దూ" అన్నాను. ఏదో చాలా సులభమైన పనిలాగ. నాకు తెలియదూ? అది ఎంత సులభమైన పనో! తల వొంచుకుని వూరుకునేవాడు.

ఆమె నా మరదలు గనక నాకు ఎట్లానూ ఇంటో పరిచయమే.కాని ఎప్పుడూ నేను ఆ ఇంటో వుండేవాణ్ణి కాదు. ఒకసారి నేను తెనాలి వెళ్ళినప్పుడు—

వెన్నెల రాత్రి, నేను వొయ్యి మెట్ల పిట్టగోడ నానుకుని నుంచుని చందమామ వంక చూస్తున్నాం. రెండో వేపున పిన్ని వొచ్చి నా భుజాన్ని ఆనుకుని నుంచుంది. వొయ్యిని పిల్చి 'ఇదేమిటి' అన్నట్టు వింతగా చూపాను. వొయ్యి 'అంతేలే' అని తల వూపింది. అది మొదలు, అప్పుడు నేను మర్నాడే ఏలూరు వెళ్ళిపోయినాను, కాని ఆ వెన్నెట్లో పిన్ని పట్టుకున్న స్పర్శ ఇంకా అట్లా బాధ పెడుతోనే వుంది. త్వరలోనే పిన్ని నాకు సగం ప్రేమలేఖ రాసింది. దానికిజవాబు నేను పూర్తి ప్రేమలేఖ రాశాను. ఆ కాలంలో తెలుగుదేశాన్ని పాలించిన స్త్రీలలో మా పిన్ని వొకత్తే. రెండవది రత్నం.

నాకు గుంటూరు ట్రాన్స్ఫర్ అయింది. అప్పుడు తెనాలిలో వుంటున్నాం. నా యింటి ప్రక్క పోర్షన్లో మా తమ్ముడు వున్నాడు. అంటే పిన్ని కూడా వుందన్న మాట. అప్పుడు వాళ్ళు మాతో మాట్లాడటం లేదు. కారణమేమీ లేదు. స్త్రీ చేసిన ఇంద్రజాలం. వొకళ్ళమీద నేరంమోపి, ఇంకొకరితో చెప్పడం నా స్వభావంలో లేదు ముఖ్యం స్త్రీమీద ఆమె భర్తతో, అది పిన్నికి గొప్పకాలం.

ఆనాటి గొప్ప కవి క్రిష్ణశాస్త్రి వాళ్ళతో వుంటున్నాడు. క్రిష్ణశాస్త్రి ఏ వూళ్ళో వున్నా, ఆ వూళ్ళో నుండే కవుల్ని, artists ని, నాటకాలవాళ్ళని అందర్నీ తన చుట్టూ పోగుచేసు కుంటాడు. కనక మేము వెళ్ళేప్పటికే నా పూర్వ మిత్రులు. నాటకాల వాళ్ళు, కవులు, సాహితీసంఘ సభ్యులు అందరూ పిన్ని పాదాలచుట్టూ కూచుని ఆమెని ఆరాధిస్తున్నారు. నాటక ప్రదర్శనాలకి వీళ్ళని పిల్చుకుపోతారు. కవులు ఆమెకి పుస్తకాలు అంకితమిస్తున్నారు.

ఓ రోజు రాత్రి క్రిష్ణశాస్త్రి వొచ్చి తను కొత్తగా రాసి ముగించిన ఊర్వశి అనే కావ్యాన్ని వినిపించాడు నాకు. చాలా గొప్పగా వుంది. కాని దాంటో ఆత్మ లేదు. ఏదో దీంటో నిజం బైటపడి పోతుందేమోనని దాచి....దాచి రాసినట్టుగా



చలం ఉపనయనం ఫోటో మధ్యలో పెట్టెమీద కూర్చున్నది పడక పెళ్ళి కొడుకు చలం- ఎడమ చలం తాతగారు గుడిపాటి వెంకట్రామయ్య. చలంగారి అమ్మమ్మ గుడిపాటి లక్ష్మమ్మ (కుడి పక్క చివర) చలం తల్లి కొమ్మూరి వెంకట సుబ్బమ్మ. ఎడమ చివర నిలుచున్నది చలం తండ్రి కొమ్మూరి సాంబశివరావు. మిగతా పిల్లలు తమ్ముళ్ళు చెల్లెళ్ళు (ఫోటో 1904)



కాకినాడలో చలం చదువుకుంటున్నప్పుడు శ్రీమతితో (ఆమె వయస్సు 13 సంవత్సరాలు) సుమారు 1913లో



కాకినాడలో ఇంటర్ చదువుతున్నపుడు ఒకే కండువాలో
ప్రకాశరాయుడు, చలం 1914లో.



చలం భార్య రంగనాయకమ్మ

కలకత్తాలో 1917

చలం కాకినాడలో ట్యూటరుగా వున్నపుడు శ్రీమతి

రంగనాయకమ్మ, రవితో 1818



ఎడమ నుంచి చలంభార్య చిట్టి రంగనాయకమ్మ. చలం. పెద్ద రంగనాయకమ్మ. సౌరిస్ ముత్తాత వల్లూరి గోపాలంగారు. చలం అత్తగారు సీతాయమ్మ. చలం మామగారు ఉప్పలూరి రామశేషయ్య (కుడి చివర) డాక్టర్ రంగనాయకమ్మ (పొయ్యి) కూర్చున్నది వల్లూరి పార్థసారధి (గోపాలం గారి కొడుకు) రంగనాయకమ్మ గార్లకు మేనమామ

(వీరంతా చలాన్ని వెలివేశారు)



1931లో రవితో
చలం

డాక్టర్ రంగనాయకమ్మ పెద్ద అబ్బాయి రవితో 1922



1931 ట్రయినింగ్ స్కూల్, బెజవాడ హెడ్మాస్టరుగా వున్న
ప్పుడు విద్యార్థులతో టాగూర్ ఆనివర్సరీకి మాలిని-పోస్టా
ఫీస్ వేసినపుడు ఆ బృందంతో



చలం, చంపక 1947లో



ఎడమ నుంచి యస్వీ జోగారావు, చలం, సౌరిస్
(1949లో బెజవాడలో)





చలంగారికి పోతుకూచి సాంబశివరావు 1987 లో చేసిన సన్మానం.
(దండ, శాలువా, మెడాలియన్ చలం మెడలో చూడవచ్చు);
ఎడమ నుంచి చలం, చిత్ర, సౌ, నర్తకి – ఇది చలానికి
జరిగిన తొలి సన్మానం।

కాని నా వేపు చెయ్యిజాచిన స్త్రీని ఎట్లా పొమ్మనాలో నాచేత కాలేదు. చాలాసార్లు రంగనాయకమ్మగారు పిన్నిని మా ఇంట్లో దిగటానికి వీల్లేదనేది. కొన్ని రాత్రులు మాకు నిలవడానికి నీడలేక అగచాట్లు పడేవాళ్ళం. రాఘవాచారిగారి ఆనటజీవితంలో ముఖ్య భాగమైన పిన్ని పేరెత్తడానికి ఈ కవీంద్ర చంద్రులందరికీ భయమే.

ఆమె పిల్లలు పెద్ద వాళ్ళయినారు. రాఘవాచారిగారు ముసలి వారయి పోతు న్నారు. ఈమె ఎటు తిరిగినా ఎంతెంత కాలం తనని వొదిలి తిరిగినా, తిరిగి ఆమెని స్వీకరించే ఉదారత్వాన్నీ, విశాలత్వాన్నీ అతి సులభంగా సాధించిన మా తమ్ముడి గొప్పతనాన్ని నేను ఎంతో విలువగా చూసుకుంటాను. అది సహజ మేనా, ఒక వయసు వచ్చేటప్పటికి మనుషులు— ముఖ్యం స్త్రీలు- అది వరకు స్వేచ్ఛా జీవితం గడిపినవారు తిరిగి మర్యాదలో కలిసి పోవాలని విశ్వప్రయ్నతం చేస్తారు. పెళ్ళి గాయిమడక యిటు-అటు తిరిగిన స్త్రీలు వీలైనంత గట్టిగా పెళ్ళిలో తమని యిరికించాలని చూస్తారు.

కొడుకు సంపాదనలో ప్రవేశిస్తున్నాడు. మా తమ్ముడిసౌజన్యం వల్ల పిన్ని ఆకర్షణ వల్ల మళ్ళీ కవులు మొదలయిన వాళ్ళు ఆమె చుట్టూ చేరుతున్నారు. ఆమె మొదట వితంతు వివాహం చేసుకున్న స్త్రీ కూతురు ఆమె చరిత్ర సుప్ర సిద్ధం. పైగా ఆ కుటుంబం మీద చలం Influence వుందని అనుకునేవారు. అందువల్ల ఆ కూతురికి పెళ్ళి అవడం కష్టమయింది. పైగా అప్పుడు చలం లీల గారి ఆధీనంలో ఒక మనిషి కింద లేడు. తాను చేసే మర్యాద పనులు వొప్పు కోడని తెలుసు పిన్నికి. అందుకని క్రమంగా దూరమైపోయింది నా నించి. కూతు రికి పెళ్ళి అయింది. ఆ అల్లుడికి చలం Influence అంటే చాల వొళ్ళు మంట. ఎట్లాగన్నా చలం నించి వాళ్ళని తప్పించి మర్యాదస్తుల్ని చెయ్యాలని చూశాడు. ఆ ఇంట్లో అతను కూడా వాళ్ళతోనే వున్నాడు. ఆ ఇంట్లో చలం పేరు వినపడ కూడదని శాసించాడు.

ఆ ఇంట్లో పిన్నిపేరు అమర్యాద పేరు అయిపోయింది. పిన్ని చేసినపనులు ఎట్లానన్నా తెలుగు సంఘంలో మర్చి పోయేట్టు చెయ్యాలని ప్రయత్నించారు. ఆమె పిల్లలని చెప్పుకోడానికి సిగ్గుపడుతున్నారు ఆమె పిల్లలే చలం దూరమైనాడు. ఇట్లాంటి గొప్ప ఆపదలో పడ్డది పిన్ని. ఆమె మాట్లాడితే నోరు నొక్కుతున్నారు. ముఖ్యంగా అల్లుడు(కె.కె.).ఇంతలో పిన్ని కొడుక్కి ఒకసినిమా star కి scandal

బయలుదేరింది. (జానకి, కొమ్మూరి సాంబశివరావు) ఆ దెబ్బతో మళ్ళీ ఆ కుటుంబం కొన్నాళ్ళు దొంగ మర్యాదల నుంచి అల్లుడి ప్రభావం నించిబయటపడ్డారు.

*          *          *          *

ఆమె తన మర్యాదల విష వలయం నించి తల ఎత్తి చూసి చలం కోసం వెతుక్కునేప్పటికి చలం అరుణాచలం వచ్చేశాడు. ఆమె జాతక ప్రభావం వల్లనో ఏమో తన జీవితమంతా 'ఏదీ చలం?' అని వెతుక్కోకుండా వుండలేక పోయింది. వొచ్చి చూసేప్పటికి మా యిల్లు ఒక ఆశ్రమమై పోయింది. నేను పై సరదాలన్నీ పోయి సన్యాసి లాగున్నాను. అప్పటికి సౌరిస్‌కి ఈశ్వరుడు ప్రత్యక్షమైనాడు. సౌరిస్ లోనించి వినవచ్చే ఈశ్వరుడికి అందరం ఆధీనులమైనాము. వెంటనే పిన్ని పూర్తిగా విరోధించింది వ్యతిరేకించింది. మద్రాసు వెళ్ళి మా అందరికి పిచ్చి పట్టిందని ప్రచారం చేసింది.

తర్వాలో ఆమె, ఆమె కొడుకు ఆ సినిమా తార scandal వల్ల ఏమై పోతాడో అని భయం పట్టుకుని చలం వేపు తిరిగింది. అల్లుళ్ళు, కొడుకులు, కూతుళ్ళు ప్రతివారికీ తను లోకువయింది. ఏ అపవాదులకీ, ఏ మలినానికి జంక కుండా తనని ఒక ప్రేమ హృదయంగా artist గా,చిరకాల మిత్రురాలిగా మన్నించి ప్రేమించింది మేమే. అప్పటికే ఆమె వయసు మళ్ళి రోగగ్రస్తమయింది. ఎక్కువ డబ్బులేదు. ఇంట్లో గౌరవం లేదు. ఇక్కడికి వస్తే లోకంతో ఏమి సంబంధం లేకపోవడం ఇదంతా తాను భరించలేదు.

గవర్నమెంటు వారు పెట్టిన ఆర్టిస్టు వృద్ధాప్యపు రక్షణ మందిరాల్లో చేరాలని ఎంతో ప్రయత్నం చేసింది. చలం దగ్గరికి అట్లా తరుచుగా రావడం ఆమె పిల్లలకి ముఖ్యంగా కొడుక్కి ఏ మాత్రం యిష్టంలేదు. తల్లి బయట తిరుగుతో వుంటే ఆమె అతని తల్లిగా గుర్తిస్తారని భయం. నన్ను చూడ్డానికి వస్తే ఆమెలో వున్న స్వతంత్ర బీజాలు మొలకెత్తుతాయని అంతకన్నా భయం. ఈ విధంగా అన్నిటికి అణిగిపోయి చలాన్ని చూడడానికి గూడా వీలులేకుండా నొక్కి పారేస్తే ఆ విధంగా ఏడుస్తో చచ్చిపోయింది.

నడిరేయి చీకట్ల కడుపులోనే ప్రొద్దు
పొడుపు బంగరు మెఱయదా !
నా తండ్రి
చెడని తేజము విరియదా !!

# 7

# శృంగార 'లీల'

చలం గారికి ఒకామె పిఠాపురం నుంచి ఉత్తరాలు రాసేది ఆరాధనగా. సౌరిస్ అప్పటికే 'సుందర్' అనే నాటకం రాసింది. అందులో లీల అనే పాత్రకి ఈ ఉత్తరాలు రాసే ఆవిడకి సామ్యం కనపడేసరికి ఆమె యింకా రాకమునుపే చూడకుండానే 'లీల' అని పేరు పెట్టేసింది. తీరా ఆవిడ ఉత్తరం రాసి వచ్చేసరికి సౌరిస్ ఆమెను చూసి సంతోషించింది. ఎంతో యిష్టపడింది.

లీలగారు ఎంతో సంతోషంగా వచ్చారు. ఆవిడ చలం వాళ్ళ గురించి ఎన్నో కథలు విని వచ్చారు. చివరికి 'షా' వాళ్ళని చూచి వుండబట్టలేక అడిగేసింది కూడా- "ఇదేమిటి ఈ ఇల్లు ఆశ్రమంలాగా, మీరంతా మునిబాలకుల్లా వున్నారేమిటి? "అని. లీలగారికి ఆశ్రమ వాతావరణం స్ఫురించడం యాదృచ్ఛికమేమీకాదు. రాబోయే కాలంలో జరగనున్నది ముందే సూచకమయింది.

లీలగారి కనుముక్కు తీరూ, ఒంటితీరూ పెద్ద అందం కాదు, మొత్తంగా అందం. సౌజన్యమూర్తిలా కనిపించిందామె. మొదట్లో జుట్టుముడి వేసుకున్నా

రానురాను జుట్టును కత్తిరించేసుకుంది. వుంగరాలజుత్తు భుజాన పడేది. అన్నిట్లోకి విశాలాలు ఆవిడ కళ్ళు, ఆ చూపూ, ఆ కనుపాపరంగూ ఎంతో ప్రత్యేకం అయినవి. ఆవిడ తీరు చాలా అందం, ఎంతో హ్యూమర్ మనిషిలో.



1945-46 నరసాపురంలో లీలగారితో వేసవి సెలవులలో
కుటుంబ మిత్రులతో చలం షికారు.

ఆమెలో, లోపల్నించి అందం మీద దృష్టి, మనుష్యుల్ని అర్థం చేసుకునే గొప్పశక్తి వుండేది. ఎటొచ్చీ పాపం చలం వాళ్ళని బయటనించే ఆరాధిస్తూ వుండి పోయివుంటే వాళ్ళని ఎంత దగ్గరగా తీసుకొనేవారో! ఆమె వాళ్ళ ఆదర్శాల్నీ, జీవితాల్నీ ఎంతగా ఎప్రిషియేట్ చెయ్యగలిగే వారో! కాని విధి తప్పుతుందా? ఆమెకి చలం వాళ్ళ జీవితాలలో ప్రవేశించి వాళ్ళ ఆదర్శాల్ని బట్టి నడవాల్సి వచ్చింది. ఆవిడది పూర్తి ప్రాపంచికదృష్టి. ఆశయాలు పుస్తకాల్లో, భావాల్లోనేకాని ఆచరణలో భరించలేరు. బంగారు పంజరంలో పెరిగిన పిట్ట ఆమెకి రెక్కలులేవు, రావు, షా వాళ్ళతో స్వేచ్ఛగా ఎగరడానికి.

ఆమెతో రాజీ పడేందుకు చలం ఆ కట్టడి బ్రతుకుని భరించలేరు. ఆవిడకి అన్నీ పద్ధతులు. అందువల్లతికమక పడే వాళ్ళు చలం వాళ్ళు. నాలుగ్గోడల నించి

చౌరస్తాలోకి నడవడం తెలియదామెకు. ఒక్కసారి విజృంభించి తన అలవాట్లనీ గుణాలనీ తీసేసుకుని చలం వాళ్ళతో కలిసిపోయేది. కానీ హఠాత్తుగా దిగాలు పడి పోయి "ఇలా అయిపోతున్నానేమిటి? చివరికి నాకేం మిగులుతుంది? నేను తేలిక్కై పోతే ఎలాగ?" అన్న ఆలోచన వచ్చి, వాళ్ళ ఆదర్శాలతో వాళ్ళతో విరోధించి చలం పిల్లల్ని ఏమీ చేయలేక చలంమీద విరుచుకుపడేది. చలంగారి ఆదర్శాలు ప్రాక్టికల్‌గా పనికిరావని, లోకోపకారాలు కావని వీటిలో భ్రష్టులైపోతున్నారని తిట్టేది. మళ్ళీ సర్దుకునేది. తనలోతాను తమాయించుకునేది. ఇవన్నీ గొప్ప ఆద ర్శాలని ఆమెకి తెలుసు తాను వాటిల్లో నడవలేదు. చలంవాళ్ళతో వుండాలంటే వాటిని పాటించక తప్పదు. అదీ ఆమెలో సంఘర్షణ.

లీలగారు చలం కుటుంబాన్నంతా తన ఇంటికి పిఠాపురం ఆహ్వానించారు. ఎంతో మర్యాదలు చేసి, ప్రతి చిన్న విషయంలోనూ ఎంతో శ్రద్ధ తీసుకున్నారు. కానీ అక్కడి పద్ధతులు, వీళ్ళ ప్రవర్తన నాన్నకి, సంతికి గిట్టక వెంటనే వెళ్ళి పోయారు. 'వొయ్యి' వాళ్ళతో వెళ్ళిపోయింది. షౌకి లోపల్నించి భగవాన్ తనని అక్కడే వుంచేస్తున్నారనిపించి నాన్న వాళ్ళతో వెళ్ళకుండా అట్లానే వుండి పోయింది. అట్లానే 'చే' వాళ్ళ స్నేహం కోసం, అమ్మవాళ్ళతో సరదాగా గడపటం కోసం వుండిపోయారు.

ఆవిడ ఒకరోజు వీణవాయిస్తూపాడారు,ఎంతగొప్పశ్రావ్యమైనకంఠంఆమెది. ఎంతభావమో ఆ పాటలో! వీణని అంత మృదువుగా అంత గొప్ప లాలిత్యంలో వాయించిన వాళ్ళని షౌ అంతదాకా చూడలేదు. ఏమిటి ఇంత గొప్ప కళ వుండి కూడా ఆమె ఈ మూల ఇలా ఎలా మరుగుపడ్డారో అనిపించింది షౌకి. వెంటనే ఆమెని "ఏమిటండి, మీ జీవితం? ఇంతేనా? ఏం చెయ్యబోతున్నారు? ఇట్లాగే అణ గారి పోతారా? ఇంత గొప్ప కళ పెట్టుకుని ఇక్కడే దిగపడిపోతారా?" అని అడి గింది "లేను షౌ నా పిల్లలు వాళ్ళు" అంటూ గొణిగిందామె. అసలు లీలగారి జీవితం ఒక మిస్టరీ. అక్కడికీ వూరుకోకుండా షౌ అడిగింది. "సరే పిల్లలు పెద్దయ్యాక మనమలు, ఎప్పటికండీ మీకు విముక్తి" అని. ఆమెకి చలంగారి మీదెంత భక్తి ప్రేమ.

"ఆయన్ని చూస్తే యోగిలా అనిపిస్తారు.ఆయనకి నా ప్రేమ అవసరమా?" అన్నారామె దీనంగా. "అట్లా అనుకోకండి. అతను యోగే అయినా అతనిలో

మానవత్వముంది. అతనికి ప్రేమకావాలి," అని ఎక్స్‌ప్లెయిన్ చేసింది షౌ. లీల గారు షౌని, చేని ఉప్పాడ తీసుకొని వెళ్ళారు. అక్కడ సరదాగా ఒకరోజు గడిపి వచ్చేశారంతా పిఠాపురం. చలం నుంచి షౌ వాళ్ళకి ఒక దుర్భరం అయిన లేఖ వచ్చింది. "ఆమె ఏ మాత్రం మనతో కలవలేదు. ఆమెను ఒదులుకోవడం వుత్తమం" అని, ఆమె నాన్నమీద తన ప్రేమని గురించి షౌతో ఎంతగానో మాట్లాడారు గనక ఆ లేఖని ఆమెకి చదివి వినిపించింది షౌ. అది విని ఆమె వెక్కెక్కి ఏడవడం మొదలుపెట్టారు. ఆమెని బుజ్జగించి, ఓదార్చి, బెజవాడ తమతో తీసుకు వెళ్ళింది షౌ.

ఇంటికి వెళ్ళాక చలంగారి దగ్గరికి వెళ్ళి షౌ "ఆవిడ గోల పెడుతోంది—మారుతుందేమో చూద్దాం" అని అడిగింది. "ఆవిడ మన level కి ఎదగలేదు" అన్నారు చలం. "ఆవిడ ఏడుస్తోంటే తీసుకొచ్చాను. సరయిన పనే చేశానా?" అని అడిగింది. చలంగారు "నువ్వు తీసుకు రాకపోయినా ఆమె ఎట్లానూ వచ్చేవారు. నన్ను ఒదలరామె" అన్నారు.

## భీమ్లీలో చలం

ఇంతలో చలంగారికి భీమ్లీ బదిలీ అయింది. బెజవాడలో వుండటం ఇష్టం లేక షౌ చలంగారితో, లీలగారితో కలిసి భీమ్లీ బయలుదేరింది. వాళ్ళతో చిత్ర, పకపక, చే, లీలగారి బాబు బయలుదేరారు.

ఎందరో వర్ణించగా విని ఎంతగా వూహించిదో షౌ భీమ్లీ గురించి. భీమ్లీ వెళ్ళే దోవంతా ఎంతో అందం, బస్ కొండల మధ్య నుంచి పోతోంది. స్వర్గం లాగా వుంది. మెరిసే ఆకు పచ్చని పొదలు అన్ని రకాల ఆకు పచ్చని మొక్కలు. నారింజా గులాబీ రంగుల పువ్వులు కొండ రాళ్ళని కప్పేశాయి. ఎన్నందాలో? తాదాత్మ్యభావనానికి మనుషుల్ని తట్టి లేపే మహాత్సౌందర్యాలు; అటూ ఇటూ కొండలూ, చెట్లూ, నీలం ఆకాశం, బంగారపు ఎండ.... ఆ అందంలో షౌ మన స్సెంతగా పరవశించి పోయిందో; ప్రయాణం బడలికకి అలసిపోయి వాడిపోయిన షౌ వాళ్ళ మొహాలమీద మంచు మీంచి వస్తున్నంత చల్లని గాలి చక్కలిగింతలు పెట్టి నవజీవనాన్నిచ్చింది. ఈ తోవే ఇంతందమైతే అసలు ప్రదేశం ఎంత సుందరమైనదో అనిపించింది వారికి.

గుబురయిన తోటల్లోంచి సాగుతోంది బస్సు— జన్మతమస్సుల్ని చీల్చుకుని ముందుకుసాగే సాధకునిలా- వేగంగా రోడ్డు ప్రక్కనే ఏరు పది గజాల వతల ఏటిని కావలించుకుని చిక్కటి నీలం సముద్రం, తెల్లని నురుగులు చిమ్ము కున్న కెరటాలు- కేరింతలాడే పసిపాపల నవ్వుల్లా పచ్చని ఇసక, సంతోషంతో గంతులు వేసింది షౌ హృదయం. ఎక్కడో పటాల్లో చూచి కలలు కనే అందం- బస్సు వూళ్ళోకి మళ్ళింది. సముద్రాన్ని వెనక వొదలి. కానీ బస్సు బజారు మధ్య ఆగేసరికి చలం వాళ్లు ఎంత నిరాశ పడ్డారో! టి. బి. లాంటిది ఆ వూళ్ళో ఎక్కడా లేదన్నారు. దాంతో ఒక సత్రంలో దిగారు. మర్నాటి నుంచి ఇళ్ళ వేట, అన్ని యిళ్ళూ చీకటి కూపాలు. ఆఖరికి బొక్కెదార బంగళాలో చలం వాళ్ళకి మేడమీద వాటా దొరికింది. క్రింద భాగం తాళం వేసి వుండేది. వరండాలో ఒక పిచ్చివాడు కాపురం చేస్తున్నాడు. మేడమీద వరండా కింద నుంచి అక్కడికి వెళ్ళే దారి చేసు కొని వరండా కింద నుంచి చప్పుళ్లు చేసుకుంటూ నడిచేవాళ్ళు, బంగళాలో పెద్ద.... పెద్ద కిటికీలు, ఒక వైపు ఏరు, ఒక వైపు సముద్రం, ఒకవైపు కొండ, ఎటు చూచినా గొప్ప దృశ్యాలుకన్పించేవి. ఆ వూరు పూర్వం డచ్చి వాళ్ళకి నౌకాశ్రయం. ఏ హాలెండ్‌నుంచో డెన్మార్క్ నించో, స్పెయిన్‌నించో ఒక ముక్కకోసి తీసుకొచ్చి ఇండియాలోపెట్టినట్లుగా వుండేది ఆవూరు. కొబ్బరి చెట్లలోంచి ఆకుల సందుల్లోంచి గంతులేస్తున్న సముద్రం, ఇసుకతిన్నెలు, చుట్టూతా చూచే అందంతో పరవశించే షౌ ఎక్కడికో, ఏలోకాలలో వెళ్ళిపోయేది. కాని ఛీమ్లీ అందాలు వెంటనే అందిరావు. ఆ అందాల్ని అన్వేషించాలి. ఆ ఆనందాన్ని హృదయ నిశ్శబ్దంలో ఆనందించి పరవశించాలి. అంతేకాని ఒక రోజు టూరిస్టు బస్సులోంచి తొంగిచూచి, పెదవుల మీంచి ఏమందం, ఏమందం అనుకుంటో వెళ్ళిపోయే వాళ్ళకి చిక్కవు. అక్కడ వుండి ఒక్కొక్కొక్షణంనించి ఋతువుల మార్పునించి వొంపులు తిరిగిన తీరం సొంపుల్లోంచి వెతుక్కుంటూ పోవాలి. అప్పుడెన్నెన్ని అందాలు గోచరిస్తాయో! అన్ని వొంపులు ఏ సముద్ర తీరానికి కనిపించవు. ఆ సముద్రానికి ఒక్కొక్క వొంపులో ఒక్కొక్క అందం. ఒక్కొక్క వొంపులో ఒక్కొక్క గొప్ప రం గుగా మారేది సముద్రం. బంగారం రంగు ఆకాశం, ముందు నల్లని కొబ్బరిచెట్లు, మొగలి తోపులు ఒడ్డున, మాటల్లో ఇమడని అందాలు-మనస్సులతో సూటిగా మాట్లాడే అందాలు, సమస్యలుగా కనిపించే జీవితం మీద గొప్ప ప్రేమని పుట్టించే అందాలు, రోజుకి ఇరవైనాలుగేనా 64 గంటలు వుండకూడదా? అనిపించే

అందాలు............డిస్కవర్ చేసి వెదకాలి, వెదకాలి, అందుకోవాలి. "ప్రియుల్ని ఆకర్షించి, ప్రియురాళ్ళనించీ, ప్రియురాళ్ళని ప్రియుల్నించీ లాక్కొంటాయి. చాలా బలం వుంటే కాని గెలవలేరు ఆఅందాల్ని. గంధర్వులు భూలోకంలో విహరించే టప్పుడు ప్రపంచం అంతా వెదకి ఈ ప్రదేశాన్ని తమ ఆటస్థలంగా నిర్మించుకొన్నారనిపిస్తుంది" కొండపాదం దగ్గర ట్రైనింగ్ స్కూలు అందాలు ఆక్రమ్మరించింది. కొండమీదినించి పైన విష్ణ్వాలయానికి తీసుకునిపోయే మెట్లు.ముందరగా తాము, ఊహించిన అందాల్ని కనుక్కోలేక డిజప్పాయింట్ అయారు, షా వాళ్లు-కానీ, ప్రకృతి తనని నమ్మి వచ్చిన వాళ్ళని వంచించదు.

రోజూ చలం వాళ్ళు సముద్రంలో స్నానాలు చేసేవారు. లీలగారికి సముద్రాన్ని చూస్తే ఎంత సంతోషమో! ఎంత ఆనందమో ఆవిడని సముద్రంలో చూస్తే- ఈమె సముద్రానికి సంబంధించిన మనిషి అనిపించేది. ఆవిడ ముఖం తీరు మారేది. సముద్రంలో చంటి పిల్లయి గంతు లేసేది. ఆమెతో పాటు అలలు నవ్వుతూ అల్లరి పిల్లల మల్లే చలం వాళ్ళ కాళ్ళని చుట్టుకునేవి. మామూలప్పుడు లీలగారు చాలా రిజర్వ్‌డ్‌గా తన అంగాంగాన కదలికల్ని-శాసించుకునేవారు. కాని స్వేచ్ఛా ప్రియుడైన సముద్రుడి ఒళ్ళో-ఆమెస్వేచ్ఛాలాలసత్వంలో సహజంగా, మెదిలేవారు, అంతా వెళ్ళిపోయినా చే, షా, చేపలవాళ్ళు ఒడ్డుకి లాగిన పడవల్లో! ఆర్చివప్పల్లా నీలంగా, గులాబి రంగులో వుండే ఆకాశాన్ని చూస్తూ పడుకునే వారు. ఎన్ని ఆటలో వాళ్ళు ఆ సముద్రం కెరటాలలో ఆడుకునేవాళ్ళు పిల్లలంతా. భీమ్లీ సముద్రం కృష్ణవేణిలా జిత్తులమారి. తెలయకుండా వచ్చి నిలువునా ముంచెత్తేది. లోపలకి లాక్కుపోయేది. సముద్రంలో చాలా గొప్ప అంతర్వాహినులు వుండటంతో కత్తిమీద సాములా జాగ్రత్తగా ఆనందిస్తూ స్నానాలు చేసేవారు చలం వాళ్లు ఒడ్డునే.

అక్కడి ట్రయినింగ్ స్కూలు హెడ్మాష్టారుకి చలంగారంటే ఎంతో ఇష్టం. శ్రోత్రియ బ్రాహ్మణుడు, చలం వాళ్ళ వేషాలు, మాంసాలు తినడాలు, లీలగారి లీలలు ఆయనకి తెలిసినా సరే చలం అంటే గొప్ప గౌరవం ఆయనకి. భగవాన్ గురించి చెప్పించుకునో, చలంగారి యశోదా గీతాలు వినో వెళ్ళే వారాయన. ఆ ట్రయినింగ్ స్కూలు పిల్లలెంతో సరదా అయిన వాళ్ళు. వాళ్ళలో బం, రా, జో, ముఖ్యుడు. అతను ఒక నవల వ్రాశాడు. అది చలంగారికి చదివి వినిపించేవాడు. రోజూ చలంగారికి ఒక చంపకం పువ్వు ఇచ్చి

పెళ్ళేవాడు అతను చదివాక, భగవాన్‌కి పెట్టడానికి పూల కోసం ఎంత పరితపించినా షా వాళ్ళకి దొరికేవికావు. కానీ ఈ విధంగా రోజూ భగవాన్ ఒక్క చంపకం పువ్వుని అతనిద్వారాతెప్పించుకుని అలంకరింపచేసుకునేవారు. భగవాన్ మనస్సుల్ని దొంగిలించడంలో ఎంత దొంగో. పువ్వుల్ని దొంగిలించడంలోనూ అంతే దొంగ. పువ్వులు లేనిచోట్ల ఎల్లానో అట్లా పువ్వులు తెప్పించుకునేవారు. ఒకసారి షాని చలంగారిని చలంగారి స్నేహితుడైన శాస్త్రిగారు యింటికి మైలు దూరంలో వున్న ఒక చోటుకు తీసుకువెళ్ళారు. అక్కడ సముద్రం మలుపు తిరిగింది. ఒడ్డున ఎర్రటి మట్టి దిబ్బలు ఏర్పడ్డాయి....... వాటి ముందు చిన్న సర్వీ చెట్లు. చూడ్డానికి చాలా అందంగా వుంది. ఆ లోపలకి-చీలికలుగా దోవలు. ఒక దోవంబడి వెళ్ళారు. కొండల్లోంచి వెళ్తున్నట్టుంది. బురుజుల్లాగు. శిఖరాల్లాగు. ఏర్పాడ్డాయి- ఆ దిబ్బలు అవి సినిమాకి కట్టిన సెట్టింగుల్లాగ వున్నాయి. ఒక దోవన వెళ్ళితే తిరిగి....తిరిగి ఎక్కడ బయలు దేరామో అక్కడే వుంటాము. యింకో దోవను వెళ్ళితే వచ్చిన దోవ తెలీకుండా ఇంకో ఏ వైపుకో వెళతాం. చుట్టూవున్న శిఖరాలు, బురుజులు, ఆకాశం. ఎండ చలం వాళ్ళతో అలాగే నిలబడిపోయినట్టు వాళ్ళు శ్వాస తీసుకున్నప్పుడు అదీ వాళ్ళతో ఊపిరి పీల్చినట్లనిపించింది. అక్కడ అంత నిశ్శబ్దం. శాస్త్రిగారు చూపిన ఆ అందాల మట్టిగుట్టల్లో విహారానికని షా చలంగారు కలిసి వెళ్ళారు ఒక రోజు. దోవలో అబ్బాయి వాళ్ళకి పరిమళించే మొగలి పొత్తు అమ్మాడు. అల్లరిగా సరదాగా కబుర్లు చెప్పుకుంటో, నవ్వుతూ అక్కడంతా తిరిగి యింటికి బయలు దేరేటప్పటికి వాళ్ళకి తాము వచ్చిన దోవ కనిపించలేదు. సముద్రమూ కనపడదు.........చీలు దార్లల్లోంచి ఎమూలకో వెళ్ళుతారుగానీ, అసలు దోవ చేరుకోరు. అంతా పద్మ వ్యూహంలా అనిపించసాగింది. దోవ తప్పారు... ....చూడ డానికి నేలలాగ వుండి చివరికి వెళితే పెద్దఎత్తు. కాని షాకి ధైర్యమే. రాత్రిలోగా భగవాన్ దోవ చూపిస్తారని ఆకేతకీసుమాన్ని తన పటానికి అలంకరింప చేసుకుంటారని.

సూర్యుడు గుంకుతో వుండగా సంధ్యా సమయంలో ఒక దోవ కనిపించింది. చలంగారికీ, షాకి ప్రాణం లేచి వచ్చింది. సూర్యాస్తమయ మౌతోంది. పడమటి తాళ్ళ వెనక ఊదా, నారింజ, ఎరుపు, గులాబి రంగులో మబ్బులు-బంగారం. సూర్య బింబం చుట్టు ఆ గొప్ప శోభ వైపుకి వీపు తిప్పి ఎట్లా నడుస్తారు. తిరిగి.........తిరిగి చూశారు. సూర్యుణ్ణి చూస్తో వెనకాలగా నడిచారు. ఆదరా

బాదరా ఇంటికి బయలు దేరారు. ఎదురు గుండా కొండమీద గుడి, వెన్నెలలో స్ఫటికంతో చెక్కినట్లుగా వుంది. ఆ మహా సౌందర్యాన్ని అవలోకిస్తూ ఇల్లు చేరే సరికి సరిగ్గా ఏడు గంటలయింది. ఆ పుప్పు కోసం ఇంటికి దోవ దొరికేలాగ చేశారు. అల్లరి భగవాన్ దోవ తప్పడం, తనవల్ల దోవ దొరకడం-అంతా చలం కుటుంబ భవిష్యత్తుని సూచిస్తున్నవి.

చిత్రకి తొడ దగ్గిర గ్లాండ్ వాచి ఆ ఊరిలో డాక్టర్లు లేక ఇంటికి వెళ్ళి పోవల్సి వచ్చింది. అందుకని చిత్ర, చే, వక వక బెజవాడ వెళ్ళిపోయారు. లీలగారికి చలంగారి మీద కోపం వచ్చి కాకినాడ వెళ్ళిపోయారు బాబుని తీసుకుని. షౌ చలం మిగిలారు ఆ ఇంటికంతటికీ.

ఇంక వీలయినప్పుడల్లా సముద్రంలో ఒడ్డుకి వెళ్ళిపోయేవారు చలం, షౌ. ఆ వూరు నిండా మిలటరీ వాళ్ళు వుండేవారు ఇండియాలో ప్రతి సముద్ర తీరాన. ఆర్మీ పెట్టారు బ్రిటిషు వాళ్ళు. చలం, షౌ వాళ్ళు వుంటున్న యింటి తలుపులకీ, కిటికీలకీ గొళ్ళాలులేవు. చలం గారు స్కూలుకి వెడితే ఒంటరిగా యింట్లో వుండేది షౌ. ఆ తరువాత చలంగారు షౌ కాకినాడ వెళ్ళారు. వాళ్ళు తిరిగి వచ్చేప్పుడు వాళ్ళతోబాటు లీలగారు వచ్చేశారు వీణతో సహా. రోజూ షౌ, చలం, లీల షికారు పోయేవారు. ఎంతెంత దూరాలు పోయేవాళ్ళో ఎక్కడ ఏ ఇసుక దిబ్బల మీదో చీకటి పడేదాకా కూర్చునేవాళ్ళు ఒకొకప్పుడు సముద్రం పోటు మీద వుండి అక్కడి ఇసుక దిబ్బలదాకా వచ్చేసి నప్పుడు దారి మునిగిపోయేది. ఒకవైపు సముద్రం ఒక వైపు మొగలి, పొదలు ఆ చీకట్లో అలానే ఇల్లు చేరేవారు. లీల గారికి లోలోపల ఏమన్నా భయం తోచేదేమో! కాని షౌ ముందు అనక ఊరు కునేవారు గావును. కాని ఒకసారి షౌతో అన్నారు ఇక వుండలేక నడిమిదోవలో "షౌ నీకు భయం వెయ్యదూ?"

"ఎందుకండీ భయం?" అని అడిగింది షౌ "ఏ సోల్జర్ అన్నా విన్నూ నన్నూ పొదలలోకి ఈడ్చుకుపోతే, నాన్నని అసహాయుడిని చేసి కొడితే ఏం చెయ్యగలము?" అంది. ఆవిడకి యోచన ఏది వచ్చినా షౌ వాళ్ళతో అనడం భయం షౌ వాళ్ళదృష్టి ఎక్కడో వుండేది. "ఎందుకండీ మీకా భయం? ఎందుకని ఈడ్చుకు వెడతారు?" అంది షౌ.

కానీ లీలగారికి భయంవేయడం సహజమే.ఆవిడ అంతగా భయపడ్డాఎప్పుడూ భీమిలీలో సోల్జర్లు అసభ్యంగా ప్రవర్తించినట్టు వాళ్ళ చెవిన పడలేదు. భీమిలీలో

ఇల్లు ఊరిచివర ప్రదేశం. అంచేతనే లీలగారికి భయం. కాని ఆ సోల్జర్లు రాదలుచుకుంటే ఎవరేం చెయ్యగలరు ? ఆ యింటికి బందోబస్తు అనేదిలేదు.

ప్రొద్దున పూట లీలగారు వీణ సాధన చేసేవారు. చలం షా పాడేవారు. షా ఎంకిపాటలు పాడేది. చలం పాటకన్నా షా పాట ఆమెకి చాలా యిష్టం. లీలగారు కర్ణాటకం పాడినా, అందులో చాలా మట్టుకు హిందుస్తానీ కళలుండేవి. క్షేత్రయ్య పదాలు, జావళులు ఎంతో భావయుక్తంగా పాడేవారామె. ఆమె వీణతో పాడటమే గొప్ప అందమైన దృశ్యం. ఆమె సంగమేశ్వర శాస్త్రి గారి శిష్యురాలు. లీలగారి ఫక్కీలో మూడు జావళీలు నేర్చుకుంది షా వీణతో అంత గొప్పగా పాడే వారిని చూడటం షాకి అదే ప్రథమం. ఆ వీణా, ఆ గొంతు ఎంత చక్కగా కలిపిపోయేవో! ఒక్కొక్క పదంలోని మాట భావం లోపలికి తీసుకుని లీనమైపాడేవారామె. షా ఎంకి పాటలు పాడితే ఏవేవో స్మృతుల లోకి వెళ్ళిపోయేవారామె. కళా విషయంలో ముఖ్యంగా సంగీత పరంగా ఆమె అభిరుచి చాలా గొప్పది.

ఆమె వంట చేసే వారు. అదే మొదట ఆమె పొయ్యి దగ్గిరికి రావడం ఆమెకి వంటలో గొప్పచాతుర్యం వుంది. అక్కడ కాయ గూరలు దొరకక పొద్దున్న మాంసం, సాయంత్రం చేపలు వండుకునే వారు. వాటిని ఆమె ఎంత చక్కగా వండేవారో చెప్పలేము.

ఇంత రానురాను ఆమె చలం ప్రభావంలో పడడం మొదలు పెట్టారు. బట్టలమీద ఆమెకి లోగడ వున్న దృష్టిపోయింది. వెలిసిన చీరలు కట్టుకునే వారు. ఒక్కొక్కసారి చలం బనీనూ, లుంగీ కట్టుకునేవారు. చలం వాళ్ళ ఇంటిలో అన్నీ మట్టిపాత్రలే ఉపయోగించేవారు. ఇల్లంతా వుట్లు కట్టి వుండేవి. వాటిలోనే అన్నీ పెట్టుకునేవారు. అందరికీ భోజనాలు అవీ చేతితోనే వడ్డించేవారు. లీలగారు ఒకసారి షా వాళ్ళ మేనత్తగారి అమ్మాయి 'తాయి' వచ్చినప్పుడు రియలైజ్ చేసింది- ఆమె తాను తన ఎంగిలిచేతితోనే ఇన్నాళ్ళూ అందరికీ వడ్డిస్తున్నానని "నీ కభ్యంతరమా ఈ చేతితో వడ్డిస్తే" అని ఆమె 'తాయి'ని అడిగారు. అప్పుడు 'తాయి' "మేము కమ్యూనిస్టులం. మాకు అభ్యంతరం లేదు" అనే సరికి ఆమె ఎంతో సంతోషించారు.

లీలగారితో వాళ్ళబాబు వచ్చాడు. అతని హృదయం ఎంత విశాలమో, ఎంత ప్రేమమయమో చెప్పలేము. అప్పుడు ఆ అబ్బాయికి ఆరేళ్ళు వుంటాయి.

ఆ అబ్బాయికి సొంత తండ్రి తెలియక షౌ వాళ్ళని అక్కయ్యలుగా చలంగారిని నాన్నగా అనుకునేవాడు. అట్లాగే పిలిచేవాడు. తన వస్తువులతో పాటు షౌ వాళ్ళ వస్తువులు తీసుకుపోయి చాప కింద దాచి అడిగితే నేను తీయలేదని అబద్ధాలు చెప్పేవాడు. అతనికి తమ మీద ప్రేమా అభిమానం కనుక మెల్లగా అతన్ని అబద్ధాలు చెప్పే గుణంనించి మాన్పే ప్రయత్నాలు చేసేవారు షౌ వాళ్ళు. వస్తువు లేంకావల్సినా నీకు యిస్తాం, నువ్వు అబద్ధం చెప్పకు. అని చెప్పి మెల్లిగా అతని లోని ఆ అవగుణాల్ని తొలిగించేశారు.

అతను షౌకి ఎన్నోపువ్వులుతెచ్చి ఇచ్చేవాడు-భగవాన్‌కి అలంకరించడానికి-తన నేస్తాలకి షౌని 'మాఅక్కయ్య' అని గర్వంగా చూపించుకునేవాడు. అతన్ని భీమ్లీలోనే కాన్వెంటులో చేర్చారు లీలగారు. ఆ కాన్వెంటులో బియాట్రిస్ అనే ఒక నన్ వుండేది. అతను కాన్వెంటు నించి వచ్చి ఆవిడ గురించి తన్మయపడి పోయేవాడు. షౌ వాళ్ళకి ఆమె గురించి తెలియదు, ఆమెను గురించి, అతను గురించి అతను ఎన్నికలల్లోకి పోయేవాడో! అతను పెద్దయి షౌ వాళ్ళని చూడటానికి తిరువణ్ణామలై వొచ్చి నప్పుడు చెప్పాడు-తాను భీమ్లీ వెళ్ళి ప్రత్యేకంగా బియాట్రిస్‌ని చూచి వచ్చానని. అతను బియాట్రిస్‌ని గురించి మాట్లాడితే-అంచే తన బియాట్రిస్‌ని గురించి ఈ విధంగానే వర్ణించా దనిపించేది-డాంటే బియాట్రిస్ అతని కంటే చాలా చిన్నది-కానీ బాబు బియాట్రిస్ అతని కంటే చాలా పెద్దది-యింతే తేడా.

ఒక రోజు చలంగారితో వాళ్ళ కో టీచర్ తన కూతురు సమస్యల గురించి మాట్లాడుతున్నారు. వాళ్ళు ఏం మాట్లాడుకుంటున్నారోగానీ చలంగారు షౌని పిలిపించారు.చలంవాళ్ళ కోటీచర్ "నీకో రోజు డబ్బులేక ఆ రోజు తిండికి మాడిపోవల్సి వస్తుంది అనుకో! డబ్బు ఎక్కడ నించీ రాదనుకో! నీవు సంపాయించలేవనుకో-అప్పుడు ఏం చేస్తావు?" అని అడిగారు షౌని. తడుముకోకుండా "బిక్షం అడుక్కుంటాను" అని చెప్పింది షౌ. దాంతో విస్తుపోయిన ఆయన "ఇంత సంస్కారంలో పెరిగిన నువ్వు బిచ్చం ఎత్తుకొంటావా? అభిమానం అడ్డురాదా?" అని రెట్టించారు. "అడుక్కోక ఏం చేస్తావండి.అంత కంటే గత్యంతరం లేనప్పుడు.అభిమానం ఎట్లా అడ్డుపడుతుంది?" అంది షౌ. ఆయన కొంతసేపు వాదించి "మీ నాన్నే అనుకుంటే మీ నాన్నని మించి పోయావు. He is a hard nut to crack and you are a harder nut to crack" అని అన్నారు.

ఆ సంగతి లీలగారితో చెబితే-"నిజంగా అలా చెయ్యగలవా?" అని అడిగారు. వెంటనే షా "చెయ్యకేమండీ! మేం భవిష్యత్తు గురించి వూహించటంలేదు. దాని కోసం మేమేమీ పాటు పడటంలేదు. రేపు దారిద్ర్యాన్ని ఎదురుకోవాలంటే తప్ప కుండా అడుక్కుతింటాను. కాని జీవితంతో మాత్రం రాజీ పడబోవటంలేదు. చివ రికి ఏసైడ్ కాలువ పక్కనో దిక్కుమాలిన చావు వచ్చినా బాధపడను. జీవితంలో ఎంతో అందాల్లో బతికాను. ఇంక ఎట్లా చచ్చిపోతే నాకేం?" అంది షా.

కానీ, లీలగారు కన్విన్స్ కాలేక పోయినారు. ఆమెకి స్పష్టం, చలం-కుటుం బీకులు భవిష్యత్తు గురించి గోడవ పడటం లేదనీ, వాళ్ళకీ రేపన్న పదం తమ నిఘంటువుల్లో లేదని. ఇదామెకు నమ్మలేని చేదు నిజం.

ఇంతలో సంతి లీలగారి, అమ్మాయి భీమ్లీ వచ్చారు. సంతి, లీలగారి అమ్మాయి ప్రేమికులు. అంతదాకా లీలగారు తమ కూతురి తత్వం గురించి బాధ పడుతో చాలా చెప్పేవారు షా వాళ్ళకి. కానీ ఆ అమ్మాయి రావడంతో వాళ్ళిద్దరూ గదిలో చేరి తలుపులు బిగించు కున్నారు. ఇంక లీలగారు చలంగారికీ, పిల్లలకీ కనిపించడం మానుకొన్నారు. ఆమెలో ఏదో తిరుగుబాటు తలెత్తింది తానేమీ కానంత వెర్రిదాన్నై పోయానన్న కసి ఏదో బుసలు కొట్టింది. ఆమెలో-ఆ తల్లి దగ్గర లేకపోతే ఆ అమ్మాయి ఎంత చక్కగా మసిలేదో! అది ఆ అమ్మాయి చాక చక్యం. ఆ అమ్మాయిని ఎంతో ఇష్టపడేవారు అందరూ ఆమె చాకచక్యం వలన- కానీ తల్లీ పిల్లా కలిశారో-ఒకరికొకళ్ళు ప్రపంచం, మిగిలిన వాళ్ళంతాపై వాళ్ళే.... తల్లి ప్రభావం వలననే ఆ అమ్మాయి తన జీవితాన్ని చేతులారా సర్వనాశనం చేసుకుం . తల్లి జీవితాన్ని అధోగతి పాలు చేసింది.

సంతి భీమ్లీ సౌందర్య విలాసం చూచి వివశుడై పోయి భవిష్యత్తు గురించి పెద్ద.......పెద్ద కలలు కనేవాడు. ఒక్కొక్క అందం చూచి మూర్ఛలు పోయే వాడు. సముద్రంలో ఈతలాడి వచ్చేవాడు. బెస్త వాళ్ళతో నేస్తం కట్టి వాళ్ళతో కలసి చేపలు పట్టి తన వంతు చేపలు తెచ్చేవాడు ఇంటికి.

రోజూ ఆ అమ్మాయికీ ఇతనికీ కీచులాటలు తలెత్తేవి. సంతితో ఆ విష యం గురించి అతనికి కొన్ని సలహాలు ఇవ్వబోయింది షా.

త్వరల్లో ఆ అమ్మాయి వెళ్ళిపోయింది. సంతి ఎంతగా బాధ పడుతున్నాడో షాకి తెలుసు. ఇవన్నీ చూచి ఏం చెయ్యలేని విస్పృహాయతతో వుండేది షా.

సంతి తన ఆశయాల గురించి షా తో మాట్లాడేవాడు. అతని కలల్లో ఒక స్త్రీమూర్తి కానవచ్చేది. ఆమె విదేశీ వనిత అతని ప్రకారం. కానీ జాతకాల వాళ్ళంతా లీలగారి అమ్మాయి గురించే చెప్పేవారు, అతని జాతకంలో. నెల్లూరు కూడా సంతి జీవితం ఈ అమ్మాయిత్రోనే ముడిపడి వుందని చెప్పి పెళ్ళి చేసుకున్నట్లయితే, గొప్ప మిజరీ అనుభవిస్తావని చెప్పారు. తరువాత అతను భరించలేక బెజవాడ వెళ్ళి పోయాడు.

రాను రాను సిపాయిల సంఖ్య భీమ్లిలో పెరగడంతో చలం, లీలగారు, షా వేసవికాలం సెలవలకి బెజవాడకి బయలు దేరారు. ఎండాకాలంలో భీమ్లి ఇంకా అందంగా తయారయింది. అక్కడి గాలి, షర్బత్తు త్రాగినంతటి హాయి గొలిపేది.

లీలగారి అమ్మాయి వచ్చి సామానంతా సర్దిపెట్టింది-షాకి. షాతో "అన్నీ సర్దేశాను. నీకొక్కవల్సినవి, ఏదో ఇప్పుడే తీసుకో, మళ్ళీ పెట్టెని సర్దటం కష్టం" అంది, "నాకేం అక్కరలేదు" అంది షా. ఆరోజు ప్రయాణమై వెళ్ళి పోయే ముందు కోడికూర వేసుకుని అన్నాలు తిన్నారు. తింటూంటే షా కట్టుకున్న తెల్ల చీర మీద ఆ కూరపడి ఎర్రగా డాగుపడింది. షాని చీర మార్చుకోమంది ఆ అమ్మాయి. ఎంత బతిమాలినా మార్చుకోకుండ వున్న పళంగానే వూరికి ప్రయాణం అయింది.షా. ఎందుకంటే ఆ అమ్మాయి మళ్ళీ పెట్టె తియ్యనంది కనుక, ఆ పట్టుదల వల్ల. అక్కడ తాము పెంచుకున్న కుక్కపిల్లని బుట్టలో పెట్టి కట్టి కూడా తీసుకు వెళ్ళారు. వైజాగ్ చేరారు. స్టేషన్లో,రైలు నిండా అంతా సోల్జర్సు. ఇంటర్ క్లాసులో చలం వాళ్ళంతా ఎక్కుతుంటే మొరటుగా కోయజనం చొరబడటంతోటే తమ టిక్కెట్టుని సెకండ్ క్లాసుకి మార్చుకొన్నారు. ఆ సెకండ్ క్లాసు కంపార్ట్మెంట్లో ఆర్మీ ఆఫీసర్లు కూర్చొని వున్నారు. సోల్జర్స్ వుండగా ఆ పెట్టెలో సాధారణంగా సివిలియన్స్ ఎక్కడానికి భయపడతారు. అయినా షా వాళ్ళు సామాన్లతో ప్రవేశించేసరికి, ఆ ఆఫీసర్స్ మారుమాట లేకుండా వుండి పోయారు. వాళ్ళల్లో ఇద్దరు సామాన్లు అంది పుచ్చుకుని రేక్స్ మీద పెట్టారు. లీలగారు, చలం గారూ కూడా వచ్చికూర్చొన్నారు.

రైలు కదిలి కొంతదూరం వెళ్ళిందో లేదో పిల్లి బుట్టలోంచి మ్యావ్.... మ్యావ్ అంటూ గోల చెయ్యసాగింది. చివరికి అది బుట్టలోంచి వెలుపలికి వొచ్చేసి షా వొళ్ళో చేరింది. దాన్ని చూడగానే ఆర్మీ ఆఫీసర్స్ అంతా అదే పనిగా నవ్వారు. వాళ్ళతో చలం- పిల్లలూ- లీలగారూ నవ్వారు. చివరికి లీలగారితో

పిఠాపురంలో దిగారంతా. ఆ తెల్లవారు జామున షౌ. చలంగారు, పిన్ని బెజవాడ వచ్చేశారు ఆ తరువాత మళ్ళీ భీమ్‌లీ తిరిగివెళ్ళలేదు- చలం శలవుల్లో వున్నారు.

బెజవాడ వచ్చాక ముందు అమ్మ. వొయ్యి లీలగారిని ఎంతో ఆప్యాయంగా తీసుకున్నారు. ఆవిడా అలాగే వాళ్ళని తీసుకున్నారు. భీమ్లీలో వుండగానే ఆమెకి చలంగారి మీద ఒకరకం అయిన పొజసివ్‌నెస్ బయలుదేరింది. షౌ ఏవన్నా కథలు చెప్పినపుడు వాటిల్లో విషయాలు తనకి అన్వయించుకుని ఆవిడ రియాక్ట్ అయి. షౌ నన్నిట్లా అంటోందని నాన్నకి చెప్పేది ఆవిడ. రామ....రామ.... ఆవిడ బెజవాడ వొచ్చినప్పుడు ఎవరితో కలవక రిజర్వుడుగా కూర్చునేవారు. దాంతో వొయ్యి హర్ట్ అవడం మొదలు పెట్టింది.

ఆ ధోరణి వొయ్యికి ఎంతో బాధాకరంగా వుందని షౌకి తెలియవచ్చింది. ఒకరోజు వొయ్యి మాట్లాడుతూ వుంటే షౌ అడిగింది. "వొయ్యి నీకు బాధగా వుందా?" అని. వొయ్యి "నేను భరించలేకుండా వున్నాను" అంది. అప్పుడు షౌ చలం గారికి, లీలగారికి స్పష్టం చేసింది. "ఆవిడ ఇక్కడికి తరచు రావడంమంచిది కాదు. వొయ్యి బాధపడుతోంది." అని. లీలగారికి ఆ మాట నచ్చి వెళ్ళిపోయారు. చలం గారు ఏలూరు బదిలీ మీద వెడితే లీలగారు అక్కడికి వెళ్ళి ఇల్లు తీసుకుని చలంగారితో కలిసి జీవించడం మొదలుపెట్టారు.

## అయోమయలీల

భగవాన్ దగ్గిరికి వెళ్ళి వచ్చిన తరవాత నా ప్రపంచం మరీ అయోమయ మయింది. ఈ ప్రపంచం నాకు అర్థం కాదు. నాకే కాదు లోకంలోని గొప్ప మేధావంతులకి కూడా అర్థం కాదు. మనిషి మనసే అంత. అది చాలా అల్పం. అనంతమైన ఈ కాలాన్ని, ప్రపంచాన్ని తెలుసుకునే శక్తి దానికి లేదు. చావు తర వాత మనిషి ఏమౌతాడో తెలియదు. నిశ్చయంగా తెలియని దాని కోసం ఆలోచించి ఏం ప్రయోజనం? ఆ విషయాన్ని వొదిలేసి వూరుకోవడం ఉత్తమం.

మనల్ని పాత్రల్ని చేసి మీ చిత్తం వచ్చినట్టు నటించమని దీంట్లోకి తోసింది ఏదో మహాశక్తి. సరే. ఈ మూడు నాళ్ళ ముచ్చట తీర్చుకుని మనతోవన మనం పోదాం ఆ శక్తి ఎట్లా ఆడిస్తే అట్లా ఆడిపోదాం అనే బుద్ధిమంతులు అనేకు లున్నారు. వాళ్ళు ధన్యులు, ఇదేమిటి? దీని అంతు కనుక్కుందామని వ్యర్థంగా తలలు బద్దలు కొట్టుకునే నాబోటి కొందరు మూర్ఖులున్నారు. ఇన్నేళ్ళు ఆలోచిం

చాను, వెతికాను, చదివాను, అడిగాను, ఎవరికీ ఏమీ తెలియదని రూఢీ అయి పోయింది. స్త్రీ ప్రేమ తప్ప ఎంత వెతికినా, స్త్రీ ప్రేమకి మించినది ఈ లోకంలో అభిలషింప తగినది ఏదీ లేదు, అనే ఈ నిశ్చయానికి చాలాకాలం కిందటేవచ్చాను. కాని నాకు శాంతి లేదు నిద్రలేదు. అర్థం తెలియని బాధ.

ఈ స్త్రీ ప్రేమలో కూడా అనేక అంతర్యాలు వున్నాయి. స్త్రీని స్వార్థంగా సంకుచితంగా అనుభవించడంలో సుఖం చాలా తక్కువ. తనని అర్పించుకుని స్త్రీని ఆరాధించిన కొద్దీ ప్రేమ ఉజ్వలమౌతుంది. నన్ను ప్రేమించి నా బాధపై సానుభూతి చూపి తనలో నన్ను లాలించి నాకు సుషుప్తి నిచ్చే స్త్రీ రాబోతుందని చాలా కాలం కలలు కన్నాను. ఇప్పుడు ఆ ఆశా దూరమయింది. కల మాయ మయింది. జీవితమంతా బాధ పడటం తప్ప ఇంకేమీ లేదనుకున్నాను. అట్లాంటి స్థితిలో భగవాన్ దగ్గరికి వెళ్ళాను. ఆయన మాటలో నాకేదో ఆశ కలిగింది. కాని ఆయన కొన్ని జన్మలు సాధన చేస్తే తప్ప ఏమీ లభించేటట్టు చెయ్యనట్టున్నారు. ఇది ఒకనాటి వ్యవహారం కాదు. ఆయనని చూసి వచ్చినప్పటి నించి అవ్యక్తమైన బాధ ఎక్కువైంది నాకు.

వైజాగ్ బీచ్ మీద నా అనుభవంతో నాకు ఆశ కలిగింది. భగవాన్ తన థియరీని చెప్పడమే కాదు. ఆ సాధనకి సహాయం చేస్తారు. నా అశాంతిని, దుఃఖాన్ని పోగొట్ట గలరా ఆయన? నాకు శలవు వచ్చినప్పుడల్లా "షా"తో ఆశ్రమానికి వెళుతున్నాను. వెళ్ళినప్పుడల్లా తిరిగి వచ్చింతరువాత మెడిటేషన్ ఎక్కువయ్యేది. కాని ఎన్నాళ్ళకీ దానివల్ల నాకే ప్రయోజనం కనపడలేదు ఏ సుఖమూ, ఆనందమూ రాలేదు ఎన్నాళ్ళకీ. నా సుఖాలన్నీ పోయాయి. స్త్రీ పుస్తకం, సినిమా ఇవేమీ మనసుకి సంతోషాన్ని, సుఖాన్ని ఇవ్వటం లేదు. పోనీ సుఖదుఃఖాలు పోతా యనుకుంటే తల నెప్పులు, అనారోగ్యం, మనసులో అకారణయాతన, నిద్ర లేక పోవడం అన్నీ అట్లానే వున్నాయి.

ఈ లోపల "షా" చాల గొప్ప సాధనలో వుండేది. ఏమైనా సరే వదల కుండా చెయ్యమని తనకి తెలుసునని నన్ను గట్టిగా ప్రోత్సహిస్తోంది. కాని ఆమె అనుభవాల్ని hypnotism కింద auto suggestion కింద, intoxication కింద తుడిచేశాను. నా దుఃఖంలో, కష్టంలో బాగా మారుతున్నాను కసికొద్దీ.

* * * *

అది బెజవాడ. మా యింటి మూడో అంతస్తు. ఆ మేడ మీద మూడు వేపులా తెరిచి వున్న వరండాలో పడుకుని వున్నాను. బెజవాడలో వున్నప్పుడల్లా అక్కడే నేను పడుకునేది. తెల్లారగట్ట నాలుగు గంటలు. నా పక్కనే దగ్గిరగా పడుకుని నా మీద చెయ్యి వేసుకుని నా చెవిలోకి మాట్లాడుతోంది లీలగారి అమ్మాయి విమల.

"అసలు మేమెవరమో మీకు తెలియదు."

"మీరెవరో నాకేం అవసరం లేదు. మీరెవరైతేనేం? మీ మీద నాకు ప్రేమ అంతే. నాకు కావలసింది."

"ఐనా ఈ సంగతులు మా అమ్మ మీకు చెప్పమన్నారు."

"మేము వొంటర్ల జాతి వాళ్ళం. పిఠాపురం సంస్థానంలో ఉంటాము. మహారాజాగారి జ్ఞాతి ఐన రావు సూర్యారావుగారు నా తండ్రి. ఆయనకి సంగీతం మీద చాలా ప్రీతి. నాకు 8 ఏళ్ళు వయసు రాగానే వీణా విద్వాంసులు సంగమేశ్వర శాస్త్రిగారి వద్ద సంగీత శిక్షణకి నన్ను వదిలేశారు. ఇప్పుడు నా భర్త అంటానే ఆ వెంకట్రావుగారు నన్ను చూసి మోహించి, తన భార్యగా చేసుకోవాలనుకున్నారు. కాని నన్ను పెళ్ళి చేసుకోలేదు. ఆయనకి పెళ్ళి రాలేదు. పెళ్ళి చేసుకుంటే చచ్చిపోతారని ఆయన జాతకంలో ఉన్నదట.

ఆయన ధనికుడు. ఆస్తి పరుడు. ఆయనకి నన్ను యిచ్చి చేశారు మా వాళ్ళు. ఆయన చక్కని యిల్లు కట్టించి దాంటో పెట్టి నన్ను చూసిపోతూ వుండే వారు. ఆ విధంగానే ఆయనకి ముగ్గురు పిల్లల్ని కన్నాను. మా ఇంటిచుట్టూ చక్కని తోట వేశారు. ఆ తోటలో, ఇంట్లో చాలా గొప్పగా కాలం గడుపుతుందేదాన్ని, వీణ వాయించుకుంటో. నేను వీణ వాయించి పాడుతో వుంటే తెలిసిన వాళ్ళెవరెవరో వచ్చే వాళ్ళు వినడానికి. అంతే కాక పాత తెలుగు కావ్యాలు, ప్రబంధాలు చదువుకుంటో వుందేదాన్ని. కొత్తగా వస్తున్న నవలలు, కవిత్వాలు గూడా చదివేదాన్ని.

వెంకట్రావు అని నాకో బాల్య స్నేహితుడు వుండేవాడు. అతను క్రిష్ణశాస్త్రిగారికి దగ్గర మిత్రుడు. ఆ నాటికే క్రిష్ణశాస్త్రిగారు ప్రసిద్ధి కెక్కారు. ఆయన ద్వారా మీపేరు విన్నాడు వెంకట్రావు. వొక్కొక్కటే మీరప్పటికి రాసిన పుస్తకాలు తెచ్చేవాడు. మేము వొంటరిగానూ యిద్దరమూ కలిసి మీ పుస్తకాలన్నీ

చదువుకునే వాళ్ళం. ఈ పుస్తకాలు తప్ప బయట ప్రపంచం ఎరగని దాన్నినేను. నాకు ఘోషా. ఈ పుస్తకాలు తప్ప ఏ మనుషుల్నీ ఎరగను. మీ పుస్తకాలు చదవగానే ఎక్కడి నుంచో మే మెరగని లోకం నించి మీరు శాసిస్తున్నట్టుగా వుండేది. నన్ను నివ్వెరపడ చేసేదేమిటంటే— మీ కథల్లో మీరు చూపే స్త్రీ గౌరవం. అదెప్పుడూ ఏ పుస్తకాల్లో లేని విషయం. నిగూఢంగా స్త్రీ మనసులో ఏయే భావాలు దాక్కుంటాయో,ఎంతటి అదృష్టంలోనూ ఆమె ఏయే బాధలు రహస్యంగా పడుతో వుంటుందో, ఏయే విధంగా పురుషుడు తనకి తెలియకుండానే ఆమెని లోకువ చేస్తో వుంటాడో అన్నీ విశదం చేశారు స్త్రీకి. అణిగి పోయిన స్త్రీకి ఆత్మ గౌరవాన్ని, ఆత్మ విశ్వాసాన్ని యిచ్చారు.

ఒకనాడు వెంకట్రావు మీ శాంశక రాత ప్రతిని తెచ్చాడు. అది ఒకటే కాపీ ఉందని దాన్ని మీరు క్రిష్ణశాస్త్రికి యిచ్చారని. అది క్రిష్ణశాస్త్రికి అమూల్యమని చెప్పాడు. వెంటనే యిద్దరం కలసి మా తోటలో కూచుని చదవడం ప్రారంభించాము. దాంటో ఒక్కొక్క వాక్యం; ఆ కాగితాల్లోంచి కాక; ఆకాశం నించి వినపడుతున్నట్టుంది. ఆకాశం నుంచి ఎవరో మాకు వినిపిస్తున్నట్టయింది. అసలు మీ పుస్తకాలు ఎవరో ఒక మనిషి రాస్తున్నట్టు అనిపించేది కాదు నాకు. ఎక్కడి నించో ఆ పుస్తకాలు ఊరికే లోకం మీద పడుతున్నాయి అని అనుకునేదాన్ని. ఏ పత్రికలో మీరు రాసింది అచ్చయినా దాన్ని కొని తెచ్చి నాకిచ్చే వాడు వెంకట్రావు.

"ఈయన అసలు ఎక్కడ వుంటారని" అడిగాను.

"నాకు బాగా తెలియదన్నాడు" అతను.

"క్రిష్ణశాస్త్రిగారికి ఆయన అంత మిత్రులన్నారుగదా. ఎప్పుడూ ఈ వూరు రారా?" అని అడిగాను.

"ఆయన ఈ కవులతో తిరగరు. ఆయన ఊరినించి ఆయన కదలరు ఎవరు పిలిచినా."

"ఆయన్ని పిలవమను. తీసుకు రమ్మను. ఆయన ఈ వూరు వొచ్చాక నువ్వు ఆయన స్నేహం చేసుకుని...."

"ఇక్కడికి తీసుకురమ్మంటావా?"

"అమ్మో! యిక్కడికే! నువ్వు ఆయన్ని ఈ రోడ్డు వెంబడి షికారు తీసుకుపో. నేను తలుపు సందుల్లోంచి చూస్తాను ఆయన్ని."

"ఇంతకీ ఆయన యిటు వొచ్చినప్పుడు గదా!" అని వెళ్ళిపోయాడు.

ఇట్లా మిమల్ని గురించే కనుక్కుంటో, తెలుసుకుంటో పద్దెనిమిది ఏళ్ళు గడిపాం అని యిదంతా మీకు చెప్పమంది అమ్మ."

"మొన్న మొన్ననే మా నాన్నగారు చచ్చిపోయారు. చచ్చిపోయిన కొద్ది కాలానికే మీ దగ్గరికి మనిషిని పంపింది అమ్మ"

* * *

విసుల చెప్పిన కథని కొన్ని భాగాలు పూర్తిగా నమ్మడానికి వీల్లేదు. కొంత కాలం కిందట లీలగారు నాకు ఉత్తరాలు రాశారు. తన హృదయమంతా నాదేనని. తరవాత ఆమె మనుషుల్ని పంపారు నన్ను తీసుకురమ్మని. కాని నేను కదల్లేదు నాకేమీ ఇంటరెస్టు లేనందువల్ల. కావలిస్తే ఆమెని యిక్కడికే రమ్మన్నాను. చివరికి ఆమె వొచ్చారు. వొచ్చి నన్ను చూసినప్పటినించి ఆమె ఏమన్నారంటే—

"నిన్ను గురించే నేను జీవితమంతా కలలు కన్నాను. నీ కంటే నాకు వేరెవరూ లేరు. ఎప్పటికీ నువ్వు నన్ను తీసుకో" అని అడిగారు. అప్పటినించి మా యిద్దరికీ స్నేహమైంది.

ఆమె వీణ గొప్పగా వాయిస్తారు. దాంతో కలసి పాడతారు. ఆమె వీణ వాయిస్తో పాడేటప్పుడు చాలా గొప్పగా వుంటుంది. వీణతో ఆ విధంగా పాడిన వాళ్ళని నేను ఇంతవరకూ వినలేదు ఆమెది చాలా శ్రావ్యమైన కంఠం. ఆమెపైగా మనిషి అందం. మాట అందం. ఆమె నడకతీరు అన్నీ చాలా అందం. ఆమె జీవితంలో అందాన్ని cultivate చేసుకుని బతికినట్టున్నారు. ఇంకా నేనేమన్నా ఒక్కమాట మాట్లాడానంటే, ఆ మాటలో ఎంత గొప్ప అర్థముందో! ఏమిటో నన్ను వెతుకుతున్నట్టు వుండేవి ఆమె కళ్ళు. నా దగ్గిరనించి ఉత్తరం వెళ్ళక పోయినా. నా నించి ఒక్కమాట వినపడక పోయినా ఆమె చాలా తహ తహలాడేది. నేను ఆమె ఎడల అట్లాగే ఐనాను.

ఆవిడ రాకముందు భగవాన్ కలలోకనబడి ఒక చాల అందమైన స్త్రీ నన్ను కోరి వొస్తున్నట్టుగా, ఆమెలో తన అంశ వుండేట్టుగా అనిపించేటట్టు నాకు తెలియజేశారు. అందువల్ల నేనూ ఆశపడ్డాను. నేను జీవితమంతా ఏ శృంగారం కోసం

వెతుక్కుంటున్నానో, ఆ శృంగారం ఈమేనేమో : ఏ ఆశయం కోసం ఏ fulfilment కోసం నేను ఆశపడుతున్నానో భగవాన్ నా మనసు కిస్తారని: నేను ఆశ పడ్డ శాంతి, కాంతి ఈమెవల్లనే లభిస్తాయోమోనని నమ్మాను. అది కొంతకాలం అట్లాసాగింది. లీలగారి రాకతో నాలోని బాధలు తగ్గాయి. శూన్యత్వం మాయమయింది.

నేను వాళ్ళ వూరు వెళ్ళేవాడ్ని. ఆమె యిక్కడికి వొచ్చేవారు.కాని తొందర లోనే మా యిద్దరి మధ్య భేదాభిప్రాయాలు రావడం ప్రారంభించాయి. ముఖ్యం ఆమె సహించలేని దేమిటంటే-ఆమెకాక నా మనసులోకి ఇంకోర్ని తీసుకోవడం. నా పిల్లలూ, మా "వొయ్యి" మేమందరం నా కెంతో దగ్గిర ఆమెకి ఏమనిపించిం దంటే- ఏం చేసినా,- ఎంత ప్రేమించినా ఈ మనిషి నా వాడు కాదు. ఇతను వాళ్ళవాడే. ఆ పిల్లలే ఎక్కువ యితనికి అతనికి సంసారమే ఎక్కువ. నేను ఊరికే ఒక ఉపకరణం మాత్రమేననిపించేది తనకి.

"నా వంటి స్త్రీ తనని కోరివచ్చిందంటే ఎటువంటి పురుషుడైనా seventh heaven లో వుండేవాడు. నీ కెక్కడా తృప్తిలేదు. శాంతిలేదు. కృతజ్ఞత లేదు" అని తిట్టేది.

నన్ను ఆమె అంతా కోరేసింది. వేరే ఆలోచన లేకుండా, సర్వమూ తనకి కావాలి. అదిగాక ఏదన్నా ఉద్యమమో, ఉద్యోగమో ఇట్లాంటి వాటిలో పురుషుడి మనసు వుండవొచ్చు గాని, ప్రేమ వ్యవహార మనేప్పటికి, అంతా ఆ విధంగా కాలేను. ఏం చేసినా నేను కాలేను. ఆవిడ నానించి వేసు. నేను ఎంత ప్రయ త్నించీ ఆమెలో ఐక్యంకాలేక పోయాను. నాకు నా మనసులో ఎన్నో ఆశయాలు, ఎన్నో యత్నాలు. పైగా ముఖ్యం "షా" వాళ్ళమీద ప్రేమ. ఇవన్నీ పెట్టుకుని ఆవిడకి నేను అంకితం కాలేక పోయాను. దాంతో మా యిద్దరికీ విరోధాలు హెచ్చి పోయాయి. పోట్లాటలంటే పోట్లాడుకోవడం కాదు. కాని వ్యత్యాసం వొచ్చింది.

నేనే బుద్ధిగలవాడ్నైతే వెంటనే ఎప్పుడైతే ఆ వ్యత్యాసాలు కనబడ్డాయో అప్పుడే ఆమెనించి గుడ్ బై చెప్పి వెళ్ళిపోవలసింది. కాని అది ఏం కర్మో నాకు తెలియదు, ఆమెని వొదలలేక పోయాను. ఆమెతో ఏ సంబంధమూ లేదు. ఆఖరికి మా యిద్దరికీ ప్రేమచూపులన్నా లేవు. లేకపోయినా అంత ఎడమైనప్పటికీ అమెను వొదల్లేదు. ఆమె నన్ను వొదల్లేదు. అది ఏమన్నా వరమో, శాపమో తెలియదు

అట్లా ఎందుకైనామో నేను యిప్పుడు తెలుసుకోలేను. ఇంకా రెండుమూడేళ్ళు కలిసి ఉన్నాం. అదంతా కూడా నా జీవితంలో కల్లా ఘోరమైన కాలం.

ఇంటి దగ్గిర డాక్టరుగారికి, వాళ్ళకి చాలా బాధ కలిగిస్తున్నాను. కాని నేనప్పుడు ఒక మనిషికాను. నాకు యోచనాశక్తి పోయింది. నేనూ, నా నియమాలు, నా స్వభావాలు, నా పద్ధతి అంతా, ఇదివరకటి దంతా వేరు. ఇప్పుడు నేను తలుచుకుంటే నేనే మయాననిః వుత్త వెధవనై పోయాను. ఏక్కడా ఏమిలేకుండా, ఆ విధంగా నేను చాలా నలిగిపోయాను, కష్టపడి పోయాను. వొదిలించుకోవాలంటే వొదిలించుకోలేను. పోవాలంటే పోలేను. ఇదంతా వొదిలి ఎక్కడికన్నా పారిపోవాలనిపించింది. కాని ఎక్కడికి పోను నేను? నాకు డబ్బులేదు, ఆరోగ్యంలేదు.

బెజవాడ పోవాలంటే ఎందుకో బెజవాడంటే చాల కష్టమైపోయింది నాకు. బెజవాడలో ఒకరోజు వుండలేను, పిల్లలు, వీళ్ళందరూ కావాలి. కాని ఆ బెజవాడ ఆ వైద్యం, ఆ వొయ్యి ఎప్పుడూ ఏదో పనులమీద తిరుగుతూ వుండడం.యిదంతా నాకు ఏ కారణమని కాదు. ఎందుకో నేను అక్కడ వుండలేను. ఎప్పుడు వెళ్ళిపోదామా అనిపించేది. కాని లీలగారు నాకు నా భోజనం, శరీర సౌకర్యాలన్నీ ఎంత శ్రద్ధగా కనిపెట్టి సదుపాయం చేసేవారో! నన్ను అన్ని విధాల ఈ శరీరాన్ని సుఖపెట్టారు. కాని నా ఆత్మ మాత్రం ఎప్పుడూ దిగులుతో, అశాంతితో కొట్టుకుపోయేది. భగవాన్ దగ్గిరికి పోదామనుకుంటాను. కాని నాకు ఆరోగ్యమేదీ? అక్కడికి వెళ్ళి ఎట్లా బతకను? పైగా అక్కడికి వెళ్ళిన దగ్గిరనుంచీ పెద్ద క్షోభ మనసులో. ఇటువంటి సంశయాలు పెట్టుకుని భగవాన్ దగ్గిరికి వెళ్ళితే ఏం ప్రయోజనంలేదు. వెళ్ళి అక్కడ ఆయన పాదాక్రాంతులై పోవలసిందే, కాని అట్లాంటి విశ్వాసం ఆయనలో నాకు లేదు. లీలగారు చాలా తెలివిగలవారు, బాగా చదువుకున్నవారు. లోక వ్యవహారాల్లో విచక్షణా జ్ఞానం ఎక్కువ ఆమెకి.

తగాదాలు ప్రారంభించినప్పటి నుంచి, భగవాన్ తరుచూ కలల్లో కనబడుతూనే వున్నారు ఆమెకి.

"అతన్ని కష్ట పెట్టవద్దు. అతని యెడల స్నేహంగా, ప్రేమగా వుండు" అని బోధిస్తూనే వున్నారు. "అతను నాకు చాల ప్రియమైన వాడు జాగ్రత్త" అని అంటోనే వున్నారు.

అయినా ఆమె స్వభావాన్ని ఏ మాత్రం మార్చుకోలేక పోయింది. లీలగారితో ఉన్నన్నాళ్ళు కూడా నేను భగవాన్ని మనసులో ప్రతి రోజూ పూజ

చేస్తూనే వున్నాను. ఆమెతో సంబంధం miserable అయిన కొద్దీ "భగవాన్! ఈ సంబంధంలోంచి మాకు ఔన్నత్యాన్నైనా యివ్వు, నేనశక్తుణ్ణి. ఆమెని విడవ లేకుండా వున్నాను నువ్వు దీన్ని తుంచేసి నాకు స్వేచ్ఛన్నా యివ్వు." అని అడుగుతూనే వున్నాను.

కాని ఏ దిక్కునుండి ఏ సహాయమూ రాలేదు నాకు. దినదినమూ నా స్థితి హీనమైపోతోంది. ఎన్నిసార్లో లీలగార్ని బతిమాలాను నాతో అరుణాచలంరమ్మని. ఆమెకి భగవాన్ అంటే నిష్కారణ వైరం. ఆమెకి ఎట్లానో తెలుసు నేను భగవాన్ దగ్గిరే తేల్తానని. ఆమెనించి నన్ను తప్పించగల శక్తి ఆయన కొక్కరికే వుందని ఒకసారి ఆమె అన్నారు.

"నీది ఒట్టి సన్యాసి బతుకు, నీకు ఎట్లాపట్టిందో ఈ స్త్రీ బలహీనం." ఆమె కదల్లేదు. ఆమె లేనిది నేను కదలలేక పోయాను. బొటన వేలితో నొక్కి ఆయన నన్ను ఆ బురదలోనే వుంచారు.

ఏ సమస్యలూ భరించే శక్తి పోయింది నాకు. వూరికే పక్కమీద శాంతంగా, చదువుకుంటో పడుకుని వుంటాను. నా కప్పుడు ఏ గొడవా ఏ తాపత్రయాన్ని రానీరు లీలగారు. ప్రతిపూటా నాకిష్టమైన చాపలకూర వండిస్తారు. కాని నా లోపల ఏదో కాలుస్తుంది ముఖ్యం పిల్లలనించి. వొయ్యిలేదు లీలగారు ఉత్తమురాలైన స్త్రీ. Prudent. Intelligent with a hankering for higher values. వాటన్నిటినీ మించిన Plane వొకటి వుందని ఆమె దూరంగా చూడగలదు. Appreciate కూడా చెయ్యగలదు, దాన్ని ఆమె తన జీవితం మీదకి వస్తేమాత్రం భరించలేదు. దాన్ని ముందు చాలా తను Inferior గా feel అవుతుంది. దాంతో ఆమె అహం అధికంగా పైకి లేస్తుంది. మమ్మల్నీ వొ:ల్లేదు మింగలేదు. క్విక్ షైర్ లో సగం వరకు కూరుకుపోయి పైకి లేవాలని తంటాలు పడే మనిషి మల్లె అయింది నా స్థితి.

లీలగారికి ఒక్కడే కొడుకు. అతనికి ప్రాణం మీదికి వొచ్చింది జబ్బు. చచ్చిపోతున్నాడని ఒకటే ఏడుస్తున్నారు. అప్పుడు నేను,—

"అతన్ని బతికించమని భగవాన్ని ప్రార్థిస్తాను. అతను బతికినట్టయితే భగ వాన్ని చూడ్డానికి వస్తావా?" అని అడిగాను.

ఆమె కెంత అయిష్టమో భగవాన్ దగ్గిరికి రావాలంటే అప్పుడు తెలిసింది, నాలో ఆమెకి చిక్కక తప్పించుకునే భాగమంతా భగవాన్ సంబంధమైనదని ఆమెకి

తెలుసుననుకుంటాను. conscious గానో sub-conscious గానో ఆమె వొప్పు కోక తటవటాయించారు. ఆమె కళ్ళు ఎదటే ఆ కుర్రాడు నిమిష నిమిషం sink ఐపోతున్నాడు. ఇంక గతి లేక సరేనన్నారు నేను వెంటనే భగవాన్‌కి ఈ అబ్బాయిని రక్షించమని టెలిగ్రామ్ యిచ్చాను వెంటనే అతను ఆ crisis నుంచి బయట పడ్డాడు.

తరవాత రోజుల్లో గూడా తన వాగ్దానం నించి తప్పించు కోవాలని చూసింది ఆమె. కాని నేను గట్టిగా పట్టుబట్టాను. ఏ గతీ లేక బయలుదేరారు పిల్లలతో సహా, అప్పటికే 'T' (టీ) అక్కడ సెటిలయి వుంది. లీలగారు,ఆమె కూతురు భగవాన్ని దూరం నించి చూసి వొణికేవారు. ఎంత అధములు, పాపాత్ములు ఆయన ముందుకి రాగలిగేవారు. కాని వీరు అసలు రాలేకపోయారు. చివరికి భగవాన్ నించి నేను శలవు తీసుకోడానికి వెళితే వాళ్ళు రానేలేదు.ఎంత దుష్టులో, నిష్కారణంగా భగవాన్ ఉగ్రులై మాట్లాడారు నాతో. అప్పటికీ నారు బుద్ధిరాలేదు. నా కళ్ళు తెరుచుకోలేదు చివరికి ఆయన్నించి శలవు తీసుకోకుండానే లీలగారి భయంతో వెళ్ళిపోయాను. అప్పటినించి నాకు ఎన్ని బాధలో! కొద్ది రోజుల్లో లీలగారికి పెద్ద జబ్బుచేసింది. ఏ డాక్టరుకి చూపినా ఆ జబ్బు మానసిక మంటారు. కాని చచ్చిపోతున్నాననే భయం పట్టుకుంది" ఆమెకి.

ఇట్లాగే కాలం గడుస్తోండగా వొయ్యి చచ్చిపోయింది. నేనింక పిల్లలతోనే వుండి పోయాను. లీలగారితో రానన్నాను, ఆమె వచ్చి బెజవాడలో మాతో వుండ డానికి చాలా ప్రయత్నం చేశారు. అట్లా కాకపోతే మమ్మల్ని తనతో రమన్నారు. తనే మా బాధ్యత అంతా తీసుకుంటానని.అదీ practical కాదని అనుకున్నాం, ఇంక బలవంతం మీద మమ్మల్ని విడిచి ఆమె పూరు వెళ్ళిపోయినారు. అదిగాక మేము బెజవాడ వొదలి అరుణాచలం వెళ్ళిపోతున్నాం. లీలగారితో నాకు ఆదర్శ స్త్రీ పిచ్చి వొదిలి పోయింది. ముందు తాను ఆదర్శ పురుషుడైతే తప్ప. ఆదర్శ స్త్రీ ఎక్కడ నించి వొస్తుంది?

## నూజివీడులో

లీలగారి అబ్బాయి బాబుకి టైఫాయిడ్ వస్తే, ఆ జబ్బులో వంతి అతనికి అమోఘమైన సేవచేశాడు. వసంత్‌లో అలాంటి స్వార్ధరాహిత్యం, సేవాగుణం! ఆ అబ్బాయికి జ్వరం ఎక్కువై బ్రతకడనుకున్నారు. చలంగారు 'వొయ్యి'కి టెలి

గ్రాం యిచ్చారు, బయల్దేరి రమ్మనమని. డాక్టరుగారికి బి.పి. ఆరోగ్యం సరిగా లేదు. అయినా ఒక డాక్టరిగారి కారు తీసుకుని వెళ్ళి అబ్బాయినీ, లీలగారినీ (నూజివీడు నుంచి) తీసుకుని వచ్చేశారు. 'వాళ్ళు'లో ఆ ఔన్నత్యం ఆశ్చర్య కరమే. ఎంతో ఔదార్యంతో తన కన్సల్టింగు టేబిల్ దగ్గరనే ఆ అబ్బాయికి పక్క వేయించి కనిపెట్టి మందులిచ్చేది.

లీలగారంటే పెద్దక్కయ్య (పెద్ద రంగనాయకమ్మగారు) ఎంతో యిష్టపడి ప్రేమగా చూసేది. లీలగారు అదంతా తన ఘనతేనన్న గర్వంతో ముడుచుకు పోయేవారు. తమ చుట్టూ తాము గిరి గీసుకుని కూర్చునే మనుషులపట్ల ప్రేమ చూపితే తన ఘనతని చూసే ఎదుటి వాళ్ళు తమను ప్రేమిస్తున్నారనుకుని హృద యానికి అంధత్వాన్ని ఆవహింప చేసుకుంటారు, అంతే!

చలంగారి ప్రోద్బలం వల్ల లీలగారు వాళ్ళ బాబుకి తగ్గితే భగవాన్ దగ్గిరికి వాస్తామని మొక్కుకున్నారు. అతనికి తగ్గినాక లీలగారు చలంగారు అంతా తిరువణ్ణామలై బయలుదేరుతుంటే 'షౌ' లోపల అనిపించక ముందు బయల్దేరి తరవాత ఆగింది.

లీలగారు వాళ్ళు తిరువణ్ణామలైలో అమ్మ దగ్గిర దిగారు. వాళ్ళను చూడ గానే భగవాన్ 'ఆ బిడ్డరాలేదేం' అని అడిగారట. చలం టెలిగ్రాం యిచ్చారు 'షౌ'కి- 'భగవాన్ నిన్నడుగుతున్నారు' అని. ఉత్సాహంలేక మానుకుంది 'షౌ'.

నంతి- లీలగారి అమ్మాయి పోట్లాడుకున్నారు, ప్రయాణానికి ముందే. ఆశ్రమం నించి ఆమె ఉత్తరం రాసింది. 'నేను నువ్వు చెప్పినట్లల్లా వింటాను, నన్ను వొదలద్దు' అని. కాని నంతికి తెలుసు, ఆ అమ్మాయివల్ల తనకు misery తప్ప ఏమీ లేదని. ఆ అమ్మాయి పద్ధతులు ఎంత మాత్రం అతనికి నచ్చేవికావు' "నువ్వు వేరే పెళ్ళి చేసుకో" అని స్పష్టం చేశాడు ఆమెకి చివరికి. ఆ అమ్మాయిని వేరే పెళ్ళికి encourage చేసి తనని తను రక్షించుకున్నాడు-జీవితంలో.

ప్రాణ రమణ! కరుణా చరణ!
శ్రితయాచక శోకహరణ!
నవ విధాత కిరణ కంకణ!
ప్రాణ రమణ!

# 28

# సౌరిస్ బాల్య విలాసం

'సౌరిస్' ఒక ఇంగ్లీషు నవలలోని ఫ్రెంచి కథానాయిక పేరు. హాస్పేట్‌లో ఏప్రిల్ నెలలో పదమూడవ తేదీ రాత్రి రంగనాయకమ్మకి ఓ పాపాయి పుట్టింది. అది 1921వ సంవత్సరం. తెల్లని బట్టలలో ఆ పాపని చూసీ చూడగానే 'హల్లో! అనిబిసెంట్!' అని చలం గ్రీట్ చేశాడు. తెల్లారి పాపాయి పుట్టిన కబురువిని మొక్కపాటి రామ్మూర్తి 'పుటక యింత సహజంగా వుంటుందా' అని ఆశ్చర్యపోయి 'చావు కూడా యింత సహజంగావుంటే ఎంత బావుండునో' అని కామెంట్ చేశాడ్డ. శశిరేఖ రాసిన సంవత్సరమే 'షా' పుట్టుక—

ఆ రోజుల్లో చలం హాస్పేట్ మునిసిపల్ హైస్కూల్లో హెడ్ మాస్టరుగా పని చేసేవారు. అలా వుండక ఆ వూరి మునిసిపల్ చైర్మన్‌ని అందరినీ ఎదిరించి 'రెబెల్' అయాడు. ఒంటరిగా పోరాటం-ఎవరి సహాయంలేదు. స్టూడెంట్సు వాళ్ళ తండ్రులూ చలం పక్షం కావడంతో అధికారవర్గం తగ్గక తప్పలేదు. స్కూలు నిర్వహణంతా తన యిష్టప్రకారం చలమే నడిపేవాడు. అప్పట్లో మరో దిక్కు

లేక రామ్మూర్తి, రత్నమ్మ, ప్రకాశం, సత్యవతి వచ్చి చలంగారింట్లో వున్నారు. చలం భార్య రంగనాయకమ్మగారికి వారి పాతకోపాలుండేవి(రాజమండ్రి నాటివి). అవన్నీ విస్మరించి వీరిని దగ్గరకు తీసుకుంది. ఆమె కడుపుతో వుంది సౌరిస్ని. ఈ వచ్చిన వాళ్ళెవరూ ఆమెకు సహాయంగా వుండలేదు. అప్పుడు చలంగారికి వెలి (సంఘ బహిష్కారం) వుండేది. ఇంత మందికి చాకిరీచేసి వొండి పెడు తుండేది. ఆమె గర్భిణి-వొంగి వంట చేసుకోవటం కష్టం అవుతోందని చలం, ప్రకాశం రాత్రికి రాత్రి మట్టితట్టలు మోసి నిలబడి వంట చేసుకుందుకు వీలుగా ఎత్తయిన ఓ అరుగుకట్టారు. ప్రకాశం, రామ్మూర్తీ ఆ హైస్కూల్లో చలానికి అసిస్టెంట్సు, ఉద్యోగాలు చలం యిచ్చినవే.

చలం పెద్ద కుమారుడు రవికి ఓ కర్పూరపు బొమ్మ వుండేది. దాన్తో ఆడు కునేవాడు చెల్లెలు పుట్టేదాకా. పాప పుట్టగానే 'నాకు చెల్లెలు పుట్టింది, ఇంక ఈ బొమ్మెందుకు' అని గదిలో మధ్య, వేలాడేసి ఆ బొమ్మను కాల్చేశాడట. అప్పటికి రవి వయస్సు అయిదేళ్ళు. చెల్లెల్ని పడుకోబెట్టిన గది ముందు కత్తి పుచ్చుకుని నిలుచుని ఎవరూ ఎత్తుకుపోకుండా కాపలా కాసేవాడట. పాపాయిని చూడలంటే తన పర్మిషన్ కావాలి. ఇరవై ఒకటో రోజు నుంచి పచ్చిబాలెంత అయిన రంగ నాయకమ్మగారే ఇంటెడు చాకిరీ చేసుకునేది. సెలవులకు 'వొయ్యి' (డాక్టరు రంగ నాయకమ్మ) వచ్చింది. చలంగారి తమ్ముళ్ళు చిన్నతనంలో వదిన అనడం చేత గాక 'వొయ్యి' అని పిలిచేవాళ్ళట.చలం కూడా ఆమెను 'వొయ్యి' అనే పిలిచేవాడు.

పాపాయి 'సౌరిస్'ని వరండాలో కట్టిన కెమోక్లో పడుకో పెట్టేవారు' చలం, రవి, వొయ్యి ఎన్నో సుందరమైన గొప్ప కవిత్వాలు కావ్యాలు (టాగూర్ పుస్తకాలు, లారెన్స్ హోప్ మొగల్ కవిత్వం, జెబున్నిసా దివాన్ ఇవన్నీ) చదువు కుంటూంటే, ఆకాశంలో తేలిపోయే మబ్బుల్ని చూస్తూ, గాలి అలలు మొహాన తాకినపుడల్లా గలగలా నవ్వేది పాప.

చలం, స్నేహితులు యింకా నెలయినా నిండని ఒళ్ళారని పసిపాపను గడకి జోలికట్టి అందులో పడుకోబెట్టి రెండు చివర్లా యిద్దరూ పట్టుకుని కులాసా కబుర్లు చెప్పుకుంటూ షికార్లకు తీసుకుపోయే వారు.

స్కూల్లు తగాదాలు తారస్థాయికి విజృంభించాయి. చలం, సుబ్బరాయన్ కుమార మంగళం దగ్గిరికి వుద్యోగం కోసం వెళ్ళగా ఆయన తన ఎస్టేటు మేనే

జర్‌గా రమ్మన్నాడు. వెళ్లామనుకునే లోగా మలేరియా వచ్చి రవినీ చలాన్నీ కావి లించుకుంది. కుటుంబం అంతా తెనాలి వెళ్ళిపోవలసి వచ్చింది. జ్వరం తగ్గాక కుమార మంగళం వద్దకు వెళితే ఆ ఉద్యోగం భర్తీ అయిందని, తన పిల్లలకు ట్యూటర్‌గా వుండమని అన్నాడు. జీతం చాలదని వచ్చేసి వేరే ఉద్యోగానికి దర ఖాస్తు పెట్టగా రాజమండ్రిలో గవర్నమెంటు ట్రయినింగ్ స్కూల్లో ఉద్యోగం వచ్చింది. అంతా రాజమండ్రి వచ్చారు. అయన రచనల్లోని తీవ్రమైన సంస్క రణ భావాల వలన ఎప్పుడూ వెలే. ఊరి చివర కొంప, అడివిలో ఆయనవాసం, నివాసం. ఆ రోజుల్లో అక్కడే రామ్మూర్తి, రత్నమ్మా వుండేవారు. చీకట్లుయింకా లేతగా పడుతూండగా గోదావరిని చూస్తూ ఆరు బయట భోజనాలూ, కబుర్లూ, నిత్య పండుగే. పిల్లలకి నిద్ర వచ్చేదాకా కథలు చెప్పడం- సెలవు రోజున రవితో, షాతో గోదావరిలో పడవ షికార్లు. సూర్యరశ్మి తగలని నీలపు నీళ్ళలో పావని ముంచెత్తేవారట. ఒకప్పుడు అలలమీద తేలుతూ పడవ వెంట వచ్చేదట 'షా'. ఇసుక దిబ్బలమీద కాపురం గురించి కబుర్లు-పిల్లలచేత ఆటకోలుగా పుత్తత్తి దుకాణం పెట్టించి వారికి కాలక్షేపం కలిగించేవారు.

స్కూలు నించి చలం రాగానే ఆయన బూట్లు వేసుకుని "షా" చలంలా వడిస్తే, చలం ఆమె వెనకాల పాకుతూ రావడం-

'షా నీకేం కావాలి?'

'పూలు'

పూలు కాక మరేదైనా అడిగితే 'నువ్వు 'షా'వి కాదు' అనేది 'షా'

అమ్మని 'నీకేం కావాలి T?' (చిట్టి రంగనాయకమ్మగారిని చిట్టి అని పిలవ లేక T అని పిలిచేవారు చలం)

రంగనాయకమ్మ 'పాలపీకలు' తెమ్మని అనేది రోజూ. ఇదీ ఆట.

ఏడాది దాటాక కూడా పాలు తాగితే వీల్లేదని కట్టడి చేసేరు చలం.

అమ్మానాన్న అన్నాలు తింటుంటే వెళ్ళి చూడటానికి, గడపదాటడానికి వీల్లేదు. 'అమ్మాబాయి,' అని అడగ వీలులేదు. గుమ్మం దగ్గరే చూస్తో ఎప్పుడో నిద్రలోకి వెళ్ళిపోయేది. లేస్తూనే 'అమ్మకోకో' అంటూ లేచేది.

వసంత్ పుట్టాక రంగనాయకమ్మ జబ్బుపడి వైద్యానికని తెనాలి వెళ్ళింది. రవి 'వొయ్యి'తో హైదరాబాద్ వెళ్ళాడు. ఇంట్లో చలం, సౌరిస్ ఇద్దరే. హోటల్లో భోజనం చేసి చలం కాలేజికి వెడితే 'షౌ' పక్కనున్న పెద్ద సాయిబు గారింటికి వెళ్ళేది. ఆ రోజుల్లో ఆ పాపతో ఆడుకోడానికి ఓ జింక పిల్ల, కుక్కపిల్ల, పిల్లి వుండేవి. ఇవి చాలక ఓ రోజు ఓ గాడిద పిల్ల వెడుతోంటే 'నాన్నా నాకు ఆ గాడిద కావాలి' అంది 'షౌ'. వెంటనే అయిదు రూపాయలు పెట్టి ఆ గాడిదను కొనేశాడు చలం. ఆ చుట్టుపక్కల వాళ్ళు దాన్ని వుపయోగించేవారు, దాన్ని వెతికి తెచ్చి ఇంట్లో కట్టేసేవాడో గదిలో రాత్రిళ్ళు.

'నా గాడిదా నా గాడిదా' అంటూ 'షౌ' ఆడుకోడం ఆరంభిస్తే 'నన్నేగా పిలుస్తున్నావ్' అని చాలా సిన్సియర్ గా అడిగేవాడ్ట చలం. పెద్దసాయెబు గారీయన గాడిదవేట చూసి పిచ్చి కాబోలనుకుని 'ఎందుకండీ మేష్టారూ ఈ గాడిద మీకు 'అంటే' 'నేనసలెవరో తెలుసుకోడానికి' అని అన్నాడట.

పెద్ద సాయెబుగారింటికి చలంగారింటికి మధ్య మొండిగోడ అడ్డం లేచి పాలూ అవీ తాగగానే గౌనువేసి గోడమీంచి సాయెబు గారింట్లో వాళ్ళకి అందిచ్చేసే వారట 'షౌ'ని. వెంటనే వాళ్ళు వాళ్ళ పద్ధతిలో బట్టలు వేసేవారట. మళ్ళీ రాత్రి నిద్రపోయాక గౌను మార్చి గోడమీదనుంచి అందిచ్చేవారు. అక్కడ ఎప్పుడూ వుండటం వల్ల ఉర్దూమాటలు ముందు వచ్చాయి. 'షౌ'కి, పెద్ద సాయెబుగారి ఆరేళ్ళ అమ్మాయి సర్దార్ అంటే ప్రాణం. సీతాఫలం చెట్లమీద చిలకల్ని ఆశ్చర్యంగా చూస్తూ పెంపుడు పావురాల్ని చేతుల్లో పట్టుకుని- తన నేస్తురాలిని 'దర్దార్ దర్దార్' అనిపిలిచేది. 'షౌ'కి, గోదావరి, రైల్వే వంతెనా బాల్యంలో ప్రథమ మధుర స్మృతులు

తనెవరితోనో మాట్లాడుతున్నట్టూ వారు గ్రామ దేవతలైనట్టూ తనతో వచ్చెయ్యమని అడిగినట్టు ఆ పాపకి అంత చిన్న వయస్సులో అనుభవాలు కలిగేవట.

తల్లి జబ్బుపడితే తమ్ముడికి పాలుపట్టడంలాటి చిన్నచిన్న పనులు చిట్టిచిట్టి చేతుల్తో చేసేది. రెండు మూడేళ్ళు వచ్చేదాకా బందరులో వుంది

బందరులో మొదట్లో ఒక పాకలో కాపురం, చుట్టూ అందమైన చెట్లు- దాయీ పేరు అచ్చమ్మ. తరువాత వూరవతల ఒకపెద్దతోటలో కాపురంవుండేవారు.

ఏదో సంచీలో యిరుక్కున్నట్లు అనిపించేదట, నీళ్ళల్లో తేలక మునుగుతాం ఎందు వలన- యిలా అన్నీ విచిత్రంగా వుండేవిట. దేనిలోంచో బయటపడాలని తల గోడకేసి మోదుకునేది. నడుస్తూ పడిపోతే ఎందుకు పడిపోవడం అనుకునేది. పిల్లకు ఏమైనా పిచ్చితనం వుందా అనిపించేది. అమ్మానాన్న నిద్రపోతుంటే అలా నిద్ర పోవడం ఓ జబ్బు అనుకునేది. తన ఆకలే తనకు తెలీదు. పైగా మిక్కుటమైన పరధ్యాస. 'సొజ్జీ'లాంటిది చేసి అమ్మతినిపిస్తే తినేది.

చలం రూల్సు ప్రకారం పిల్లల్ని ఎత్తుకోకూడదు. షికార్లలో 'షౌ' ఎంత దూరం అయినా నడిచేది. కాని ఏణ్నర్థం పిల్లాడు వసంత్ నడవలేనని మారాంచేస్తే, 'నడవలేక పోతే యిక్కడే కూచో- మేము మళ్ళీ వచ్చాక కలిసిపోదాం' అని అంటే వసంత్ కూర్చొని-ఆగమని అంటూ వున్నా నడిచేంతదూరం నడిచాక వెనక్కు- వచ్చాక పిల్లాడిని పికప్ చేసుకుని యింటికి చేరేవాడు చలం. ఒకప్పుడు పది మందితో బయల్దేరి కబుర్లలో పరధ్యానలో'షౌ'ని మర్చిపోతే, అక్కడే ఒక్కర్తీ భయం లేకుండా కూర్చుని వుండేది. ఏదీ పట్టదు. తండ్రిజ్ఞాపకానికి వస్తేమాత్రం బెంగ. ప్రయాణాల్లో స్టేషనుకువచ్చిన రవిగాని తండ్రిగాని చేయిపుచ్చుకు దిగమంటేదిగేది. ఆమె బుర్రచాలాస్లో-అగ్గిపుల్ల వెలిగిస్తే చివరిదాకా చేయికాలేదాకా పట్టుకునేది. మళ్ళీ మంటకి ఏడ్చేది కాని వదిలేదికాదు, కాగితాన్ని తుంపులు చేస్తూ ఏ వస్తువు కయినా అంతం వుందా అనుకునేది. చూసేదంతా చూస్తున్నానా నిజమేనా అని సందేహం వస్తూ వుండేది. జాబిల్లితో కబుర్లు చెప్పేది. వస్తున్నానని కబురంపేది. జాబిల్లినే తల్లి అనేది. ఆ రోజుల్లో దేవరగారి వద్ద చలం సంగీతం, రంగనాయకమ్మగారు ఓ డ్రాయింగు మాష్టారివద్ద డ్రాయింగు నేర్చుకునేవారు. పిల్లలు రవి, షౌ సంగీతాలని పట్టేశారు. చిత్రలేఖనం కూడా తెలిసింది ఎక్కువ ప్రయత్నం లేకుండా. షికార్లకు వెళ్ళని రోజుల్లో సాయంకాలాలు చలం-పిల్లలూ సమావేశాలు చెట్లకింద కుర్చీలు వేసుకుని నడిపేవారు (షౌకి మూడు, రవికి ఎనిమిది, వసంత్‌కి యాణ్ణర్థం)-విశేషాలు, కబుర్లు చెప్పుకునేవారు. ఆ సభలో తను ఏది రాసినా చలం వాళ్ళకి వినిపించేవాడు. అంతా సీరియస్‌గా వినేవాళ్ళు. చలం అలమారలో రవీంద్రుని, అరవిందుని, జిడ్డు కృష్ణమూర్తి ఫోటోలను 'షౌ' చూసింది. గీతాంజలిలో అచ్చయిన పెయింటింగ్సు చూసి ఆనందించేది. అవనీంద్రనాథ్ టాగుర్ చిత్రాలు చూస్తూ పరవశించేది. పిల్లలకు ఆ తండ్రి, ఆ తండ్రికి ఆ పిల్లలూ వారికి వారే ఒక ప్రపంచం.

'వొయ్యి' ఎవరో తెలీదు చాలా కాలం 'షౌ'కి. ఆవిడ ఛార్మింగ్, డార్లింగ్ అనుకునేది. ఒకసారి ఆమెను రైలు ఎక్కించడానికి వెళ్తే, రవితో బాటు తను కూడా వెళ్తానంటే 'వొయ్యి' తనతోపాటు తీసుకెళ్ళింది హైదరాబాద్. 'వొయ్యి' ఉస్మానియాలో మెడిసిన్ చదువుతున్న స్టూడెంట్. అప్పటికి రవి కాన్వెంటులో బోర్డర్‌గా వున్నాడు. మూడవ ఏటనే 'షౌ'ని కాన్వెంటులో చేర్చారు. వాయిల్ పైజామా, చొక్కా తల్లి జరీ చీరల్తో కుట్టిన వేష్టు కోటూ, కాళ్ళకి చడావులు వేసుకుని కాన్వెంట్‌కు వెళ్ళేది. ఆ బట్టలు ఆ కత్తిరింపు జుట్టూ చూసి తురక పిల్ల అనుకునేవారు. సౌరిస్ అంటే అబ్బాయని కొందరు అనుకొనేవారు. ఆ పిల్ల మనస్తత్వం కూడా— పురుష స్వభావం.ఆడ మగ అనే భేదాలు తెలీకండా పెంచాడు చలం పిల్లల్ని. 'షౌ'కి ఎంతసేపూ మగ పిల్లల్తోనే పోటీ.

"షౌ" ప్రతి ఆదివారం 'వొయ్యి'తో పబ్లిక్ గార్డెన్స్‌కి వెళ్ళేది. అక్కడ రకరకాల జంతువుల్ని పార్కులో చూసి వాటికి కారప్పూస వేసి ఆనందించేది. లేళ్ళకి ఆకులు వేసేది. గరిక పోచలనీ మబ్బుల్నీ పిట్టలనీ చూస్తూ వొయ్యితో ఒక్క మాట అన్నా మాట్లాడకుండా గడిపేది. ఐస్‌క్రీము తింటూ విద్యుద్దీపాల కాంతి వెల్లువలో ఏయే లోకాల్లోనో తేలిపోయేది. వొయ్యి వస్తే షౌకి పండగే. వొయ్యి తెచ్చే కేక్స్ తినడం ఆ ఆనందం అదో సరదా—

కొన్నాళ్ళకి తెనాలిలో 'చే' పుట్టింది. సౌరిస్‌ని తెనాలి తీసుకెళ్ళారు. చలం గారి తల్లిని (నాయనమ్మనే) అమ్మమ్మ అని పిలిచేవారు చలం పిల్లలు. "షౌ" బంధువులు, ముఖ్యంగా మేనత్తలూ, చిన్నాన్నలూ అంతా అందమైన వాళ్ళు. హైందవ సమాజంలోని ఫ్యాషన్స్ అన్నీ అక్కడే వారింట్లోనే కనిపించేవి. అందులో "షౌ" పిన్నిది అల్ట్రామోడరన్ ఫ్యాషన్స్‌లో (కొమ్మూరి పద్మావతీ దేవి). సౌరిస్ తాతయ్యకు.

(చలంగారి తండ్రి కొమ్మూరి సాంబశివరావు) రవి, షౌ, సంతి అంటే ముద్దు. 'షౌ' మీద కంప్లెయింట్సు ఏమైనా వస్తే ఎత్తయిన గోడ మీద కూర్చోపెట్టి ఇక అల్లరి చేయననే దాకా దింపేవారు కాదట. అదీకాకపోతే శాలువాలో మూటకట్టేసే వారట. అది విడిపించుకుని తనంతట తానే బయటికి రావాలి.

బుచ్చిబాబాయి అంటే వెంకట్రాయ్యగారికి షౌ, రవి అంటే ప్రాణం.ఎంత మందిలో వున్నా ఒంటరి తనమే షౌకి.

చంటి బిడ్డ 'చే' (నిర్మల)తో కలిసి రంగనాయకమ్మ అంతా బందరువచ్చే శారు. ఈమారు ఊరి చివర మరో ఇల్లు. మొండి గోడలు. 'షౌ'ని సైకిలుకి తగిలించిన బేబీసీట్‌లో కూచోపెట్టుకుని అడవుల్లోకి వెళ్ళి అక్కడ గంటలకు గంటలు గడిపేవాడు.

పుస్తకాల్లోని ఇంగ్లీషు మాటల్ని చదవడం, ప్రతి విషయానికి పడిపడి పగల బడి నవ్వడం చేసేది. పదిహేనేళ్ళు వచ్చే వరకు నవ్వుల గ్రామఫోన్ రికార్డులా ఆపకుండా చాలాసేపు నవ్వేది.

రవికి గుండె జబ్బు మొదలు. ఇంట్లో పాపం అతని కోసం మాంసా హారం వండించడం ప్రారంభమయింది. వసంత్, షౌ కూడా వేడి వేడి కోడి మాంసం తినడం అప్పుడే ఆరంభించారు. భోంచేసి దగ్గరకు వస్తే ఆ పిల్లల మీద తల్లి చిరాకు పడి తోసేసేది. 'ఆమెకు బ్రాహ్మణ భోజనం లేనిది సరిపడదు. పిల్ల లకు యీ తేడా తెలీదు. తిండి విషయంలో ఆవిడ రాజీపడలేక పిల్లల్ని దూరం చేసుకుంది. పిల్లల పెంపకపు రీతుల గురించి ఆమె రాజీ పడినా భోజనాల విష యంలో నిరోధించింది.

షౌకి అయిదవ ఏడు— చలానికి అనంతపురం బదిలీ. ఆయన ముందు వచ్చేస్తే వెనక సామాన్లతో పిల్లలతో తల్లి వెళ్ళింది. నంద్యాల నించి వస్తోంటే కనిపించే అడవుల అందాలు ఎంచక్కా- 'ఈ అడవి దాగిపోనా, యిచటనే యాగి పోనా' అనే కృష్ణశాస్త్రి పాటంత సమ్మోహనంగా వుండేవి. ఆ పాటకి ఆ అడవే ఆవేశ కారణం.

అనంతపురం అడవిలో ఒకపాడు పడ్డ కొంపలో మకాం పెట్టాడు చలం. ఆ ఇల్లంతా ఎక్కడ చూసినా మండ్రగబ్బలు, పురికొనలు, త్రాచు పాములే. దూరా న్నుంచి ఆ పాముల్ని చూస్తూ వినోదంగా వుండేది 'షౌ'-చలంగారు రంగనాయ కమ్మ బూట్లు వేసుకుని రోజూ వాటిని చంపుతూ ఆత్మరక్షణ చేసుకోవలసి వచ్చేది. టాగుర్ కవిత్వాలు, కృష్ణశాస్త్రినీ సౌరిస్‌కి అనంతపురంలోనే చలం పరిచయం చేశాడు. అప్పుడే కృష్ణశాస్త్రి నోట'ఎంకి వంటి పిల్ల లేదోయి'అనే ఎంకిపాట సౌరిస్ వింది. అప్పట్లో అక్కడ చలం మైదానం నవల రాస్తున్నాడు. చలం తనకు పిల్ల లకు భారత భాగవత కథలు చెప్పేవాడు, అంత చిన్నప్పుడే కృష్ణుడు విష్ణుమూర్తి ఆమె విజన్స్‌లోకి వచ్చేవారు. ఒకసారి జీసస్ కూడా కనిపించినట్టు వచ్చింది.

అప్పుడు చూసిన సెమిటిక్ ఫేస్, జీసస్ మొహం ఆమెకు బాగా గుర్తు. అక్కడ ఓ ఇంగ్లీషు వాళ్ళ అబ్బాయిని చూసింది, దొరల పిల్లలతో ఆడుకోవడం జరిగింది. సౌరిస్ జీవనరాగం కథలో సుధతో చిత్రించిన బాల్యజీవిత దృశ్యాలకు యిక్కడి లేత్రాయపు స్మృతులు ఆధారం. హాస్పిటలో వొయ్యి, రామ్మూర్తి, సత్యవతి ప్రకాశం, రత్తమ్మల జీవితం, రంగనాయకమ్మ, వొయ్యిల ప్రవేశం 1924తో, చలం రాసిన అమీనా కథలోని కొంత కొంత కల్పనకు లీలామాత్రమైన ప్రేరణ వున్నదేమోననిపిస్తుంది. ఏలూరి జీవితం అమీనా కథకు ఎక్కువ ఆధారంగా కనపడినా కొంతలో కొంత చలం హాస్పిట్ జీవిత ప్రభావం వుంటే వుండవచ్చు అనంతపురంలో అయిదో ఏట ఒక ఇంగ్లీషు పిల్లవాడిని అతని తల్లి వేపమండతో బాదటం చూసిన షాక్కి మనుషుల పట్ల ఒక విధమైన నిరాసక్త భావం ఏర్పడింది.

రంగనాయకమ్మగారి పిన్ని కామేశ్వరది వితంతు వివాహం, ఆవిడ సౌరిస్ని, పెంచుకోవాలని తనతో తీసుకుపోవాలని చేసిన ప్రయత్నాలను చలం వమ్ముచేశాడు. బలవంతాన మోజుపడి తీసుకెళ్ళినా ఒక్కరోజు కంటే వుండనిచ్చేవాడు కాదు, సోకాల్డ్ ప్రేమ ప్రదర్శించి తను ఏర్పాటు చేసిన డిసిప్లిన్ చెడగొడతారని చలం భయం. అందుకే అంత కఠినంగా వుండాల్సివచ్చింది. తనకో పాపాయి కావాలని గోలచేసేది. తనే పాపాయి కదా! తనకి పుట్టిన రోజు చేస్తే, తను తిరిగి తన తండ్రికి పుట్టినరోజు వేడుకచేసేది. వేయించిన సెనగపప్పు దంచి పాకం పట్టి లడ్డూలు చేసింది. చలాన్ని గద్దిలో వడుకోబెట్టి బొట్టుపెట్టి వసంతంనీళ్ళ హారతి యిచ్చింది. అప్పుడు అక్కడే వున్న వొయ్యి 'వెంకట చలం మీ అమ్మ కూడా నీవు పుట్టినరోజు ఇంత బాగా చేసిందో లేదో' అంటూ పకపకా నవ్వింది, ఇంక తోచినపుడల్లా పుట్టినరోజు చేయడం ఒక ఆటయిపోయింది సౌరిస్కి.

చలంగారు కథలు రాయడం చూసి తనూ కథలు వినిపించేది తండ్రికి. ఆయన సీరియస్గా వినేవారు. ఓసారి ఏలూరులో కృష్ణశాస్త్రిగారు వస్తే సౌరిస్ చేత తను రాసిన కథల్ని చదివించారు. ఇంతేగాక 'షా' చేత విచ్చెన మెల్లు లోంచి మెల్లులోకి పాములా మెలికలు తిరుగుతూ పైకి ఎగబాకటం లాటి ఫీట్సు చేయించారు. చేతులు కాళ్ళు పట్టుకుని గాలిలో గిరగిరా తిప్పేవారు. ఒకసారి వసంత్ని అలా తిప్పితే అతను నీలంగా కమిలిపోయాడు. అప్పుడు కోపంగా రంగనాయ

కమ్మ 'అది రాక్షసి. దాన్ని ఏం చేసినా ఫరవాలేదు. పసివాడ్ని అట్లా తిప్పితే ఏమయినా వుందా' అని చలంగారిని కేకలేసింది. అప్పుడాయన సోక్రటీస్‌లా నవ్వుతూ వుండి పోయార్ట.

అనంతపురంలో వుండగా చలానికి నెలకు 70 రూపాయల జీతం. రవికి గుండె జబ్బుతో డబ్బు ఖర్చులు పెరిగి ఎంత పొదుపుగా వాడినా చాలక బందర్లో 'షా'కి చేయించి పెట్టిన చంద్రహారాన్ని అమ్మవలసి వచ్చింది. ఊళ్ళో యిల్లు దొరికి వెళ్ళాక ఆ వూరి భక్తసమాజంలో స్త్రీలంతా రంగనాయకమ్మగారికి స్నేహితులయారు. ఆ సమాజం అధ్యక్షురాలు పుత్తా సుందరమ్మగారనే ఆవిడ చలం భార్యకు రాజేశ్వరీ మంత్రోపదేశం చేసింది. ఆడవాళ్ళట్లాంటివి వుపాసించకూడదట. నిష్కామంగా చేసినన్నాళ్ళూ ఆ మంత్రం ఏమీ హాని చెయ్యలేదు. ఆ తరువాత ఏదో లోపల కోరికతో చేయడం మొదలు పెట్టేసరికి తలకొట్టేసింది. రంగనాయకమ్మగారికి మతి చలించినట్లు అయింది సౌరిస్‌కి హిందూ సమాజంతో కలయికకు అదే మొదటిసారి. వీళ్ళని భోజనాలకి పిలిచేవారు. అక్కడ రవితో సహా ఇంట్లో అందరికీ కళ్ళ కలకలు వచ్చాయి. అదే సమయంలో రవికి జబ్బు ఎక్కువయి ఆస్పత్రిలో చేర్చారు. మార్కండేయులికి చెప్పినట్లుగా రవి ఆయుష్షు పధ్నాలుగేళ్ళేనని డాక్టర్లు చెప్పారు. అతని బాధను చూడలేక చలం చాలా దుఃఖపడేవాడు. దుఃఖ భారంతో నిద్రారహితంగా త్యాగరాజ కృతులు ఆలపిస్తూ వివశుడై పోయేవాడు. వినేవార్కికి కడుపు తరుక్కు పోయేది. పిల్లల్ని నిద్ర పుచ్చడానికి రాత్రుళ్ళు దిగాలుగా రంగనాయకమ్మగారు 'చిలకల్లే చెలరేగి జీడి కొమ్మెక్కు, అబ్బాయి చెలరేగి నాన్న భుజమెక్కు' అంటూ జోలపాటలు పాడుతూంటే 'షా'కి లోపల్నుంచి పుట్టుకొచ్చేది గుబులు.

రవికి కాస్త తగ్గి యింటికి తీసుకు వచ్చాక కృష్ణుడ్ని వూచేందుకు వుయ్యాల ఒకటి భక్త సమాజానికి చేసిచ్చాడు. అతనికి మెకానిజంలో ఆసక్తిమెండు. రవి వెళ్ళి పోయాక కూడా ఆ ఉయ్యాలలో అతని స్మృతిడోలికల్లో వూగుతున్నాడు శ్రీకృష్ణ పరమాత్మ- అని పుత్తా సుందరమ్మగారు బెజవాడ చాలా కాలానికి వచ్చినపుడు చెప్పింది. అనంతపురంలో వుండగానే మాంస భక్షణ కేగాక ముట్టుమయిల మడి ఆచారం వంటి కొన్ని పట్టింపులు ఆమెలో తిరిగి ప్రవేశించాయి.

చలం కుటుంబం అనంతపురం నుంచి తెనాలి వచ్చారు. అక్కడ వారి యింటి ఖాళీ స్థలంలో వెలిసిపోయిన ఓ మార్వాడీ పిల్లాడి బొమ్మ ఎవరో పారేసి

నది 'షౌ'కి దొరికింది. తలపాగా, జుబ్బా, పంచకట్టు ఆ బొమ్మ బాగా పెద్దసైజుది. ఎత్తుగా వుండేది. దాన్ని తన నేస్తంగా చూచుకునేది 'షౌ'. దానితో గంటలు గంటలు గడిపేది ముద్దులాడుతూ.

తెనాలిలో వాళ్ళ యింటికి కృష్ణశాస్త్రి, విశ్వేశ్వరరావు, నండూరి సుబ్బారావు వచ్చేవారు తరుచుగా. పాటలు, చర్చలూ, సాహిత్య గోష్టులూ జరిగేవి. అప్పట్లో బందరులో అహోబలరావుగారు చలం 'చిత్రాంగి' నాటకం వేయిస్తున్నారు. నాటకం అయాక చలం, షౌ, రవీ ఏలూరు వచ్చేశారు.

ఏలూరులో వాళ్ళున్న యింటికి సమీపంలోని తోటలో ఒక మిషనరీ ఆవిడ ఒక క్లబ్బు పెట్టారు. నవనాగరిక యువతులంతా వచ్చేవారు. చలం భార్య పిల్లలు వెళ్ళేవారు. అప్పట్లో వీళ్ళు క్లబ్బు నుంచి యింటికి వచ్చేసరికి చలంగారు గులాబీ రంగు అమ్మ చీర కట్టుకుని చిత్రాంగి వేషంలో వున్నారు; నండూరి సుబ్బారావు గారు గుబురు మీసాల్తో సారంగధరుడు-నాటకం రిహార్సలు.రవి అన్నా షౌ అన్నా వాళ్ళ నాన్న పిల్లలని రంగనాయకమ్మగారికి పడేది కాదు.చే.సంతి అమ్మ పిల్లలు. 'షౌ'కి నాన్నే అన్నీ. సెలవులకి 'వొయ్యి' జుట్టు కత్తిరించుకుని వచ్చింది. ఆడ మగ అందరూ జంపర్లు వేసుకునేవారు. చలం లాగు వేసుకునేవాడు జంపర్ మీద. అంతే తేడా. అంత చిన్న పిల్ల 'షౌ' వూహల్లో ఎదిగిన స్త్రీలా రొమాంటిక్‌గా ఫీలయేది.

రంగనాయకమ్మగారి దూరపు అన్నయ్య 'మల్లికార్జున మావయ్య'తో బెజవాడ వెళ్ళింది. మద్రాసుకూడా వెళ్ళింది. మొదటిసారి టెలిఫోన్‌లో మాట్లాడటం లిఫ్ట్‌లో ఎక్కి దిగడం చూసింది. కొన్నాళ్ళుండి తిరిగి కారులో ఏలూరు వచ్చేసింది,

ఒకసారి చలం, కృష్ణశాస్త్రి మాట్లాడుతూ కూర్చున్నారు. వానపడుతోంది. 'షౌ' సంతి వానలో ఆడుకుంటామని చలంగార్ని అడిగి ఆడుకొంటున్నారు. ఆ యింటికి బాత్‌రూమూ, వంటిల్లూ విడిగా వుండేవి. ఆ రెంటినీ కలుపుతూ రెండు గోడలుండేవి. మధ్య గచ్చు నేల. ఆ తూముకి ఓ బిరడా అడ్డుపెట్టడం వల్ల నీళ్ళు బాగా నిలిచాయి. ఆ నీళ్ళలో 'షౌ' 'సంతి' ఆడుతున్నారు. ఒకసారి వచ్చి తుడుచుకున్నాక మళ్ళీ దిగరాదని చలంగారి రూలు. అలా దిగితే జబ్బు చేస్తుందని. మరీ ఎక్కువసేపు నానితే కోప్పడతారని వచ్చి తువాలు తీసుకు తుడివమని చలం దగ్గరకు వచ్చారు. మాటల పరధ్యానంలో చలం యిద్దరికీ తుడిచారు. మళ్ళీ వెళ్ళి

దిగారు నీళ్ళలో. మళ్ళీ తుడవమని వచ్చారు. చలం యీమారూ పరధ్యానంలో తుడిచారు. మళ్ళీ వెళ్ళి దిగారు. ఈమారు తుడవమని వచ్చారు. ఈమాటు చలం యిద్దర్నీ చెరో రెక్క పట్టుకుని నీళ్ళలోకి నెట్టి తలుపు వేసి వెళ్ళి పోయారు. ఇదే ఛాన్సని షౌ, సంతి ఎన్ని గంటలు ఆడేరో లెక్కలేదు. శాస్త్రిగారితో ముచ్చట్లు ముగిశాక ఎప్పుడో మూసిన తలుపులు తెరుచుకున్నాయి.

సౌరిస్, చలం ఫామిలీ, చలం తండ్రి కొమ్మూరి సాంబశివరావు, చలం తల్లి వెంకట సుబ్బమ్మ, చలం తమ్ముళ్ళు మొత్తం బలగం అంతా పూనా బయలు దేరి వెళ్ళారు. సౌరిస్ చిన్నాన్న గోపాలం అనే ఆయనకు అక్కడ ఇంజనీరు పని అయింది. అప్పుడు డాక్టర్ రంగనాయకమ్మ ఔరంగాబాద్‌లో హౌస్ సర్జన్ చేస్తున్నది. ఆమె కూడా వచ్చి వీరిని కలిసింది.

పూనాలో చిన్నాన్న కార్లో ఊరంతా షికారు తిరిగేవారు. ముఖ్యంగా పూనా రవి వైద్యానికి వచ్చారు. పూనాలో చలం సెకండ్‌హాండ్ ఫ్రెంచి మోడల్ లిజ్-బర్ అనే కారును కొన్నారు. రవికి వసంత్‌కి ప్రతి దాంట్లో పోటీ. తగూలాడుకునేవారు. ఈ తగూలు భరించలేక షౌనీ సంతినీ చలం డాక్టర్ రంగనాయకమ్మ హైదరాబాద్ తీసుకుపోయారు. హైదరాబాద్‌లో చలం స్నేహితుడు ప్రకాశం గారింట్లో దిగారు. ఆయన పిల్లలు జీసస్, షాజహాన్ చాలా అందమైనవాళ్ళు, తెలివైన వాళ్ళు. ఈ బాల్యక్రీడల ప్రభావం సౌరిస్ రాసిన జీవనరాగం తొలి అధ్యాయాల్లో కనిపిస్తుంది.

చలంగారి తల్లి వెంకటసుబ్బమ్మగారికి అయిదుగురు మొగపిల్లలు, నలుగురు ఆడపిల్లలు. పెద్దవాడు చలం. అర్భకుడు. చిన్నప్పటి నుంచి తల నొప్పులు (మైగ్రేన్). ఆబలంచే చలానికి ఎక్కువ యిష్టం వుండేది కాదు.

కొమ్మూరివారు నియోగులు. వీరి అసలు కుదురు కొమ్మూరికి చెందినది. అప్పుడు వీరి యింటి పేరు గంగరాజువారు. వీరిది లోహితాస్యగోత్రం ఉద్యోగ రీత్యా వీరంతా వివిధ ప్రాంతాలకు తరలి వెళ్ళారు. కాకినాడ అలాగే చేరారు.

చలాన్ని మాతామహుడు దత్తత చేసుకున్నారు. తాతగారు గుడిపాటి వెంకట్రామయ్యగారు. గుడిపాటివారిది గుడివాడలో వెంకటాపురం. సర్వే డిపార్ట్‌మెంటులోను, సెటిల్‌మెంట్ డిపార్ట్‌మెంట్‌లోనూ పనిచేసి ఆఫీసర్‌గా రిటైరయారు. గవర్నమెంటులో మంచి ప్రాపకం పెద్ద పేరు సంపాదించి 'దివాన్ బహదూర్'

బిరుదాన్ని పొందారు కూడా. పెద్ద మేడ కొన్నారు. మంచి సంపన్న గృహస్థులు. నియోగుల్లో పెద్ద పేరు. పూర్వాచార పరాయణులు. దానధర్మాలు, పండిత సన్మానాలు విరివిగా చేస్తూండేవారు తరవాత గుడిపాటి వెంకట్రామయ్యగారు తోట్లవల్లూరు జమీకి రిశీవరయారు. ఇక్కడే చలానికి అక్షరాభ్యాసం. ఈ వూరికి దగ్గర్లో కృష్ణానది. తరచు నదిలో పడవలమీద షికారు చేయడం, ఏనుగులు, గుర్రాలమీద స్వారీ, జమీందారీఫాయాలో పెరిగాడు. చలంగారి తాతగారు పురాణ కాలక్షేపాలు, బ్రాహ్మణ సంతర్పణలతో కాలక్షేపం చేసేవారు.చలంగారిఅమ్మమ్మకు మంత్ర శాస్త్రంలోనూ, యోగశాస్త్రంలోనూ ప్రవేశం వుంది. రిశీవరు పదవి తరవాత రిటైరయి మకాం తెనాలికి తరలించారు వెంకట్రామయ్యగారు. చలంగారి మలి నవల 1923లో రాసిన దైవమిచ్చిన భార్యలో చలం బాల్యం రేఖామాత్రంగా రాధాకృష్ణ బాల్యంతో పోల్చవచ్చు. వీరి తాతగారి కుటుంబం అలనాటి జీవన స్మృతులు లీలగా యీ నవలలో చోటుచేసుకున్నాయి అనిపిస్తుంది.

## పాపత్త

చలంగారి కడసారి చెల్లెలు పాపత్త రంగనాయకమ్మ కాపురానికి వచ్చే నాటికి ఏడ్పర్ధం వయసుబిడ్డ. ఈమెను చలం భార్య పెంచింది. ఆమెనే అమ్మ అనుకొనేది. చాలామటుకు 'షా' వాళ్ళతోనే వుండేది. ఇంటికంతా హడావుడి ఆ అమ్మాయే తెనాలిలో పిల్లలందరికీ నాయకురాలు. పిల్లలందర్నీ ఆడించేది బొమ్మల పెళ్ళిళ్ళు విందులూ చేసేది. రవీ ఆ అమ్మాయీ దగ్గిర యీడువాళ్ళు. వాళ్ళిద్దరికీ చెప్పలేనంత స్నేహం. వాళ్ళుచేసే అల్లరి అంతా యింతాకాదు. వెన్నెల రోజుల్లో ఒక అట్టపాముని కత్తిరించి, రంగుతో దానికి చారలు గీరలు యిత్యాదికాలైన అలంకారాలు చేసేవారు. గుర్రం వెంట్రుకలు పోగుచేసి వాటన్నింటిని ఏకంచేసి- ఆ పొడుగైన వెంట్రుకలని ఆ పాముకి కట్టి రోడ్డుకి ఆ వైపున వదిలి ఇంట్లో గోడ వెనకాల దాక్కొని నెమ్మదిగా ఆ వెంట్రుకలని లాగేవారు. ఆ పాలవెన్నెల్లో అది జరజరా పాములా పాకి-నిజమైన పాములా భ్రాంతి కలిగించేది. ఇక దారే పోయేవారు దాన్ని చూసి 'పామో పామో' అని భయంతో గంతులు వేసేవాళ్ళు, నిదానించి చూడగానే అది అట్టపాము అని తెలిసేది. ఆ వెన్నెట్లో ఆ గుర్రం వెంట్రుకలు కనిపించేవి కావు. పిల్లలూ అగపడే వాళ్ళుకాదు........ఇంక పూనా వొచ్చిన తరువాత పాపత్తా, రవీ మరీ మరీ దగ్గరయి ప్రాణస్నేహితులై పోయారు.

వాళ్ళు ఒక రోజున ఎక్కడ విన్నారో 'కుర్మా' అనే పేరును విన్నారు. అది వాళ్ళకి తెలుసో లేదో కాని ప్రతి దుకాణానికి వెళ్ళి 'కుర్మాహై' అని అడిగే వారు. వాళ్ళ చేతుల్లో చిల్లి గవ్వలేదు. వాళ్ళ వెంట షౌ కూడా వెళ్ళేది. కుర్మా అంటే ఏవిటో తెలుసుకోవాలని. చాలా టీ దుకాణాల్లో 'నై' 'నై' అనేవాళ్ళు. ఆఖరికిలా కొన్ని రోజులు తిరగ్గా, తిరగ్గా వుందనీ, వుడుకుతోందనీ ఒకచోట చెప్పారు. చెప్పగానే పిల్లలు యింటికి పరుగు లంకించుకున్నారు. ఈ సంగతి తాతాయ్యకీ, అమ్మమ్మకీ తెలిసింది [చలం తండ్రి. తల్లి-నాయనమ్మను అమ్మమ్మ అనేవారు చలం పిల్లలు]. చిన్నాన్నలు శ్రోత్రియంగా పెళ్ళిళ్ళు చేసుకోలేక పోయినా అట్టే బాధ పడలేదు, చలం తల్లి. కాని తన కూతురూ, మనవలూ రోడ్డంట 'కుర్మా 'కుర్మా' అని బయలు దేరితే మాత్రం రోషం వచ్చేసింది. 'ఇంత బ్రతుకు బ్రతికి చివరికి బజారు పాలవడమా? వీళ్ళకి ఏమి వచ్చింది పోయేకాలం' అని ఏడ్చింది. వెంటనే జానకి అత్తయ్య (చలం మరో చెల్లెలు) తన కూతుర్ని యీ రవికి యివ్వనని భీష్మించుకు కూర్చుంది. ఆ పిల్లకింతా చేస్తే రెండేళ్ళు. ఇదంతా వింటున్నా తాతయ్య (చలం తండ్రి సాంబశివరావు) 'ఒరే తాతా నీకు కుర్మా కావలసివస్తే నన్నడగరాదా? నేను తెప్పించివుందునే' అన్నాడు. తాతయ్య రవిని తాతా అని పిలిచేవాడు. మర్నాడు కుర్మా తెప్పించుకుని తాతయ్య రవీ విందుచేసుకున్నారు. (చలం తండ్రికి నాన్‌వెజ్, డ్రింక్, వారవనితా వ్యసనం అన్నీ వుండేవిట). పాప ఎట్లాగూ తినదు, కాని వాళ్ళు 'షౌ' ని పిలవలేదు.

చలంగారి చెల్లెళ్ళకు తాతయ్య [సాంబశివరావు] బలవంతంగా పెళ్ళిళ్ళు చేశాడు. చలంగారి మూడో చెల్లెలికి మాత్రం చలంగారు తను యిష్టపడ్డ మేనత్త కొడుకుని పిలిచి పెళ్ళి చేశారు. [ఈ వివాహాలు ఆడపిల్లల్ని బలవంతంగా గదుల్లోకి తొయ్యడం. వాళ్ళు పడే బాధలు చలాన్ని తీవ్రంగా కదిలించి ఆలోచింపచేసి తిరుగుబాటుకు, వివాహం పేరిట జరిగే దుర్మార్గాలపై ధ్వజమెత్తడానికి ప్రోత్సహించినాయి].

పాపత్తకి కూడా ఎవడినో యిచ్చి పెళ్ళి చేసేస్తారేమోనని చలం బెంగ. తన మిత్రుడు టి. రామమూర్తిని చేసుకుంటే చాలా బావుండునని అనుకుని, ఆ వుద్దేశంతో 'షౌ' వాళ్ళు పూనా వస్తూంటే ఆయన్ని కూడా వెంట తీసుకుని వచ్చారు. రోజూ రాత్రి పాప పక్క వేసుకోగానే ఆ పక్కమీద కూచునేవాడు రామమూర్తిగారు. అతన్ని పక్కమీద చూసి చిందులు తొక్కేది పాపత్త. చివరికి

ఓ రాత్రి చలం- 'నిజంగా ఆయనంటే నీ కిష్టం లేకపోతే, పాపా! ఆయన వీపు మీద ఒక దెబ్బవెయ్యి,'అన్నాడు. వెంటనే ప్రాణం జిల్లార్చుకు పోయేటంత దెబ్బ వేసింది పాపత్త! దాంతో చలానికి పాపకు యిష్టంలేదని తెలిసిపోయింది. ఆయన్ని వాళ్ళ వూరు పంపించేశారు. తరవాత పాపని ఎంతో హెచ్చరిస్తూ చలం 'రామమూర్తిని చేసుకో. అతను అందగాడు, మంచివాడు, లేకపోతే వీళ్ళు బలవంతం పెళ్ళి చేస్తారు' అని ఎంతగానో చెప్పారు. కాని పాప వినిపించుకుంటేనా?

పాపకు అలాగే పెళ్ళయాక, మొగుడితో పోనని ఏడుస్తోవుంటే తాతయ్య (చలం తండ్రి) బెట్టుపెట్టి ఆమెను కొట్టాడట. ఏమయినా పాప మొండికెత్తింది. చివరికి పాపం ఆ హింస చూడలేక పెళ్ళికొడుకే 'పాపా నువ్వెంత మొండికెత్తినా నువ్వొచ్చేదాకా, మీ నాన్న కొడతాడు. ఎందుకు మొండిపట్టు పడతావ్? నేను నిన్నేమీ అనను. అంతా నీ ఇష్టానికి వొదులుతాను, నాతో రా' అన్నాడు. అప్పుడు పాప ఆయనతో వెళ్ళింది.

ఈ పెళ్ళి పేరిట జరిగే దుర్మార్గాలు చాలవా చలాన్ని ఆలోచింప చేయడానికి, తిరుగుబాటుకు స్త్రీలను ప్రేరేపించడానికి?

రవి వైద్యానికి పూనాలో వుండగా రంగనాయకమ్మగారు పిల్లల్తో ఏలూరు వచ్చారు. అప్పుడు చలానికి జ్వరం. ఆయన ప్రియమిత్రులు కొందరాయన్ని డబ్బు వుండనివ్వకుండా పీడించుకు తినడం చూసి రంగనాయకమ్మగారు తిట్టి కేకలేసి వాళ్ళని తరిమేసింది. హొయ్యి అప్పుడే పరీక్ష ప్యాసయి వచ్చేసింది. మొక్కపాటి రామ్మూర్తిగారు పోయాక ఆయన పిల్లలు తండ్రి అభ్యర్థన మేరకు ఇందూ, ఉషా, 'షా' వాళ్ళతో వుండి పోవడానికి వచ్చారు. అంతా కలిసి తెనాలి వెళ్ళిపోయారు. అక్కడ డాక్టర్ రంగనాయకమ్మగారి కోసం ఇంట్లో మార్పులు చేయిస్తున్నాడు చలం. 'హొయ్యి' డిస్పెన్సరీ తెరిచింది. ఓ కరణంగారింట్లో అద్దెకుండేవాళ్ళు. ఇంతలో పూనా నించి చలం తండ్రి, తల్లి, పినతండ్రి పిల్లలూ వచ్చారు. అందర్నీ చిట్టి రంగనాయకమ్మగారు పెంచాల్సి వచ్చింది. వొంటంతా ఆవిడే. పిల్లలకి పొంగులు చూపాయి. హొయ్యి వైద్యం. ఇల్లంతా అప్పత్రి. రామ్మూర్తిగారి భార్య చంద్రమతి వచ్చి తన పిల్లల్ని తీసుకువెళ్ళింది. పిల్లలందరికీ టైఫాయిడ్ ఒక్క రవికి తప్ప. 'షా'కి సంధి కూడా వచ్చింది. చచ్చిపోతుందో పిచ్చెక్కుతుందో అనుకునేవారు. సంధిలో నుదురు పిక్కుని గాయం చేసుకుని

తగ్గాక అది శివుని మూడోకన్ను తెరిస్తే భస్మమవుతారని పిల్లలతో అనేది. అలం కరణమీద ఆసక్తిపోయింది.

చలం పెద్ద కుమారుడు రవి అందమైనవాడే కాక చాలా విశిష్టమైన వ్యక్తిత్వం కలవాడు. మెకానిక్. ఏవో డిజైన్లు అవీ వేసి అమెరికా పంపి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవాడు. బతికి బట్టకడితే మంచి ఇంజనీరు అయేవాడు.హోమ్యోకి కాంపౌండింగు పనంతా చేసి పెట్టేవాడు. చలం అతని కోసమే కారుకొన్నాడు. కారు నడిపేవాడు. సొంతంగా నాటకాలు రాసేవాడు. ఒక గ్రామఫోను, అతనికిష్ట మైన రికార్డులు, ఒక కెమేరా వుండేదతనికి. బాగా పాడేవాడు. పెయింటింగ్స్ వేసే వాడు. పిల్లల కోసం ఎన్నో వింతలూ వినోదాలు కనిపెట్టి వాళ్ళని ఆడించేవాడు. పెద్దవాళ్ళు వచ్చి అతనితో చర్చలు జరిపేవారు. పిల్లవాడిగా అతన్నెవరూ చూడ లేదు. కోపం వస్తే చాలా తీవ్రంగా (VIOLENT) ప్రవర్తించేవాడు. అతను కొంత ప్రివిలేజిడ్‌గా వుండటం వలన తమ్ముడు వసంత్‌కి రవికీ పడేదికాదు. తగూలు, పోట్లాటలు. హోమ్యో అభిమానం పొందడానికి పోటీపడే వారు. 'షౌ' మనసు వికలం అవుతుందేమోనని ఆమెను ఎనిమిదేళ్ళ పిల్లని గుంటూరులో ఓ బోర్డింగ్ స్కూల్లో చేర్చారు. అదో ప్రత్యక్ష నరకం.తరువాత 'షౌ'ని స్కూలు మానిపించేశాడు చలం.

ఒకసారి ఓ కమ్మవారి కుటుంబం-అతి నీరసంగావున్న చంటిపిల్లాడిని పెంచలేక రోజుల పసిగుడ్డుని హోమ్యో ఆస్పత్రిలో వదిలి వెళ్ళిపోయారు. ఆ పిల్ల వాడిమీద చలం ప్రయోగాలు కొనసాగించాడు. వేళకి పాలు కలపడం, పట్టడం అన్నీ తనే చేసేవాడు. వాడికి చొక్కాలు, పిన్నులులేకుండా చిన్న తాళ్ళతో కట్టి వేసేందుకు ఏర్పాటు చేశాడు. వాడికి చలంగారే మాతృస్థానం వహించి అలా నెలల తరబడి పెంచారు. ఆరోగ్యంగా ఎదిగిన నెలలబిడ్డను వాళ్ళ వాళ్ళు వచ్చి తీసుకు పోయారు. 'షౌ'కి పాపల సరదా. పాప కావాలని గొడవచేస్తే, చలం ఎవరినో ఒకరిని తెచ్చి పెంచే ఏర్పాటు చేసేవాడు.

తెనాలికి గాంధీగారు వస్తున్నారని తెలిసింది ఓ రోజు. ఆ వేళ చలం గాంధీజీ వ్యక్తిత్వం గురించి ఆయన వుద్యమాల్లోని పద్ధతుల్లోని వైశిష్ట్యం వివ రించి పిల్లలకు చెప్పారు. స్వాతంత్ర్య పోరాటంలో ఆయన నిర్వహిస్తున్న సృజ నాత్మక కృషిని వివరించారు. సభలకి సమావేశాలకి వెళ్ళే మనిషి కాకపోవడంతో

పిల్లలంతా గాంధీజీని చూడటానికి 'సౌయ్యి'తో బయలుదేరారు. ఆ మహాత్ముని దర్శనార్థం ఆ వేళ తెనాలిలో జనసముహం పెద్ద మైదానాన్ని చేరుకుంది. ఎత్తయిన వేదికమీద బాపూజీ, కస్తూరిబాయి ఆసీనులై వున్నారు. ముతక ఖద్దరుకట్టిన ఆ ముని తుల్య దంపతులలో ఎంత వెలుగో- ఎంత తేజస్సో-ఆయన పేదల సహాయార్థం వచ్చారు భిక్షాపాత్రతో. స్త్రీలందరి దగ్గరకు వెళ్ళి వాళ్ళు బహూకరించిన నగలన్నీ సేకరించి వాటిని బాపూజీకి యిచ్చింది 'సౌయ్యి'. చిరునవ్వుతో సువర్ణభిక్షను స్వీకరించి బాపూజీ తన మెడలోని నూలుదండతీసి సౌయ్యి మెడలో వేశారు.

తెనాలిలో చలంగారి యింటి వెనక వున్న అమీనాగార్డెన్స్‌లో ఆ రోజుల్లో చలంగారు తన సంతానం కొరకు అద్భుతమైన సాయం కాలాల్ని రూపొందించేవారు. చలం ఆయన మిత్రులతో కలిసి రామాయణం, ప్రహ్లాద మొదలైన షాడో ప్లేస్ తెరకట్టి ఆడేవారు. రోజూ సాయంత్రం అవుతూండగా సన్నాయి మేళగాళ్ళు వచ్చి సన్నాయి వాయించేట్లు ఏర్పాటు చేశారు. సన్నాయిపాట కాగానే అంతా కలిసి గ్రామఫోన్ రికార్డ్స్ వినేవారు. అప్పుడప్పుడు రవి సంగీతం భరించలేక రికార్డు విసిరేసి బద్దలు కొట్టేసేవాడు. రవి. షౌ సౌయ్యి దగ్గిర హార్మోనియం నేర్చుకున్నారు. రవి హార్మోనియం వాయిస్తూ బాగా పాడడం నేర్చుకున్నాడు.

తెనాలి రామవిలాస సభవారు ఆడే 'బొబ్బిలి' నాటకంలో చలం 'బుస్సీ'వేషం వేసేవారు. ఆ నాటకంలో చినరంగారావుగా రవి వేసేవాడు. 'షౌ' కూడా చినరంగారావు వేసింది, పెదరంగారావు మాధవపెద్ది వేసేవారు.

ఎంత అమాయకంగా ఆనందంగావున్నా రవి అనారోగ్యం పిల్లలందరికీ తెలియని దిగులయి మబ్బులా వారి మనసులను కమ్మేసింది. నిత్యం పత్యం భోజనమే. అతనికి ఆయుస్సు 14 సంవత్సరాలే అని డాక్టరు నిర్ధారణగా చెప్పారు (మార్కండేయుల్లా). అతనికి యీ విషయం తెలుసు.'ఎందుకమ్మా యీ జబ్బు దేహం కోసం ఏడుస్తావు? నేను మళ్ళీ ఆరోగ్యంగా నీ కడుపులో పుడతాగా' అని ఓదార్చేవాడు. కొన్ని జబ్బులు కొందరిలో వైరాగ్యాన్ని డిటాచ్‌మెంటును హ్యూమర్నీ పెంచుతాయి. రవి తన జబ్బును ఎంతో జోక్‌గా తీసుకునేవాడు.

ఒకసారి అమ్మ (రంగనాయకమ్మ) షౌని, చేని, సంతిని కూర్చోబెట్టుకుని సరదాగా కబుర్లు చెబుతూ 'నీకో వెండి గిన్ని. నీకో గ్లాసు. నీకో కొమ్ము చెంబు' అంటూ ముగ్గురికీ తలోటి చేయిస్తానని సరదాగా కబుర్లు చెబుతోంది. రవి

దూరంగా ఎటో చూస్తూ టేబిల్ దగ్గిర కూర్చున్న వాడల్లా 'అమ్మా అప్పుడే నన్ను మెంబర్సులోంచి తీసేశావా' అన్నాడు. ఆ తల్లి బావురుమని పోయింది.

'వొయ్యి' స్కాలర్‌షిప్‌తో డాక్టరీ చదువుకొంది గనక- నైజాంలో అయిదేళ్ళు సర్వీస్ చేస్తేనే డిప్లొమా యిస్తారు. ఆమెకు కరీంనగర్‌లో పోస్టింగ్ వచ్చింది. చిట్టి రంగనాయకమ్మగారు పిల్లలతో సహా అక్కడే వుండేట్టు ఏర్పాటు చేసుకున్నారు. క్రమంగా చలం కూడా అటు వైపుకే వచ్చేట్టు ప్రయత్నాలు చేసుకోవాలనుకున్నారు. కరీంనగర్ చేరింది చలం కుటుంబం. అక్కడ వుండగా రవి పిల్లల్ని చుట్టూతా కూర్చోబెట్టుకుని తన చావుని అభినయిస్తూ, ఎవర్నీ ఏడవ్వొద్దని చెబుతూ రిహార్సెల్సు చేయించేవాడు. అక్కడ పిల్లల్ని బళ్ళలో వేశారు. చలంగారు 'చే'కి నూర్జహాన్ అని పేరు పెట్టారు గాని తల్లి కా పేరు యిష్టం లేదు. రవి జబ్బు గొడవల్లో పడి 'చే'కి పేరు నిశ్చయంగా పెట్టలేదు. 'షౌ'కి ఉర్దూ బాగా వచ్చింది. ట్యూషన్ కూడా పెట్టించుకుంది.

'వొయ్యి' తోటి డాక్టర్ రవికి స్నేహితుడయ్యాడు. రవిని హార్మోనియం వాయించవద్దని వొయ్యి ఆంక్ష. చేకి కానీ యిచ్చి బెల్లోస్ నొక్కించుకుని నెమ్మదిగా వాయిస్తూ పాడేవాడు. రవికి రాత్రిపూట కాళ్ళూ చేతులు చల్లపడేవి. రవికి అత్తల్లా నారింజలూ యిష్టం.

వొయ్యి ఆస్పత్రి వీళ్ళ యింటికి ఓ మైలు దూరం. ఓ రోజు 'షౌ' వొయ్యి ఆస్పత్రికి వెళ్ళి వచ్చింది. వొయ్యిని పిలుచుకురమ్మని రవి. షౌని అడిగాడు. అతనికి ఎదురు చెప్పింది బహుశా మైలు దూరం మళ్ళీ నడిచి వెళ్ళలేక. ఆరోజు ట్యూషన్‌కి వెళ్ళి తిరిగి వచ్చే సరికి రవికి జబ్బు ఎక్కువయి చివరిక్కి పోయాడు.

షౌ-చే-సంతి వస్తూన్న ఏడుపుని ఆపేశారు. తల్లి గొల్లుమంది... ఎందుకు ఆపేశారంటే ఏడిస్తే లోగడ రిహార్సల్స్ లాగ రవి లేచి కొడతాడని భయంవేసిందట. రవి తనవల్ల తండ్రికి అట్టే బాధలేకుండా చేద్దామని ప్రయత్నించాడు. తల్లిని ఓదార్చేవాడు ఆ పద్నాలుగేళ్ళ బతుకూ ఎవ్వరికీ బాధ లేకుండా చేద్దామని హాయిగా నవ్వుతూ అల్లరి చేస్తూ గడిపి వెళ్ళిపోయాడు జీవితం ఓ చలోక్తిలా.

చలంగారికి టెలిగ్రాం యిచ్చి ఆయన రాకకోసం రవి శరీరాన్ని మూడు రోజులు అట్లానే వుంచారు. ఇది చలం కుటుంబం ఎదుర్కొన్న తొలి దురదృష్టం.

అతని కోసం గుడివాడ నుంచి రంగనాయకమ్మగారు తెచ్చిన అత్తరువులు రాసి, స్పిరిట్స్ పూసి, ఆ శరీరం పాడవకుండా నిద్రపోతున్నట్లున్న అతని శరీరాన్ని మూడు రోజులు అలానే వుంచారు చలంగారు రాలేదు. ఆయన రారని తెలిసి రవికి అంత్యక్రియలు జరిపించారు. అతని శరీరం మీద తల్లి గులాబీ రంగు చీర కప్పింది. అది కట్టుకుని యింతకు ముందు నాట్యం చేసేవాడు అతను. కరీంనగర్ వూళ్ళోంచి కొంత మంది ముస్లిం యువకులు శ్వేతరుమాలాలు ధరించి సహాయానికి వచ్చారు.

పుడమితల్లి ఒడిలో కప్పేసి వచ్చారంతా. 'షౌ' గోల పెట్టింది. అతన్ని కప్పివేస్తే మళ్ళీ ఎలా వస్తాడని.

అతని వస్తువులు గ్రాంఫోను, కెమెరా అన్నీ డాక్టరుగారికి యిచ్చేశారు. అక్కడున్న వాళ్ళకి అతని దుస్తులూ వస్తువులూ వేటినీ మిగల్చకుండా పంచి పెట్టేశారు. అతని జ్ఞాపకాన్ని వెంటబెట్టుకుని గుంటూరు ప్రయాణం అయి వచ్చేశారు దిగులుగా బరువయిన మనసులతో. ఆ రాత్రి వేగుచుక్క పొడవగానే-రవికి-సమాధి దగ్గర పాలు పోసేందుకు ఏర్పాటు చేసి మరీ వచ్చారు. ఈ ప్రయాణంలో డాక్టరు గారు, రంగనాయకమ్మగారు కంపార్ట్ మెంటులో దిగాలుగా ఏడుస్తూనే వున్నారు.

బెజవాడ ప్లాట్ ఫారం మీద చిరునవ్వుతో నిలబడ్డ చలంగారి చేతులు పట్టుకుని 'నువ్వే మంచి వాడివి నాన్నా! నువ్వేడవటం లేదు. అమ్మా, వొయ్యి ఒకటే ఏడుస్తున్నారు' అన్నారు పిల్లలు. చలం బాధ ప్రపంచానికి బాధ కాలేదు.

చలం ఆత్మ కథలో రవి చావు గురించి చలం యిలా రాసుకున్నాడు—

'రవి చచ్చిపోయినాడు. చచ్చిపోయేటప్పుడు నేను దగ్గిర లేను. అతను పడుతున్న బాధ చూస్తే ఎవరికయినా యితను ఎందుకు బతికి వుండటం? చచ్చిపోవటమే హాయి అనేట్టు వుండేది. అతను చచ్చిపోతే ఎక్కడికి కెళ్తాడు? నేను అతన్ని వొదిలి యిక్కడ ఏం చేస్తో వుంటాను? మళ్ళీ ఈ సంతోషం వుంటుందా? అంత వొంటరి తనంలో పడిపోయాను. అతని పెర్సనాలిటీ అట్లాంటిది. అందర్నీ ఇంకా శాలాన్ని ఏదో విధంగా ఆక్రమించుకున్నాడు.

—'అసలు రవి లేనేలేడు మాతో. అదొక కల. ఎందుకు దాన్ని తలచుకోటం? అని స్నేహితులందర్నీ పిలిచి, అటు తిరిగి యిటు తిరిగి, జ్ఞాపకాలన్నీ ఎట్లానో వొదిలించుకోవాలని చూశాను—'

'....కాని, రవి చచ్చిపోవడంతో నా లోపల ఏదో తెగిపోయింది. అసలు ఎక్కడనించి సంతోషం జీవితానికి వొస్తుందో ఆ నరం తెగిపోయింది. పైపై సంతోషాలు వొస్తున్నాయన్న మాటేగాని, లోపల్నుంచి నేను పూర్వపు మనిషిని కాను. పైన ఏ దిగులూలేదు, అంతా నెట్టేసుకున్నాను. తీసేసుకున్నాను, కాని దుఃఖమనేది పైపైన అనుకున్నాను కాని దాని వేళ్ళు ఎక్కడో వుంటాయని నా కప్పుడు తెలియదు అసలు. అందువల్ల ఏదీ నేను గొప్పగా చేసుకుని అనుభవించాలని చూసినా వొస్తుంది పైనించి కాని, అసలు లోపల్నించి సంతోషంరావటం మానేసింది. అంతే—నా జీవితానికి అంతే, తరవాత నేను గొప్పగా సంతోష పడలేదు. ఎందుకంటే నా బతుకులో ప్రతీదీ చెట్ల అందం, ఆకాశం అందం, పిట్టల అరుపులు, నీళ్ళ యివన్నీ గూడా అతనితో కలిసి నశించాయి.'

'మేము యిద్దరం ఒకటై ఈ సంఘాన్ని తిట్టుకోడం, వాళ్ళని దుయ్యబట్టడం, ఎక్కిరించడం. నవ్వుకోడం యివన్నీ కూడా మేము యిద్దరం లోపల్నుంచి వొకటై అనుభవించేవాళ్ళం, ఎప్పుడూ యిట్లానే వుంటాం అనుకునే వాళ్ళం. బేబ్స్ ఇన్ ది వుడ్‌లాగు అతనూ అట్లానే కలిసి పోయినాడు ఏ లక్ష్యం లేకుండా ఏది ఉంటేనేం? మేము యిద్దరం ఒకటై పోయినాం అన్నట్టు కలిసి పోయాం. మాతో కలిసింది వొయ్యి.'

'....వొయ్యేమో తన ఉద్యోగంలోకి వెళ్ళిపోయింది. రవి చచ్చిపోయాడు. నేను ఏకాకినయి పోయాను.

మళ్ళీ 'షౌ' కొంచెం పెద్దదై 'నాతో కలిసి కలలుకని సంతోషం పంచుకున్నదాకా నేను వొంటరిని అయిపోయాను. 'షౌ' చిన్నప్పటి నుంచీ కలల్లో బతికేది. ఆ కలల్లో నేనూ కలిసే వాణ్ణి కొంతవరకు. నా గొప్ప కాలం అయిపోయింది అతను లేకపోవడంతో. ఆ సంగతి నా కప్పుడు తెలియలేదు.... ఎన్ని నవ్వుకునే వాళ్ళమో! ఎంత గొప్పగా కలలు కనేవాళ్ళమో; ఏదీ లేకండా నేనూ, రవి,వొయ్యి మేము ముగ్గురమే ఈ ప్రపంచంలో అట్లా వుండేవాళ్ళం. రవే బతికి వున్నట్టయితే వొయ్యి గూడా రవికి దూరం కాలేక పోయేది!

## బెజవాడలో....

చలం బెజవాడలో వున్న రోజుల్నుంచీ వారింట్లో వారి ప్రాపకంలో పశుపక్ష్యాదులకు మనుషులతో సమానంగా గౌరవం ప్రేమాభిమానాలు యింట్లో అంతా చూపేవారు. సౌరిస్ ఆ రోజుల్లో బెజవాడలో తమతో వచ్చి కలిసి జీవించిన జంతువులు పిట్టలను గురించి గుర్తు చేసుకుంటూ చెప్పిన స్వగతం యిది—

బెజవాడకి ఎక్కడినించో ఓ కోతివచ్చి ఒక కుళాయి దగ్గరచేరి కుళాయి దగ్గిరకొచ్చే ఆడవాళ్ళ బట్టలు చించడం, వాళ్ళని కొరకడం, బెరచడం ఇట్లాంటి వన్నీ చేస్తోందని విన్నాం. ఋషివాలీ నుంచి నేను ఇంటికి రాగానే ఆ కోతి మా ఇంటి వరండా ముందు పెద్దగొలుసుపెట్టి కట్టేసిఉంది. బెజవాడ ట్రెయినింగ్ స్కూలులో వెంకటేశ్వరరావు అనే ఒక స్టూడెంట్ చదువుకుంటూ ఉండేవాడు. అతను బీదవాడు. మా వంటింట్లో పనులు చేసిపెడుతూ మా ఇంట్లో భోజనం చేసేవాడు. ఆ కోతి పరిసరాల్లోకి పోవడానికే మనుష్యులు భయపడుతుంటే వెంకటేశ్వరరావుకి మచ్చికయింది ఆ కోతి. అతనికి దాన్ని చూస్తే భయంలేదో లేక ఆ కోతికి వెంకటేశ్వరరావు అంటే ఇష్టమో తెలియదు. అతనేం ఆజానుబాహువు కాదు. వస్తాదూ కాదు. కాని ఆ కోతి అతన్ని చూడగానే ఎంత ప్రేమగా ప్రవర్తించేదో. రోజూ అతనే అన్నం పెట్టేవాడు దానికి. ఇంతలోకే అతని చదువు పూర్తి అయిపోయింది. వాళ్ళవూరికి వెళ్ళిపోతున్నాడు. అతనులేందే ఆ కోతిని ఎవరు చూసుకుంటారు? అందుకని అతను కోతిని వెంటబెట్టుకుని కృష్ణానదిదాటి సీతానగరం అడివిలో గొలుసు విప్పాడు. అది ఇతని కాళ్ళు పట్టుకుని వెళ్ళదు. స్వేచ్ఛ ఇచ్చినా సరే. అంత భయంకరమైన కోతి అతన్ని వదల్లేదు. ఆ దృశ్యం చూసేటప్పటికి అతనికి ఏడుపొచ్చింది పాపం, ఎట్లానో ఓలా దాన్ని ఒదిలించుకుని గబగబా నడిచి వచ్చేశాడు. అతను వెళ్ళేవరకు అట్లా నుంచుని చూస్తూ బాగా దూరానికి వెళ్ళేటప్పటికి అడివిలోకి వెళ్ళిపోయిందట.

ఒకసారి మా ఇంటి వెనకాల ఆరుబయట చాప వేసుకొని ఆడవాళ్ళందరూ కూచుని వున్నారు మాట్లాడుకుంటో. నేనూ వాళ్ళ మాటలువింటూ కూచుని వున్నాను. ఇంతలో మా పెంకులమీదికి ఒక పెద్ద పిల్లి వచ్చింది. అంతా తెలుపు. పట్టులాగా మెరిసిపోయే బొచ్చు, పెద్ద కళ్ళు, విచిత్రమేమిటంటే ఒక కన్ను నీలం ఒక కన్ను పసుపు. ఇన్ని పిల్లుల్ని చూసినా అటువంటి పిల్లిని ఎక్కడా చూడలేదు. దాన్ని అదివరకు ఎప్పుడూ చూడలేదు. మా ఇంటికి ఎప్పుడూ రాలేదు, ఆ పిల్లిని చూడగానే నాలోపల తెలిసింది అది నా దగ్గిర కొస్తుందని. అట్లానే అది పెంకుల మీద నుంచి నా వేపుకి నడవటం మొదలుపెట్టింది. ఎవరి వేపూలేదు దాని చూపు. పెంకులమీద నుంచి ఒక్క దూకు దూకి నా ఒళ్ళో వచ్చి కూచుంది. అక్కడున్న వాళ్ళందరూ ఎంత ఆశ్చర్యపోయారో. ఎన్నడూ చూడని పిల్లివచ్చి నా ఒళ్ళో కూచోవడం, తరువాత దాని కళ్ళు, అంత విచిత్రమైన పిల్లిని ఎవరూ చూడలేదు.

నేను ఎంతో దానికి ఎప్పటి నుంచో తెలిసినట్టు, అంత ప్రేమగా కూచుంది. కానీ నా లోపల తెలుసు. కాస్త సేపే నా ఒళ్ళో ఉంటుందని తరువాత వెళ్ళిపోతుందని, మళ్ళీ దాన్ని ఎప్పటికీ చూడనని. అట్లానే కాసేపు వీపు రాయించుకుని, ముద్దు చేయించుకుని నా ఒళ్ళోంచి లేచి ఎట్లా వచ్చిందో అట్లానే ఆ పెంకులమీదకి దూకి నడుచుకుంటూ వెళ్ళిపోయింది. ఎక్కడికి వెళ్ళిపోయిందో ఏమో మళ్ళీ దాన్ని చూడలేదు.

## మే - జూన్

లూలూకి (పెంపుడుకుక్క) గేదెకాళ్ళ రూపం పట్టం తరవాత వొయ్యి చాలా నిరాశపడి పోయింది. ఇంకెవరో పేషెంట్లు బెంగళూరు వెళ్తుంటే వాళ్ళు వచ్చేప్పుడు ఒకబొచ్చుకుక్కపిల్లని తీసుకురమ్మని చెప్పింది. వాళ్ళు ఒకటి గాకుండా రెండు తీసుకొచ్చారు. అవి స్పానియల్స్; పొడుగాటి నల్లని బొచ్చు. మే నెలలో రావడం వలన మొగవాడికి మే, ఆడదానికి జూన్ అని పేర్లుపెట్టాం. మే చాలా గంభీరంగా ఉండేవాడు. జూన్ చాలా అందంగా ఉండేది. ఆ రెండిటిని నేనే పెంచేదాన్ని. పడుకోవడం మాత్రం వసంత్ పక్కలో పడుకునేవి. మేకి జూన్‌కి రోజూ నీళ్ళు పోసేదాన్ని.

ఒకరోజు వీటికి నీళ్ళుపోసి తుడుస్తోంటే వాడు నా వేపు చూస్తో బిగుసుకు పోయి కళ్ళు పైకి తేలేశాడు. ఏమయిందో తెలియదు. చచ్చిపోతున్నాడనుకున్నాను. కొద్ది సేపటికి మామూలు అయిపోయినాడు. ఆ తరవాత చాలా సార్లు అట్లాఅవటం వలన తెలిసింది. వాడికి ఎవరిమీదయినా చాలా ఇష్టంవస్తే అట్లా అయేవాడు. పెద్దవుతున్నకొద్దీ వాడి పర్సనాలిటీ 'చాలా డెవలప్' అయిపోయింది. జూన్‌ని ముద్దు చేస్తేమాత్రం గిట్టేదికాదు వాడికి. దానికి మెళ్ళో పువ్వులు కడితే పీకి తుంపులు తుంపులు చేసేసేవాడు. మేం కోప్పడితే ఈ మాటు మెల్లగా వరండాలోకి పిల్చి జూన్‌ని మాకెవరికీ కనపడకుండా ఆ దండనంతా తుంపులు చేసేవాడు. అన్నం దగ్గిర అధికారం. ముందువాడు తింటేగాని జూన్ తినడానికి వీల్లేదు. నేను కొన్నాళ్ళు వూళ్ళో ఉండక పోవటంవలన వసంత్‌కి బాగా అలవాటయిపోయినాడు. అతనికి సేదేవాడు. వాడ్ని తీసుకొని పెరుశెనగ పొలాల్లో ఒక పొదలో గప్‌చిప్‌గా కూచోబెట్టి వసంత్ మొక్కలు పీక్కొచ్చేవాడు. వసంత్ మాట అంటే అంత శిరసావహించేవాడు. ఇంకేది వచ్చినాసరే. ఏమయినా సరే కిక్కుర్రు మనకుండా ఆ పొదలో కూచొని

ఉండేవాడు అంతసేపు. వాళ్ళిద్దరూ కలిసి ఎన్ని ఆటలు ఆడుకునేవారో దాగుడు మూతలు అట్లాంటివి.

మేకి జబ్బుచేసింది. బాగా జ్వరం. వాడు వసంత్ నోట్లో అన్నం పెడితేగాని తినేవాడు కాదు ఆ జ్వరంలో. ఆడవాళ్ళని చూస్తే చులకన. ఎవరయినా సరే మే ఇది చెయ్యి అంటే ఆడ వాళ్ళయితే చూసేవాడు కాదు. వాడి చేత ఏదయినా చేయించ వలసిందంటే వసంత్ చెప్పవలసిందే. ఆ జబ్బులో నర్తకి రోజూ వాడ్ని వెట ర్నరీ హాస్పిటల్‌కి తీసుకెళ్ళేది. రోజూ వాడికి ఇంజక్షన్ ఇవ్వమని. ఓ రోజు వీడు దొడ్డికి ఎట్లా వెళ్తున్నాడు అని అడిగాడు కంపౌడరు. వెంటనే బయటకు వెళ్ళి దొడ్డికి కూచుని కంపౌడరుని తీసుకెళ్ళి తనదొడ్డి చూపించాడు. వాడి బెల్ట్‌కి కింద అస్పత్రిలో కూచున్న వొయ్యి తాళంచెవులు ఇవ్వమంటే సరాసరి వెళ్ళి ఇచ్చేవాడు. ఒక్క కంటి సౌంజ్ఞతో ఒక్క మూతి విరుపుతో వాడు ఏమనుకుంటున్నాడో మాకు తెలిసేవాడు. అందరిలోకి ఈ సౌంజ్ఞలన్నీ పకపక బాగా కనిపెట్టేది, ఎప్పుడన్నా తప్పు పని చేస్తే వసంత్ కోప్పడితే అలిగి మూల పడుకునేవాడు. మళ్ళీవెళ్ళి వసంత్ బతిమాలితే తప్ప అమూల పడుకునే ఉండేవాడు. వాడికి సంగీతం అంటే మహా అభిరుచి. వాడికి సంగీ తం ఇష్టమయితే వాళ్ళ ఒళ్ళల్లోకి ఒక్క దూకు దూకేవాడు. నేను పాడుతున్నప్పుడు నా ఒళ్ళోకి అట్లా దూకి నా కళ్ళల్లోకి చూస్తో కళ్ళు తేలేసేవాడు. వాడి మొహం చూడ గానేనాకు నవ్వు వచ్చేసేది. ఒకసారి సుబ్రహ్మణ్యదేవర వయోలిన్ వాయిస్తుంటే మా ఇంట్లో పెద్దపార్టీలో, ఏమూలో పడుకున్న మే మనుష్యులందరిని మధ్య ఉన్న ఆయన మీదికి దూకేశాడు. వాడు చాలా లావు. బరువు. వాడు వయోలిన్ విరగ్గొట్టేస్తా డేమోనని వాడ్ని నలుగురయిదుగురు పట్టుకున్నారు.

సంతి, చే, వీణ నేర్చుకునేవారు. మేడమీద మూడో అంతస్థులో వీణ టింగ్‌మని మోగంగానే మే గాడు మెట్లు ఎక్కేవాడు పైకి. మధ్య దాకా పోయే టప్పటికి ఎవరు వాయిస్తున్నారో తెలిసిపోయేది వాడికి. ఆ వాయిస్తున్నది చే అయితే వెంటనే కిందకి దిగిపోయేవాడు. వసంత్ అయితే మేడ మీదకి వెళ్ళిపోయేవాడు. వెళ్ళి వసంత్‌కి ఎదురుగుండా కూచునేవాడు కళ్ళు అప్పచెప్పి. ఇంక అతను విషాద కరంగా వాయిస్తుంటే భరించలేక ఏదో తీగెలమీద చెయ్యి అడ్డుపెట్టేసేవాడు. ఎంత దీనంగా హృదయం కరిగిపోయేట్టు వసంత్ వేపు చూసేవాడో. "అబ్బా ఇంకచాలు నేను భరించలేను ఆపెయ్యవూ" అన్నట్టు చూసేవాడు అతని వంక.

చేకి, వసంత్‌కి వీణ నేర్పే మాష్టారు కంభంపాటి అక్కాజీరావుగారు మెడ్రాస్ రేడియో నించి అప్పుడప్పుడూ వాయిస్తూ ఉండేవారు. ఆయన కచ్చేరి ఎట్లా ఉందో వినమనేవారు మమ్మల్ని. మేమంతా రేడియో చుట్టూ కూచుంటే మే కూడా వచ్చి వినేవాడు. బాగా లేకపోతే అక్కడినించి వెళ్ళిపోయేవాడు. ఈ సంగతి ఒకసారి అక్కాజీరావుగారితో చెప్పాం. అప్పటి నించి ఆయన "మే విన్నాడమ్మా" అని అడిగేవారు. "మీరు విన్నారా" అని కాదండీ. మే అభిరుచిమీద అంత విశ్వాసం ఆయనకి. మేమన్నా మొహమాటం వలన బాగుందంటాం కానీ మేకి అట్లాంటి మొహమాటాలు లేవు కదా.

వాడికి షేక్‌హాండ్ ఇవ్వటం నేర్పించారు చే, వసంత్. వాడికి సౌందర్యం మీద ఎంత దృష్టో. అందమైన ఆడవాళ్ళు ఇంటికి రాగానే వాళ్ళ ముందు వెళ్ళి కూచుని వాళ్ళకి షేక్‌హాండ్ ఇచ్చేవాడు ఒకసారి ఒక పంజాబీ ముస్లిం ఆవిడ మా యింటికి వచ్చింది. ఎరక్కపోయి ఆవిడతో చెప్పాం అందమైన ఆడవాళ్ళకి వీడు షేక్‌హాండ్ ఇస్తాడని, ఆవిడకి షేక్‌హాండ్ ఇవ్వమంటే ఎంతసేపటికీ ఇవ్వడు. మే ఎంత బతిమాలినా ఇవ్వలేదు. ఆవిడ మొహం మాడ్చుకొంటోంది. మేము చాలా 'అక్వర్డ్ పొజిషన్'లో పడ్డాం. వాడు ఏ మాత్రం ఆవిడకి షేక్‌హాండ్ ఇవ్వలేదు. ఆవిడ కోపం తెచ్చుకుని వెళ్ళి పోయింది. ఎవరయినా పేషెంట్లు ఆసుపత్రి ముందర ఆగంగానే మేడమీద నించి కటకటాల్లోంచి చూసేవాడు. అందమైన అమ్మాయిలైతే సరేసరి. వేంటనే కిందికి వెళ్ళిపోయేవాడు. వాళ్ళు బల్లమీద వొయ్యి కోసం ఎదురు చూస్తోవుంటే వెళ్ళి పక్కన కూచునేవాడు. వాడి నల్లటి ఆకారం తెల్లటి కోరలు తేలేసే గుడ్లు చూసి ఆ పేషెంట్లు కొయ్యబారి పోయేవాళ్ళు నోట మాట వచ్చేది కాదు. ఇంక వొయ్యి వచ్చి "ఆ కుక్క ఏమీ చెయ్యదులెండి. భయపడకండి" అని చెప్పేవరకూ వాళ్ళు వెళ్ళిపోతుంటే వెంట వెళ్ళి రిక్షా ఎక్కేదాకా వుండి వచ్చేవాడు.

ఒకసారి నేను మేడమీద వరండాలో నిద్రపోతున్నాను రాత్రి అర్ధరాత్రి కళ్ళు తెరిచేప్పటికి మెలకువ వచ్చి మసక చీకట్లో నా మంచం దగ్గిర ఏదో ఆకారం కూచోని ఉంది కదలకుండా. ఎవరా అని చూస్తే అది మే. ఎందుకట్లా కదలకుండా కూచున్నాదో తెలియలేదు నిద్ర పోకండా నాకు కొంచెం నిద్రమగత వచ్చి మళ్ళీ కళ్ళు తెరిచి చూసేటప్పటికి అట్లానే కూచుని ఉన్నాడు. తూర్పు వేపుకి చూస్తో నేను గట్టిగా కళ్ళుతెరిచి చూశాను ఏమిటి చూస్తున్నాడా అని. దూరంగా

కొండల వెనకనించి చంద్రుడు ఉదయిస్తున్నాడు. వాడు ఉదయించే చంద్రుడ్ని చూస్తున్నాడు. నాకు నిద్ర పట్టింది మళ్ళీ నాకు మెలకువవచ్చి కళ్ళుతెరచి చూసే టప్పటికి ఎదురుగుండా తెల్లని చంద్రుడు. కదలకుండా చంద్రుడ్ని చూస్తో మే. అట్లా ఎంతసేపున్నాడో. నాకు నిద్రపట్టి నేను నిద్రపోయాను.

కొన్ని రోజులు గడిచిపోయినాయి. జూన్‌కి జబ్బు చేసింది. మేము ఎండా కాలం ఉప్పాడకి వెళ్ళాం. మాతో మే వచ్చాడు. వాడికి అదే మొదటిసారి సముద్రం చూడటం. సముద్రం చూడగానే దాంట్లోకి దూకేశాడు వాడు. ఎప్పటి నుంచో తనకి చాలా తెలిసినట్టు అలల్లో ఈతలు కొట్టడం మొదలుపెట్టాడు. అంతకుముందు వాడికి నీళ్ళంటే భయం. వసంత్ బందరు కాలవలోకి దూకి ఈత కొడుతున్నప్పుడు మే ఒడ్డు నుంచి కుయ్యో కుయ్యోమని ఏడ్చేవాడు. ఏడుస్తూనే వసంత్ దగ్గరకి ఒక్కదూకు దూకేవాడు. చుట్టూ ఈత కొడుతూ బతిమాలేవాడు. వచ్చేసెయి ఈ నీళ్ళలో వద్దు అని బతిమాలేవాడు. అంత భయం నీళ్ళంటే. అట్లాంటిది రోజూ సముద్రంలో ఈతలు కొట్టేవాడు.

కొన్ని రోజుల తరువాత మే సాయంత్రం మూడు నాలుగు ప్రాంతాల్లో సముద్రం ఒడ్డున కూచునేవాడు ఎక్కడో చూస్తో. దేనినో ఎదురు చూస్తున్నట్టు ఉండేది వాడి తీరు. మాకు అర్థమయ్యేదికాదు. మే, మే, అని పిలిస్తే పలికేవాడు. కాదు. దగ్గరకి వెళ్ళి తట్టినాకూడా కదిలేవాడు కాదు ఒక రోజు ఆ సమయానికి అక్కడ కూచుని కూచుని కుయ్యో. కుయ్యో అని ఏడవటం మొదలు పెట్టాడు ఏదో పెద్ద ఆపద మీద పడ్డట్టు. మాకేదీ అర్థం కాక తికమక పడిపోయాం. ఇంటికి వెళ్ళంతరవాత తెలిసింది. జూన్ అదే సమయానికి చచ్చిపోయిందని.

కొన్నాళ్ళయిపోయింది వాడు మళ్ళీ ఏదో తప్పు చేయడం వలన వాడ్ని పైకి రానీయకుండా కిందకి పంపించేసింది చే. వాడు కొంచెం చలివేసినా సరే, కొంచెం వానపడినా సరే గజగజ ఒణుకుతూ చే వంక నిష్ఠూరంగా చూసేవాడు. "చూసేవా నేను ఎట్లా ఒణికిపోతున్నానో" అన్నట్లు "దొంగవాడా నీకు నిజంగా చలివేస్తోందా?" అని చే కేకలేసేది.

వసంత్ ఇంట్లోంచి చెప్పకుండా వెళ్ళిపోయినాడు. వసంత్ మీద బెంగతో కొద్దిరోజులకే మే చచ్చిపోయినాడు.

(సౌరిస్‌గారు చెప్పి రాయించినది)

హృదయ వనజాత సుమ
మృదు మనోహర దళము
ల దయతను ద్రుంచినారే
పెంధూళిc
జిదిమి వెదc జల్లినారే।

# 1౭

# బెజవాడ జీవితం

రవి అస్తమించాక డాక్టర్ రంగనాయకమ్మ (వొయ్యి) తిరిగి కరీంనగర్ వెళ్ళదలుచుకోలేదు. డిప్లమాకి పూర్తికావలసిన అయిదేళ్ళు పూర్తి అయినా కాక పోయినా ఆమె నైజాం వెళ్ళదలుచుకోలేదు. బెజవాడలో అప్పుడు ప్రయివేటు ప్రాక్టీసు పెట్టి చలాన్ని, కుటుంబాన్ని ఆదుకోవాలనుకుంది. బెజవాడ ఆమె పుట్టిల్లు, కట్టుబట్టలతో యింటి నుండి బాల వితంతువుగా తరిమేసిన బెజవాడలోనే ఆమె ప్రయివేటు ప్రాక్టీసు ప్రారంభించింది. అయితే వీళ్ళ జుటు కత్తిరింపులూ, వేషాలూ సనాతన బంధువులకు కంపరం పుట్టించాయి. కొంతమంది వీరిని ఆదరించారు.

ఒక పెద్ద యింట్లోకి మారారు అక్కడ డాక్టర్లంతా వీరిపై కట్టుకట్టారు సహాయం చేయము అని. ముందు అంతగా పేషెంటు వచ్చేవారు కారు.

కాని, ఆ రోజులలో లేడీ డాక్టర్లు ఎవరయినా వుంటే వారంతా క్రైస్తవులు చాలామంది హైందవ కుటుంబాలలోనివారు ఆనాడు వాళ్ళిచ్చేమందులు తాగ

వలసి వస్తుందని వారిచ్చే మందులు వాడుకునేవారు కాదు. తప్పనిసరిగా అయితే తప్ప. కాని, త్వరలోనే ఉచిత వైద్యం కోసం బంధువులంతా రాసాగారు.

వీళ్ళని విచిత్రంగా చూసినా మొత్తానికి మళ్ళీ హిందూ సంఘం మీదకు వచ్చి పడ్డారు. పెద్ద రంగనాయకమ్మ వాళ్ళ మామగారు పోయి పెద్దజబ్బుచేసి వీళ్ళ పాలబడక తప్పలేదు. వీళ్ళంతా మాంసాహారులని వాళ్ళకి పెద్ద బెంగ. బంధువులు వచ్చి వీళ్ళని ఎద్దేవ చేసినపుడు పిల్లలు ఎదురు జవాబులు చెప్పి వాళ్ళని బెదర గొట్టేవారు. సంప్రదాయ మార్గంలో బంధువులతో కలిసిపోవాలని వుండేది చలం భార్యకి. వీళ్ళు యీ పిల్లలూ చలం, సౌఖ్య దాన్ని పడనివ్వలేదు. రోజూ బెజ వాడలో చుట్టూ వున్న ప్రదేశాలకు షికార్లు పోయేవారంతా, క్రమక్రమంగా కవులూ కళాకారులూ పత్రికలవారూ అంతా చలంగారి కోసం వచ్చేవారు. అప్పట్లో అబ్బూరి రామకృష్ణారావుగారు చలం కుటుంబానికి మంచి నేస్తం. జాతీయోద్యమం జోరుగా సాగేది. 'లాఠీ పోటులె పూలచెండ్లు, చెరసాలల్ పెండ్లివారిండ్లు, ఏ కాఠిన్యంబయినన్ సుఖానుభవమే గాంధీ కళాశాలలో పాఠంబుల్ పఠియించు', విద్యార్థులకు ఆంధ్ర దేశంలో. చలంభార్య ఉద్యమంలో కురికింది. సౌఖ్య సరే సరి. ఖద్దరు వస్త్రధారణ, రాట్నాలు నూలు వడకటం- చలం ప్రభుత్వోద్యోగి, ఇల్లు కాంగ్రెసుకి నిలయం! పిల్లలంతా పికెటింగులు చేసేవారు విదేశీ వస్త్ర బహిష్కరణోద్యమంలో. బాల సంఘం ఏర్పడింది అబ్బూరి వారబ్బాయి సారథ్యంలో. వసంత్‌ని, సౌరిస్‌ని రామకృష్ణారావుగారి అబ్బాయి విశాఖపట్నం తీసుకు వెళ్ళేడు. అక్కడ బీచ్చిలో తిరిగేవారు. కల్లుకుండలు పగల గొట్టేవారు వాళ్ళు. డాక్టరుగారు పిల్లల్ని కాన్వెంటులో చేర్చింది. ఇంట్లో పెద్ద రంగనాయకమ్మరాకతో ఆచారాలు పెరిగాయి. అప్పుడు ట్రైనింగ్ స్కూలు హెడ్మాస్టరుగా వున్న చలం విద్యార్థులచేత టాగోర్ నాటకాలు వేయించేవాడు. మంచిమంచి విందులూ, విహారాలూ. ఆ రోజుల్లో నాగేశ్వరరావుగారి దుర్గా మందిరంలో వూళ్ళో పెద్దలంతా కలిసి fools dinners చేసుకునేవారు. చలంగారు ఆ సమావేశాల్లో చాలా సరదాగా ఉత్సాహంగా పాల్గొనేవారు. ఎంకిపాటలుపాడేవారు. చలానికి బదిలీ కావడంతో అంతా చల్లారిపోయింది. బళ్ళారి రాఘవతో నాటకయాత్ర సాగిస్తూ పద్మావతి (పిన్ని) విజయవాడ వచ్చింది మధ్య మార్గంలో. అప్పుడు 'షా' పిన్నితో బయల్దేరి 'బరంపురం'లో 'తప్పెవరిది', నాటకంలో ఒక స్కూలు హెడ్మాష్టరుకి నాలుగో భార్యగా వేషం వేసింది. మధురమైన కంఠస్వరం, మాట్లాడుతుంటే ధా(ర)ం,

కళ్ళు తిప్పుకోలేనంత గొప్ప అందం పద్మావతిగారిది. ఆమె ప్రతిభకి వికాసానికి యీ నాటకాలు, పాత్రలు, వేదికలు ఎంతో యిరుకు. ఒకసారి బందర్లో చలం చిత్రాంగి నాటక ప్రదర్శన జరిగింది. అందులో పద్మావతిగారు చిత్రాంగి, చలం సారంగధరుడు, అబ్బూత్త రత్నాంగి, మిగతా పాత్రలు విద్యార్థులు. ఆఖరికి డాక్టరుగారుకూడా ఏదో చిన్నవేషం వేసింది. ముగ్గురు రంగనాయకమ్మలకి సవతి తల్లి, చలం సవతి అత్తగారు ఆ రోజుల్లో బెజవాడలో వుండేది తన అక్క పిల్లల్ని పెంచుకుంటూ. ఆవిడ గొప్ప అతిలోక రూపసి— తలారా స్నానం చేసి నడిచి వస్తూంటే ఏ కణ్వాశ్రమంలోని శకుంతలో నడిచి వస్తూన్నట్టుండేది. సౌరిస్ మాటల్లో- 'తాతయ్య మూడో భార్య మరీ చిన్నపిల్ల. తాతయ్యతో కాపురం చేయలేక పారిపోయింది. కోర్టులో ఆమె వ్యాజ్యం వేసినపుడు, బాసటగా నిలిచి సాక్ష్యం యిచ్చి ఆమెకు కొంత ఆస్తి వచ్చేలా చేసింది చలం భార్య. కాని చలం భార్యకీ డాక్టరుగారికీ- వాళ్ళమ్మ (చలం అత్తగారు) యిచ్చిన భూమి తనదేనని ఆవిడ దావా వేయడంతో గుడివాడ కోర్టు చుట్టూ చలం భార్య తిరగవలసి వచ్చింది. చలం వున్నదంతా తన తల్లి కిచ్చేశారు. ఆవిడ తెచ్చిపెట్టిన తగవులకోసం చలానికి కోర్టు ప్రదక్షిణలు తప్పేవికావు.

తల్లి 'షో' కి జుట్టుపెంచి నగలు పెట్టి కట్టూ, బొట్టూ మార్చి పేరంటాలకు తీసుకేళ్ళేది. ఓసారి ఆమె మద్రాసువెళ్ళి తిరిగి వచ్చేసరికి చలం సౌరిస్ జడ కత్తిరిం చేశారు. ఆమె గుమ్మంలో దిగీదిగడంతో చూసీ చూడగానే బావురుమని ఏడ్చేసింది. రవి పోయాక ఒంటరి తనంవల్ల పిల్లలు తెగ అల్లరి చేసేవారు. సంతి ఎక్కువ చేసేవాడు. చిన్న చిన్న అప్పులు చేసేవాడు కొట్లలో, పెద్దవాళ్ళతో పోట్లాటలకు వెళ్ళేవాడు. చలం ఎప్పుడూ పిల్లల్ని ఎవర్నీ కొట్టలేదు. ఒకటి రెండు సార్లు వసంత్ని తప్ప. మరీ చిరాకు తెప్పిస్తే కొట్టి, కొట్టేక, అనుకోకుండా కొట్టాను, నన్ను క్షమించు' అని క్షమాపణ అడిగేవారు. కాని ఆ విధంగా పెంచడం ఎంత కష్టం! తరవాత జీవితంలో పిల్లలకి ఎదగడం అనే యాతన వుండదు.

చలం పెట్టిన రూల్సు పాటించడం చాలా కష్టం. 'అమ్మ జోలికి పోకూడదు. బట్టలు నగలూ అన్నీ అమ్మ విషయాలు. అమ్మ యిస్తేనే తీసుకోవాలి లేకపోతే లేదు వేళకు భోజనానికి రావాలి. వేళకి నిద్రపోవాలి, వ్యాయామం చేయాల్సిందే.'

పసివాళ్ళ మనసుల్లో మంచితనాన్ని చివురింపచేయడం తల్లిదండ్రులచేతుల్లోనే వుంది. ఉదహరణకి-భయంకరమైన ముళ్ళతో వున్న కాక్టస్ని లూయీఎమ్బేంక్స్

తనతోటలో పెంచాడు. రోజూ ఆ చెట్టుకి వుపదేశించాడు "ఇక్కడ నిన్నెవరూ ఏం చెయ్యరు? భయంలేదు. నిన్ను మేము ప్రేమిస్తున్నాం. ఇంక ముళ్ళెందుక"ని. ఆశ్చర్యం! కొన్నాళ్ళలో కాక్‌టస్ ముళ్ళు రాల్చేసి అందంగా ఎదిగింది. తమ్మి తాము తీసేసుకుని ప్రేమతో పెంచాలి. అది చలం నమ్మిన సూత్రం.

బెజవాడలో రక్షణ మందిరమని అనాథ స్త్రీలకి ఆశ్రమం పెట్టాడు చలం. రక్షణ మందిరంలో సీతమ్మ అని ఓ ఆవిడ వుండేది. అందర్లోకి అందమయినది ఆవిడ. అందర్లా కాకుండా ప్రత్యేకంగా వుండేది. ఆవిడకి సౌరిస్‌కు ఎంతో స్నేహం. సీతమ్మని పాపాయిని నాకిచ్చేస్తావుగా అని అడిగేది 'షౌ'. 'నీకే యిస్తానమ్మా' అనేది ఆవిడ. ఎంతోమంది ఇలానే ఇస్తానని చివరికి దాటేసేశారు. అందుకని 'షౌ'కి నమ్మకం లేదు. ఒకరోజు పొద్దున్న సీతమ్మకి పాపాయి పుట్టిందని చలం వచ్చి చెప్పారు 'షౌ'కి. నా పాపాయి పుట్టింది అంటూ 'షౌ' పరుగెత్తుకుని వెళ్ళింది. 'ఇదిగో నీపాపాయి' అంటూ నవ్వింది సీతమ్మ. ఆ పాపయే చిత్ర. కడుపు పోయి మంచంమీద ఉన్న అమ్మ వెంటనే ఆ పాపాయిని పక్కలో వేసుకుంది.'

ఈ సమయంలోనే చలం తండ్రి పోయాడు. మేనత్తలంతా పిల్లల్తో వచ్చి చేరారు చలంగారింటికి.'షౌ' స్కూలు మానేసింది. పిల్లలంతా కాన్వెంట్ మానేశారు.

ఒకసారి ఒక టీచర్ 'షౌ' ని కాన్వెంటులో కొట్టిందట. చలంగారితో చెప్పింది-తరవాత ఓ సర్కస్‌కి చలం పిల్లలతో వెళ్ళాడు. అక్కడికి ఆ ప్రిన్సిపాల్ పిల్లలతో వచ్చింది.. 'ఈఓ దేనా కొట్టింది. వెళ్ళి ఒక్క దెబ్బ వేసిరా' అన్నాడు చలం. 'ఈవిడ కాదు తెలుగు టీచర్' అంది సౌరిస్. నిజంగా ఆనన్‌ని కొడితే తెల్ల వారి రాజ్యంలో బతకనిస్తారా? చలం పెంచే పద్ధతికి యిది ఓ మచ్చుతునక.

ఆడా మగా అనే తేడా లేకుండా పెంచడం వలన యీ పిల్లలు అందరితో చనువుగా వుండేవారు. దాన్తో మగవారి స్వభావం వికలం అయేది. అవి వీరికి అర్థం అయేవికావు. చలం పుస్తకాలు చదవడం వలన పురుషుల నైజం తత్వం గురించి ముందుగానే అనుభవం కావడం మొదలెట్టింది. తల్లి వొయ్యి సలహా లిచ్చేవారు, వీరు పొట్టిలాగులూ పొట్టి చొక్కాలూ వేసుకునేవారు. ఇంట్లో అదే డ్రెస్ చలంగారితో సహా. బయటకువెడితే చలం పైజామా, వసంత్ నిక్కరు షర్ట్ ఆడపిల్లలు ఫ్రాక్స్. ఈ డ్రెస్ వలన యీ బాధలు వస్తున్నాయని తనకు ఫ్రాకులు కుట్టించమని పోరాడింది 'షౌ'. చలం వీల్లేదు-యివే వేసుకోవాలన్నాడు, అప్పుడు

డాక్టరుగారు 'వెంకటచలం 'షౌ' పెద్దదవుతోంచే ఇంకా చొక్కా లాగూ వేసుకో మంటావేమిటి? అని అడ్డుపడి తను కుట్టిస్తానంది. యాత్రలు ముగించుకుని కన్యా కుమారి నుంచి వచ్చాక 'షౌ', వసంత్, చేనిఋషీవాలీ స్కూలుకి పంపించారు చలం. అక్కడ చదువు డాల్టన్ పద్ధతి. కొన్నాళ్ళయాక వుండలేమని తిరిగివచ్చే సింది 'షౌ'; అప్పుడు చలంకని గిరిలో-'షౌ' స్కూలు మానేసిందని తల్లి తలుచుకుని తలచుకుని ఏడ్చింది. 'షౌ' ని వొయ్య క్రింద ఆస్పత్రి పనిలో పెట్టారు. కాన్పులకి అటెండ్ అయినా నెత్తురు చూడలేక పోయేది, డిస్పెన్సింగ్ బాగా నేర్చుకుంది. ఆస్పత్రుల్లో రోగాల్ని ఛవరోగాల్ని కూడా చూసింది. తరువాత చలానికి నెల్లూరు బదిలీ అయింది. అక్కడ వుండగా బెజవాడలో రంగనాయకమ్మ ప్రసవించింది. పకపకపుట్టింది. కాన్పులో ప్రమాదమయిన జబ్బు చేసింది తల్లికి. కాన్పు తరవాత కాళ్ళకి చచ్చువాతం వచ్చింది. పుట్టిన పాప చరచర నడుస్తున్నా తల్లి మంచంలో వుండేది. యాత్రలకు వెళ్ళాక పుట్టింది గనుక చంపకాదేవి అని పేరు పెట్టారు. అక్కడ 'షౌ' కాలిమీద పెద్ద కురుపులేచి మదనపల్లి ఆస్పత్రిలో చేర్చారు. స్కూల్లో యిద్దరబ్బాయిలు 'చౌ' ని ప్రేమించి ఆ జెలసీతో ఒకతను హాకీబ్యాట్‌తో కాలుమీద కొట్టాడట. కాలు కొబ్బరికాయంత వాచి చీము పట్టిపోయింది. తరువాత గవర్న మెంటు డాక్టర్ని పిలిచి పదేళ్ళ చొకి ఆపరేషన్ చేశారు. అప్పట్లో వసంత్ చలం దగ్గర నెల్లూరులో వుండేవాడు. 'షౌ' కూడా తండ్రి వద్దకు వెళ్ళింది. ఆ రోజుల్లోనే చలం మృత్యువు నాటకం వ్రాశారు. శలవులయాక చేని వసంత్‌ని ఋషీవాలీ స్కూలు మానిపించేశారు. చదువు మానేస్తామంటే డాక్టరుగారు స్కూల్లో చేర్పించి ప్రయివేటు మాష్టారుని పెట్టి చదివించింది. 'చే' శ్రద్ధగా చదివేది.

అరుణాచలం వెళ్ళి వచ్చారు చలం. తన అనుభవాన్ని భగవాన్ గురించి పిల్లలకు చెప్పారు. షౌరిప్ భగవాన్ సాధనలో పడింది. తరువాత చలానికి విశాఖ పట్నం బదిలీ అయింది. అప్పుడు విశాఖపట్నంలో ఓ కొత్త సినిమా కంపెనీ బయల్దేరింది. వాళ్ళకి కొత్త తారలు కావాలి. 'షౌ' ఫొటోతో దరఖాస్తు పెట్టింది. అక్కడికి 'వొయ్య' 'షౌ'ని కారులో తీసుకు వెళ్ళింది. అక్కడకు వచ్చిన వాళ్ళని అక్కడ వాళ్ళ ప్రవర్తన చూపుల్ని చూశాక వాళ్ళ చెప్పుచేతల్లో ఆడీపాడేకన్నా ఒక బుద్ధిహీనుడైన మగవాడ్ని కట్టుకుని వాడికి దాస్యం చేయడం మేలనిపించింది. ఆ సినిమా కంపెనీ దివాలా తీసింది. ఆ రోజుల్లో తన తొలికథ 'ఉష' రాసింది 'షౌ'. వసంత్, చలం ఆ కథని ఎంతో మెచ్చుకున్నారు. కొడవటిగంటి కూడా ఆ కథని మెచ్చుకున్నాడు.

ఆ రోజుల్లో వసంత్ యస్. యస్ ఎల్. సి. తప్పాడు. ఏం చెయ్యాల్లో తోచక అడయార్ స్కూలుకి పంపించేశారు. అక్కడ మళ్ళీ పరీక్ష తప్పితే కళా క్షేత్రంలో కళా విభాగంలో చేర్చారు.

అప్పట్లో 'చలం-షౌ'ది ఒకటే ఆలోచన, ఒకటే మాట. వొయ్యికి ఆస్పత్రి పనుల్లో వూపిరాడేది కాదు. రంగనాయకమ్మగారికి జబ్బు. తల్లితో వొయ్యితో కలిసి మెలిసి వుండకుండా తండ్రీ కూతుళ్ళిద్దరిదీ ఒక జట్టు—ఆత్మీయత కుదరలేదు.

చలం, సౌరిస్ ఆధ్యాత్మికసాధన చేయడం డాక్టర్‌గారికి అర్థం అయేదికాదు. వాళ్ళు తప్పుదోవన నడుస్తున్నారని ఆమె అనుకునేది. భగవాన్ అంటే మహాను భావులే కాని ఆయన వల్ల మీకేమి వస్తుందని ఆమె పగలబడి నవ్వుకునేది. సాధ నలో తండ్రి కంటె తను ముందుకు వెళ్తున్నట్లు ఆమెకే తెలిసేది. చలానికి గుడివాడ బదిలీ అయింది. అక్కడ పేరుకి ఓ యిల్లు తీసుకున్నారు. సౌరిస్ కూడా వెళ్ళింది. ఇద్దరికీ తల నొప్పులు. స్కూళ్ళకి తనఖీకి వెళ్ళినప్పుడు 'షౌ' అనుసరించేది.

పాల్ బ్రంటన్ పుస్తకం చదివాక ఆ సంవత్సరం 'షౌ' పుట్టిన రోజు కాను కగా రంగనాయకమ్మ, చలం, పకపక, షౌ అరుణాచలయాత్రకి బయలుదేరారు. ప్రతి అడుగులోను సంతోషం. భగవాన్‌ని చూడగానే ఆత్మీయమైన చిరునవ్వు, బాణంలా దూసుకుపోయే ఆయన దృష్టి ఆనందంతో నిండి పోయింది. చలం సౌరిస్ సాష్టాంగ నమస్కారాలు చేశారు. తిరిగి వస్తుంటే మళ్ళీ భగవాన్‌ని ఎప్పుడు చూస్తామా అనే బెంగ. 1939లో దీక్షితులుగారితో మళ్ళీ వెళ్ళారు అరుణాచలం. నాలుగు రోజులవగానే చివరికి 'ఇక వెడదామా' అని చలం అనగానే దీక్షితులుగారు వెక్కివెక్కి ఏడిచారు. దసరా శలవల్లో మళ్ళీ వెళ్ళారు. పద్మావతిగారు కూడా వచ్చింది. చలంగారికి ఏలూరు బదిలీ అయింది. చలంగారి 'మ్యూజింగ్స్', 'హంపీ కన్యలు', 'అరుణ' అప్పట్లో వచ్చాయి. చలం కథల్ని పత్రికలవారు బహిరం గంగా ధైర్యంగా ప్రచురించడం ప్రారంభించారు. బహిష్కరించిన చలం పుస్త కాల్ని యువతరం బహిరంగంగా చదవడం ప్రారంభించారు. రెండవసారి వచ్చి నప్పుడు 'షౌ' అరుణాచల లేఖ రాసింది.

క్రిస్టమస్ సెలవుల్లో చలం మళ్ళీ భగవాన్‌దగ్గరికి వెళ్ళారు. భగవాన్ చలాన్ని ఆత్మీయంగా పలకరించారు. భగవాన్ అరుణాచల లేఖ చదివారని తెలిసింది.

బాల్యంలో 'షా' వాళ్ళు చెడ్డమాటలు మాట్లాడితే గుంజీలు తీయించేవారు చలం. ఇతర పిల్లలతో కలిసి ఆడుకున్నా 'షా'కు బూతుమాటలు వినిపించలేదు, మొదటిసారి బెజవాడలో జనం తాగి రోడ్డుమీద కొట్టుకుంటూ అరుచుకోడాలు విన్నాకగాని బూతు మాటలు వుంటాయని వారికి తెలీదు. కాని చిత్ర చిత్రంగా అవన్నీ విని పట్టేసింది. అవి ఇంట్లో ప్రవేశపెట్టింది. ఎవరికీ తెలియకుండా డబ్బులు ఎత్తుకు పోవడం అన్నీ చేసేది. ఇలాంటి అల్లర్లు వాళ్ళకి కొత్త. చలం గారిది చివరి మాట తీర్పూ—దానికి కట్టుబడేవారు పిల్లలంతా. చిత్ర మీద యీ పద్ధతులేవీ పని చేయలేదు. మళ్ళీ తెలివి తక్కువ పిల్ల కాదు. చిత్ర మొండి పిల్ల. ఎదురు తిరిగేది. ఏం చేయలేక పోయారు. పొయ్యి. చలం ప్రయత్నించి కాలేక వదిలేశారు. ఇంటికి వచ్చిన వారు 'చిత్ర' బూతులు విని షాక్ అయేవారు.

## ఓనిల్

ఓనిల్ అనే ఆయన లండన్ పరిసరాల్లో dreadful school అని ఓ ఆదర్శమైన పాఠశాలను ప్రారంభించాడు. ఆ స్కూల్లో యిష్టమైతేనే పిల్లలు క్లాసు రూముకి వెళ్ళేవారు. పిల్లలంతా ఓనిల్‌తో కలిసి అల్లరి చేసేవారు. ఆ పిల్లలంతా సంఘానికి పనికి రాక వదిలేసిన వాళ్ళు. ఒకావిడ ఓనిల్‌ని 'నీల్ నువ్వు' దుష్టులయిన పిల్లల కోసం స్థాపించావుటకదా నీ పాఠశాల?' అని తన కొడుకుని చేర్పడానికి వచ్చి అడిగిందట. 'అదేం కాదమ్మా. బుద్ధిహీనులైన తల్లుల బిడ్డల కోసం' అన్నాడట అతను జవాబుగా. ఇష్టమైతే తప్ప పిల్లలు ఆ బడిలో చదువుకో నక్కరలేదు. రాళ్ళు తీసి లేబరేటరీ అద్దాలు బద్దలు కొడుతోవుంటే ఆ అల్లరిని ప్రేమతో సద్వినియోగం చేసుకోగల మేధావి.

తన జీవితంలో చాలా ఆలస్యంగా చదివారు 'ఓనిల్' పుస్తకాన్ని చలం. పిల్లలకు స్వేచ్ఛ అంటే ఎన్నో కొత్త విషయాల్ని నేర్చుకున్నాను అంటాడు చలం 'ఓనిల్' గురించి. ఏదన్నా ఇల్లు కడితే అంతా కలిసి కట్టేవాళ్ళు. స్కూలు సంగతులన్నీ పిల్లలే చూచుకునేవారు. కార్పెంటరీ (వడ్రంగం) మొదలుకుని శారీరక శ్రమతో కూడిన పనులన్నీ పిల్లలే చేసేవారు. మానసికంగా ప్రకాశితం చేసి పిల్లల్ని సరైన దోవకి తీసుకు రావడమే 'ఓనిల్' శిక్షణ.పిల్లలలో ఏదైనా బలంగా నాటుకుని వున్నప్పుడు దాన్ని వెలికి వచ్చేయనివ్వటమే మంచిదని 'ఓనిల్' అర్థం.

చలంగారి పెంపకంలోని strictness చిత్ర దగ్గరకి వచ్చే సరికి సడలి పోయింది. పిల్ల స్వభావం వేరయినపుడు శిక్ష వత్తిడి వలన మార్పురాదు. పద్ధతిని మార్చుకోవాలి పెద్దలు.

ఇంతలో వసంత్ అడయార్ నించి వచ్చాడు. బెజవాడలోవొయ్యి (డాక్టరు) రక్షణమందిరానికి మద్రాసులో పద్మావతి (పిన్ని ఒక యిల్లు బ్రాంచి). మద్రాసులో చేరిన వాళ్ళని దిక్కులేనివారిని బెజవాడ పంపించేది పద్మావతిగారు, ఇల్లంతా సందడి. వీరంతా జబ్బుపడివున్న చలం భార్యని ఆటపాటల్తో ఆనందపరిచేవారు.

చలం ఏలూరులో మైదానం దగ్గర ఒక చిన్న యింట్లో వుండేవారు. చలం ఆరాధకులు ఆయన్నీ పిల్లల్నీ చూడ్డానికి వచ్చేవారు, సౌరీస్ ఆ వచ్చిన వారూ అంతా కలిసి ఇంట్లో పనులు పంచుకుని హాయిగా వుండేవారు.

బెజవాడలో చలంగారింటి ముందున్న తోటని ధ్వంసం చేసి కొట్లుకట్టి అద్దెలకిస్తానన్నాడు యింటి యజమాని. దాంతో వాళ్ళు ఆ యిల్లు మారవలసి వచ్చి-వెతగ్గా లక్ష్మి టాకీస్ వద్ద (జె.డి. ఆస్పత్రిరోడ్)లో వారికి నచ్చిన యిల్లు దొరికింది. ఆ రోజుల్లో మా యింట్లోంచి ఎటు చూసినా ఆకాశం కొండలు కనపడేవి (యిప్పుడది మురికి ఇరుకు సందు).

చలం. షౌ మళ్ళీ అరుణాచలం వెళ్ళారు.

రంగనాయకమ్మగారికియింకా జబ్బుగా వుండగానే యిల్లుమారడం జరిగింది. చలం భార్యకు కూతురు సౌరీస్‌తో విరోధభావం- అది భగవాన్‌కి 'సౌ' దగ్గిరయాక తగ్గింది. ప్రాణంగా చూసుకునేది.' చలం, చలంభార్య ఒకరికొకరు తగిన జంట కాదని కూతురు సౌరీస్ అనుకునేది. వారిస్వభావాలు, ప్రవృత్తులు, పూర్తిగా వేరువేరు.

ఇంతలో 'చే' కాలేజీ చదువులకు వెళ్ళింది. S.S.L.C. తప్పినా స్త్రీలకు ఆ రోజుల్లో ప్యాసవకుండానే exempt చేసి కాలేజీల్లో చేర్చుకునేవారు. కాకినాడ కాలేజిలో ఇంటర్‌లో చేరి హాస్టల్లో వుండేది 'చే'. ఆమెని చూసుకుని తల్లి గర్వపడేది. అక్కడ తిండి పడక ఆరోగ్యం దెబ్బతించే చలం ఆరోగ్యం బాగయ్యాక చదవవచ్చని కాలేజీ మాన్పించారు. తిరిగివచ్చి ఆ అమ్మాయి అక్కగారి అడుగుజాడల్లో నడవడం ప్రారంభించింది. ఆరోగ్యం కోసం యోగాసనాలు ఆరంభించింది. తలారా స్నానం చేయాలి గనుక అంత పెద్దజుట్టుని నాన్న చేత కత్తిరింపించేసుకుంది. భగవాన్ మీద భక్తి కుదిరింది. పాపం రంగనాయకమ్మగారు

సౌరిస్‌ని తిట్టిపోసేది. పెద్దపరికిణీలు మానేసి స్కర్ట్స్ పొట్టివి వేసుకోవడం మొదలు పెట్టింది. వేషం మార్పుతో ఆమె స్నేహితులు ఆమెకి దూరమయ్యారు.

రంగనాయకమ్మగారికి డాక్టరు (వొయ్యి) గారికి 'చే'లో వచ్చిన మార్పులకు చాలా కష్టంగా వుండేది. 'నువ్వు పెళ్ళాడి స్థిరపడకపోతే 'చే' కూడా స్థిరపడదు' అని వారిద్దరూ సౌరిస్‌తో పోరాదేవాళ్ళు. 'చే'ని ఎంతో మంది ప్రేమించేవారు కాని, సౌరిస్‌ని పెళ్ళి చేసుకుంటామని ఎవరూ ముందుకు వచ్చేవారు కాదు. 'చే' తనను ప్రేమించి వచ్చిన వారినందరినీ తిరస్కరించేది. ఈ ప్రవర్తన డాక్టరుగారికి తల్లికి చాలా కష్టం కలిగించేది. అయితే ప్రతి విషయంలో చెల్లెలు అక్కగారిని సలహా అడిగేది.

వసంత్, చే కొంచెం పెద్దయ్యాక చలం రచనలు చదివి రచయితగా తండ్రి ప్రభావాన్ని ప్రఖ్యాతిని గుర్తించే స్థాయికి వచ్చారు. మా నాన్న యింత గొప్ప రచయితా అని పొంగి పోయేవారు. 'చే-వసంత్' చలానికి బాగా దగ్గరవసాగారు.

అప్పట్లో సంగీతాభిమానులయిన చలం కుటుంబంలోకి రేడియో వచ్చింది.

ఆ రోజునే హరీన్ వీళ్ళ యింటికి వచ్చి వీళ్ళతో కలిసి పోయారు. హరీన్ తన పాటలకు 'చే'కి డాన్స్ నేర్పారు. పాటలు, ఆటలు, నృత్యాలు, కవిత్వాలు హరీన్‌తో ప్రపంచం అదో రకం హాయి.

ఇంతలో చలంగారిని మార్టేరు ఎగ్జామినర్‌గా వేశారు. అది చాలా అందమైన వూరు. పెద్ద పెద్ద కాలువలూ, ఒడ్డున శిరీష వృక్షాలూ-ఎంతందమో! కుటుంబం అంతా చలంతో వచ్చేశారు. రంగనాయకమ్మగారు చిరాకులు కోపతాపాలు లేకుండా సంతోషంగా గడపడం జీవితంలో అదే మొదటి సారేమో? ఎప్పుడూ యీవిడ యిలా ఎందుకు వుండదు? అవసరం లేని గొడవల్ని ఎందుకు నెత్తిన వేసుకుంటుంది? అనిపించేది సౌరిస్‌కి.

అక్కడ మార్టేరులో హెడ్‌మాస్టరు మంచి హోమియో నిపుణుడు. ఆయన సలహాపై పోస్టులో మందులు తెప్పించుకుని వాడారు తండ్రీ తనయులు. రెండు మూడేళ్ళపాటు వాడారు వచ్చినవి ఆ జన్మరోగాలు అవి తగ్గలేదు మానేశారు.

## ఒక యూరోపియన్‌తో

హరీన్ నాటక ప్రదర్శనానికి టికెట్లు అమ్ముతూండగా ఒక యూరోపియన్ ఆఫీసర్‌తో 'షా'కి స్నేహమయింది. అతన్ని గురించే మాట్లాడేది. ఆ బంగ్లా

చూడటానికి చే. షా షికారుగా వెళ్ళారు. సరదాగా అల్లరిచేశారు. ఒక పార్టీలో 'షా'ని పాడమందితల్లి. ఈమె పాడగా ఆ ఆఫీసరు విన్నాడు.అతనికి బాగానచ్చింది. 'షా' పట్ల అతనికి అమితమైన ప్రేమ అని అందరికీ తెలిసిపోయింది. హాల్లోకి వచ్చాక మళ్ళీ పాడింది 'షా'. అతను ఎంతో పరవశించి చాలాసేపు వుండి ఆఖర్న వెళ్ళాడు అప్పుడు యుద్ధం రోజులు అతను పరదేశస్థుడు. తనుతనను ఎన్నడో భగవాన్‌కి అర్పించేసుకుంది. ఇది జరగదని ఆమెకు తెలుసు. కాని లోపల ఏదో తీపి గురుతు! సౌరిస్ రాసిన అరుణాచల లేఖ ఇంగ్లీషు ప్రతి అతను తీసుకున్నాడు- అతని పేరు వింటూనే మూర్ఛపోయేది సౌరిస్. యుద్ధం జోరుగా సాగుతోంది. ఊపిరాడని పనులు- ఎప్పుడో ఓసారి వచ్చి కాస్సేపు కూచుని వెళ్ళిపోయేవాడు, ఆహ్వానించినా వచ్చే తీరిక లేదనికి ఎప్పుడన్నా ఎదురయితే సర్వాన్నీ మర్చిపోయి తన్మయత్వంలోకి వెళ్ళిపోయేవాడు. అది దైహికాకర్షణో? దైవికాకర్షణో? భౌతికంగా చేరువైతే ఇద్దరికీ వినాశంతప్పదని 'సౌరిస్'కి అనిపించేదట. బ్రిటిష్ వారంతా మూటా ముల్లె సర్దుకుని ఏ నిముషాన్నయినా వెళ్ళిపోవలసి వచ్చేరోజులవి. జాతకాల వాళ్ళు 'షా'కి పెళ్ళి ఆ సమయంలో జరుగుతుందన్నారట. సౌరిస్ భగవాన్‌నే నమ్ముకుంది. ఈ ప్రేమను కూడా ఆయనకే సమర్పించుకుందాం అనుకుంది.

## వసంత్

వసంత్ వచ్చాడు. అతను అడయారు స్కూలు మానేసి ఒక సినిమా కంపెనీలో అసిస్టెంట్ కెమరామాన్‌గాచేరాడు. ఆ సినిమా వాళ్ళు మెచ్చుకుని పైకి వస్తావన్నారు. అతను కంపెనీలో పనిచేస్తూ హఠాత్తుగా చలానికో ఉత్తరం రాశాడు-

'కాశ్మీరు వెళ్ళి, అక్కడ వుండిపోయి. అక్కడ కూలీపనిఐనా చేస్తూ బతకాలని వుందనీ వెంటనే అయిదు వందల రూపాయాలు పంపమని'

నువ్వు కూలి చేసుకోదలిస్తే డబ్బెందుకు? ఇప్పుడే శ్రమకి తట్టుకోవడం, డబ్బులేకుండా గడపటం నేర్చుకో! అంతదాకా ఎందుకు? మదరాసు నుంచి యిక్కడికి నడిచిరా అని జవాబు రాశారు చలం.

అతను అలాగే ఒక మిత్రుడితో కలిసి మదరాసునుంచి బయలుదేరి బెజవాడ వచ్చాడు, అతను ఎవరో తెలియకపోయినా దారి పొడుగునా అతనికి అన్నం లేదన్న వాళ్ళు లేరుట. వాళ్ళు వచ్చేసరికి చలంవాళ్ళకి ఎంతో ఆనందమనిపించింది. ఏ ఆధారం లేకుండా మద్రాసు నుంచి నిర్వికారంగా నిశ్చింతగా నడిచి వచ్చా

దంచే, యిత నెంతలేకపోయినా బ్రతుక గలదనే ధీమా చలం వాళ్ళకి కలిగింది. ఇంతలో సుబ్బారావుగారు (చలం మిత్రుడు) రావడంతో ఆయన వసంత్ ఆలోచించి కాశ్మీర్‌కి ఎటు దగ్గిరదారో నిర్ణయించుకున్నారు. వసంత ఆతని నేస్తం నైజాం వెళ్ళడం దగ్గరని నిశ్చయించుకున్నారు. అటు వైపు బయల్దేరారు, హైదరాబాదు వైపు వెళ్ళారు. ఆ దక్కను పీఠభూమి అక్కడ ఏమీ పండదు కాని, వసంత్‌కి అతని స్నేహితునికి ఎవరూ కాదనకుండా దారిలో భోజనం పెట్టారు. వాళ్ళు పెట్టిన గొడ్డుకారంతో హైదరాబాద్ చేరేసరకి వసంత్‌కి డీసెంట్రీ పట్టుకుంది. రంగనాయకమ్మ గారి పెద్దక్కయ్య బ్రతిమాలి. ఏడ్చి, వాళ్ళని తనతో వుంచేసింది, యింక ముందుకు పోనివ్వకుండా. వసంత్ స్నేహితుడు మిలటరీలో చేరిపోయాడు. పెద్ద రంగనాయకమ్మగారు వసంత్‌ని తీసుకుని బెజవాడ వచ్చేశారు.

(బిడ్డల శిక్షణలో చెప్పిన ప్రకారం పెంచితే తల్లిదండ్రులకి వాళ్ళ ప్రవర్తన చాలా disappointingగా వుంటుందని చలంగారు చెప్పారు గనుక యీ అడ్వెంచర్ గురించే వ్యాఖ్యానించడంఅనవసరం. ఓనిల్ స్కూల్ ఫర్ ది డ్రెడ్‌ఫుల్ ప్రకారం బుద్ధిహీనులైన తల్లిదండ్రుల బిడ్డలకోసం పెట్టిన స్కూల్లో సంతిని చేర్పించాల్సింది.)

## ఫలి

ఇంతలో లీలగారు వచ్చి బెజవాడలో చలం ఫామిలీతో కలిశారు. చలం ద్వారా సౌరిస్‌కీ ఆ యూరోపియన్ ఆఫీసర్‌కి మధ్య జరుగుతున్న తేలని వ్యవహారం అమెకు తెలిసింది. ఆవిడ అతన్ని చూడాలని 'షౌ', రంగనాయకమ్మగారితో వెళ్ళింది. అతను వీరందరితో చాలా ఆప్యాయంగా మాట్లాడాడు. లీలగారు అతన్ని చూసి చాలా మెచ్చుకుంది, సౌరిస్‌ని ఏదన్నా ఉత్తరం రాయమని సలహా యిచ్చింది. వెల్లటూరు కూడా ఆమె జాతకాన్ని బట్టి నువ్వేదన్నా ప్రయత్నం చేస్తే మంచిది అని చెప్పిన మీదట సౌరిస్ అతనికి లేఖ రాసింది–'ఎప్పుడూ నువ్వొస్తావని ఎదురు చూస్తాను. ఈ మారు నిరాశ పరచవని ఆశిస్తాను' అని. రంగనాయకమ్మగారు అంతకు ముందే అతన్ని ఒక పార్టీకి పిలిచింది. అతను వచ్చి 'మీ ఉత్తరం అందింది థాంక్స్' అన్నాడు. 'షౌ' పాడింది లీలగారు వీణ వాయిస్తూ పాడారు, చలం భార్యతో చలంగారితో లీలగారు ఈ విషయమై వ్యవిషయంలా తీసుకుని మాట్లాడారు. 'షౌ' ఏడాది నుంచి పక్కమీద వుండటం, బలహీనమయి పోవడం యివన్నీ

అతనికి కొంత తెలియపరిస్తే బావుంటుందని లీలగారు అనుకున్నారు. ఆ ఆలోచనతో రంగనాయకమ్మగారు ఆ ఆఫీసర్‌కి ఓ ఉత్తరం రాసి 'షా' కిచూపి, అతనికి పంపించింది.

రంగనాయకమ్మగారు ఆ ఉత్తరం రాసి వుండవలసిందికాదు. అన్ని ప్రణయాలు అపార్థంతో ముగుస్తాయని బాల్జాక్ అన్నట్లు జరిగింది. ఇది వెల్లటూరు గారన్నట్లు ఒక రాంగ్ స్టెప్। అతను అపార్థం చేసుకుని చలంగారికి సుదీర్ఘమైన లేఖ రాశాడు-"ఇట్లా మీ భార్య రాసింది.ఆమె నింక మాయింటికి రావద్దని చెప్పండి" అని. పాపం, చింతతో బరువెక్కి కొలిమిలా అయిపోయింది "షా" హృదయం. ఆమెలోరగిలిందిచిచ్చు. రంగనాయకమ్మగారు తనమీద వొచ్చిపడినందుకు ఓ రోజు యిల్లు వదిలి ఎక్కడికో వెళ్ళిపోయింది. చివరి కెప్పుడో సాయంత్రం వచ్చింది. వచ్చి చెప్పింది 'తను చచ్చిపోదామని వెళ్ళానని, అక్కడ 'షా' కనిపించినట్లయి తిరిగి వచ్చేశాన'ని. తరవాత చలంగారు అంతా సర్దేసి అతనికో లేఖ రాశారు.

కొన్ని రోజుల తరవాత ఆ ఆఫీసరుకు బదిలీ అయిపోయింది. ఇంక అతను వెళ్ళిపోతున్నాడంటే 'షా' లో అంతులేని దుఃఖం పొంగి వచ్చింది. అతను శలవు తీసుకుందుకు వీరింటికి వస్తానని రంగనాయకమ్మగారితో చెప్పాడు. లక్ష్మి టాకీసు దాకావచ్చి చలంగారింటికి తీసుకెళ్ళమని. మళ్ళీ వద్దులే అని వెళ్ళిపోయాడట. అతను వెళ్ళాక జ్వాల అంతాపోయింది 'షా'లో, బదిలీ అయి వెళ్ళాక కూడా రంగనాయకమ్మగారికి అతను ఎన్నో ఉత్తరాలు రాసేవాడు.

అప్పట్లో బెజవాడలో ట్రెయినింగ్ స్కూలు మూసివేసి చలంగారిని డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్‌గా వేశారు. 'షా' కి లీలగారు తోడుగా వుండి మనసుని మళ్ళించి ఊరట కలిగించడానికి ప్రయత్నించేది.

ఆ ఆఫీసర్ వెళ్ళిపోతూ ఒక శిశు సంక్షేమ కేంద్రాన్ని ప్రారంభించివెళ్ళాడు. దానిని రంగనాయకమ్మగారూ కొంత మంది మిషనరీలు నడిపేవారు. అక్కడకు వెళ్ళి ఆ పిల్లలతో ఆడుకుని వచ్చేది 'షా'. అది రెడ్‌క్రాస్ సంస్థ. దానికి నిధులని స్వీకరించేందుకు వెల్లటూరుగారు 'మారబుల్‌టూంబ్' అనే నాటకాన్ని ఎన్నుకున్నారు. వసంత్, చే, చలం, షా వేశారు. అందులో 'చలం, షా' ఎంకి-నాయుడు బావ టాబ్లోస్ వేశారు. తతిమ్మావి నాటకాలు.ఊరు ఊరంతా టిక్కెట్లు కొనకుండా

కట్టుదిట్టాలు చేస్తున్నారు. కలెక్టరు ఆ నాటకాన్ని ప్రదర్శనను చూసి మూర్ఛ పోయాడు. ఆ కలెక్టరు తరువాత చలం పుస్తకాలన్నీ చదివాడు.

ఆ తరువాత ఇంకో నాటక ప్రదర్శనం ఏలూరులో యిచ్చారు. ఈ మాటు చలంగారి 'నరసింహావతారం', (శివం) వేసి ఎంకి-నాయుడుబావ టాబ్లోస్ వేశారు. నండూరి సుబ్బారావుగారు ఆ ప్రదర్శనానికి వచ్చి 'షా' వేసిన ఎంకిని మెచ్చు కున్నారు.

తరువాతచలంగారికి ఢిల్లీ బదిలీ—అప్పుడు చలంగారు ఏలూరులో యిల్లు తీసుకుని లీలగారితో వుంటున్నారు.

డాక్టరుగారు సౌరిస్‌కి బాగా దగ్గరయి మునుపటివలె ప్రాక్టీసు పెట్టక ముం దెంత సరదాగా వుండేదో అంత సరదాగా వుండేది. ఆమెని పిల్లలు వదిలేవారుకాదు లోపల ఏమి బాధపడేదో కాని పైకి సంతోషంగా వున్నట్లు కనపడేది.

ఇక్కడ రంగనాయకమ్మగారి మానసిక పరిస్థితి క్రమక్రమంగా దయనీ యంగా మారిపోసాగింది.

చలంగారి యిష్టమైనసిస్టర్ (పిల్లలకు పేలు విడిచిన మేనత్త) వాళ్ళు మద్రాసులో నాడి చూపించుకున్నారట. రంగనాయకమ్మగారు వెళ్ళి 'షా' నాడి చదివించుకుంది. దాంట్లో జరిగిందంతా-లీల, చలంతాళ్ళు, 'షా' ఆ ఆఫీసర్ బంగళాకి వెళ్ళడం దగ్గర్నుంచి అన్నీ రాసి వున్నాయట. అతని నాడి కూడా చదివించింది సౌరిస్ తల్లి. అందులోనూ సౌరిస్ పేరు వుందిట. ఈ పెళ్ళి అయి తీరుతుందని రంగనాయ కమ్మగారి ధైర్యం. నాడిలో ఆ ఆఫీసరుకి షాకి ముడిపడి వుంది గనుక తన పూజా బలంతో ఆ ఆఫీసర్ని 'షా' వైపు తిరిగేలాగు చేయాలని గట్టి పంతం పట్టింది. ఏవేవో పూజలు చేయడం ప్రారంభించింది. 'అలాంటి పూజలు చేస్తే నీ మొహం చూడన'ని 'షా' ఢిల్లీ నుంచి ఉత్తరం రాసింది.

అటువంటి పూజలు చేయడం వలన ఆమె తలచెడి హిస్టీరియాలో పడి పోయింది. శ్మశానాల్లో కూర్చుని వచ్చేది. ఈ పూజల వలన చీకటన్నా శ్మశాన మన్నా భయపడే రంగనాయకమ్మగారు భయపడటం మానేసింది. ఆవిడ తాపత్రయ మంతా తన కూతుళ్ళకు పెళ్ళయి వారు లోకంలో అందరిలా స్థిరపడాలని-అదే జరగడంలేదు.

ఇంతలో 'చే' మేనత్త కొడుకుతో పెళ్ళికి సిద్ధం కావడంతో ఆమె దృష్టి రెండవ కుమార్తె వివాహం వైపు మళ్ళింది.

ఆ రోజుల్లో రంగనాయకమ్మగారు వార్ వర్క్ చేసేది. అందుకని R.A.F. ఆఫీసర్లు కుర్రవాళ్ళంతా ఓ మంచి ఆంటీ దొరకడంతో ఆమెనుంచి మాతృ ప్రేమను మారగొనేవారు. ఇళ్ళూ వాకిళ్ళూ వదిలివచ్చిన కుర్రాళ్ళు! ఈ ఆంటీని చూస్తే వారికి ప్రాణం లేచి వచ్చేది. ఆ పంజాబీ ఆఫీసర్లకి వసంత్ అంటే చాలా ప్రీతి. గన్నవరం విమానాశ్రయంలో వాళ్ళంతా మకాం ఈ ఆంటీతో డాక్టర్ గారితో వాళ్ళు విమానాశ్రయంలో విందులూ యిష్టాగోష్టులు జరిపేవారు. 'షౌ' కూడా వెళ్ళేది. అదో కాలక్షేపం. తమ కోసం తయారయిన భోజనాలను వీళ్ళకు పెట్టి వాళ్ళు డాల్ రోటీ తినేవారు. వాళ్ళు చలంగారింటికి వచ్చినా అంతే! వంటింట్లో ఏమి వుంటే అది అంతా కలియబడి ఆరగించేవారు. ఓ సారి వీళ్ళు వాళ్ళ కాంపుకు వెళ్ళినపుడు వీళ్ళని వెళ్ళనివ్వక ఒక పార్టీలో తాగి యింటికి పోతామంటే వినిపించుకోకుండా ప్రవర్తించారు. ఎలాగో యింటికి వచ్చిపడి మళ్ళీ ఆ క్యాంపుకు వెళ్ళలేదు వీళ్ళు.

డాక్టర్ గారు ఒక రూలు పెట్టింది. ఎవరు వీళ్ళ యింటికి వచ్చినా రాత్రి తొమ్మిదికాగానే వెళ్ళిపోవాల్సిందే. అంత జాగ్రత్తగావున్నా బెజవాడలో 'షౌ' వాళ్ళమీద అసహ్యంగా మాట్లాడుకునేవారు వూళ్ళోవాళ్ళు. చలంగారింటికి వచ్చే ఆంధ్రులకన్నా వాడు విద్యాధికులు వున్నత సంస్కారం కలవాళ్ళు.

## 'చే'

ఆ ఆఫీసర్లలో ఒకతను 'చే'ని ప్రేమించాడు అమితంగా. రమణ అనే చలంగారి చెల్లెలి -వేలు విడిచిన మేనత్త- కుమారుడు కూడా 'చే'ని ప్రేమించాడు గాఢంగా. ఒక స్నేహితుడ్ని వరించాలా, మేనత్త కొడుకుని చేసుకోవాలా అనే ప్రశ్న వచ్చి నిలిచింది 'షౌ'ని చలంగారిని అడిగింది చే. 'చే' కోసం వారిద్దరూ పరితపిస్తున్నారు. ఎవరిని చేసుకోవాలో నీవే నిర్ణయించుకోమని అంటే 'చే' బావని పెళ్ళిచేసుకోను అని ఆ సంగతిని అతనికి స్పష్టం చేసింది. పెళ్ళయినాక స్వేచ్ఛగా వుండాలనీ, తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవాలని 'చే' ఆకాంక్ష. పెళ్ళికి అంగీకరించి అడ్జస్టు అవాలనే తత్వాన్ని ఆమోదించలేని 'చే' ఆ విషయాన్ని యిద్దరికీ చెప్పేసింది. ఈలోపుగా ఆ R.A.F. ఆఫీసరు 'మీ బావనే పెళ్ళి చేసుకొని సుఖంగా వుండు' అని 'చే'కి చెప్పి బదిలీ చేయించుకుని దూరంగా వెళ్ళిపోయాడు. అప్పుడు

'చే' 'షా'తో అంది—'ఆ ఆఫీసరుతో వెళ్ళి పోయేదాన్ని సుమా— [ఎందుకు వెళ్ళ లేదంటే] వొయ్యిని [డాక్టరుగార్ని] వదిలిపోలేక' అంది. ఆ అమ్మాయి ఏం చేసిందో ఆమెకి అప్పుడు తెలియదు [అది ఎంత త్యాగమో?]. తన విషయం వదిలేసుకుని 'చే' వొయ్యి కోసం అంకితమైపోయింది. చే, వసంత్, షా లేకపోతే వొయ్యి ఏమయిపోయేదో?

'చే' తిరస్కరించాక ఆ మేనత్తకొడుకు చాలా సున్నిత మనస్కుడు ఏమయిపోతాడోనని ఆత్మహత్య చేసుకుంటాడేమోనని అందరికీ భయం. అత నంటే అందరికీ యిష్టమే. రంగనాయకమ్మగారు సౌరిస్‌ని తిట్టింది - 'నీవల్లే అది మనసు తిప్పేసుకుంద'ని. చేసుకోమని సౌరిస్ గట్టిగా చేకి చెప్పలేదని.

ఇంతలో ఆ మేనత్త చచ్చిపోయింది. ఆ మామయ్య పిచ్చి ఎత్తే స్థితిలో వున్నాడు. ఆ బావతో కలిసి రంగనాయకమ్మ ఆ వూరు వెళ్ళింది. అక్కడ వాళ్ళు ఆ చనిపోయిన మేనత్త స్పిరిట్స్‌ని పిలిచి మాట్లాడేవారు. ఆ మాటలాడడంతో వాళ్ళ మతులు పోయాయి. చలం భార్య అశాంతితో వెళ్ళి తలకిందులై వచ్చింది. 'చే' పెళ్ళి విషయంలో రెండవ దెబ్బతింది ఆమె తల్లిమనసు. ఈ మనో వేదనని అశాంతిని భరించలేక ఆవిడ అందరినీ వదిలి అరుణాచలం వెళ్ళిపోయింది.

## చలం లీల లేక లీలా లోల

ఇదే సమయంలో చలం అలా లీలగారితో వుండిపోవడం డాక్టరుగారికీ, చేకీ, వసంత్‌కీ బాధ అనిపించింది. ఆయన ఆనందంగా వున్నాడు కదా అని ఓ తృప్తి కూడా!

కొన్నాళ్ళకి రమణాశ్రమం నుంచి రంగనాయకమ్మగారికి మతిపోయిందని డాక్టర్‌గారికి టెలిగ్రాం వచ్చింది. అది భగవాన్ యిప్పించారట. చలం సర్వీసు నుంచి రిటైరయి లీలగారితో నూజివీడులో వుండిపోయారు. చలంగారికి రమ్మన మని టెలిగ్రాం యిప్పించింది డాక్టరుగారు. ఆ రోజంతా నిద్రలేక యమయాతన పడింది వొయ్యి. ఆమెను ఓదారుస్తూ కూర్చుంది 'షా'. భగవాన్ వున్నారని పరవా లేదని అన్నా డాక్టర్‌గారికి ఆ విశ్వాసం లేదు. ఆవిడ level headed woman ఆవిడే ఈ చలం నౌకకు కేప్టెన్ లేదా పడవకు చుక్కాని. ఆమె లేకపోతే సమయం వస్తే ఎవరూ ఏమీ చేయలేరు. చలానికి టెలిగ్రాం అందేసరికి లీలగారికి ఆరోగ్యం బాగాలేదు. ఆయన బెజవాడ వచ్చి చేని నూజివీడు పంపారు లీలగారికి తోడుగా,

చలం, షా అరుణాచలం బయలుదేరారు. రమణనగర్ చేరి తల్లిని చూడగానే నివ్వెరపోయింది 'షా'- ఆవిడ పిచ్చి చేష్టలు చూసి. చలం, షా ఆమెను యింటికి పోదామని ఎంతచెప్పినా ఆమె వినలేదు. ఆశ్రమం వాళ్ళు తనకు విషం పెట్ట చూశారని, తననేదో చేశారనీ చెప్పింది. ఆ కల్పనలను వినియోగించుకుని ఆమెను యింటికి తీసుకువెళ్ళడానికి 'షా' ఒప్పించింది. దారిలో తను భగవాన్ లాకెట్ పిన్‌తో సహా మింగేశానని చెప్పింది. చలానికి షాకి ఏమీ తోచలేదు, వెంటనే ఆపరేషన్ చేసి తీయకపోతే ప్రాణానికి ముప్పు. ఏమైనాసరే రంగనాయకమ్మను ప్రాణాలతో తీసుకువచ్చి తన కళ్ళముందు నిలపాలని డాక్టరుగారి మాట. మద్రాసులో ఆపకుండా బెజవాడ తీసుకుపోయారు ఆమెను. బెజవాడ రాగానే ఆవిడ నార్మల్‌గా అయిపోయినట్లు ప్రవర్తించింది. ఆ లాకెట్ కూడా మద్రాసు వెళ్ళి ఆపరేషన్ చేయించనవసరం లేకుండా బయటకు వచ్చేసింది. ఆమెకు వచ్చిన పిచ్చి కుదరదని వొయ్యి డయగ్నైజ్ చేసింది. అలాటి వారు త్వరలోనే చనిపోతారట, వారి బాధకు అంతు వుండదుట.

డాక్టర్ గారి నగలన్నీ చెల్లెలు వచ్చిందన్న సంతోషంతో ఆమెకు పెట్టేసింది. అమావాస్యకి పౌర్ణమికి అటాక్స్ వచ్చేవి. వీళ్ళు తనకి విషం పెడుతున్నారని పోలీసులకు రిపోర్టు యిచ్చేది. నగల కోసం ఎవరన్నా ఆమె ప్రాణం తీస్తారేమోనని ఒక్కొక్కనగే తీసి భద్రం చేశారు పిల్లలు భగవాన్ పేరుచెప్పి. వొయ్యి దిగుళ్ళతో అనారోగ్యంతో నీరసించిపోతోంది. ఈ పిచ్చిలో ఆమె తనకు తెలియని స్థితిలో ఏవేవో పిచ్చి ఉత్తరాలు ఆ ఆఫీసర్‌కి వ్రాసేది. ఆవిడ స్థితిని తెలియపరచి మనసు కష్టపెట్టుకోవద్దని ఆ ఆఫీసర్‌కి ఒక ఫార్మల్ ఉత్తరం రాసింది 'షా'. గుంటూరు నాటకానికి వెళ్ళి తిరిగి వచ్చేసరికి ఆ ఆఫీసర్‌వద్దనుంచి ఉత్తరం వచ్చింది. అతను ఎంతో ప్రేమగా రాశాడు. ఆ ఉత్తరానికి జవాబురాసి ఆ వ్యవహారాన్ని ఆమె పొడిగించలేదు. మళ్ళీ బాధలోకి దిగడం ఆమెకిష్టంలేదు. రాస్తే యుద్ధమయిపోయింది గనుక అతను తప్పకుండా వస్తాడు. చివరికి థాంక్స్ అని కూడా రాయనందుకు ఆమె సిగ్గుపడింది.

ఇంతలో రంగనాయకమ్మగారు ఒక రోజు హఠాత్తుగా మాయమయింది. డాక్టరుగారు చాలా ఆదుర్దాపడి బాధపడింది. ఆసుపత్రిలో పనిచేసే మంత్రసాని

ఒకావిడ దగ్గర చీరలన్నీ దాచి, వెళ్ళేరోజు తీసుకుపోయిందని ఆమె చెప్పింది' నాలుగు రోజులకి తిరువణ్ణామలై నుంచి తను క్షేమంగా చేరానని ఉత్తరం రాసింది, సౌరిస్ కొంత ఆదుర్దా తగ్గి స్థిమితపడి సంతోషంతో భగవాన్ దగ్గరకి వెళ్ళిందికదా అని నెలనెలా కొంత డబ్బు పంపేది. కాని, ఎవరో ఒకరు వచ్చి 'మీ చెల్లెల్ని చూశాం, మాడిపోయినవి తింటూ, చిరిగిన బట్టలు కట్టుకుంటూ తిరుగుతోంది. అని చెప్పగానే డాక్టరుగారు క్రుంగిపోయేది. సౌరిస్ పంపించిన డబ్బుతో బిస్కట్లు, చాక్లెట్లు కొని భగవాన్‌ని బలవంత పెట్టేదట తినమని. డబ్బుకోసం యిబ్బంది పడేవాళ్ళకు తనకుమాలిన సహాయం చేసేదిట.

ఇది యిలా వుండగా —

వసంత్ ఉద్యోగం మానేసి యింటికి వచ్చేశాడు. పక్కనున్న సినిమా వారితో వేటలకి వెళ్ళి వాళ్లు చంపిన పిట్టలూ అవీ తెచ్చేవాడు తాగుతూ వుండేవాడు కాని అతనికి అంతదాకా అలవాటు కాలేదు. కాని, బాధను దిగమ్రింగడానికి తాగేవాడు. అది రానురాను విపరీతమయిపోయింది. సౌరిస్ అతన్ని వారిద్దామనుకునేది కాని హృదయం రాలేదు. చేకి సంతకి కూడా సౌ అంటే గౌరవం. అతని బాధ సరేసరి - తనుమాత్రం తక్కువ బాధలో వుందా? కేవలం సౌరిస్ కోసం పైకి చిరునవ్వులు చిందిస్తూ జీవిస్తోంది సౌరిస్‌కోసం చేకి గుండెల్లో కోత - అంతా చిచ్చులోనే వున్నారు. 'షా' కయితే భగవాన్ మీద విశ్వాసం వుంది. వాళ్ళకెవరూ లేరు. లోకంలో చీకటితప్ప యింకేముంది?

చలం లీలగారితో అనుశాసన పర్వంలో కాళ్ళుతెగిన ఒంటరి ఒంటెలా గున్నాడు. రంగనాయకమ్మగారికి మతిస్థిమితం లేదు-పిచ్చి డాక్టరుగారి ఆరోగ్యం రోజురోజుకి దిగజారుతోంది. ఈ పరిస్థితుల్లో - వసంత్, చే అనేవాళ్లు - 'అంతా వెళ్ళిపోదాం 'షా', ఈ లోకంలో వుండొద్దు' అని. ఆత్మహత్య మహాపాతకం అన్నారు భగవాన్ అనేది 'షా'. భగవాన్ ఎలాగో ఓలాగ ఒడ్డెక్కిస్తారని 'షా' నమ్మకం.

— వాళ్ళెవరికీ చావంటే భయంలేదు. 'ఒక fine day హాయిగా మంచి భోజనం తిని, గొప్ప సంగీతం వింటూ, వెన్నెల్లో wine విషం కలుపుకు తాగేద్దాం. చావంటే ఏముంది? హాయి అయిన మార్పు.' అట్లా చేద్దామని చిన్నప్పుడే చలం వాళ్ళకి చెప్పాడట. కాని, ఆత్మహత్య నీచమైనది, అది పిరికితనం! జీవి

తంలో దేనితోనూ రాజీపడని చలం పిల్లలు మృత్యువుతో మాత్రం ఎందుకు రాజీ పడాలి? అందరితో కలిసి చావుకు సిద్ధమే కాని భగవాన్ మీద గట్టి విశ్వాసమున్న ఆమెకి ఆత్మహత్య ఎట్లా యిష్టమవుతుంది? అయితే అందరూ పోతూవుంటే, తను లేకపోతే వారికి బాధకనక తనూ వారితో పోవడానికి యిష్టమేనంది 'షౌ'.

డాక్టరుగారికి మాత్రం ఎంతబాధ అయినా ఎందుకు బలవంతాన పోవాలని పట్టు. ఆత్మహత్యకి వొప్పేదికాదు ఆమె. వసంత్, చే 'షౌ'తో గట్టిగా వాదించారు 'వొయ్యి రాదన్నా మనం చచ్చిపోదాం. మా జీవితంలో అంతా మిజరీతప్ప మేము ఏ ఆనందాన్నీ ఎరగం, మాకంతా చీకటే' అనేవారు. భగవాన్ వేదాంతం వారికి బోధపడదు. సంతోషం తెలియనివాడికి బాధా తెలియదు, బాధ పడేవాడికి సంతోషం తెలుస్తుంది. ఖేదం, మోదం రెండూ రెలిటివ్ అని అంటే వారికి అందరూ వివరించినా, చివరికి అంతా ఒక అంగీకారానికి వచ్చారు - 'వొయ్యికోసం మనం బతకాలి. ఆవిడ వుండగా మనం చచ్చిపోవడం చాలా అన్యాయం. వొయ్యి వున్నంతవరకూ మీరు ఆగితే నేనూ మీతో వస్తాను' అని చెప్పింది వారంతా అందుకు అంగీకరించారు.

ఇక వొయ్యిని కూచోపెట్టి చే, షౌ ఆస్పత్రి నడపడానికి సిద్ధపడ్డారు. పని అంతా ఆమెకు శ్రమ యివ్వకూడదని వాళ్ళే చూసేవారు. డాక్టరుగారు ఎందరికి వైద్యం చేసినా ఎవరెంతిచ్చినా తీసుకోవడమేగాని యింత యివ్వాలని ఆమె కోరే వారు కాదు. 'చే' బిజినెస్ లైక్‌గా గొప్పవాళ్ళ దగ్గర డబ్బులు తీసుకునేది. ఊళ్ళో అంతా డాక్టరుగారు లక్షలార్జించారనే మాట నిజం కాదు. ఆవిడతో ఎవరికీ పోటీ పడే శక్తి లేనిమాట నిజమే. ఎవరయినా యిచ్చినది కాస్తా అనాథల్నీ, ఆస్పత్రి సిబ్బందిని, కుటుంబాన్ని పోషించడానికి సరిపోయేది.

రంగనాయకమ్మగారు 'చే' పెళ్ళి చేసుకోనంటే బాధను పైకి వ్యక్తం చేసింది. కాని డాక్టరుగారు లోపల్లోపల కుమిలి పోయేది. వసంత్ వ్యసనపరుడు కావడం గోరుచుట్టుపై రోకటి పోటు. మిమ్మల్ని వదిలి ఎందుకు ఎక్కడో ఉద్యోగం చేయడం అనేవాడు అతను. ప్రకృతిలోనే కార్యనిమగ్నత్వంలో సర్వాన్నీ మరిపించే తత్వం ఒకటి వుంది. ఈ నిమగ్నత వలన మనసు, ఆరోగ్యం మెరుగవుతాయి. జీవనోత్సాహం పుంజుకుంటుంది. బతకాలనే యిచ్ఛలేకపోవడం కంటె దరిద్రం ఏమిటి వుంది? హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తూ వుండగా సితార్ ప్లేయర్

బాబూరావు ఇతని artistic qualitiesకి ముగ్ధుడై వెంటపడి నేర్పిస్తానంటే ఆయన దగ్గర సితార్ కొంత నేర్చుకుని వచ్చేశాడు వసంత్. ఎందుకివన్నీ? వీటికి అర్థం ఏమిటని అతని బాధ! సంత్‌కి అన్నీ సందేహాలు- ఈ కీర్తి ఎందుకు? ఈ ధనాలెందుకు? ప్రతి విషయమూ అతనికి ప్రశ్నే! వసంత్‌కి - ఆధ్యాత్మిక సత్యాలకీ చాలా దూరం.

ఇంతలో చిత్ర తానే ఓ సమస్య అయింది డాక్టరుగారికి. హైదరాబాద్‌లో ఓ బోర్డింగ్‌లో చేర్చారు ఆమెను. అక్కడ నుంచి ఆమె పెద్ద రంగనాయకమ్మ గారింటికి పారిపోయింది. ఒక అబ్బాయిని అక్కడ చూచి యిష్టపడి అతని ఫొటో తోసహా వచ్చి పెళ్ళి చేయమని కూచుంది- చిత్రది రాజీలేని ధోరణి. వినదు. ఆ అబ్బాయికి చిన్న జీతం. అయినా 'షా' యిష్టపడింది. ఆ అబ్బాయి తల్లి కొడుక్కి తిరపతిలో పెళ్ళి చేస్తానని మొక్కుకుందిట. పెళ్ళి తిరపతిలో జరగాలి. బెజవాడ మీదుగా వెళ్ళేప్పుడు కలుసుకోడానికి అంతా స్టేషనుకి వెళ్ళారు. వారు చిత్రని తమతో తీసుకువెడతామని అడిగారు. చిత్రతో కూడా చే. వసంత్ వెళ్ళారు. ఆ మర్నాడు పెళ్ళి చేయించడానికి డాక్టరుగారు కూడా వెళ్ళింది.

ఆ అబ్బాయికి ఎపిలెప్టికాఫిట్సుట. పెళ్ళిలోనే ఫిట్స్ వచ్చాయి. దాంతో డాక్టరుగారు దిగాలు పడిపోయింది. చేతులారా చిత్ర గొంతుక కోసి నట్లయిందే అని చింత. అతనికి ఫిట్స్ జబ్బు వున్న సంగతి వాళ్ళు దాచారు. చిత్ర అత్త వారింటికి వెళ్ళింది. వొయ్యికి అన్నీ బాధలే! ఈ ఆసుపత్రిలో ఎవరికీ చెందని పిల్లల్ని ఎవరెవరికో పెంపకానికి యిచ్చేశాక వాళ్ళెలా అగచాట్లు పడుతున్నారో అని అదొక బాధ. వృత్తి ధర్మాన్ని గుప్తు చేసుకుని గుండె దిట్టం చేసుకునేది. ఇంతలో డాక్టరుగారికి జబ్బు చేసింది. వసంత్‌ని తీసుకొని యీమారు విశాఖపట్నం వెళ్ళింది. వైజాగ్ ఆస్పత్రిలో పరీక్ష చేసి కాన్సర్ అని అనుమానంగా వుందన్నారు. వేసంకాలం అయాక తిరిగి వచ్చారు. అవసరమయితే మద్రాసు వెళ్ళి ఆపరేషన్ చేయించుకోడానికి నిశ్చయించుకొంది వొయ్య. డాక్టరుగారికి ఏమి జబ్బో మద్రాసు డాక్టర్లకీ అంతు పట్టలేదు. మేజర్ థామస్ అనే డాక్టరు పరీక్షచేసి అది ఫైబ్రాయిడ్ అని తేల్చాడు. మేజర్ ఆపరేషన్ చేసి యుటెరస (గర్భసంచీ) తీసేసారు.

ఇక్కడ ఆసుపత్రిని షా, చే నడుపుతున్నారు. రోగులకి డాక్టరుగారి మీద చాలా గురి. మరో డాక్టరు దగ్గరికి వెళ్ళమంటే వెళ్ళేవారు కాదు. 'షా' కేసులు తీసుకునేది తప్పక. అవే నయమయేవి. ఆపరేషన్ అయి ఎన్నో నెలలయినా

డాక్టరుగారు యింటికి బెజవాడ రాలేదు. వస్తున్నామని ఉత్తరాలు రాసేవారు. చేని పెళ్ళి చేసుకోవాలనుకున్న రమణత్త కొడుకుని 'షా' గారి చిన్నానన్న కూతురికి యిచ్చి ఓ పెళ్ళి జరిపించాక డాక్టరుగారు వసంత్ తిరిగి వచ్చారు. చాలా నీరసంగా జబ్బుగా వుండే వొయ్యి.

డాక్టరుగారిని బెజవాడ తీసుకు వచ్చిన మర్నాడు వసంత్ ఎక్కడికో వెళ్ళాడు. అలా వెళ్ళటం అతనికి మామూలే, 'నేను ఎటో వెళ్ళి పోతున్నాను. మళ్ళీ నా దేహాన్ని మీరు చూడరు' అని వసంత్ నుంచి వెళ్ళిన మర్నాడు పోస్టులో ఉత్తరం వచ్చింది. వసంత్‌కి చలం ఉత్తరం రాశారు. ఆఉత్తరాన్ని అందులో రాసిన దాన్ని తనకు ఆపాదించుకుని అపార్థం చేసుకుని వసంత్ యిల్లు వదిలి ఎటో వెళ్ళిపోయాడు. ఆ విషయం రాసింది అతని గురించి కాదని చలం క్లియర్ చేయాలని రేడియోలో చెప్పించారు. వసంత్ నుంచి ఉత్తరం ఎటో వెళ్ళి పోతున్నాను తిరిగి కనిపించనని పోస్టులో వచ్చిన రోజే నూజివీడు నుంచి చలం, మానవతిగారు, చిన్నారావుగారు కలిసి వచ్చారు. చలం ఆ ఉత్తరం చూచి ఎంతో బాధపడ్డారు.

డాక్టరుగారికి అతను చనిపోవడానికే వెళ్ళాడని విశ్వాసం. సౌరిస్‌కి అతను ఎక్కడో జీవించి వున్నాడని విశ్వాసం. సౌరిస్‌కి కోపం వచ్చింది. వొయ్యి కోసం తామంతా జీవిస్తూ వుందామని ఒప్పందం చేసుకున్నాక వెళ్ళి పోవడం అక్రమమనిపించింది.

ఆ రోజున 'షా' వాళ్ళంతా మానవతిగార్ని ఆమె స్నేహితుల్నీ తీసుకుని 'సీజర్ అండ్ క్లియోపాత్రా' అనే సినిమాకు వెళ్ళారు. దీన్ని అంతా అపార్థంచేసుకుని రకరకాలుగా చెప్పుకున్నారు.

డాక్టరుగారికి వసంత్ అంతర్ధానం పెద్ద దెబ్బ. ఆ బాధనించి వొయ్యిమనసు మళ్ళించడానికి 'షా' పుస్తకాలు చదివి వినిపించి, సినిమాలకు తీసుకుపోయేది. ఆస్పత్రిని అమ్మాయిలే నడుపుతున్నా ఓసారి చాలా కష్టమైన ఓ కానుపు కేసు వచ్చింది. మేడదిగి వచ్చి డాక్టరుగారు ఫోర్‌సెప్స్ వేసి కానుపు చేసేసరికి మేజర్ ఆపరేషన్ తనకు జరిగాక ఆమె అంత శ్రమపడకూడదు. ఆమె ఆ శ్రమకి క్రుంగి పోయింది. పైకి యీ పిల్లలతో ఉల్లాసంగా వున్నట్లు కనిపించినా తనకు దగ్గరయిన పేషంట్ల యిళ్ళకు వెళ్ళినప్పుడు తన బాధలు చెప్పుకుని ఆమె ఏడ్చేదట

వాళ్ళతో. ఈ చే, షౌ, వసంత్ లాగ తనని వదిలి పెట్టి వెళ్ళి పోతారేమోనని ఆమె ఏడ్చేదట. 'ఎందుకునన్నిట్లా అంటి పెట్టుకుని వుంటారు. పెళ్ళిళ్ళు చేసుకోండి' అని అరిచేదట వొయ్యి.

చలం ఒక పెద్ద నైట్‌మేర్‌లో వున్నాడు అప్పుడు. 'నాకన్నా అధముడు యీ ప్రపంచంలో వుంటాడా' అని తనే ఆశ్చర్యపడ్డాడు తన గురించి. వొయ్యి చాలా బాధపడుతో వుండటం చూచి కూడా కఠిన హృదయుడిగా వుండి పోయి ఏమీ పట్టించుకోలేదు చలం 'ఇప్పుడు తలుచుకుంటే ఏదో దుష్టశక్తి నా కళ్ళని కప్పింం దని నా గుండెని రాయి చేసిందని పిస్తోంది. ఇంతా చేసి నాకూ లీలగారికి ఏ శృంం గారమూ లేదు. ఆకర్షణా లేదు. నేనే వ్యామోహంలోనూ పడిపోలేదు ఆఖరికి 'షౌ'తో కూడా యోచించలేదు నేను ఈ నియమాలు. వుత్త మొద్దునయి గడిపాను కాలం. నాలో ఒక జీవంలేదు. ఒక హృదయ స్పందన లేదు. స్నేహితులకు దూరమైనాను. ఈ పిల్లలూ వొయ్యి అందరూ నన్ను లీలగారికి వొదిలేశారు.అతను కోరిన శృంగారాన్ని అతన్ని అనుభవించనీమని మనం అభ్యంతరం పెట్టకూడ దని గాపును. తను చచ్చి పోతే తను ప్రేమించే ఈ పిల్లలు ఏమౌతారనేది పెద్ద దిగులు వొయ్యికి!

ఒకసారి వేసవిలో ఒక పురుటికేసుకి వెళ్ళి వొచ్చింది 'వొయ్యి'.ఆ కానుపు ఎంతకీ అవకపోయేసరికి అక్కడే వుండి కానుపు అవగానే, అది ఆచారవంతుల యిల్లయినందున, తలారా స్నానంచేసి, అక్కడే భోజనంచేసి వచ్చింది. చన్నీళ్ళ స్నానం వలన, వేళతప్పి తినడం, వడగాడ్పుల దెబ్బతో ఎండదెబ్బ తగిలింది డాక్టరుగారికి. మర్నాడు వొయ్యి గుండెలోనుంచి ఎడంభుజంలోకి పోట్లు 'ఎంజినా పెక్టారైస్' రావడం మొదలయింది. యమబాధపడుతో 'నాకు విషంయివ్వండి' అంటూ ఆవిడ ఒకటేగోల. మూడురోజుల తరువాత అది నయం అయింది. ఈ చే,షౌ ఆమెను కట్టడిలో వుంచారు. 'ఏమిటి నాకీ చెర' అని అరిచేది. ఆవిడ అలా ఆయాసపడితే యీ ఆరోగ్యం యింకా చెడి ఏ పక్షవాతమోవస్తే అది దుర్భరం— అంతకన్నా మరణమే మేలని సౌరిస్ చెప్పింది. తన ఆవేదన, వీళ్ళు తనుపోతే తాము ఏమయిపోతామో అనే బెంగతో తనని కట్టడిచేస్తున్నారనే అను మానం 'వొయ్యి'కి తీరింది.

'మీరు నాన్నపిల్లలని నా హృదయంలోకి ఇంతదాకా మిమ్మల్ని తీసుకోలేదు తెలుసా! ఏమో! ఎలా తయారవుతారో! కాని మీరిద్దరూ నిజంగా మణులు' అంది

'షా', 'చే'లతో. అయినా అంత దుర్భరమైన బాధల్లోవున్నా డాక్టరుగారిని కొంత మంది పేషంట్లు వొదిలేవారు కాదు. ఆమె వాళ్ళ ఇళ్ళకివెళ్ళి వైద్యంచేసి వచ్చేది.

వొయ్యికి ఒకరోజున సుస్తీ అనిపించింది. ఆవిడని మేడమీదనించి కిందికి దిగనివ్వలేదు. బాల్కనీలోంచి పేషంట్లకు 'ఇవాళంతా మా అమ్మాయిలు చూస్తారు, మందులు తీసుకోండి. నా ఒళ్ళు బాగాలేదు. రేపటి నుంచి నేను వస్తాను' అని చెప్పింది. ఆ మర్నాడు కూడా అలాగే వుంది. కిందికి రాలేదు డాక్టరుగారు. ఆ మర్నాడు కాస్త బాగా వున్నా కిందికి రానివ్వలేదు.

ఇంతలో బి వి. నరసింహారావుగారు వచ్చారు. రచయిత, కవి, గాయకుడు, నాట్యం చేస్తారు. ఆ వేళ చలం మిత్రుడు పట్టాభిరామయ్య వచ్చి చలంగారిచేత 'పురూరవ' చదివించుకుంటున్నాడు. వొయ్యి, సౌరిస్ కూడా వింటున్నారు. అందులో మృణాళిని చనిపోయే ఘట్టం చదువుతూ వుండగా అలిసిపోయాను, రేపువచ్చి వింటాను అన్నాడాయన.

'మీరు అలసిపోయారా నాకు అలసటే అనిపించలేదు సుమండీ' అన్నారు డాక్టరుగారు.

ఆ రోజు సాయంత్రం 'వొయ్యి' కుర్చీలోపడుకుని వుంటే సౌరిస్ ఆమె గుండెలమీద తలపెట్టుకుని పడుకుని వుంది. వొయ్యి గుండె అదోరకంగా కొట్టుకోవడం విని—'ఏమిటి నీ గుండె యిలా కొట్టుకుంటూంది. డాక్టర్ని పిలవమా?' అని అడిగింది 'షా'. అంతకుముందు ఓసారి'దో భాయ్' సినిమా చూసివచ్చింది వొయ్యి. అందులో సన్నివేశాన్ని తలుచుకుని 'స్టెతస్కోపు లేకుండా గుండెని పరీక్షిస్తున్నావా సినిమాలోలాగ' అంటూ నవ్వింది. డాక్టర్ని పిలవాలని 'షా' పట్టుపట్టింది. 'అబ్బ యీ చిన్నదానికి ఏ డాక్టరూ అవసరం లేదు' అందామె.

రాత్రి మళ్ళీ బి.వి. నరసింహారావుగారు వచ్చి 'షా'కి పాట నేర్పిస్తున్నారు. చే ఇంకా చీట్లపేక ఆడుతూనేవుంది.

-పోలేపెద్ది సుబ్బారావుగారు -తెనాలి- చలం ఆప్తమిత్రులు- ఆ సుబ్బారావుగారు, చలాన్ని యిట్లా ఒకసారి రమ్మనమని బయటికి తీసుకువెడుతూంటే 'ఇంకా అలాగే బయటకి తీసుకుపోతున్నారా వెంకటచలాన్ని సుబ్బారావుగారూ' అంటూ నవ్వారు డాక్టరుగారు. ఎటో వెళ్ళి కాసేపు తిరిగివచ్చారు యిద్దరూ -వచ్చాక ఆ హాలులోనే ఓ పక్కన కూర్చుని మాటాడుకుంటున్నారు.

'షా' పాడుతూనే వుంది. వొయ్యి పాట వింటూ పడుకుంది. ఇంతలో సుబ్బారావుగారు 'డాక్టరుగారి తలట్లా పక్కకి వాలిందేమిటి?' అని అడిగారు. అప్పటికే వొయ్యికి గురక వచ్చేసింది. 'షా', 'చే' అది పెరాలిసిస్ కాదుగదా అని భయపడ్డారు. సుబ్బారావుగారు ఆమె కాళ్ళు పట్టుకుని చూసి, కాళ్ళు చల్లబడి పోయాయి అన్నారు. పల్సుచూస్తే అందలేదు 'షా'కి.

అంతా అర్థమయింది సౌరిస్‌కి. ఆమె మాటలేకుండా కిందికి వెళ్ళిపోయింది. డాక్టరు దక్షిణామూర్తి కోసం కబురుపెట్టారు చలం. చలం కిందికి వచ్చి 'వొయ్యి చచ్చిపోయింది షా' అన్నారు. అలాటి స్థితిలో ఇవ్వాల్సిన ఇంజక్షనులన్నీ యిచ్చారు షా, చే, వొయ్యి శవానికి. తరువాత దక్షిణామూర్తిగారు వచ్చి వొయ్యి గుండెకి ఎడ్రినలిన్ యిచ్చారు.

వొయ్యి చచ్చిపోయింది. నరుచేతను, హరిచేతను, పరమడిగిన కుంతిచేత వాసవుచేతన్—ధరణీశాపంచేత....కర్ణుడు అస్తమించినట్లుగానే.

చలాన్ని మాయంచేసి తన మాయజాలంలో నిలిపిన లీలగారి వలన, 'ఇంత కంటే యీ లోకంలో చేసేదేముంది' అనుకుంటూ తనని దహించే ప్రేమాగ్ని నించి తనకేం కావాలో తెలియక ఎటో వెళ్ళిపోయిన వసంత్ వలన, వొయ్యికోసం జీవితంలో అన్నిటినీ కాదని నిలిచిపోయిన 'చే'మీద బెంగవలన, స్థిమితంగా నిలచి కాపురం చేసుకునే అదృష్టం చిత్రకి లభించనందువలన, అమ్మకి పిచ్చెక్కి ఇల్లు వాకిలి వొదిలి దూరం కావడంవలన— వొయ్యి అనారోగ్యంలోపడి— మృత్యువాత పడింది.

వొయ్యి పోవడంతో చలానికి బెజవాడ చచ్చిపోయింది.

# ఉపసంహారం

ఈ పుస్తకం పూర్తి అవుతోంది అని నేను అంటున్నాను. అంటే — ఈ ప్రపంచంలో ఏ పనికీ పూర్తి కావడం అంటూ వుండదు. ప్రవాహానికి పూర్తి కావడమనేది వుండనట్లే చలం అనే సబ్జక్ట్‌కి పూర్తి కావడమనేది వైకల్పికం. ఈ చలం ప్రాజెక్ట్ నన్ను మూడేళ్ళు బాధించింది. ఇంకా బాధిస్తూనే వుంది. ఈయన సాహిత్యం గొప్పదా, యీయన వ్యక్తిత్వం గొప్పదా అని మూలిగే వారికి జవాబు చెప్పడం కష్టం. తనలో ఏ లోపాలు వున్నాయో ఆ లోపాలు ప్రపంచంలో వుండ కూడదనుకున్నాడు. తనని తను గట్టిగా రుద్దితే, గోక్కుంటే ఆ పుస్తకాలు వచ్చాయంటాడు. ఈ ప్రపంచం, ఈశ్వరుడు, చలం— ముగ్గురూ ఒక దానిలో ఒకటి. అంటే ఒకటి. భిన్నత్వంలో ఏకత్వం వున్నట్లే చలంలోనూ వుంది. చలం ముక్కలు ముక్కలుగా విడిపోయిన వస్తువు కాదు. స్త్రీ చుట్టూ ప్రపంచం వుంది కాని ఆ స్త్రీకి వేరే ప్రపంచం లేకుండా చేసిన యీ ప్రపంచాన్ని చీల్చి చెండాడిన చలాన్ని ప్రపంచం అంతా దుమ్మెత్తి పోసింది. ఈ లోకంలో ఎవరయితే నలుగురిచేతా ప్రశంసింపబడి ఎక్కువ పూజలందుకుంటారో వారిని గురించి మనం నిజంగా అనుమానించాల్సి వస్తుంది అలాగే ఎవరయితే నిందలు, నిష్ఠూరాలు, అవమానాలు, అభిశంసనలు పొందుతారో వారి అయోగ్యతలోని యోగ్యత గురించి ఒకించుక ఆలోచించాల్సి వస్తుంది. మంచి చెడులనేవి భావనష్టాలుగా మారి జారిపోకుండా మనం చూసుకోవాలి.

ఇంత పరిశ్రమించి, ఎంతో తాపత్రయపడి చలం గురించి పుస్తకం రాసినా నేను బయలుదేరిన చోటనే వున్నానేమోనని నా కనిపిస్తోంది. నేను తెలుసుకున్న దేమీ ఎక్కువగా లేదేమోనని నాకు కించ కలుగుతోంది. ఆఖరికి చలం జీవితం చెప్పడానికి సరయిన భాష కూడా నా దగ్గర లేదేమోనని నాకు అనిపించింది. ఒక నవలలో, ఒక కథలో, ఒక వ్యాసంలో నా భాష. నా భాష వ్యక్తీకరణ విధానం శైలిగా రూపుదిద్దుకొని ఇది నా సొంతమనిపించేటట్లు పరిగెడుతూ వుంటుంది. ఇంత పెద్ద పుస్తకంలో నా సొంత శైలి అక్కడక్కడ ప్రవేశించి మటుమాయ మైపోయింది. ఎందుచేతనంటే యిందులో నా సృజనాత్మకతకు చోటు లేకపోవడం వల్ల. చాలా చోట్ల అనేక పుస్తకాల నుంచి, నోట్సుల నుంచి, ఉత్తరాలు, తదితర లిఖిత సామాగ్రి నుంచి ఎత్తి రాయడం వలన డాక్యుమెంటరీ పద్ధతి చోటు చేసు కొని ఒక పెద్ద రికార్డు తయారు చేస్తున్నట్లు నా కనిపించింది కాని నాకు నేనై ఒక రచన చేస్తున్న ఆవేశం కానీ, అనుభూతి కానీ నాకు కలగలేదు. చాలా చోట్ల చలంగారి జీవిత విశేషాలను వుటంకించినపుడు ఆ భాష సౌరిస్ గారిదో, చలం గారిదో, మరెవరిదో అయికూర్చుంది. శైలీసాయుజ్యత యిందులో సాధించలేక పోవడానికి యిది డాక్యుమెంటరీ పద్ధతిన రచించిన జీవిత చరిత్ర కావడమే కారణ మనుకొంటాను.

చలంగారి రచనలపై పరిశోధనలు చేసి డాక్టరేట్లు సంపాదించినవారి పుస్త కాలను నేను చూశాను. అందులో గడులు గీసుకొని వచ్చెన్ ఆట ఆడినట్లు ఒక నిర్ణీతమైన క్రమంలో విషయసేకరణ, విషయ వివరణ, విషయ విశ్లేషణ సాగి పోతూ వుండటం నేను గమనించాను. అధోజ్ఞాపికలు, అనుబంధాలు, పేర్ల జాబితాలు, పట్టీలు— యివన్నీ నా యీ పుస్తకానికి కూడా అవసరమా అని నాకు అనిపించక పోలేదు. కాని వీలయినంత వరకు యీ పుస్తకం చదవగానే ఎట్టి సంక్లిష్టతా లేకుండా సామాన్య పాఠకులకు అర్థం అవాలి అనేది నియమంగా పెట్టుకున్నాను. అందుచేత విశ్వవిద్యాలయాల స్థాయిలో ప్రదర్శించే ఆడంబరాల జోలికి పోవడానికి నాకు భయం వేసింది. మొదట్లో చలం సాహిత్యాన్ని అంతా సమీక్షించాలనే కుతూహలం నన్ను ఆవేశించింది. కాని పుస్తకం రాస్తున్న కొద్దీ చలం జీవితం, చలం సాహిత్యం రెంటినీ సమర్థించగల ఓపిక, అవకాశం రెండూ నాకు లేవేమోనని తెలిసి వచ్చింది. పైగా అతని జీవితం గురించి త్రవ్వి కలకొక్క దానికి చెరువు తవ్వే పని లాటిది మీద వేసుకున్నానాయె: అతని జీవితం గురించి

చెప్పడానికి ప్రయత్నించినప్పుడల్లా అతని సాహిత్యం, దాని పరామర్శ అవసరమైన మేరకు కరివేపాకులా కాక, తులసిదళంలా చేస్తూనే వున్నాను. అయితే నేను సాహిత్య విమర్శకారుడినా లేక జీవిత చరిత్రకారుడినా అనే అనుమానం నాకు వస్తూ వుండేది. నేను జీవిత చరిత్రకారుడుగానే వుండిపోదలచి సాహిత్యవిమర్శ పరిశీలనను పక్కన పెట్టాల్సి వచ్చింది. అయితే ఆయన సాహిత్యాన్ని తరచి చూడకుండా జీవిత చరిత్రకు మాత్రం నేను వుపక్రమించలేదని మనవి చేసుకుంటున్నాను. చలంగారి కథలు, నవలలు, నాటకాలు, నాటికలు, వ్యాసాలు, లేఖలు, రాతప్రతులు మొదలయిన వాటితో పాటు అరుణాచలంలో వారు సృష్టించిన వేరు రకమైన సాహిత్యాన్నంతటినీ మళ్ళీ మళ్ళీ చదివి అవసరమైన మేరకు మాత్రమే వాటిని లేదా వాటి సారాన్ని తగుమాత్రంగా వుపయోగించుకున్నాను. ఆ పెద్ద పనిని యిందులోకి తీసుకొనక పోవడం నా అజ్ఞానం చేత మాత్రం కాదు, నాకు అవకాశం లేక.

'తెలుగు వెలుగు చలం' అనే పుస్తకం రాయడం అనేది ఒక అనుకోని సంఘటన. చలం సాహిత్యంతో నాకున్న కొద్దిపాటి పరిచయం నా బాల్య, కౌమార, యవ్వన దశలకు చెందినది. చలం వ్యతిరేకులే నాకు చలాన్ని మళ్ళీ జ్ఞాపకం చేశారు. చలం వల్ల మానవజాతి, అందులో ముఖ్యంగా స్త్రీలకు చాలా అపకారం జరిగింది అనే అంశంతో బాటు చలం అపరిణతమనస్కుడు, చాలా ప్రమాదకరమైన సాహిత్యకారుడు అనే అభిప్రాయాలు కూడా నా చెవిలో దూరాయి. చలాన్ని ఏ రకంగా సమర్థించినా మార్క్సిజానికి ద్రోహం చేసినట్లే అవుతుందని మరొక వాదన కూడా నా దృష్టికి వచ్చింది. అయితే సైద్ధాంతికంగా చలం జీవితసాహిత్యాలను పరిశీలించి అభిప్రాయాలు నిర్ణయించుకోవాలనే భావన నాకు స్టూడెంట్ బుక్ సెంటర్ వారు యీ పుస్తకం రాయమని అడిగేదాకా స్ఫురించలేదు. చదువుతూ, విషయసేకరణకు పర్యటిస్తూ, ఆయన అభిమానులను, స్నేహితులను, శిష్యులను, భక్తులను కలుసుకుంటూ యీ పుస్తకం రాయడానికి తాపత్రయ పడుతున్న కాలంలో నాకు భగవాన్ రమణమహర్షి గురించి కూడా బాగా తెలుసుకోవలసిన అవసరం ఏర్పడింది. భగవాన్ రమణమహర్షి గురించి తెలుసుకుంటున్న కొద్దీ చలం నాకు మరీ బాగా అర్థం అవుతూ వచ్చాడు. భగవాన్ గురించి కూడా యీ పుస్తకంలో విశేషంగా రాయడం వలన చలాన్ని మరీ లోతుగా దర్శించినట్లయింది. భగవాన్ క్రమక్రమంగా నన్ను కూడా వశపరుచుకుంటున్నట్లు నాకు అనిపించగానే నేను భౌతిక వాదానికి, మార్క్సిజానికి, నాస్తిక మార్గానికి దూరం

అవుతూ వచ్చాను. ఈ పుస్తకం రాసి నేను చాలా మార్పుకు లోనయ్యాను. నాకు ఆధ్యాత్మిక విశ్వాసాలు, ఆస్తిక విశ్వాసాలు పెద్దగా లేకపోయినప్పటికీ నేను శ్రీ రమ గ్గరవుతూ, మార్క్సిజానికి నేచురల్‌గా దూరమైపోయాను.

వీరేశలింగం, గురజాడ, చలం— వీరు ముగ్గురూ తమ శక్తులను స్త్రీల సమస్యలపై కేంద్రీకరించి, సంఘం వారిపట్ల ప్రదర్శిస్తున్న వైఖరికి విసిగి, మనలో ఏర్పడిన ద్వంద్వ ప్రమాణాలకు ఆగ్రహించి, మనల్ని సంస్కరించడానికి అకుంఠిత దీక్షతో పోరాడారు. అయినప్పటికీ నిత్యం మనం వరకట్న దురాచారానికి బలియైపోతున్న ఆడపిల్లల కథలు వింటున్నాం. ఏ రోజు పత్రిక తెరిచినా స్త్రీలపై అత్యాచారాలు, మానభంగాలు, సజీవదహనాల వార్తలు చూస్తున్నాం. ఈ సంఘం ఎక్కడ మారింది? మనుష్యుల ప్రవర్తన రానురాను పైశాచికం అయిపోవడం లేదా? లా ఎన్నో ప్రశ్నలు మనల్ని ములుకుల్లా బాధిస్తున్నాయి. ఈ సందర్భంలో ఆధునిక ప్రపంచ తత్త్వవేత్తలలో అగ్రగణ్యుడయిన జీన్‌పాల్ సార్త్రి అభిప్రాయాలను ఒక్కసారి గమనిద్దాం. సోషలిజం రావడంతో శ్రామిక వర్గ ప్రజల సంక్షేమంతో పాటుగా స్త్రీల సంక్షేమం కూడా పనిలో పనిగా వస్తుందని, అది అందులో భాగమ ఒక నమ్మకం విశేషంగా ప్రచారంలో వుంది. అది సరికాదని సార్త్రి ఇంటర్వ్యూలో తేల్చారు. 'లా ఆర్క్' అనే ఫ్రెంచిపత్రిక ఈ ఇంటర్వ్యూను సార్త్రి మరణానంతరం ప్రకటించింది. సిద్ధాంతపరమైన వైరుధ్యాలను ఎదుర్కొంటూ వుదారంగా, నిజాయితీగా సార్త్రి చెప్పిన కొన్ని మాటలు చలం, చలం సాహిత్యానికి కాలదోషం పట్టిందనే విమర్శకులకు కనువిప్పు కాగలదు.

## సార్త్రే చెప్పినవి

"నా చిన్నప్పుడు నేను ఆడవాళ్ళ మధ్య పెరిగాను. ముఖ్యంగా మా అమ్మ, మామ్మ నన్ను బాగా చూసుకునేవారు. నేను పెద్దయ్యాక నా మనవరాళ్ళు నన్ను చూసుకుంటున్నారు. ఆడపిల్లలతోనూ, ఆడవాళ్ళతోనూ మెసలటం నాకు పుట్టుకతో అబ్బిన విద్య. అది నాకు సహజ వాతావరణం. అందుకే నాలో స్త్రీ అంశవుంది అని నే అనుకుంటాను.

మా మామ్మని మా తాత అణచిపెట్టి వుంచేవాడని నా వూహ. అయితే అది సహజమైనదిగా నేను తీసుకున్నానే గాని వేరే అన్యాయంగా నాకు అనిపించలేదు.

మా అమ్మ వితంతువు కాగానే ఆమెను ఆమె తల్లిదండ్రులు కట్టడిలోకి తీసుకుని అణచిపెట్టి వుంచేవారు. తల్లిదండ్రుల బాధని మా అమ్మ అనుభవించింది.

మగవారు యిలా ఆడవారిపై అధికారం చెలాయించడం (లార్డులాగ) ఎక్కువయితే మనుషులలోని లోపమేమో అనుకునేవాడిని. వినయంగా అణగిమణగి పడి వుండటం ఆడవారికి సహజమైన గుణమని నేను భావించేవాడిని.

పురుషుడు స్త్రీ కంటే అధికుడని, అది సహజమని నేను నమ్మేవాడిని. ఆ కారణంచేత స్త్రీ పురుషుల మధ్య సమానత్వం వుండదని అనుకునేవాడిని. కోపంగా, దండించే విధంగా, అధికారంగా, అహంకారంగా వుండటం పురుషుల శీలంలో సహజలక్షణం అనుకునే వాడిని. ఆడవారు రకరకాల సెంటిమెంట్లు, విధేయంగా వుండడం యిలాంటివన్నీ వారి లక్షణాలని నేను నమ్మేవాడిని. ఆడవారిలో వుండే లక్షణాలు కొన్ని నాలో వుండేవి. అందుచేత నేను మగవారితో కంటే ఆడవారితో బాగా మాట్లాడగలిగే వాడిని. మగవారితో సంభాషణ వృత్తికి సంబంధించిన ప్రశ్నల లోకి మారిపోతుంది. స్త్రీలతో ఒక కఫేలో కూర్చున్నప్పుడు వాతావరణం గురించీ, ఇయ మనుష్యుల గురించీ, వీధి గురించి యిలా ఎన్నో వింత వింత విషయాలను గురించి మాట్లాడుకోవచ్చు. సంభాషణ నేనే ప్రారంభించే వాడిని. (చలం కూడా ఆడపిల్లల స్నేహాల్లో, పరిచయాలలో పూర్తిగా మనసు విప్పి మాట్లాడగలిగే వాడు. కొత్త వారయిన మగవారితో పూర్తిగా మనసువిప్పి మాట్లాడలేక పోయేవాడు )

సార్త్రె ముందుగా స్త్రీలతో సంభాషణను ప్రారంభించడం తన పురుషాధిక్యతకు చిహ్నం కాదని చెప్పాడు. అతని సహజ గుణమది. అంతే. సార్త్రె తన వయసు యువతీయువకులకంటే తాను వ్యక్తిగా అధికుడనని తాను భావించకలగడం వలన అలా సంభాషణను ప్రారంభించగలిగేవాడినని చెప్పాడు. అయితే ఆయన అందరితోనూ అలాగే మాట్లాడేవాడట. కాని యిలా ముందుగా మాట్లాడడానికి ఆధిక్యతాభావం కాదు, ఆప్యాయతే కారణమంటాడు.

స్త్రీల విమోచనకి సోషలిస్టు విప్లవం అవసరమని సార్త్రె దంపతులు గాఢంగా విశ్వసించారు. కాని సోషలిస్టు విప్లవం జరిగి సోషలిస్టు రాజ్యం వచ్చాక రష్యా, చెకొస్లవేకియా, ఏ యితర సోషలిస్టు రాజ్యాలనూలో స్త్రీ పూర్తిగా పురుషునితో సమాన హక్కులు అనుభవించడం లేదని, ఆ స్థాయికి రాలేదని సార్త్రె దంపతులు విచారించారు. ఆ కారణం చేత సార్త్రె భార్య 1970 ఆ ప్రాంతాలలో

స్త్రీ విమోచన ఉద్యమం వైపు తన దృష్టిని మళ్ళించింది. స్త్రీల విమోచన కోసం జరిపే పోరాటానికి, వర్గ పోరాటానికి వుండే సంబంధం యేమిటి అన్న దానికి సార్త్రె యిలా సమాధానం చెప్పాడు:

"వర్గ పోరాటం వేరు, స్త్రీ విమోచన కోసం జరిపే పోరాటం వేరు— ఈ రెండూ రెండు పోరాటాలు అని నేననుకుంటున్నాను వర్గ పోరాటం అధికారానికి, ఆర్థిక విషయాలకు సంబంధించినది. ఇందులో పురుషులను పురుషులు ఢీకొంటారు. స్త్రీ పురుష సంబంధాలనేవి, వాటి వల్ల ఏర్పడే సమస్యలు వర్గపోరాటం వల్ల ఏర్పడే సమస్యల వంటివి కావు. మగవారికి, ఆడవారికి మధ్య వుండే గొడవలు వర్గ పోరాటపు గొడవలవంటివి కావు. అవి భిన్నమైనవి. అయితే ఆర్థికపరంగా ఎంతో ప్రాముఖ్యాన్ని కలిగి వున్నప్పటికీ స్త్రీ పురుష సంబంధాలను పరిగణించేటప్పుడు స్త్రీని కాని, పురుషుడ్ని కాని ఒక వర్గానికి చెందిన వారుగా ఎప్పుడూ పరిగణించరాదు.

స్త్రీ పురుష సంబంధాల మధ్య క్లాస్ స్ట్రగుల్‌కు ప్రాముఖ్యత లేదు. అవి సెక్స్ సంబంధాలకు సంబంధించినవి కాని వర్గచైతన్యానికి సంబంధించినవి కావు. పీడిత ప్రజల పోరాటంలో రెండు అంశాలు వున్నాయి. ఒకటి-వర్గాల మధ్య సంఘర్షణ, రెండు-స్త్రీ పురుషుల మధ్య సంఘర్షణ. ఈ సంఘర్షణను నడిపించే సూత్రాలు రెండింటికీ ఒకటి కావు. బూర్జువా స్త్రీ, శ్రామిక స్త్రీ నిజానికి రెండు విభిన్న వర్గాలకు చెందిన వ్యక్తులు కారు. ఒక బూర్జువా స్త్రీకి, ఆమె దగ్గర పనిచేసే కార్మిక స్త్రీకి మధ్య వుండే సంబంధం ఒక ఫ్యాక్టరీ యజమానికి, అందులో పని చేసే కార్మికుడికీ మధ్య వుండే సంబంధం లాంటిది కాదు.

బూర్జువా స్త్రీ తన భర్త గురించి, తన యింటిని గురించి యితర వర్గాలకు చెందిన స్త్రీలతో మాట్లాడినపుడు వ్యత్యాసాలు గురించిన హెచ్చు తగ్గులు (గొప్పలు) వుండవచ్చు. అయితే బూర్జువా స్త్రీ ఏదైనా ఒక కంపెనీకి ముఖ్యాధికారి అయితే తప్ప బూర్జువా వర్గానికి చెందదు అని నేననుకొంటాను. మామూలుగా సంప్రదాయం ప్రకారం బూర్జువాస్త్రీ— మొదట బాలికగా వున్నప్పుడు తల్లిదండ్రుల వద్దలో, తండ్రి అధికారంలో జీవిస్తుంది. తరువాత పెళ్ళయాక మొగుడుగా వచ్చిన మగవాడు ఆమె తండ్రి పాలించిన అధికార సూత్రాలను చేజిక్కించుకుని ఆమెపై పెత్తనం చెలాయిస్తాడు. తన వ్యక్తిత్వాన్ని సమర్థించుకోవడానికి

ఆమె కసలు అవకాశమే వుండదు. నిజానికి చాలా సందర్భాలలో ఆవిడ బూర్జువా సూత్రాల్ని తన భర్త ప్రవర్తనను, అతను ఏ విధంగా తనకంటె తక్కువవారితో ప్రవర్తిస్తాడో అనుకరించడం ద్వారా నేర్చుకుంటుంది. అయితే ఆవిడ పనిమనిషి దగ్గరకు వచ్చేసరికి ఆమెతో ఎలా ప్రవర్తించాలో అన్నచోట అయోమయంలో పడిపోతుంది. పనిమనిషితో తన కష్టసుఖాల రహస్యాలను చెప్పుకునేటప్పుడు ఆమె స్థాయికి కాని పని చేస్తున్నట్లు కించపడుతుంది. ఆ పనిమనిషి వాటిని అర్థం చేసుకుని తన కడుపులో పెట్టుకుంటుంది. అయితే బూర్జువా స్త్రీలలోవున్న అధికార అంశ ఆమె బూర్జువా భర్తతో వుండే సహజ సంబంధాల నుంచి సంక్రమించినదే కాని సహజసిద్ధమైనది కాదు. బూర్జువా స్త్రీలోని బూర్జువాతనం భర్తకు దాసీ కావడం వల్ల సంక్రమించినట్టిది. అంటే, స్త్రీకి సాంఘిక జీవితంలోగానీ, ఆర్థిక వ్యవహారాల్లో గానీ భర్త ద్వారా వుండే సంబంధాలని బట్టి మాత్రమే ఆస్త్రీ పరోక్షంగా బూర్జువా అవుతున్నది కాని ప్రత్యక్షంగా కాదు. బూర్జువా స్త్రీకి ఎక్కడో నూటికి కోటికి, ఎవరో ఒకరికి మాత్రమే పెట్టుబడితో సంబంధం వుంటుంది.

భర్త వద్దిలో వున్న స్త్రీ భర్త వదిలేసినా, భర్త మరణించినా, తండ్రి లేక పోతే, ఆదుకునే వాెవరూ లేకపోతే దిక్కులేక కూలిమనిషిగా శ్రామిక వర్గంలో చేరి పోతోంది. ఎందుచేత? ఆమె పరోక్షంగా బూర్జువా కావటం చేత. సార్త్రె యింకా యిలా అన్నాడు— "మా అమ్మకి డబ్బుతో వుండే సంబంధం గురించి చెబుతాను. మా నాన్నగారిస్తే ఆవిడ దగ్గర డబ్బు వుండేది. మా నాన్నగారు పోయాక మా తాత గారిస్తే ఆవిడ దగ్గర డబ్బు వుండేది. మా అమ్మకి మరొక వ్యక్తితో, అంటే నా సవతి తండ్రితో వివాహం జరిగినప్పుడు ఆయన ఆవిడ పోయేదాకా ఆవిడ్ని సాకాడు. మా అమ్మ చనిపోయేదాకా మా సవతి తండ్రి యిచ్చే డబ్బుతోనూ, నేను యిచ్చే డబ్బుతోనూ జీవించేది. ఒక పాయింట్ నుంచి యింకో పాయింట్ దాకా మా అమ్మ నేనో, యింకెవరో యిచ్చే డబ్బు మీదో ఆధార పడి వుంది గానీ, ఆవిడకు నేరుగా పెట్టుబడితో సంబంధం లేదు." ఈ విషయం చెబుతూ పురుషులతో సమాన హక్కులకై స్త్రీలు నిర్వహించే సంఘర్షణను తాను మనస్ఫూర్తిగా ఆహ్వానిస్తున్నానని, అది అవసరమని సార్త్రె చెప్పాడు.

గర్భస్రావం చేయించుకొనే హక్కు కొరకై స్త్రీలు వుద్యమాలు నడిపి పోరాడవలసి వచ్చింది. ఆదిలో కొద్దిమంది మేధావులు దీనికి వత్తాసు పలికారు.

ఈ మేనిఫెస్టోపై సంతకాలు చేసినపుడు చాలా తక్కువమంది స్త్రీలు యిందులో పాల్గొన్నారు. తక్కువ మంది స్త్రీలు పోరాడి గర్భస్రావాన్ని— కొన్ని లోపాలు వున్నప్పటికీ చట్టబద్ధం చేసుకోగలిగారు. అయితే యీపోరాటంలో తక్కువసంఖ్యలో వున్న స్త్రీలకు ఎక్కువ మంది పురుషుల సహాయం లభించింది. ఎంచేతనంటే ఆ దేశంలో అబార్షన్ ఖర్చులు భరించేది మళ్ళీ మగవాడే కావడం వలన. పిల్లలు అక్కర్లేదనుకున్న దంపతులు బిడ్డ పుట్టకుండా చేసుకోవడానికి యీ చట్టం ఒక వీలు కల్పిస్తుంది. అయితే పురుషులంతా గర్భస్రావాల ఖర్చు భరించడానికి సహాయ కారులుగా వుంటారనే విషయం పూర్తిగా నిజం కాకపోవచ్చు. అనేక సందర్భాలలో గర్భిణీ అయిన స్త్రీని మోసగించి పురుషులు తప్పించుకోవచ్చు. అంటే నైతికం గానూ, ఆర్థికంగానూ కూడా పురుషుడు సాయపడ పోవచ్చు అయినప్పటికీ గర్భ స్రావాల చట్టం స్త్రీకి కొంత వుపశాంతినీ, మేలునీ కలగచేస్తుంది. స్త్రీ పురుషుల మధ్య కొన్ని విభేదాలు తలెత్తినప్పటికీ యీ చట్టం గెలుపుకి కొంతమంది పురుషులు మూకుమ్మడిగా ఓటు చేయడం వల్లనే ఫలితం దక్కింది.

స్త్రీకి ప్రత్యేక సదుపాయాలు, సౌకర్యాలు కావాలంటున్నాం ఒక పక్కన. మళ్ళీ మనిషిని మనిషి దోచుకునే వ్యవస్థని నిర్మూలించి సమసమాజాన్ని ఏర్పరచాలంటున్నాం ఒక పక్కన. మగవారు చేసే పనులన్నీ అధికారక్రమంలో స్త్రీలు కూడా చేయగలరని, చేయాలని వాదిస్తున్నాం. అధికార వృక్షం నశించాలంటూ, మళ్ళీ అందులో స్త్రీలు పైకి రావాలనుకోవడంలో వైరుధ్యం లేదా? (మగవారితో సమానమైన విద్యార్హతలు వున్నప్పుడు మగ వారికి వలె సమానావకాశాలు ప్రారంభంలోను, పైకి అత్యున్నత పదవులు చేరుకోవడంలోను స్త్రీలకు కూడా వుండాలంటున్నాం. వివిధ దశలలో వున్న ప్రభుత్వాధికారమంతా ప్రజల పరమైనప్పుడు యీ వైరుధ్యాలన్నీ అణచివేయబడతాయి). అంటే వ్యవస్థమారి పరిపాలనాయంత్రాంగం మారినప్పుడు స్త్రీలను, పురుషులను సమానంగా చూస్తారు. ఇప్పుడున్న పరిపాలనా వృక్షంలో శిఖరాగ్రానికి చేరుకోడానికి స్త్రీలకు సమానావకాశాలు వుండటం లేదు. క్రింది స్థాయి వుద్యోగాలలో అవకాశాలు వుంటున్నాయి. ప్రస్తుత పరిస్థితులలో అతి కొద్దిమంది స్త్రీలుమాత్రమే అత్యున్నతపదవులను అధిరోహించి పురుషులతో సమాన స్థాయిని చేరుకొంటున్నారు. తతిమ్మా స్త్రీలు తమ అర్హతలతో వున్నతావకాశాలను సమసమాజం తోను, దాని అధికార యంత్రాంగం తోను పోరాడి సాధించాలని నా వుద్దేశం.

అయితే అత్యున్నత పదవికి చేరుకున్న మహిళ కూడా తను తీసుకున్న నిర్ణయాలకు ఆ స్థాయిలోనూ, అంతకు తక్కువ స్థాయిలోనూ వున్న పురుషుల సహకారం లేనిదే ఫలితాలను సాధించడంలో నెగ్గదు. అంటే మరోమాటలో, అన్ని అర్హతలూ వున్నప్పటికీ స్త్రీ అధికారం చెలాయించాలంటే పురుషుల సహకారం వుండి తీరాలి ఎందుకంటే అధికార ప్రపంచం అంతా పురుషుల ప్రపంచం కనక.

శాస్త్రీయ పరిశోధనా రంగంలో కూడా సైంటిస్ట్ అయిన స్త్రీ-పురుషులు అంతకు ముందే ఏర్పరచిన చట్రంలో తన పరిశోధనను కొనసాగించవలసి వుంటుంది. ఈ విషయం ఎందుకు ప్రస్తావించవలసి వచ్చిందంటే, పురుషుడు నిర్మించిన ప్రపంచాన్ని స్త్రీలు పూర్తిగా తిరస్కరించాలా అనే ప్రశ్న యిక్కడ వుదయిస్తోంది. స్త్రీ తన చేతిలోకి పనిముట్టుని సంగ్రహించాలా లేక పనిముట్టునే మార్చాలా? శాస్త్రీయ విజ్ఞాన రంగంలోను, భాషారంగంలోను, కళారంగంలోను అన్ని విలువలనూ పురుషులే నిర్ణయించి పారేశారు. అవి అన్నీ పౌరుషేయాలే! మొత్తం అంతా తిరస్కరించి సున్నా దగ్గరనుంచి స్త్రీలు వుద్యమం ప్రారంభించాలా (అంటే - యింతకుముందు పురుషులు నిర్మించిన వాటన్నిటి కంటె భిన్నంగా)? లేదా ఇప్పుడున్న విలువలను స్వీకరించి వాటిని స్త్రీల వుద్యమాలకు అనుగుణంగా మార్పులు చేసి మలుచుకోవాలా? ఈ ప్రశ్నకు సార్త్రె- "స్త్రీలకు సంబంధించిన ప్రత్యేకమైన విలువలు ఏమైనా వున్నాయా అనేది మనం ముందు ఆలోచించి తెలుసుకోవాలి. స్త్రీల సమస్యల్ని చిత్రించిన నవలల్లో స్త్రీ ఆంతరంగిక ప్రపంచాన్ని గురించి రాయడం నేను గమనించాను. అందులో స్త్రీలకు సంబంధించిన సంఘటనలను అర్థం చేసుకొనడానికి పురుషులు ఏర్పరచుకున్న విలువల దృష్ట్యా రచన సాగింది. అయితే కొన్ని విలువలు వుంటాయి. అవి స్త్రీ స్వభావానికి సంబంధించినవి. ఇవి రెండవస్థాయికి చెందిన విలువలు. మౌలికమైనవి కావు.

స్త్రీ విమోచన వుద్యమకారులు స్త్రీ స్వభావమని ప్రత్యేకంగా వుంటుందని అంగీకరించరు. నిరంకుశంగా స్త్రీలను అణచి పెట్టడం వలన వారిలో ఏర్పడిన కొన్ని లోపాలను మాత్రమే స్త్రీల స్వభావంగా చిత్రిస్తున్నారు అని అంటారు. సాంస్కృతికరంగంలో నిరంకుశంగా స్త్రీలను అణచిపెట్టివుంచడం వల్ల వారిలో కొన్ని లోపాలు, కొన్ని గుణాలు మగవారికంటే భిన్నమైనవి ఏర్పడ్డాయి. దానినే మీరు స్త్రీత్వమని అంటున్నారు.

సుదూర భవిష్యత్తులో స్త్రీ జన వుద్యమం విజయం పొందితే యిప్పుడు వారు విమర్శించే సూత్రాల ప్రాతిపదిక నిలుస్తుంది. స్త్రీలకు తమ తమ అంతరంగాలలో తాము ఎటువంటివారో సుస్పష్టంగా తెలుస్తుంది. మగవారికి అలా కాదు. స్త్రీల విమోచన వుద్యమానికి విస్తృతమైన ప్రాతిపదిక యీనాడు లేదు. అది సమాజాన్ని కుదిపి మార్చగలిగిన స్థాయిలో లేదు. ఎప్పటికైనా స్త్రీ విమోచన అనేది వర్గపోరాటంతో కలిసినప్పుడే సంఘం మారుతుంది."

చలం భావాలకు అంత సన్నిహితంగా వుండకపోయినా మార్క్సిస్టుల మనుకునే వారు స్త్రీల సమస్యలపై ప్రదర్శిస్తున్న వైఖరిలోని లోపాలను సార్త్రె యింటర్వ్యూలో వెల్లడించిన అభిప్రాయాల నుంచి గ్రహించవచ్చు. చాలామంది మధ్యమార్క్సిస్టులు కూడా వ్యవస్థ మారితే అరచేతిలో వైకుంఠం అన్నట్లు అన్ని అసమానతలు తొలగిపోతాయని వూగిపోతున్నారు. చలం విద్యావంతురాలైన, స్వయం పోషకురాలైన అధునిక యువతి కూడా సంపూర్ణమైన స్వేచ్ఛను, తన శరీరంపై తన అధికారాన్ని పొందటం లేదని, యిప్పుడున్న స్త్రీ కొన్ని కొత్త ప్రలోభాలకు బానిస అని అభిప్రాయపడ్డాడు.

## మ్యూజింగ్స్

నండూరి సుబ్బారావుగారు ఎంకి పాటలను కూర్చి తెలుగుసాహిత్య సరస్వతికి కొత్త అలంకారాన్ని తొడిగినట్లుగానే చలం ఆధునిక తెలుగు సాహిత్యంలో 'మ్యూజింగ్స్' అనే కొత్త ప్రక్రియకు నాంది పలికారు. ఇవి మొదటో పాటిబండ్ల మాధవశర్మగారి 'వీణ' పత్రికలో వెలువడినట్లు చెబుతారు. చెళ్ళపిళ్ళవారి కథలు- గాథలు, పానుగంటివారి సాక్షి వ్యాసాలు రుచి మరిగిన తెలుగుజనానికి 'మ్యూజింగ్స్' కొత్త టానిక్. మ్యూజింగ్ ఒక రకంగా ఊహాగానమే. ఇందులో బాహిర్ - అంతర్ సంఘర్షణ వున్నా లేకపోయినా, అవలోకనం మాత్రం వుంటుంది. ఈ ప్రక్రియను ప్రారంభించినది చలంగారు కనుక దాని వర్ణక్రమం, వ్యాకరణం, వ్యవహారం అంతా వారు ఎలా నిర్దేశిస్తే అలాగే. అయితే మ్యూజింగ్ అనేది సాహిత్యకారుని కొక్కడికే దత్తమైన హక్కు కాదు. ఈ మ్యూజింగ్ అన్ని వయసులవారూ, అందరూ చేయగలరు, చేస్తారు. కాని దానిని కలంమీద నిలబెట్టడం దగ్గరకు వచ్చేసరికి వస్తుంది చిక్కు. పాదరసంలా నాలుగు వైపులకూ పరుగెత్తే భావసంచలనాలను కాగితంమీదకు దింపి నిలబెట్టడం మజాకా కాదు. చలం భావనాప్రపంచపు వైశాల్యాన్ని గుర్తించడమేకాక దాన్ని కెలడియో

స్కోపిక్‌గా ప్రదర్శించడంలోనే వుంది నేర్పు మ్యూజింగ్స్ ఒకప్పుడొక రంగుల హరివిల్లులానూ, ఒకప్పుడు ఆత్మావలోకనంలానూ, ఒకప్పుడు చిన్నపిల్లల గెంతులానూ, ఒకప్పుడు స్త్రీల పైటచెరగు రెపరెపల్లానూ, ఒకప్పుడు ప్రభంజనంలానూ, ఒకప్పుడు ఎంతకూ తెరిపిలేని ముసురుపట్టిన వానలానూ, ఒకప్పుడు తుళ్ళింతలాడే పిల్లకాలువలానూ, శరన్మేఘంలానూ, చందమామ తునకలానూ, వెన్నముద్దలానూ- ఇంకా ఎన్నెన్నో రకాలుగా, ఎన్నెనో రూపాల్లో దర్శనమిస్తూ వుంటుంది. ఇది ఒకప్పుడు ఇంటీరియర్ మోనోలాగ్‌లాగ కూడ అనిపించవచ్చు.

## పునరావలోకనం – సవరింపు

చలం తన పురాణపాత్రల్ని తిరిగి ఎందుకు వ్రాయవలసి వచ్చిందో 'మ్యూజింగ్స్'లో ఒకచోట ఇలాగ చెప్పాడు : "మొదటిసంగతి ఆదర్శపు మనుషులనే వాళ్ళు లేరు. అంత మాత్రం తెలిసినవాళ్ళు గనకనే పూర్వ కవులు, పురాణాల యోధులకి, పతివ్రతలకి దేవత్వాన్ని తగిలించారు, మన నోళ్ళు మూసేందుకు. కొందరి కొందరిలో ఒక్కొక్క గుణం అద్భుతంగా ప్రకాశిస్తుంది. అంతే. పాత పతివ్రతల్లోని అనుకరణీయమైన ఉత్తమగుణాన్ని మాత్రమేగాక వారి లోపాలన్నీ ఆదర్శాలనడంవల్లనే వాళ్ళని తిరిగి వ్రాయవలసి వచ్చింది.

"ఒకొక్క గుణం ఆదర్శంగా చూపగల పాత్రల్ని సృష్టించాను, నూతన నీతి ఆదర్శాలనీ. పాతివ్రత్యాన్ని కిరాతులనించి, వేషాలేసుకున్న దేవతలనించి, పవిత్రులైన రుషులనించి, లేక రౌడీలనుంచి, జమీందారులనించి, పోలీసులనించి, దుర్మార్గుడైన భర్తమీది భక్తివల్ల, భద్రంగా దాచిపెట్టుకుందని మామూలు రకంగా వ్రాస్తేనే కాని మీకు ఆదర్శం కనబడుతుందా? త్యాగంకింద తన శీలాన్ని అర్పించిందని వ్రాయగల దారుఢ్యం పూర్వ కవులకి వుండేది. ఈనాటి నిస్సత్తువ నీతి కళేబరాలకి కలం ముందుకు నడవదు. నేను స్త్రీలచేత చేయించిన ధీరకార్యాలన్నీ లోకానికి పాపాలుగా కనబడతాయి కదా! ఎట్లా ఆదర్శాలు కల్పించగలను మీకు నచ్చేట్టు! తన ప్రేమకోసం, భర్తనీ, పిల్లల్నీ, కులాన్నీ, గౌరవాన్ని వదిలిన స్త్రీ ఆదర్శవ్యక్తి అంటాను నేను ఏమైనా ఆ ఘోరత్యాగం ఆదర్శమంటాను. మీరు కాదంటారు సీత రాత్రులు వొంటరిగా పడుకోలేక రాముడి వెంట అడివికి పోయింది. ఏమిటా మహాత్యాగమని అడుగుతున్నాను. రావణున్ని నిరాకరించిందా? నలుగురిలో తలవొంపులనీ, పాపమనీ, నరకంలో కాలుస్తారనీ భయమేసింది. వృత్తి పిరికి మనిషి అని అంటే యేమిటి జవాబు?

అశోకవృక్షం కింది అనుభవాల తరవాతగాక, అంతకు ముందు అన్నేళ్ళ అడివిలో రాముడితో తిరిగేప్పుడు సీతకి సంతానం ఎందుకు లేదు? అని ఆలోచించారా?"

సాస్త్రి తన యింటర్వ్యూలో చెప్పినట్టు తరతరాలుగా, యుగయుగాలుగా పురుషులు నిర్మించిన ఆదర్శాలకు తలవొగ్గి స్త్రీలు ఆ పరిధిలో అవే తమ లక్ష్యాలనుకొని జీవించాలా? లేక మొత్తం విలువలను తిరస్కరించి సున్నానించి ప్రారంభించి తమకు కావలసిన విలువలను ఏర్పరచుకోవాలా అనేది నేటి సమాజం ముందు వున్న పెద్ద ప్రశ్న. ఏర్పడవలసిన విలువల గురించి స్త్రీ పురుష సంబంధాల విషయంలో మార్క్సిజమ్ కూడా ఏమీ మాట్లాడదు. అందుకనే అక్కడ కూడా స్త్రీకి పూర్తి న్యాయం జరగలేదు.

## సుఖవాది ?

చలం హెడొనిస్టా? అంటే స్వసుఖవాదా? రారాగారు 'సంవేదన'(అక్టోబరు 1968)లో చలం సుఖదాహంతోనే ఆధ్యాత్మిరంగంలో ప్రవేశించినాడని, నిజమైన ఆధ్యాత్మికచింతనతో కాదని అభిప్రాయ పడ్డారు. చలంలో కనిపించే సుఖదాహమూ, సౌందర్యదాహమూ రెండూ ఆధ్యాత్మిక లక్షణాలూ కావు. మిస్టిక్ లక్షణాలూ కావు. ఆధ్యాత్మికమైన ఆనందం సుఖం కంటే ఎంతో భిన్నమైనదని తెలిసినవాళ్ళు చెబుతారు. కాని చలానికి సంబంధించినంత వరకు సుఖమే ఆధ్యాత్మిక రంగంలో పేరు మార్చుకొని ఆనందం అయింది. చలం మెంటల్ మేకప్‌గాని, టెంపర్‌మెంట్‌గాని, అభిరుచులుగాని, ఆలోచనా ధోరణిగాని, అభిప్రాయాలుకాని, ఆధ్యాత్మిక చింతనకు, ఆధ్యాత్మిక దృష్టికి అనుకూలమైనవిగావు అంటారు రారాగారు ఇవన్నీ ఆయన తొలిరచనలని బట్టి చూస్తే తెలుస్తుంది అని రారా వాదన. ఇలాగే టాగూర్‌లో కూడా సౌందర్య దాహమే కాని నిజమైన ఆధ్యాత్మికచింతన లేదని నేను అనుకుంటున్నాను అని రారా అన్నారు. అయితే జయదేవుని గీతగోవిందంలోనూ, పోతనగారి భాగవతంలోనూ, లీలాశుకుని కృష్ణకర్ణామృతంలోనూ భక్తి సౌందర్యాలు జమిలిగా కలిసిపోయాయి. భక్తిని సౌందర్యాన్నించి విడగొట్టి వేరుగా చూసి, పాశ్చాత్యుల దృక్పథంతో చలాన్ని, టాగూర్‌ని ఇద్దరినీ కొద్ది తేడాలతో సౌందర్య వాదులనడం అంత అవసరం కాదేమో, అభారతీయమేమో!

చలం 'భగవాన్ పాదాల ముందు' అని సమర్పించిన కృతిలో 'యశోదా గీతాలు' రాశాడు. ఇందులో వాత్సల్యభక్తి ప్రదర్శించాడు. ఆ యశోద కానే

అయి. వీటన్నింట్లోనూ వాత్సల్య భావనలోంచి ఆధ్యాత్మిక అన్వయం లభిస్తూ వుంటుంది. చలం ఆధ్యాత్మికానికి మారాడు అనేది ఒప్పుకుంటే యీ హెడొనిస్ట్ వాదనకు వున్న బలం సన్నగిల్లి పోతుంది. అలా కాకపోతే చలం ఆధ్యాత్మికపు ముసుగులో సౌందర్య వాదిగా జీవించాడు అనే వాదనను అంగీకరించాల్సివస్తుంది. భగవద్గీత వ్యాఖ్యానాలూ, భగవాన్ స్మృతులూ, సుధ కావ్యంలోని వచనపద్యాలూ చూస్తే అందులో సౌందర్యభావన మిళితమై వుందికాని, ఆ తీవ్రత అంతా ఆధ్యాత్మికానిదే కాని ఒట్టి సౌందర్య భావనది మాత్రం కాదు అని అనిపిస్తుంది. రారా గారి వాదన భక్తితో, ఆధ్యాత్మికంతో మిళితమైతేనే నిలుస్తుంది. ఉదాహరణకి 'సుధ'లో చలం యిలా అంటాడు:

"రా నాతో అరుణాచలం పైకి!
మర్రిచెట్టు నీడ
సెలయేటిధార
పెదవులపై పాట
నువ్వు నా వెంట"

పై వాక్యాలలో చలం కవియై మనల్ని అరుణాచలం వైపు రమ్మని ఆహ్వానిస్తున్నాడు. ఆహ్వానం సౌందర్యారాధకుడయిన మామూలు చలానికి కూడా వుంది. కేవలం సౌందర్యవాహానికి అతీతంగా నడిచే క్షణాలు కూడా వున్నాయనిపించే పంక్తులివి :

('నివేదన' నుంచి)

"నాకింక వెనక తోవలేదు. తోవ తప్పిపోయినాను నా యింటి తలుపులు మూసేశారు. వెనక్కి వెళ్ళినా, ఇక్కడే తిరిగి తిరిగి నశించినా, ఆనాడు నన్ను రమ్మన్న నీ మధురస్వరం నన్ను విడవదు.

నీలో తప్ప నాకు లోకంలో చోటులేదు. నీ ఆలింగనంలో తప్ప నాకు శాంతి లేదు.

భగవాన్ నువ్వేగతి! నాకింక శక్తి చాలదు. అంటాడు—

—చలం.

ఆధ్యాత్మికానందం చలానికి అనుభవంలోకి వచ్చిందో లేదో ఎవరూ చెప్ప లేరు కాని, అందుకై ఆయన పొందిన తహతహ, ఆరాటం, ఆవేదన అంతా అరుణా చలంలో వుండగా ఆయన సాగించిన కొన్ని రచనల నుండి గ్రహించవచ్చని నేను అనుకుంటాను. ఆయన పొందిన అనుభూతితో ఆయనకే నిమిత్తంగాని మనం ఆయన పడిన వేదన లేక సంఘర్షణతో మాత్రమే సంబంధం కలుపు కుంటాము. చలానికి టాగూర్ ఎక్కువగా నచ్చడానికి, యిష్టపడడానికి, ఆయన రచనలను తెలుగు చేయడానికి ప్రేరణం యీ ఆధ్యాత్మిక సౌందర్య దాహమేమో! అయితే టాగూర్- సంత్‌కబీర్, రామదాస్, త్యాగరాజుల వంటి భక్తకవి కాదని మనం ఒప్పుకోవాలి. ఈ ఆధ్యాత్మికపు నీడలలో చలం ఎదగడానికి ప్రయత్నిం చాడు కాని తనని తాను మోసం చేసుకోలేదు, ఎవర్నీ మోసగించలేదు. ఒక ఆవ రణలోంచి మరొక ఆవరణలోకి ప్రవేశించాడు. రెంటిలోనూ గట్టిగానమ్మి జీవించి నది మాత్రం యథార్థం.

ఈ విషయమై 'మ్యూజింగ్స్'లో కొంత వరకు చలం ప్రస్తావించాడు. (342-343 పేజీలు- చలం సాహితి, హైదరాబాద్ ప్రచురణ, 1976.)

"శంకరాచార్యుడి కాలం నుంచీ వేదాంతం తప్పు మార్గం పట్టింది. వేదాలూ ఉపనిషత్తులూ, ఆధ్యాత్మికానుభవంలో ఏ ఆనందం వస్తుందని పాజిటివ్‌గా ఘోషి స్తున్నాయో ఆ ఆనందం సంగతి వెనక్కు నెట్టి వుత్త నెగటివ్ సైడ్, వైరాగ్యం అన్ని సుఖాలూ, కామాలూ వొదులు కోవలసిన అవసరం మీదే వొత్తి వొత్తి బోధించాడు. దాని వల్లనే సంసారం దుఃఖసాగరం కావడం, కామినీ కాంచనాలకు విరోధం, సత్కారం మీది వాంఛకు కూడా అభ్యంతరం మొదలైన విపరీతాలు ప్రబలాయి. దేశంలో జాతి నిర్జీవమై స్వేచ్ఛని, సుఖాన్ని పోగొట్టుకుని యీ లోకాన్ని సాధించే చేవలేక...." యీ వాదన నుంచి చలం తన దృష్టిని మ్యూజిం గ్సులో మరోవేపుకు మళ్ళించాడు. "ఉన్న సుఖాలలోంచి, అంతకన్నా ఎక్కువ సుఖాల కోసం ప్రయత్నించాలి. ఆధ్యాత్మిక విద్యే అన్నిటికన్నా గొప్ప సుఖ మిస్తే అది చాలా వాంఛనీయం. అది దూరం. ఎవరో దాన్ని అనుభవించిన వాళ్ళ మాటలే ప్రమాణం.... కబీరు దాన్ని మకరందంతో, వెన్నెలతో, సంగీతంతో, అమృతంతో పోల్చి మాట్లాడుతాడు. కాని గొప్ప ఎక్కడంటే: లోకం యివ్వగల ఉన్నత సౌఖ్యాన్ని, ధనాన్ని, శృంగారాన్ని, పదవుల్ని అన్నిటినీ అనుభవించి

అంతుకనుక్కున్న వాళ్ళు ఆధ్యాత్మికానుభవంతో ఏదీ ఏమాత్రం తులతూగదంటు న్నారు చాలా ఘంటాపథంగా."

ఆధ్యాత్మిక విద్యలో చలం పోయేనాటికి ఏ స్థాయికి చేరుకున్నాడో మన కయితే తెలియదు కాని. ఆయన రమణాశ్రమంలో ఆ పరిసరాలలో జీవించే యితర భక్తులూ సాధకులవంటి వాడు కాదు. అక్కడ కూడా చలం చలమే. ఆయన రమణాశ్రమానికి ఎదురుగా రమణస్థానని స్థాపించి దాంట్లో సౌరిస్ అనే ఈశ్వ రుడి ఆధ్వర్యంలో పేరే వుత్సవాలూ, పండుగలూ వగైరా జరిపించేవాడు. అయితే ఆధ్యాత్మిక వాదిగా మారిన 'హెడొనిస్ట్'గా మాత్రం కాదు.

## ప్రేమలేఖలు

ప్రేమలేఖ అనేది స్త్రీ పురుషులమధ్య నడిచే శృంగార వ్యవహారాలకు సంబంధించిన వుత్తరం అనే భావనలో కాక ప్రేమలేఖ అనేది సాహిత్య ప్రక్రి యగా చలంగారు తీర్చిదిద్దారు. ఈ వుత్తరాలన్నీ ఆయన ఎవరికో రాశారని, వారి దగ్గరనుంచి మళ్ళీ తీసుకుని వీటిని అచ్చువేసారని అర్థం కాదు. ఒక సాహిత్య ప్రక్రియగా, ఆకర్షణీయంగా చదివించేలా ప్రేమలేఖ రాయడం కష్టమే। చలంగారి ప్రేమలేఖలు తెలుగు వాఙ్మయంలో ఒక సాహిత్యశాఖగా వుంటాయి. ఇవిమామూలు వుత్తరాలకంటే సర్వవిధాలా భిన్నమైనవి. ఉత్తరం అంతరంగికుల మధ్య లిఖిత సంభాషణలా వుండాలి. టీ తాగుతూ, సిగరెట్లు కాల్చుకుంటూ, వెచ్చనిగదిలో ప్రియమైన వారితో మాట్లాడుకుంటున్నట్లు వుండాలి. ఉత్తరం చదవగానే పగటి కలలు ముసురుతాయి. అలా ముసరకపోతే అది మంచి వుత్తరం కాదు.

మంచి స్నేహం వుంటేనేకాని మధురమైన వుత్తరాలు పుట్టవు. ఒకవేళ మంచి స్నేహం వున్నప్పటికీ దానిని వ్యక్తం చేయగల మంచి అభిరుచి కూడా వుండాలి. మన స్నేహితులు మన విశ్రాంతి కాలంలోకి సర్ది పుచ్చుకుని కబుర్లు, చీట్లపేకలు, తిక్కతో కాలక్షేపానికి మాత్రమే పనికివస్తారు. ఉన్నతాభిప్రాయాలు ముచ్చటించు కుందుకు కాగితాలమీద, వాళ్ళేం నిలబడతారు— ఏ కొందరో తప్ప। మనదేశంలో భార్యాభర్తలు వుత్తరాలు రాసుకోరు. స్త్రీకి వుత్తరంవస్తే అది దాచుకోడానికి ప్రత్యేక మైన చోటే వుండదు. రసికతా దారిద్ర్యం, రసికతా నిర్మూలనం వలన దంపతుల మధ్య ఏ మామూలు వుత్తరాలోతప్ప ప్రేమలేఖలు పుట్టే అవకాశమే లేదు( పెళ్ళ

యిన కొత్తలో తప్ప). నగలూ, చీరలు, మర్యాదల నుంచి స్త్రీ బుద్ధిపోదు. స్త్రీ మేధస్సు ఏ ప్రత్యేకమైన భావాన్నీ ప్రకటించడానికి సిద్ధంగా లేదు. పురుషునికీ, స్త్రీకీ మానసికస్థాయిలో-అంటే లెవెల్స్‌లో తేడా వుండటం వలన సమానహోదాలో భావాలను వ్యక్తీకరించడం సాధ్యపడదు. భార్యకు వుత్తరం రాయడం కంటె పత్రికలకు రాస్తే ఎక్కువ లాభం!

భార్యాభర్తలు కానివాళ్ళు రాసుకునేవి చీట్లుకాని, ప్రేమలేఖలు కావు. అవి గోడలు దూకడంతో ఆఖరు. ఆంధ్ర స్త్రీ కాగితంమీద పాయింట్ కాదు. ఒకవేళ రాస్తే తప్పిజారి,ఆ వుత్తరాన్ని పదిమందికీ చూపించుకుంటేగాని ఆ మగవాడికి తనరసికత చాటుకుందుకు మరో అవకాశం దొరకదు. చాలామంది స్త్రీలు పురుషులను తమకు వుత్తరాలు రాయవద్దని చేతులెత్తి ప్రతిమాలుతారు.ఒకవేళ తప్పనిసరై తాము రాసినా ఆ వుత్తరాన్ని చదవగానే చింపేయమంటారు.చాలా చక్కని వుత్తరం రాయాలంటే ఎంతో సంస్కారం,ఎంతో విశాలమైన విద్య,జ్ఞానం, ఆత్మోన్నత్యం-యింకా ఎన్నో వుండాలి. ఉత్తరాలు రాసుకునే వారి మధ్య పరస్పర ఆకర్షణ, గౌరవం వుండాలి

ఇంగ్లీషు వాఙ్మయంలో దంపతులుకాని స్త్రీ పురుషుల మధ్య కోర్టింగ్ జరిగే కాలంలో అద్భుతమైన లేఖలు రాసుకున్నవాళ్ళు వున్నారు. షెల్లీ,కీట్స్,బ్రౌనింగ్స్-వీరి వుత్తరాలు వుత్తమ సాహిత్యస్థాయిని, గౌరవాన్ని, ఆదరణను పొందాయి.చాలా మంది కవులు తమ వూహలలో స్త్రీని ఆదర్శప్రాయంగా చిత్రించుకుంటారు. కాని నిజానికి మామూలు మనుష్యులలా వుండరు.అందుచేత వారికి తాము కలలుకనే స్త్రీపైనే ఆరాధన. అటువంటి స్త్రీ లేకపోతే ప్రేయసిని గురించిన ఆరాధన వుండదు. ఆ ఆరాధన వుండకపోతే ప్రేమలేఖలకి తావు వుండదు. ప్రపంచ వాఙ్మయంలో హెలెన్, బీట్రైస్, క్లియోపాత్రా, అహల్య, తార, ఎంకి-వీళ్ళందరూ గొప్ప ఆదర్శ నాయికలే. నిజానికిలాంటివారు వుండకపోవచ్చు. ఆ సౌందర్య రూపాల వెనక్కిపోగల దృష్టి వుంటే అప్పుడా కవి మిస్టిక్ అవుతాడు. ప్రేమలేఖ రాసేప్పుడు మన మనసులో మెసిలేది భౌతికమైన ప్రేయసి కాదు. ప్రేయసిని ఆధారం చేసుకొని మనస్సులో మెదిలే దివ్యతేజస్సు. ఊహాప్రేయసితో కూడా వుల్లాసకరమైన సంభాషణ జరపవచ్చు. అలాగే వుత్తరాలు రాయవచ్చు. మిగతా సాహిత్య ప్రక్రియలకూ, ప్రేమలేఖలకూ మధ్య ఒక తేడా వుంది. మిగతావన్నీ లోకం కోసం రాస్తే,అంటే లోకం అనేది వున్నదనే దృష్టితో రాస్తే, ప్రేమలేఖ-వుత్తరాలు ప్రచురిత మౌతా

యనే దృష్టితో కాక ఏ సంకోచమూ లేక నిర్భయంగా రాస్తారు. రాతలు సహజంగా, స్వేచ్ఛగా, అంతరంగికంగా వుంటాయి. లేఖలలో ఆ మనిషి వ్యక్తిత్వం కూడా బయటపడుతుంది. లేఖలు రాసుకోవాలంటే ప్రేయసీ ప్రియులైనా, మిత్రులైనా, వారి మధ్య వియోగం అవసరం. ఉన్నతాకర్షణ, ఒకరిమీద ఒకరికి విపరీతమైన కాంక్ష వుండి తీరాలి. చిన్నపిల్లల భావనాచిత్రాలు అర్థంకానట్లే, పెద్దలు తమ చిన్న తనాన్ని మరిచినట్లే, తమ యవ్వనాన్ని కూడా మరిచిపోతున్నారంటాడు చలం. స్త్రీ హృదయంలో వుండే మాతృత్వాన్ని అనుభవించని ప్రియుడు స్వర్గానికి అందుడు. కాళిదాసు మేఘసందేశం చక్కటి ప్రేమలేఖ కాదా? భాష తెలిసినవారికి ఈ ప్రపంచమే, ఈ సృష్టి సౌందర్యమే ఒక పెద్ద ప్రేమలేఖ. ఉన్మత్తులు ప్రేమ లేఖలు రాసి వెలుగుసీతలకి అంకితమిస్తారంటాడు చలం. తెలుగులో అధునిక సాహిత్య ప్రక్రియలలో ఋుబ్యాయింగ్స్ కు వచ్చినంత ప్రాచుర్యం రాకపోయినా చలంగారి ప్రేమలేఖలు ఒక చక్కని ఆత్మీయమైన, ఆనందకరమైన ప్రయోగం. ప్రేమలేఖల్లో దిగులు వుంటుంది. దిగులెందుకంటే ఎవరేం చెప్పగలరు?

## నవీన స్త్రీ

నవీన స్త్రీ గురించి చలం అభిప్రాయాలు—

"అత్త అధికారం నుంచీ, భర్త అధికారం నుంచీ తప్పించుకున్న నవీన స్త్రీ, షోకులకీ, సంఘ గౌరవాలకీ, ఫ్యాషన్ కీ బానిస అవుతోంది. ఒక పురుషుడి నీడ కింద నుంచుని (ఆ పురుషుడికి బానిస అయితేనేంగాని) లోకాన్ని ధిక్క రించ గలిగే ఇల్లాలు- యీనాడు సంఘ గౌరవం పేర, వుద్యోగం పేర, వెయ్యి మందికి దాస్యం చేస్తుంది. నవీన స్త్రీకి తన చుట్టూ స్త్రీ లంతా అత్తలైనారు.

ఇది వరకు అరుగుమీద కూర్చుని కూరలు, పచ్చళ్ళు మాట్లాడే ఇల్లాళ్ళు ఈనాడు లేటెస్ట్ సినిమా స్కాండల్స్ చర్చించడానికీ, తమ మిత్రుల శీలాన్ని పరీ క్షించడానికీ సంభాషిస్తున్నారు.

పురుషుడూ తన కామం కోసం స్త్రీ-ను కుక్కల వలె కట్టేసుకున్నాడు. స్త్రీ తన పిల్లల్ని అచములుగా పెంచి కసి తీర్చుకుంటోంది పురుష జాతి మీద."

## పురూరవ

చలం 'పురూరవ' నాటకం ప్రేమతత్త్వానికి చలం పట్టిన దీప హారతి. ఉన్నతమైన ప్రేమానుభవం కోసం అలౌకిక వ్యామోహాలన్నీ త్యజించి వాటిని

అతిక్రమించి ఔన్నత్యం పొందవలసి వుంటుంది. లేకుండా అనుభవించే ప్రేమ భావభ్రాంతిజన్యం అవుతుంది తన గొర్రెల యందు శ్రద్ధ చూపనందుకు, తన నియమాన్ని అతిక్రమించినందుకు ఊర్వశి పురూరవుడ్ని విడుస్తుంది. తాను ఏ పనిలో అతడ్ని నియమించిందో అందులో అతడు యిమడలేకపోయాడు. అంటే పుత్తీర్ణుడు కాలేక పోయాడు. అంటే ప్రేమ ముందు అహంకారం, మమకారం అనేవి వుండడానికి వీల్లేదు. ఉంటే ఆ లోపం ప్రేమలో తప్పకుండా కనిపిస్తుంది. చలం పురూరవుడు ఒకానొక సమయంలో అహం వలకి తన పనిని సరిగా చేయక పోవడం వల్ల ఊర్వశిని పోగొట్టుకుంటాడు. ఎవడో ఊర్వశిని చంపుతాడని, తను వాడిని వధించి ఊర్వశిని రక్షించడం తన ధర్మమని, విధి అని-ఆమెవద్దంటున్నా వారిస్తున్నా ఆగకుండా అతన్ని చంపాడు. ఎప్పుడయితే లౌకిక భ్రాంతికి మూలకారకాలయిన అహం, ధర్మం, విధి, ప్రేమ అన్న, ప్రేమ యిచ్చే ఆలంబనం కన్నా ఎక్కువగా అనుకున్నాడో అప్పుడు ఊర్వశి అతన్ని వదిలేసింది. ఊర్వశి దయా విహీన అని కాదు అర్థం. ఈ చిన్న అపరాధానికి అతన్ని వదిలి వేయడంలో పురూరవుడ్ని వున్నత స్థాయికి చేర్చే ఊర్వశి ప్రయత్నమే అందులో కనిపిస్తుంది. "దిక్కులదిరేటట్లు ఊర్వశీ అని ప్రశ్నించుదుగు, సాధించు.... నన్ను పొందగలిగిన ఔన్నత్యం ఎట్లానూ తెచ్చుకున్నావు కొంతకాలం. అంత ఔన్నత్యాన్ని మామూలుగా నీ స్వభావానికి తెచ్చుకోగలగాలి. నువ్వు నమ్ము-శిక్ష అనేది సృష్టిలో లేదు-దయ తప్ప!"

ఆనందం అనేది బాహ్యవస్తు ఆశ్రితమైనది కాదు, అంతరంగిక భావాశ్రితమైనది ప్రేమ ఆనంద స్వరూపం కాబట్టి నిజమైన ప్రేమికుడు నిజమైన ఋషి అవుతాడు, ప్రేమ స్వయంభువు. దాని ఎదుగుదలకు పురూరవుడి స్వంత అనుభవమే సహాయకం అవుతుంది.

"క్రమంగా కాలంలో స్వంత అనుభవం బోధించవల్సిందే. మాటలతో నేర్చుకునే విషయాలు చాలా అల్పమైనవన్నమాట. ఎదుగు వికాలంగా, తెలుస్తాయి. తెలియడమంటే అర్థం ఏమిటనుకు న్నావు? అనుభవించే అర్హత కలగడమన్నమాట. ఎదగడం అనేది బలవంతంగా బయటనుంచి లభించేది అయినట్లయితే అది వ్యక్తికి బాధాకరం అవుతుంది. అది తన మనస్సులోంచి తానే నిర్మించుకోవాలి. ఎందుకంటే సుఖదుఃఖాలన్నీ మనసులోనే వుండి ఏర్పడుతున్నాయి." మొదటిసారిగా ఊర్వశి

పురూరవుడి దగ్గరికి వచ్చినపుడు పురూరవుడు కఠినంగా మాట్లాడే సందర్భంలో— "మామూలు మోహావేశాలకి అలవాటయిన అతని మనస్సు, ఆమె నిశ్చల తన్మయత్వాన్ని అనుమానిస్తుంది. వెచ్చనీ, వంకర్లనీ, కామాన్నీ, అవసరాల్నీ, ఎరగని ప్రేమ అతనికి అర్థం కావటం లేదు" అంటాడు. [పురూరవ- పుట 12] కామ ప్రవృత్తికి త్వర చూపించిన పురూరవుడితో ఊర్వశి-"పాపం అదొక్కటేగాపును నీకు సౌందర్యాన్నుంచి ఆనందం తీసుకునే విధం.... నీతో ఉన్న ప్రతి నిమిషం నీ నించి గొప్ప గొప్ప తృప్తి అనుభవిస్తున్నాను.... ఆ సౌఖ్యం చాలా స్వల్ప విషయం.... సౌందర్యానికీ, ఆ కలయికకీ సంబంధమేమిటి? అది కామబలం, సృష్టి చేతుల్లోకి తీసుకుని, అదిమి, రాగి, పెళ్ళ ఆవేశంతో రక్త విజృంభణంతో మనస్సు పొరలు గప్పి- ఆ నిముషాన సౌందర్యంతో ప్రసక్తి ఏముంది? సౌందర్యాన్నే అనుభవించడం నేర్చుకున్ననాడు స్వర్గమే నీ కరతలామలకం. [ఆ సౌందర్యానుభవం నేర్చుకోవడం] అదో విద్య కాదోయ్, ఎదగాలి ఆ జ్ఞానం కోరి" అని అంటుంది [పురూరవ పుట-68].

ఇంకా ఇట్లా అంటుంది.

"ఈ శరీరాల కలయికతో రక్త సంబంధంతో నా శక్తి, నా జ్ఞానం, నా స్పష్టత, నీలోకి రావాలి. ఉత్త కామవాంఛ తీర్చుకోవడమనుకోకు. నీ ఆలింగనంలోకి అపురూప దేహలావణ్యాన్నే కాదు, గొప్ప సంస్కారాన్నీ, విశాల విజ్ఞానాన్నీ, ఆధ్యాత్మిక శక్తినీ తీసుకుంటున్నావు. నీ ఆత్మ వికసించ లేకపోతే ఈ సృష్టి లీలే అర్థవిహీనం, వ్యర్థం." అని [పురూరవ-పుట 61] ఆధ్యాత్మిక శక్తి అంటే మహోన్నతమైన శృంగార విలాసమని చలం అభిప్రాయం.

ఈ నాటకంలో పురూరవ చక్రవర్తి వీరుడు, కీర్తి కలవాడు, మహా సుందరుడు, అన్ని శాస్త్రాలు, కళల్లోనూ ప్రవీణుడు. ఊర్వశి తన గురించి తెలుసుకుని అతని కోసం అన్వేషిస్తూ వుంది. శాపవశాత్తూ యీ లోకానికి వచ్చి అతన్ని కలుసుకోగలుగుతుంది మానవత్వంలోని ప్రతి అల్పమైన గుణాలూ అతనిలో వున్నాయి. ఆమెకు వాటిపై కసికలిగినప్పటికీ జాలిపడి దయతో అతన్ని అనలయిన ప్రేమను తెలుసుకునేట్లు చేయడానికి యత్నిస్తుంది. ఆమె వలన పురూరవుడు చాలా ఎదిగినాడు, ఎంత ఎదిగినా అతనికి పూర్ణత్వం రాలేదు. అతనిలో ప్రేమకన్నా మహాకామ మనఃక్షోభోద్వేలం ప్రాముఖ్యం వహించినట్లు కనిపించడంతో

పురూరవుడ్ని ఊర్వశి వదిలి వేస్తుంది. ఇదీ కథ. ఇందులో పురూరవుని ఎదుగుదలకు ఊర్వశి అనుభవరూపంలో యత్నించడం వలన చలం దీనికి 'పురూరవ' అనే పేరు పెట్టాడు. అహంభావాదుల్ని త్యజిస్తేనే గాని పవిత్రమైన ప్రేమ రాదు. అందుకే ఊర్వశి అంటుంది— "ఆ బట్టలతో, హారాలతో నీ అహంకారాన్ని కూడా అక్కడే వదిలిరా" అని. మరొక చోట, "నీ మీద కాదు, నీ మీద గొప్ప ప్రేమ. నా కసి నీ అల్పత్వం మీద, అంధత్వం మీద" అంటుంది.

"ఈ అల్పత్వం, అంధత్వం అనేవి మానవునిలోకి ఎలా వచ్చాయంటే కృత్రిమమైన నాగరకతకు, దురభిమానాలకు, డాబులకు, దర్పాలకు లోబడడం వల్లనే" అనేది సూక్ష్మమైన సమాధానం. "అహం నశించి అభిమానం దగ్ధమైపోయే వరకు మనిషి ఏర్పరచుకున్న ఈ సంకుచితమైన పరిధులు అలానే వుంటాయి. ప్రేమ స్వచ్ఛంగా వికసించాలంటే యివన్నీ కరిగి లేకుండా పోవాలి." ఊర్వశి పురూరవుడ్ని అడుగుతుంది- "స్త్రీ సౌందర్యం ఎందుకు సృష్టింపబడ్డదనుకున్నావు? పురుషుడ్ని కాల్చి, మెరవంచి కళ్ళు తెరవడానికి, అతని ఆత్మని అతనికి చూపడానికి. తక్కిన ఆలింగనాలన్నీ సృష్టి జరగడానికి. రాజవర్మం వేరు, ప్రేమదీక్ష పరుడైన పురూరవుడి ధర్మం వేరు" అని ఊర్వశి కనువిప్పు కలిగిస్తుంది.

చలం 'పురూరవ' నాటకంలో నాయికా నాయకులిద్దరికీ నగ్నత్వం ప్రతిపాదించాడు. అంటే ఆడంబరాన్నీ, అసమానత్వాన్నీ, అందాన్నీ, అయిశ్వర్య విభవాన్ని వొదలడమే నగ్నత్వం పొందడమన్న మాట.

ఊర్వశి దేవత కదా! అంటే తేజోరూపం. తేజోరూపంలో వుండే ఊర్వశికి శారీరకమైన అనుభవం వుండడానికి వీల్లేదు. అయితే ఊర్వశి పురూరవుడికి మానవరూపంలో లభ్యమైంది తేజోరూపమైన ఊర్వశికి అనుభవానురూపం కల్పితమైంది. ఈ ప్రతీకఊర్వశి నాటకాన్నంతా ఆవరించింది.

"ఊర్వశి అంటే ఒక అనుభవం-శరీరం కాదు" అని ఊర్వశే అంటుంది. పురూరవుడు మానవలోకంలో వున్నాడు కాబట్టి అతని కోసం శారీరకరూపం కల్పించాల్సి వచ్చింది. ఆ తేజస్సు అలా వదిలిందన్న మాట! ఊర్వశికి పురూరవుని మీద ప్రేమ కలిగింది. ఇంతలో శాపం వచ్చింది. ఆ శాపం పురూరవ సమాగమహేతువయింది. అంటే ఆమె ప్రేమ, దాని వికాసానికిగాను శాపం వుపయోగపడింది అని అర్థం. శాపాంతమందు తనకి పిలుపు వచ్చినపుడు తప్పకుండా

వెళ్ళవలసి వుంటుందని ఊర్వశి పదేపదే గుర్తుచేస్తూ వుంటుంది. అంటే పురూర వుడు ఆమెనీ, ప్రేమనీ అంతఃప్రేరణవల్ల ధిక్కరించినపుడు అదే ఆమెకి పిలుపు, అతన్ని విడవడానికి హేతువు. అతనికి పరిపక్వత రానపుడు అతను ఊర్వశి ప్రేమను పూరణంగా యిముడ్చుకునే స్థితికి రాలేనప్పుడు ఆమె అతడ్ని విడిచింది. ప్రేమ అనేది దీక్ష. దీక్షా భంగంవల్ల అనుభవించే ఫలితం శిక్ష అనిపించుకోదు.

చలం ఈ నాటకంలో తను ఆదర్శస్త్రీ కోసం పడిన తాపత్రయాన్ని కూడా పురూరవుని ద్వారా వ్యంగ్యంగా ధ్వనింప చేస్తున్నాడేమోననిపిస్తుంది. ఎందుచేత నంటే తను ఆదర్శ పురుషుడైతే కాని ఆదర్శస్త్రీ లభించదు కనుక వున్నతా వరణల్లో పురూరవుడ్ని అందుకే ప్రేమలో పరిపూర్ణత్వం సిద్ధించడం కోసం యోగ్యతను పొందేవరకు అతడిని దీక్షాభంగానికి ఊర్వశి వదిలేసి వెళ్ళిపోయింది. చలం కూడా ఆదర్శ ప్రేమకు అర్హుడు కాకపోవడం వలన ఆదర్శప్రేయసి అత నికి జీవితాంతమూ దొరకలేదు.

## భగవద్గీత వ్యాఖ్యాతగా చలం

'గీతాంజలి'ని తెలుగు చేయటం ఒక గొప్ప పని అయితే, భగవద్గీతకు చలం వ్యాఖ్యానం రాయడం అంతకంటె విశేషమైన సంగతి. ఈ భగవద్గీత వ్యాఖ్యానం చదివినవారికి చలం ఎంత లోతుగా, నిశితంగా, పారదర్శకంగా చూడగలడో, ఎలా శాస్త్రీయదృష్టినికూడా అధిగమించి హైలెవెల్స్‌లోకివెళ్ళి మాట్లాడగలడోతల్చుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. 'విచారణ' అని యింకా యితర శీర్షికలతో చలం రాసిన భగవ ద్గీతకు వుపోద్ఘాత ప్రాయమైన వ్యాసంలో ఈశ్వరుని గురించీ, సృష్టి యెట్లా జరిగిందీ అనే విషయమై, యీ సృష్టికి, ఈశ్వరునికి గల సంబంధం, ప్రకృతిలోని గుణాలు, వాటి వికారాలు, ఆత్మ, దాని స్వభావం గురించి వివరించడం జరిగింది. భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ చేసిన బోధ అంతా సంశయరహితమైన విశ్వాసంతో జీవితాన్ని పూర్తిగా ఈశ్వరార్పణ చేసుకునేవారికే సహాయకారి. మిగతా వారికిది వుపన్యాసా లివ్వడానికే పనికి వస్తుందట. ఈ భగవద్గీత బోధనలో సాధారణ మానవధర్మాలు, సాంఘిక పద్ధతులు, నైతిక నియమాలు- వీటి సంగతి గీతాకారుడు ఎత్తుకోడు. అందుచేత వీటిలోంచి భగవద్గీతను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించకూడదు. యోగ శాస్త్రాలలో గురువు చెప్పినట్లు చెయ్యాలి. వారి బోధనలను బట్టి సాధన చెయ్యవలసిందేకానీ మరొక మార్గం లేదు. నీతిగా, ధర్మంగా ప్రవర్తిస్తే

వాంఛలు తగ్గుతాయి. వాంఛలకు లొంగామా అవి అధర్మానికీ, అవినీతికీ దారి. కామాన్ని జయించాలి. వాంఛాబలం తగ్గితే కాని మనసు శాంతించదు. మనస్సు శాంతిస్తేనే కానీ భగవద్గీతలో బోధించే యే సాధనా సాధ్యం కాదు సాధనల ద్వారా నిష్కల్మషమైన మనస్సు ఆత్మని అందుకున్నపుడు దానికి సుఖం, నిర్వాణం, అనిర్వచనీయానందం కలుగుతాయట. అదే ఈశ్వరుడు. అదే ఆత్మ. అదే సాయుజ్యం, అదే ఆత్మసాక్షాత్కారం, మోక్షం.

భగవంతుడైన శ్రీకృష్ణునిలోంచి యీ చరాచర ప్రపంచం సృష్టి పొందింది, పరమాత్మనించి యీ చరాచర ప్రపంచం సృష్టి అంతా భిన్నమైనది అని అనుకొంటున్నాడు మానవుడు. ఆ కారణం చేత పరమాత్మ, జీవాత్మ అని ద్వంద్వం ఏర్పడుతోంది. పరమాత్మ కల్పించిన మాయనుంచీ మేలుకుని పరమాత్మను జీవాత్మ తిరిగి చేరుకునే మార్గాన్ని భగవద్గీత బోధిస్తోంది. ఆ విధంగా అది ద్వైత గ్రంథం. మళ్ళీ యీ ద్వైతం వెనక అద్వైతం స్ఫురిస్తోనే వుంటుంది. జీవాత్మ పరమాత్మ నించి వేరయినట్టు భక్తుడు తనకు తాను భావించుకుంటున్నాడు గానీ అది వేరు కాదు, వుత్త భ్రమే. భగవద్గీత అన్ని రకాల వేదాంతాలకీ ఆస్కారమైంది. పరస్పర వైరుధ్యం లేకుండ అన్నిటినీ సమన్వయిస్తోంది. ఆధ్యాత్మికాన్వేషకుడయిన మానవునికి స్థూలంగా కనపడే యీ చరాచరాల్లో ఈశ్వరుడ్ని చూడాలంటే ఎక్కడెక్కడ సులభమో వరసగా చెప్పాడు:

"రూపాల వెనక నేను. రూపంలో నేను. అసలా రూపమూ నేనే. అనుభవించేది నేను అనుభవం నేను. ఆ అనుభవాన్ని కల్పించే ఆధారమూ నేనే." శ్రీ కృష్ణుడు తాను మానవుని లెవెల్‌కి దిగి ఆ మానవుని దృష్టిని ఆధారం చేసుకుని మనిషికి వున్న స్వల్ప జ్ఞానం ద్వారా అనంతత్వాన్ని అతనికి అర్థం చెయ్యాలని యత్నిస్తున్నాడు, విభక్తుడయిన ఈశ్వరుడు సృష్టిలో విభజన పొందాడు కాదు విభజన పొందినట్టు కనపడతాడు. సర్వభూతాలూ ఆయనలో వున్నాయి. ఆయన సృష్టినంతా ఆవరించి వున్నాడు.

'ఈశ్వరుడు, మానవుడు' అనే ప్రకరణంలో చలం ఎంత బాగా చెప్పాడో చూడండి: "సూర్యుడు గాజుపెంకుల్లో నీటికణాల్లో సముద్రతరంగాల్లో, చెట్ల ఆకులపై, ప్రతిఫలించినట్టు, చిన్మయుడయిన పరబ్రహ్మ తాను అసంఖ్యాకమైన "నేను"లుగా వెలిగి వాటిలో క్షణభంగురమైన వ్యక్తిత్వాన్ని కల్పించి తన వెలుగుతోనే తానాడుకుంటున్నాడు."

భగవద్గీత గురించి చలం యిలా అంటాడు: "ఎవడైనా, ఏ మతస్థుడైనా, మతం లేనివాడైనా, ఏ స్థితిలోనన్నా, ఏ పరిస్థితిలోనన్నా, "ఇప్పుడు నా ధర్మమేమిటి? నా కర్తవ్యమేమిటి?" అని సందేహంలో పడి ఉత్తమమైన, వాస్తవమైన సందేహనివృత్తికై వెతికితే, అతనికి భగవద్గీతలో సహేతుకమైన ప్రత్యుత్తరం దొరుకుతుంది."

"మనిషికి ఏ జ్ఞానం కలగాలన్నా అతని మనసు ద్వారానే కలగాలి. తాను కల్పించుకునే దేశకాల హద్దుల్ని దాటి దేన్నీ తెలుసుకోలేదు ఆ మనసు. అంతకు మించిన ఏ సత్యాన్ని విన్నా అది అర్థం కాక దాన్ని తన పరిమితిలోనే అర్థం చేసుకో చూస్తుంది. అందువల్లనే ఏ శాస్త్ర విజ్ఞానమూ అసలు సత్యం వేపు ఒక్క అడుగు నడవ లేకపోతోంది. ఎందుకంటె, ఎంతదూరం పోయినా మనసునే ఆధారం చేసుకుంటోంది కనక."

మనసు ద్వంద్వాలపైన తప్ప పనిచెయ్యలేదు కనక అది సంపాయించే జ్ఞానం ఎప్పుడూ రెలెటివ్.

ఈశ్వరుడే అంతిమసత్యం. అన్ని సమస్యలకీ స్వేచ్ఛాసూత్రం. ఆ ఈశ్వరుడు తెలియాలంటే మానసిక తర్కాన్ని త్యజించి పరమేశ్వరుడి బోధలో విశ్వసించాలి.

శ్రీకృష్ణుడు అర్జునుడికి బోధించిన వేదాంతాన్ని టూకీగా చలం యిలా చెప్తాడు- "అందరూ చచ్చిం తరవాత ఏం రాజ్యం? అంటాడు అర్జునుడు. కాని మమతలు కాలిపోయిం తరవాత కలిగే శాంతీ-వెలుగుల ముందు తాత్కాలిక రాజ్యసుఖం ఏ పాటిది అంటున్నాడు శ్రీకృష్ణుడు.

వేదాంతపరంగా, శాస్త్రపరంగా, నీతిపరంగా, బుద్ధిపరంగా, ఆశపరంగా, అవమానభీతిపరంగా, అర్జునుడి ధర్మమేదో అన్ని Planes లోనూ తెలిపి అతనికి జ్ఞానమిచ్చాడు.

ఈ ధర్మమనే దానికి ఎన్నో మెట్లు. అర్జునుడు ఒక అంతస్తులో దుఃఖిస్తున్నాడు. శ్రీ కృష్ణుడు ఇంకో అంతస్తులో బోధిస్తున్నాడు.

తన అంతస్తులో చూడగల దృష్టినివ్వగల సమర్థుడు గనకనే శ్రీకృష్ణుడికి ఆ మాటలు బోధించగల అధికారం వుంది. జన్మమృత్యు సుఖదుఃఖ ద్వంద్వాలు

దాటిన జ్ఞాని నోటినించి కాకపోతే, ఆ మాటలు పుత్త శుష్క వేదాంత శబ్దాలే అయ్యేవి.

శత్రువుల్ని చీల్చిచంపాలి అనేది మామూలు మెట్టు.

చంపడం పాపం అనేది దానిపై మెట్టు.

వాళ్ళపై కరుణచూపు అనేది అంతకన్న ఉన్నతం.

నీ శత్రువుల్ని ప్రేమించు అనేది గొప్ప అంతస్తు.

సర్వభూతాల్నీ నిన్నుగా చూసుకో అనేది దానిపైది.

జీవితం అనంతం. పుటకలేదు. చావులేదు చంపాల్సివొస్తే చంపు అనేది ఒక పై మెట్టు.

ఫలాపేక్ష, మమతలూ లేకండా ఇష్టానిష్టాలకి సముడివై. నీ కర్తవ్యానికి పూనుకో-అనే వేదాంతబోధ చాలా ఉన్నతమైనది.

దాన్ని మించిన చివరిమెట్టు-

"తటస్థుడివై - సాక్షివై నించో. ఏం జరగాలో అది జరుగుతుంది" అనేది.

"ఎవడైనా సరే, తండ్రిగాని. తాతగాని. శత్రువుని చంపు! అది నీ క్షత్రియ ధర్మం"అనే మొదటిమెట్టు నించి తనంతటతానే అదివరలానే కదిలాడు అర్జునుడు.

"చావు లేదు, పుటకలేదు" అనే జ్ఞానానికి సన్నద్ధుణ్ణి చేసి. ఫలాపేక్ష లేకండా కర్మ చెయ్యి. అనే చివరి మెట్టుకి ఎత్తేశాడు తన సఖుణ్ణి శ్రీ కృష్ణుడు.

మొదటి అంతస్తులోనూ, చివరి అంతస్తులోనూ జరిగేవని ఒకటే, 'శత్రువుల్ని చంపడం'. కాని ఉద్దేశ్యంలోనూ, పర్యవసానాల్లోనూ, భూమికీ, ఆకాశానికీ ఉన్నంత భేదం వుంది ఆ రెంటికీ"

## ఎవరని తెలిపేది ?

చలం ఎవరు అనేది నేనెవరు అనే ప్రశ్న అంత జటిలం. బాల్యంలో చలం వేరు. బ్రహ్మసమాజంలో తిరిగిన చలం వేరు. చిత్రాంగి, పురూరవ. జయదేవ. హరిశ్చంద్ర రాసిన చలం వేరు. మైదానం, బ్రాహ్మణీకం, హంపీకన్యలు– యిత్యాది నవలలూ, కథలూ రాసి ఆంధ్రదేశాన్ని మంచికో, చెడుకో, అటూ యిటూ

తీవ్రంగా చూపించి సంచలనాలు రేపిన చలం వేరు. అయినప్పటికీ అతని జీవితం, అతని సాహిత్యం, అతని ఆలోచనలు, అతని ప్రణయతత్త్వం, అతని స్త్రీ వ్యామోహం, అతని ఆదర్శాలు, అతని విసుగు, అతని కోపం, అతని నిరాశ, అతని నిస్పృహ, అతని ఆనందం, అతని విషాదం అన్నీ కూడా నలుగురితో పంచుకుని జీవించాడు. చలం నైతికంలోనూ, ఆధ్యాత్మికంలోనూ కూడా తీవ్రవాదే. మహాప్రస్థానానికి పీఠిక రాసిన చలానికీ, భగవద్గీతకు వ్యాఖ్యానం రాసిన చలానికి తేడా లేదనుకోవటం వెర్రితనం. కొన్ని నియమాలకీ, కొన్ని సూత్రాలకీ, కొన్ని పడికట్టు రాళ్ళకీ, కొన్ని ప్రమాణాలకీ నిలవలేక పోయినంత మాత్రాన అతను అనార్కిస్ట్ కాడు. ఉంటే అనార్కిజమ్ యీ వ్యవస్థలోనే వుంది. చలం వున్నతమైన స్వేచ్ఛకోసం కలలుకని, తపించి, బాధ పడినవాడు. ఆధ్యాత్మికంలోకి ఎదిగాక తను రాసినదంతా తను చేసినదంతా చీకటి సముద్రంలోకి వెలిగించిన కాగడాల్ని విసిరేయడంతో పోల్చినవాడు. ఎవరికీ ఏమీకాని చలం తన జీవితంతో, తన సాహిత్యంతో అందరికీ తానే అయి వటవృక్షంలా నిలబడాలనుకున్నాడు.

ఇప్పుడు చలం ఎవరంటే నండూరి సుబ్బారావుగారు అన్నట్లు—

"వెలుగునీడల వైపు వేలు చూపింతు."

విజయవాడ-10<br>22—9. 1992

పురాణం సుబ్రహ్మణ్యశర్మ




చలం జీవిత కాలక్రమం-స్థలాభోగం

1894 జననం-మద్రాసు

1910 తెనాలి_S. S. L. C.

1911 కాకినాడ.

1919 L. T. రాజమండ్రి

1921 హోస్పేట

1924 బందరు, అనంతపురం

1927_28 ఏలూరు, గుంటూరు

1930 నర్సరావుపేట

1931 బెజవాడ

1934 సేతువు, రామేశ్వరం

1935 కనిగిరి

1936 నెల్లూరు, తొలి అరుణాచలం యాత్ర

1937 విశాఖపట్నం

1938 గుడివాడ

1940 భీమునిపట్నం

1945 ఏలూరు

1947 బెజవాడ, వసంత్ పలాయనం (1940_47 లీలగారితో)

1948 ఉద్యోగం మానివేయడం
డాక్టర్ రంగనాయకమ్మ మరణం (12_10_1948)

1950 అరుణాచలం

1951 మద్రాసు, మళ్ళీ అరుణాచలం

1974 చలానికి పక్షవాతం

1979 చలం తనువు చాలింపు

## చలం భార్య రంగనాయకమ్మ

1932 విజయవాడ మునిసిపల్ కవున్సిలర్  
1944 జిల్లా బోర్డు మెంబరు  
1945 రమణాశ్రమం చేరినది.



# అనుబంధం - చలం పీఠికలు

## చలం 'చంద్రవంక'కి రాసిన ముందు మాట.

'చంద్రవంక' రాయగలిగిన కవే

గీతాంజలిని పాడగలడు. పసిపిల్లల కలల్ని కాయితం మీదికి తీసుకు రావడం కన్న, ఈశ్వరుడి చేలాంచలాన్ని తాకి ఉన్మత్తుడు కావడం సులభం. ఎందుకంటే పిల్లల హృదయాలలో ఈశ్వరుడు ఏ మాయ పొరలూ కప్పుకోకండా వెలుగుతో వుంటాడు.

కదిలే ఆకుల్ని, పాకే చీమని, పరుగెత్తే దూడనీ, ఎగిరే పిచికని, కళ్ళప్పి చూస్తో ఆశ్చర్యంతో మైమరచిన మనం, రాళ్ళూ, పువ్వులూ, ఎండుటాకులూ, మట్టి ముద్దలూ, ఓనాడు మన కలలకి నిమిత్త మాత్రమైన ఆధారంగా చేసుకున్న మనం ఈనాడు బతికున్న బొమ్మలతో, డబ్బు కాగితాలతో, కనపడని కీర్తిగాలితో, ఆ పోని ఆశామంటలతో ఆడుకుంటున్నామని తెలీని మనం, చిన్న పిల్లల ఆటల్నిచూసి అర్థం లేనివని నవ్వుతున్నామని మనని చూసి నవ్వుతున్నాడు కవి.

పాతపడి మామూలు కావడం చేతనే ఈ లోకం ఇంత సారవిహీనంగా కని పిస్తోంది. అందుకనే చెత్త కోర్కెల్ని కల్పించుకుని ఎండమావుల వెంట పరుగెత్తే మృగాల వలె ఇట్లా రొప్పుతో బతకడం; మిణుగురు పురుగు ఓ నిమిషం కన్న మన చూపుని ఆపదు. పెద్దయ్యాక ఎన్నో అగచాట్లు పడి సంపాయించిన డబ్బుతో చిచ్చుబుడ్లని కొని వెలిగిస్తేనే గాని కళ్ళకి తృప్తి లేదు. ఇంతాచేసి చిన్న పాప

మైమరచి మిణుకుమనే ఆ నీలం వెలుతుర్ని చూసినట్టు చూడగలరా, విలువయిన బాణసంచాల రంగుల జ్వాలల్ని!

చిన్నప్పటి ఆనంతత్వం జ్ఞాపకం చేసినా తిరిగి దూరంగా కూడా యోచించు కోలేరు పెద్దలు.

చిన్నతనపు కలల్లో జీవించ గలిగాడు కనకనే చిన్న పిల్లల కళ్ళతో లోకాన్ని చూడ గలిగాడు కనకనే, లోకం వెనక క్రీడించే ఈశ్వరుడు దర్శనమిచ్చాడు ఈ కవికి. ఆ ప్రత్యక్షానుభవాన్నే అమరగానం చేశాడు రవీంద్రనాథ్.

ప్రతి నిమిషం పిల్లల్ని పలకరించే సౌందర్యదేవత తన మేలు ముసుగుని తొలగించి తన నేత్రాలలోని అమరత్వాన్ని ప్రదర్శించింది ఈ కవికి.

"పాప తిరిగే లోకంలో నక్షత్రాలు అతనితో మాట్లాడతాయి పాపని ఉల్లాస పరచాలని ఆకాశం పిచ్చి పిచ్చి మబ్బులతో, రంగుల ధనుస్సులతో అతని ముఖంకేసి వొంగి చూస్తుంది."

ఆ సంగతి పాపకి తెలుసు, కవికి తెలుసు, మనకి తెలీదు, చెప్పినా తెలీదు.

మానవుణ్ణి అతని ఆకల్ని, ఆశల్ని, అవసరాల్ని ఓ పెనుభూతం చేసి అన్ని అందాల్నీ, ఆశయాల్నీ, కలల్నీ, కవిత్వాల్నీ, హృదయాల్నీ, మృదుభావాల్నీ ఆ మహాకాళీ పీఠం ముందు బలియిస్తున్న ఈ రోజుల్లో—

పువ్వుల్ని కొయ్యవద్దు.

పిల్లల్ని నలప వద్దు అంటే వింటారా?

పిసికి, కసిరి, నలిపి, కొట్టి ఏడిపిస్తేనే గాని నా ముద్దు తీరదండీ— అని గొప్పగా చెప్పుకొనే పురుషుల ముందు ఈ దెయ్యం వకటి దాపరించింది దేనికీ అడ్డుగా- అని ఈసడించుకునే తల్లుల ముందు- ఎందుకొచ్చానిక్కడికి? అని తెల్ల బోయి చూస్తోంది పాప!

కీర్తులకీ, దేశాలకీ, యంత్రాలకి, ఉత్పత్తులకి,రాజకీయాలకీ, మానవత్వాలకీ మానవుడ్ని మానవుడు తొక్కి నడిచే ఈ కాలంలో పిల్లల్ని భావిపౌరులుగా విజయా వేశ దురంధరులుగా ప్రోత్సహించి విద్యావధ్య స్థలానికి తోలే ఈ కాలంలో

"దుమ్మని తృణీకరించి బంగారం కోసం దేవుళ్ళాడడం ఇతనింకా నేర్చుకోలేదు.

నీ హృదయానికి చేర్చుకునే ఇతన్ని దీవించు. ఎందుకొచ్చాడో ఏరుకున్ని నీ ద్వారం దగ్గరికి వొచ్చాడు. నీ చేతిని పట్టుకుని తోవచూపమంటున్నాడు. ఏ అనుమానమూ మనసులో లేకుండా నవ్వుతో పలుకుతో నీ వెంట నడుస్తాడు. అతని విశ్వాసాన్ని నిలుపుతో."

అని దీనంగా అనే కవి అర్ధన వృత్త అరణ్యరోదనమయింది.

అరుణాచలం

—చలం.

27-7-61

[రవీంద్రనాథ్ టాగూర్ 'క్రెసెంట్ మూన్'కి చలం అనువాదం, సౌరిస్ సహకారంతో కురంగేశ్వరరావు ప్రచురణ, 1961]

## చలం పీఠికలు

## శుభవార్తలు !

ఇది 1951 నాటి కథ

ఈశ్వరుడు సౌరిస్‌కి ప్రత్యక్షమైన కొద్ది రోజులకే మానవతిగారికి రాయమన్నారు 'ఓ బైబిలు పంపమని'. ఆమెకీ బైబిలుకీ ఏం సంబంధం? ఇదేమిటి? నేనెందుకు బైబిల్ పంపడం? నాకెక్కడ దొరుకుతుంది? అనుకోదా ఆమె? అన్నాను. కాని ఈశ్వరుడు, "నీ కెందుకు రాయి" అన్నారు. ఆమె మాట్లాడకుండా వెళ్ళి కనుక్కున్నారు. ఆ రోజునే అమెరికా నించి వొచ్చి వున్నాయి విలువయిన బైబిళ్ళు. ఆమె రెండు పుస్తకాల్ని కొని పంపారు.

తరువాత త్వరలోనే మానవతిగారూ, చిన్నారావుగారూ ఇక్కడికి వచ్చినప్పుడు వాళ్ళకి చెప్పమన్నారు వాళ్ళకీ బైబిలుకీ సనాతనంగా ఏర్పడ్డ సంబంధం. కాని ఆ మాటలు వాళ్ళు నమ్మినట్టు లేరు. నన్ను వాళ్ళకి సువార్తలు చదివి తెలుగులో

చెప్పమన్నారు. వాళ్ళెందుకు ఆ సువార్తలు తెలుసుకోవాలో, దాంట్లో అంతర్య మేమిటో చెప్పడమేకాక ఏసు బోధించిన స్వర్గమార్గం ముందు కాలంలో ఎట్లా ప్రాముఖ్యతలోకి రాబోతోందో స్పష్టం చేశారు.

కొన్ని నెలలు తరువాత ఏవేవో సంగతులు చెప్తూ అన్నారు, 'నువ్వు బైబిల్ని తెలుగు చెయ్యబోతున్నావు' అని. ఎక్కడ బైబిల్? దాన్ని తెలుగు చెయ్యడమంటే సామాన్యమా? కనీసం పదేళ్ళు పడుతుంది.అనేక భాగాలకి అసలు అర్థమేమిటో తెలీదు. అంతపని చెయ్యడానికి నాలో వోపికా, ఆయుస్సూ మిగిలి వున్నాయా ? అనుకున్నాను. కాని "ఈశ్వరుడికి అసాధ్యమయింది ఏముంది ?" అనే ఏసు ప్రవచనమే దానికి జవాబు అయింది.

1959 నేను తెలుగుచేస్తున్న టాగూరు క్రెసెంట్ పూర్తి అవుతుందో లేదో "ఏసు సువార్తల్ని తెలుగు చెయ్యి" అని ఆజ్ఞాపించారు ఈశ్వరుడు. నేనెట్లా చెయ్యగలను? ఏం చెయ్యగలను? నాకేం తెలుసు? లోకంలో ఇంతవరకు వెలువడ్డ పుస్తకాలన్నిటిలోకీ బైబిలు (ముఖ్యం సువార్తలు) పైన ఎక్కువ వ్యాఖ్యానాలు వొచ్చాయి. దాదాపు ఈ రెండువేల ఏళ్ళలో యూరపులోని గొప్ప మేధావులందరూ అర్థాలు వెతికి రాసికూడా, ఇదమిత్థమని తేల్చలేక పోయినారు, సువార్తల్లో కొన్ని భాగాల్ని. అట్లాంటప్పుడు ఏ క్రైస్తవ విజ్ఞానంలేని నన్ను తెలుగు చెయ్యమంటు న్నారు ఆ పుస్తకాల్ని. అన్నిటికీ ఈశ్వరుడున్నాడు. ఈశ్వరాజ్ఞ. ఈశ్వరహస్తం నా వెన్ను పైన ఈశ్వరవాక్కు నా కలంలో వున్నదనే విశ్వాసంతో సాహసించి ప్రారంభించాను. కొంచెం దూరం వెళ్ళి చూసుకుంటే ఏసు సువార్తల్లో అంత వరకు వుత్త నాన్‌సెన్సు అనుకున్న వాక్యాలు జ్ఞాన వాక్కులుగా, చిన్న పిల్లల కథలనుకున్నవి ఆధ్యాత్మిక సత్యాలుగా, అర్థంకావనుకున్న ఘట్టాలు సులభ బోధ కంగా కనవడ్డాయి. ఈశ్వరుడు బైబిల్ శుభ వార్తలపైన స్పష్టంగా కాంతిని పడేస్తున్నారు. అప్పటికీ చాలాచోట్ల ముఖాముఖిని ఈశ్వరుణ్ణి ప్రశ్నించాల్సి వచ్చేది. ఆయన వ్యాఖ్యానించినా అర్థంకావడం కష్టమైన బోధలు లేకపోలేదు. ఈశ్వరుడు చెప్పిన వ్యాఖ్య అర్థంకాక (ప్రస్తుతానికి ఇంతేనని) ఆయన మాటలు మాత్రంరాసేసి వూరుకున్న చోట్లూ వున్నాయి.

కాని నాకు ఈనాడు ఏసు బోధల్ని, ఎవరూ చెప్పకుండానే సునాయాసంగా అర్థం చేశారంటే—

1951 అగస్టు 15వ తేదీన సౌరిస్‌కి ఈశ్వర దర్శనమయింది. అప్పటి నుంచి ఈశ్వరుడు మాతో వుండి మాట్లాడుతోనే వున్నారు.

ఆ నాటికి స్పష్టంగా నా మనసుకి కొంత తెలిసీ, చాలా వరకు నాకు తెలీకా భగవాన్ నన్ను తీసుకుని పదిహేనేళ్ళైనా, అన్నీ వొదిలి భగవాన్ అనుగ్రహం కోసం వచ్చి ఏడాది దాటినా నాకు మతంలోగాని, దైవంలోగాని మరణాంతర జీవితంలో కాని, పరలోకాలలోగాని, మనుష్యులు నిర్ణయించే మామూలు పాప పుణ్యాలలోగాని నమ్మకం లేదు. అవన్నీ మనసుకి అందని సంగతులు కనుక ఎవరికీ ఎన్నటికీ తెలీవు. అసలవి నిజమో, అబద్ధమో, వాటిలో ఏది నిజమో, ఏది అబద్ధమో తెలుసుకోడం అసాధ్యం అని ఎన్నడో తీర్మానించుకున్నాను. నేను చిన్నతనంలో ఏసుబోధల విషయం అనుకున్నట్టే, భగవాన్ బోధల విషయమూ అనుకున్నాను. ఆనాటి యూదులు మతాన్ని ఆధారం చేసుకుని ఏసు బోధించినట్లే, ఈనాటి హిందూమతాన్ని ఆధారంగా తీసుకుని భగవాన్ మాట్లాడారు ప్రజలకి సుబోధకమయ్యేందుకు. అంతేకాని మత విషయమై వారిద్దరూ, వారిని బోలిన ప్రవక్తలూ చెప్పే మాటలన్నీ సత్యమనికాదు. ఆ మాటలు సత్యమన్నామా, ఆ ఇద్దరి అభిప్రాయాలే ఒకదాంతో ఇంకోటి విరోధిస్తాయి. అవతారాలూ, జ్ఞానులూ, సత్యస్వరూపులూ అనబడే వారి మాటలు పైకి చూడ్డానికి ఇట్లా పరస్పర విరుద్ధాలు కావడంచేతనే, అంతకన్న లోతుగా చూడలేని మేధావంతులకి ఏదీ విశ్వసనీయంగా తోచక, వారికి మతంలోనే విశ్వాసంపోయింది. మతంపట్ల ప్రజలలో సన్నగిల డానికి ఇది ముఖ్యమైన కారణం.

ఏసు ప్రత్యేక దైవత్వంలో నాకానాడు ఏ మాత్రం నమ్మకమున్నా, లేక పోయినా, ఆయన్ని మూఢుడనో, వంచకుడనో, ఏనాడూ అనలేదు. భగవాన్ నా గురువు. అందుకని ఏసు స్వర్గంలోని నా తండ్రి అన్నా, భగవాన్ నా తండ్రి అరుణాచలేశ్వరుడన్నా, భగవాన్ పునర్జన్మ అన్నా, ఏసు రిసరెక్షన్ అన్నా, భగవాన్ వేదాలన్నా, ఏసు శాస్త్రిలన్నా— ఇవన్నీ ఆయా మతస్థులైన శిష్యులకు, అర్థం అవ్వడానికి ఉపయోగించిన పింబల్సు (Symbols) అనుకున్నాను. కాని మతంలో, కాలంలో, ఆచారాల్లో, సంస్కారాల్లో ఎంతో భేదించే ఆ ఇద్దరు ఈశ్వర పుత్రులు దైవం, హృదయం, కర్మ, ముక్తి, గురువు, విశ్వాసం, భక్తి- ఇంకా ఇట్లాంటి వాటిల్లో ఎన్నిట్లో ఏక కంఠంతో మాట్లాడారో గుర్తించలేదు నేను.

ఈశ్వరుడిచ్చిన దృష్టితో సువార్తల్ని స్టడీ చేసిం తరువాతకాని. సౌరిస్ తనకి ఈశ్వరుడు ప్రత్యక్షమైనారన్నప్పుడు 'ఈశ్వరుడున్నారని నమ్మాలంటే నాకు చాల అభ్యంతరాలున్నాయి. వాటిని తీరిస్తే తప్ప నేను విశ్వసించలే'నన్నాను. ఆ సందేహాల్ని ఎట్లా తీర్చి నాకు స్పష్టం చేశారో అదంతా ఇక్కడ అప్రస్తుతం. ఆనాడు ఈశ్వరుడు చేసిన బోధనలో ఏసూ, శ్రీకృష్ణుడూ, భగవాన్— మొదలైన అవతారాల తత్వం ఒక ముఖ్యభాగం. నా ప్రశ్నలకు జవాబులుగా నైతేనేం, నాపైన వాత్సల్యం మూలాన అయితేనేం 'ఇది నా ధర్మం కనుక నీకు తెలుపుతున్నాను' అనే వాక్యం ద్వారా నైతేనేం, జగత్, సృష్టి, అవతారాలూ, ప్రళయాలూ, భిన్న మతాలూ, వేదాలూ, పురాణాలూ, వాటి రహస్యాలు మాట్లాడారు నాకు అర్థమయ్యేట్టు. అందువల్ల తెలుగు చెయ్యడానికని సువార్తలు చదువుతూవుంటే, ప్రతి అడుగునా ఈశ్వరుడిచ్చిన విజ్ఞానపు వెలుగు ఆ వాక్యాలపైన పడి 'ఇదా వీటి అర్థం?' అని నాకాశ్చర్యం కలిగింది. ఆ బోధవల్ల ఏసు కల్లా కపటంలేని అల్పజ్ఞుడైన వడ్రంగి సాధువుగాకాక జగదేక ప్రభువు కుమారుడుగా, స్వర్గానికి ద్వారంగా, ఈశ్వరలీలా విభూతిలో ఓ మహత్తర జ్యోతిగా తెలుసుకున్నాను. ఆయన ఎవరో, ఆయన claims అన్నీ ఎట్లా వాస్తవమో తెలిసింది నాకు.

ఏసు బోధని మామూలు అక్షరాల అర్థంలోకి తీసుకురావాలంటే కొన్ని చోట్ల ఆయన ఏం చెపుతున్నారో వ్యక్తం కాదు. అర్థమయిందనే వాళ్ళకీ ఎంత వరకు అర్థమయిందో అనుమానం. ఎందుకంటే సువార్తల్లోని మాటలు ఎంతో సులభముగా అర్థమైనట్లు కనపడ్డా అవి ఆకాశాన్నీ, భూమినీ ముడిపెట్టి మనసుకి ఎన్నటికీ అందుకోసాధ్యంకాని ఈశ్వరతత్వాన్ని తెలియ చెయ్యాలని ప్రయత్నిస్తాయి. వేదాంత రహస్యాలనేవాటిని సూత్రప్రాయంగా సామాన్య జనులముందు సులభంగా చెప్పేస్తారు. వాళ్ళకెట్లాగూ అర్థంకావని తెలిసికూడా. పురాతన గ్రంథాలతో అదే చిక్కు. ఏసు అసలు ఏభాషలో మాట్లాడారు? తెలుగులోకి వచ్చే ముందు ఎన్ని భాషాంతరాలైనాయి? ఆయన మాటల్ని ఎంతవరకు సరిగా రాయగలిగారు శిష్యులు? ముందు వాళ్ళకెంత వరకు అర్థమయింది? భాష నుంచి భాషకి మార్చేవారికి ఎంతవరకు తెలుసు?

చూస్తున్న కొద్దీ ఏమనిపిస్తుందంటే ప్రతి step లోనూ, ప్రతి భాషాంతరీకరణలోనూ ఈశ్వరశక్తి ఆ సామాన్య రచయిత మనసులో నిలచి పని చేసిందని

అంటే ఈ Translations చాలా వరకు Inspired అని, ఒక్క బైబిల్ విషయం లోనే కాదు అన్ని గొప్ప మతగ్రంథాలూ చాలా వరకు Inspired. ఆ రచయిత తన అహాన్ని ఎంత వరకు తీసేసుకుని ఈశ్వర వాక్ప్రవాహానికి తాను Pure channel అయినాడో అంత నిష్కళంకంగా పలుకుతుంది ఆకాశవాణి.

ఏసుబోధ చదువుతూవుంటే చెప్పిందే చెప్పడమేమిటి? అని విసుగు వొస్తుంది.

'మంచిచెట్టుకి పనికిరాని పళ్ళు పండవు. పనికిరానిచెట్టుకి మంచి పళ్ళు పండవు. పళ్ళవల్ల చెట్టుని తెలుసుకుంటారు.

ముళ్ళ చెట్టుని అంజూర పళ్ళు కోసుకోరు.

ముళ్ళ పొదకి ద్రాక్ష పళ్ళు పండవు.'

లూకా 6 : (43)

అని చెప్పి ఈ మాటలకి తిరిగ్గా అర్థం చెపుతారు ఏసు :

అంత వివరంగా చెప్పే ఆయన "Beware of the yeast of the pharasees" అనేస్తారు. "yet the dead bury the dead" అని సూత్రప్రాయంగా చెప్పి "చెవులున్న వాళ్ళని వినమనండి" అంటారు. He who saves his Life, loses it. అని paradoxical గా మాట్లాడి ఇంక ఒక్కమాట లేకుండా వూరు కుంటారు.

For every one shall be salted with fire అని mixed metaphors వాడతారు.

పూర్తిగా జ్ఞానాన్ని పొందిన వారి స్మృతి కాలానికీ, దేశానికీ అతీతం. వాళ్ళనే జ్ఞానులంటారు. వాళ్ళని శిష్యులడుగుతారు ఈ లోకానికీ అర్థం చెప్పమని, అసలు సత్యమేమిటని. అసలు సత్యం మానసాతీతం. మాటలతో వ్యక్తం కాదు. అర్థమెప్పుడూ సత్యంలో చాలా కొంచాన్ని మాత్రమే చెపుతుంది. కాని మాటలతో చెబితేనేకాని మనుషులకి అర్థం కాదు. అందుకని గురువు మనుషుల మానసిక పునాదులయిన ద్వంద్వాల్నీ, కాలాన్నీ, దూరాన్నీ మించి తప్ప మాట్లాడలేదు. అది Paradoxes మల్లే Nonsense మల్లే ధ్వనిస్తాయి. మాయా జ్ఞానంలో ఇరుక్కుని పని చేసే మనుషులకి మేధావంతులూ మనీషులూ ఆ జ్ఞాన వాక్కుల్ని అర్థం

లేని పిచ్చి వాగుడు క్రిందతోస్తారు. అప్రహస్వత్వం, అంధత్వం, తమ మనసుల్లో పల వుందని గుర్తించక.

గడిచిందీ, గడవబోయేదీ ఏసుకి ever-present, త్రికాలాలూ వర్తమాన మే ఆయనకి. ఆయన చెప్పేది జాగ్రత్తగా గమనించి సందర్భాను సారంగా తీసు కోకపోతే, వృత్త అలుకుడై పోతుంది. అట్లానే జీవితం, మృతి, ఈశ్వర రాజ్యం, స్వర్గం అనే మాటలకి మన అర్థాలువేరు. ఆయన అర్థం వేరు. ఆయన అర్థాలు మనకి గ్రాహ్యం కావు, మనమూ ఆయనంత వారమైతేనే కాని.

సువార్తలు అర్థం కావాలంటే ఇన్ని కష్టాన్నాయి,

## శుభవార్తలు !

పూర్వశాస్త్రిలు

ఏసు యూదుల్లో జన్మించాడు. ఈశ్వరుడు తమని ప్రత్యేకంగా, తనదిగా తీసుకున్న జాతి అని నమ్మేరు యూదులు-కొంతవరకు హిందువుల మల్లేనే.

వారి పురాతన చరిత్రే బైబులు గ్రంధం. అదే వారి శాస్త్రం.

పూర్వకాలంలో యూదుల్లో వరసగా ప్రవక్తలువొచ్చి, ఏసురాకను గురించి, ఆయన చరిత్రలోని విశేషాంశాలు ముందుగానే రాసిపెట్టి చెప్పి ఉంచారు. వాల్మీకి అట్లానే కదా రామాయణం రాసింది. ఏసు జీవితం తదనుగుణ్యంగానే జరిగింది. ఆ సంగతినే తిరిగి తిరిగి ఏసుగాని, ఏసు చరిత్రకారులు కాని ఆనాటి యూదులకి, ఈనాటి మనకి జ్ఞాపకానికి తెస్తూవుంటారు. హిందూ పురాణాలు, చదివిన వారికిది కొత్తకాదు.

## విశ్వకవి రవీంద్రుల గీతాంజలి పీఠిక

గీతాంజలి తమకు నచ్చదన్నా తమకు అర్థంకాదన్నా, నాకామాట విపరీతంగా వినబడుతుంది. సంగీతం ఇష్టం లేనివాడి సంగతి లారెన్జో అన్న మాటలన్నీ జ్ఞాపకం వస్తాయి.

నా కాలేజీ దశనుంచి నన్ను కలకాలమూ Influence చేసిన పుస్తకం ఈ గీతాంజలి. మొదట ఒక వాక్యం వినగానే పరవశంచెంది, నా హృదయం భక్తితో వికసించి ఎక్కడ? ఎవరు? ఎట్లా? అని వెతకడం ప్రారంభించింది. కలలో కన పడ్డ ప్రియురాలికై లోకాన్ని గాలించే ఉన్మత్తుడి విధాన వెతికాను, ఆ పుస్తకం దొరికిందాకా.

గీతాంజలి నాకో కొత్త దృక్పథాన్ని Philosophy of lifeని, నేను అను భవించే అందాలకి ఓ వెలుగుని, నా ఆశలకో అర్థాన్ని ఇచ్చింది. ఎక్కడో అంద రాని ఈశ్వరుణ్ణి, నా సుఖ దుఃఖ నిత్య సహచారికి, నా అనంత జీవిత పథచారినిగా చేసి నా ప్రక్కన నిలబెట్టింది, ఈశ్వరుడు అమృతమయుడని ఈనాడు తెలుసు కున్నాను. నేననుభవించే దంతా అమృతం, అమృతం ఈశ్వరుడు.

అదీకాదు, అనుభవించేది నేనుకాదు. నేనూ నువ్వూ కలసి.

అదీకాదు, నువ్వూ నేననే బేధమే లేదు. అంతా నువ్వే, నేను కాను.

నువ్వేకాని, నేనేకాని, ఉన్నది ఒక్కరే.

ఇది ఆధ్యాత్మిక ఆరోహణసోపానం.

ఈ స్థాయిల నన్నిటినీ ఆలాపించాడు నా కవి. ఆ గానం అనుభవంలోకి రావాలంటే—'తన అంతరాంతర గర్భాలయం చేరాలంటే, యాత్రికుడు బైటి ప్రపంచాలన్నిటిలోనూ ద్రిమ్మ తిరగాలి. మూతలుపడి 'ఇక్కడే ఉన్నావు నువ్వు' అనుకునే ముందు, కళ్ళు చాలా దూరాలు వెతకాలి.'

చిత్రమేమిటంటే ఈశ్వరుడు కాని నాముప్పై ఏళ్ళ జీవితంలోకూడా ఈశ్వర లీలల్ని కీర్తించే గీతాంజలి నానిత్య పారాయణ కలది గ్రంథంగా ఉండిపోయింది. "గీతాంజలి వర్ణితుడైన ఈశ్వరుడే నిజంగా వుంటేనా?" అని కలలు కనే వాణ్ణి.

అట్లాంటి ప్రియసఖుడి కోసం, మధురమూర్తి కోసం హృదయం తపిం చేది— "—లేదు కదా! నాలోని ఈ కాంక్ష నిరర్థక తాత్కాలిక మన ప్రవృత్తి కదా! అని దిగులుపడే వాణ్ణి.

'నే నున్నాను' అనే వోదార్పు, వరద ఐ ప్రపంచాన్ని ముంచుతోంది. "కాని, ఆ వెల్లువలో ఒక్క తుంపర తనపైన చిమ్మకుండా నా హృదయం

మూసుకుపోయింది." "నా ఈశ్వరుడు చచ్చిపోయినాడు. బతికేవుంటేనా ఈ గీతాంజలిని అతనికి పాడుకుందునుకదా" అని పరితపించాను.

నా తరోత్క్రష్టతకు జంకి దిక్కులేకుండా దాక్కున్న నా భక్తి భావనా విహంగాలు ఇన్నేళ్ళ తరవాత, కిలకిలమంటూ నా హృదయంపైన వ్రాలి, చిరంజీవిగారి ప్రోద్బలాన ఈ గీతాంజలీ ఆంధ్రీకరణంలో నివాసాలేర్పరుచుకున్నాయి.

అరుణాచలం
కార్తీక దీపోత్సవం

—చలం

# నిర్వికల్పం

లోకంనించి ఈ లోకోద్ధరణకోసం దిగివొచ్చిన చాలా కొద్ది మందిలో ఏసు క్రీస్తు నిస్సంశయంగా అతి ముఖ్యుడు. కాని ఆయనపేర ఈ దేశంలో ప్రచారమౌతున్న మత రూపంవల్లా, తత్ప్రచారకుల మూలంగానూ, ఆయన ఏమాత్రం అర్థంకాలేదు ప్రజలకి. అన్ని మతాలూ ఓ పాదపీఠం ముందుకే తీసుకుపోతాయని పెదిమలతో పలికే వారిలో కూడా కిరస్తానీ మతమనేప్పటికి నొసలు వెక్కిరిస్తోనే వుంటుంది. తమలో ఒకరు క్రిస్టియనుగా మారితే పోనీలే, ఆ మార్గాన ఈశ్వరుణ్ణి చేరుకుంటాడని వొదలరు; ఎందుకంటే తాము ఏ మార్గాన ఈశ్వరుణ్ణిచేరే ప్రయత్నం చెయ్యటంలేదు గనక.

ఈనాడు ఏ మతాలకీ ప్రభావంలేదు, ప్రజల నడవడిపైన. కాని ఏ నాటికో తిరిగి ఈశ్వరుడు లోకంలో పునఃప్రతిష్ఠ పొందితే, ఆనాడు ముఖ్యుడైన ఆయన కుమారుడు అర్థంకాక పోవడం పెద్ద అనర్థమౌతుంది.

ఆధ్యాత్మిక సాధనకి గురువు అత్యవసరమనే హిందూ విశ్వాసాన్ని క్రిస్టియన్లు వొప్పుకోక పోవడం చాలా విచిత్రం. గురువుల్లో పరమ గురువు ఏసు, గొప్ప గురువులమల్లేనే ఆయన "నేను ద్వారాన్ని, నేనే కాంతిని, నేనూ తండ్రీ ఒకటే" అంటున్నారు.

ఏసు గురించి తెలియాలంటే, మనకి ఆధారాలు బైబిల్లోని నాలుగు శుభ వార్తలు, వాటిల్లో ఏసు జీవితచరిత్ర ఆయన బోధలు పర్యటనలు, చేసిన మహత్యాలు వివరించారు. ఆయన శిష్యులు. ఆయన బతికింది ముప్ఫై మూడేళ్ళ, ఆయన బోధించింది మూడేళ్ళు. ఆ మూడేళ్ళ బోధతో ఆయన తరవాత సగం ప్రపంచాన్ని కట్టివేసి పరిపాలించగల మహత్తరమైన మతానికి కారకులైనారు.

ఆ బోధకి బలాన్నిచ్చింది ఆయనలోని ప్రేమ, ఆయన బోధలో ప్రతి మాటలో చేతలో అవ్యాజమూ అప్రతిహతమైన ప్రేమ వ్యక్తమౌతుంది.

17-1-1963 చలం.

## బిడ్డల శిక్షణ

ఇప్పుడిప్పుడే ప్రపంచం బిడ్డల విషయమై తాసు నమ్మిన అబద్ధాలలోంచి మేలుకుని పెద్దవారి అంధత్వం వల్ల బిడ్డలకి అన్యాయం జరుగుతోందనీ బాధ కలుగుతోందనీ గ్రహిస్తోంది. తక్కిన ప్రజలవలె బిడ్డ తన బాధల్ని చెప్పుకుని వాటి నివారణ కోసం ఆందోళన చెయ్యలేదు. కనుక పెద్ద వారే బిడ్డల కోసం శ్రమ పడి వారి జీవితాల్ని ఆనందకరంగానూ ఫలవంతంగానూ చెయ్యాలి.

ఇంతకాలమూ స్త్రీ యెట్లా పురుషుడి ఆస్తిగా వుందో బిడ్డకూడా అట్లానే వుంది. ఒక్క చంపడం తప్ప తక్కిన యే బాధలూ తల్లిదండ్రులూ వారు లేనప్పుడు సవతి తల్లులూ, మామలూ, అత్తలూ మొదలయిన వారు యేం చేసినా బిడ్డ నోరెత్తడానికి తెలివీ శక్తీ లేవు ఏడ్చినా వినేవారు లేరు.

బిడ్డకి యీ లోకంలో ఆనందం అనుభవించడానికీ,సౌఖ్యపడడానికీ హక్కు వున్నదనే సంగతే మరచి యెంతవరకు పెద్దవారికి సహాయపడగలదనే ఆలోచన లోనే వున్నారు. బిడ్డకి ప్రత్యేక వ్యక్తిత్వమిచ్చి బిడ్డ యెవరి ఉపయోగం కోసమూ కాదనిన్నీ తన కోసం తానుజీవించేహక్కును పొందాలనీ మనుషులు గుర్తించాలి. బిడ్డ కూడా పెద్దవారి వలెనే వివేకము కలదని విశ్వసించి బిడ్డకి సంపూర్ణమైన బాధ్యతలను యిచ్చినప్పుడే అదీ అభివృద్ధి చెందుతుంది. లోకంలోకి స్వేచ్ఛగా

పోనిచ్చి అన్నీ స్వయంగా చూసి నేర్చుకునేట్టు సహాయం చెయ్యాలి. తన శక్తుల్ని పంచేంద్రియాలను, బుద్ధిని ఉపయోగించి సత్యాసత్యాల్నీ, న్యాయాన్యాయాల్నీ, నీతి అవినీతుల్నీ స్వయంగా తెలుసుకొనేట్లు వుండాలి. బిడ్డల్ని వీలయినంత వరకు స్వేచ్ఛగా వొదిలి పెద్దవారు తటస్థంగా వుండడం మంచిది. అపాయంలోకి తెలివి తక్కువగా నడుస్తోందని తోచినప్పుడు తప్ప పెద్దవారు జోక్యం కలుగచేసుకో కూడదు. బిడ్డ చేతిని పట్టుకుని నడిపించి జ్ఞానాన్ని యివ్వడానికి గొప్ప తల్లి ఈ ప్రపంచం వుంది. పెద్దవారు యెక్కువ ఆదుర్దా పడనక్కరలేదు. ఏ ఆజ్ఞా, యే శిక్ష విధించినా యే జోక్యం కలగ చేసుకున్నా ముందు పెద్ద వారు తమ ఆత్మ పరీక్ష చేసుకుని బిడ్డ క్షేమం కోసమా తమ స్వంత క్షేమం కోసమా అని యోచిం చకుంటే బిడ్డలు చాలా సౌఖ్య పడిపోతారు. ప్రేమ పేర పెద్దలు బిడ్డలకి చేసే అపచారాలంత ఘోరమైన కార్యాలు యెక్కడా వుండవు.

ఈ పద్ధతులేమీ అమలులో పెట్టక పోయినా కొన్నిగాని అన్నిగాని ఆచరణ లో వుంచినా బిడ్డని దిద్దాలనుకొన్నప్పుడు బిడ్డ పనులలో సహజమైన ఉద్దేశ్యాలలో నడవడిలో, జోక్యం కలుగజేసుకోవాలన్నప్పుడు ఏం జోక్యం ఎట్లా కలిగించు కోవాలో నిశ్చయంగా సరైనదేదో అది తెలిస్తేనే జోక్యం కలుగజేసుకోవాలి. సందేహం కలిగినప్పుడు మాట్లాడకుండా వూరుకోవడం మంచిది. Impersonalగా చూడలేనప్పుడూ అంతే. 'నేను' 'నా పెద్ద తనం' అని మోహం పనిచేసే దాని కంటే ఏ శిక్షణా లేకుండా వూరుకోవడం వుత్తమం. పెద్దవారి రక్షణా, శిక్షణా లేకుండా పెరిగిన పిల్లలు చాలా శిక్షణలో వున్న పిల్లల కన్నా చాలా ఉత్తములుగా తయారవుతారు. ఈ పెద్దవారి చేతుల్లో వారి అభిప్రాయాలకీ, ఉద్దేశాలకీ, సాధనా లయి వంకర తిరిగిన పిల్లలకన్న దిక్కులేని అనాధ శిశువులు వారి ఆనందాన్ని వారే వెతుక్కుని సహజంగా జీవిస్తారు. విద్యావంతుల పిల్లలు, ధనికులూ, అధి కార్లూ, కీర్తివంతులూ కావచ్చు లోకం ముందు. కాని వారికి లోపల్నించి సుఖపడి బతకగల శక్తి నశిస్తుంది. చెడిపోతున్నట్టు కనపడ్డా సరే బిడ్డని బిడ్డ స్వభావానికి వొదలడం చాలా వివేకమైన శిక్షణ. యితరులు వాళ్ళ జోలికి వచ్చి వంకర్లు తిప్ప కుండా వీలయినంత వరకు చూడడమే గొప్ప రక్షణ.

## మహాస్థాన్

చిన్నారావుగారికి రాసిన లేఖలు త్వరలో ప్రచురణ ఐతే బావుండును.

వాటిల్లో ఏముందో కొద్ది జ్ఞాపకం——

నా బతుకులో ఈశ్వరుడు రావటం ఎట్లా Inevitable అనేది step by step స్పష్టమౌతుందేమో- అది తెలుసుకోవాలనుకున్న వాళ్ళకి తెలుస్తుందను కుంటాను.

ఆ విధంగా General గా ఈ ఆధ్యాత్మిక మార్గం పైన ఓ వెలుగు పడు తుందేమో!

ఆ ఉత్తరాల్లో ఓ వాక్యం జ్ఞాపకం వొస్తోంది.

"నేనీనాడు ఈశ్వరుడిలో పరిపూర్ణ విశ్వాసముంచి ఆయన Guidance కింద సాధన చేస్తున్నాను. ఇది ఫలించబోతోందని Assurance ఇస్తున్నారు ఆయన.

నా సాధన ఫలిస్తే ఈశ్వరుడూ, ఆధ్యాత్మిక జీవితం- అనేవి చాలా నిజ మని Conclusiveగా తేలిపోతుంది. ఎందుకంటే రెండు కళ్ళూ తెరచుకుని దిగు తున్నాను దీంట్లోకి.

నేను Fail అయితే- చలమే మోసపోయినాడు. ఇది శుద్ధ అబద్ధం. ఈ ఈశ్వరుడు మొదలయినవని శుద్ధ మోసమని Conclusiveగా Warning అవు తుంది నా అపజయం-" అని. నేను Fail అయితే తక్కిన వాళ్ళు Succeed కాకూడదా?- అంటే నేను Succeed అవుతానని Assure చేసి దింపాడు ఈశ్వ రుడు. నేను శక్తివంచన లేకుండా సాధించ పూనుకున్నాను.

చలం

-ఈ మాటలు చలంగారు ఒక వుత్తరంలో శ్రీ బి. వి. నరసింహారావు గారికి వ్రాశారు. అవి ఇక్కడ ఉపోద్ఘాతంగా ఉపకరించాయి.-

## చలం ఉత్తరాలు

దీక్షితులుగారు ఈ ఉత్తరాలు దాచారు. ఆయన శ్రమ ఎవరికో ఒకరికన్నా ఉపక రిస్తుందని ఆశ-ఈనాడు.

ఈ ఉత్తరాలన్నీ ఇంగ్లీషులో వ్రాసినవి. చాలకాలు చోట్లతప్ప తక్కిన దంతా తెలుగు చేశాను.

ఇతరులని గాయపరుస్తాయన్నదీ, అధికార్లని పేరు పేరు వరసలుగా తిట్టిన తిట్లూ రెండు మూడు బూతులు తప్ప తక్కిన విషయమంతా ఉన్నది ఉన్నట్లు తెలిగించాను.

ఏమీ Interest ఇయ్యవన్న కొన్ని సంగతులు వొదిలేశాను

ఆయన నాకు వ్రాసిన ఉత్తరాలు దాచని నా నిర్లక్ష్యం, నా అంధత్వం, అల్పత్వం— క్షమించ తగినవి కావు.

ఈ ఉత్తరాలలో నేను వెలిబుచ్చిన అభిప్రాయాలు ఆయానాటివి. ఈ నాటికి చాలా విషయాల్లో నా అభిప్రాయాలు మార్పుచెందాయి, చెందుతున్నాయి.

1-1-44 —చలం

## చలం మిత్రులు

పంబ్బారావుగారూ! మీరు ఎట్లా వచ్చారో, ఎట్లా దూరమైనారో చెప్పుకోలేను. అట్లా దూరమై పోయారు ఎంతో మంది నాకు ముఖ్యమైన వాళ్ళు. మిమ్మల్ని అందర్ని జ్ఞాపకంలో దాచుకున్నాను.

## చలం మిత్రులు

### ముందు మాట :

వెంకేశ్వర్లూ : నువ్వెవరివో, ఎట్లా నాకు దగ్గరయినావో నాకు గుర్తు లేదు. తెలుసుకునే వోపికాలేదు. కాని నువ్వు మొదటిసారిగా ఇక్కడికి వచ్చి నప్పుడే అనిపించింది, నాకు తెలిసిన వాడివని.

వీటన్నింటిని రాసి పెట్టే కృష్ణారావు సంగతి అంతే. వీళ్ళేకాదు చాలా మంది వున్నారు నేను వొదిలేసిన వాళ్ళు.

-3-15

అసలు నాకు బాగా దగ్గరయిన వాళ్ళ గురించి రాయడానికి ఏమీ లేనంత దగ్గరయిన వాళ్ళు నాకు.

అరుణాచలం,
మహాశివరాత్రి 1977. చలం

## ప్రేమలేఖలు
### (మొదటి భాగం)

పృష్టిదైన విరహబాధ తన మాధుర్యభారం వల్ల తనే పగిలి మన్నిద్దరినీకన్నది. జననమప్పుడు మాత్రమే ఆ వాక్క ముహూర్తమే మనమైక్యమై వున్నది.

జన్మ మాధుర్యంలో సోలిన మన చేతుల్ని చిరునవ్వుతో విడదీసి మేఘ శయ్యలమీద యిద్దరి మధ్యనూ అగాధమైన వ్యవధిని కల్పించి ఈ లోకంలో వాదిలారు. నా నోటి నుంచి వచ్చిన మొదటి శబ్దం పేరులేని నీ పేరు. మూర్ఖులు వీళ్ళు అది పాల కోసము యేడుపనుకున్నారు.

అది మొదలు నీ కోసం వెతుకుతున్నాను. నేను చదువుకున్న పుస్తకాల్లో నీ రూపం ముద్రించారేమోనని చూశాను. కవులు నీ అందాన్ని పాడారేమోనని చదివాను. నీవెక్కడన్నా కనబడతావేమోనని మొహాలు వెతుకుతూ దేశాలు తిరిగాను.

కనపడవు. కాని నాకు నీవు చిరపరిచయపు. నీ రూపమగోచరము, నీ స్వభావము మనోభావాని కతీతము. కాని నీకన్న నాకు హృదయానుగత మేదీలేదు. నీ నామ మనుశ్రుతము. కలలో విన్న గానం వలె ప్రతి నిమిషమూ నా చెవుల ధ్వనిస్తోంది. నా వేపు నడిచివొచ్చే నీ మృదు పాదరజము అస్తమయ మేఘాలకు యెర్రని రంగు వేస్తోంది. నన్ను వెతుకుతో వచ్చే నీ అడుగుల చప్పుడు నా హృదయంలో ప్రతి నిమిషం, ప్రతిధ్వనిస్తుంది. నా పరమావధివి నీవు.

నీవుండబట్టి, యీ ప్రపంచమింత సుందరమూ, హృదయాకర్షణమూ నాకు. కాకపోతే యీ కొత్త లోకానికీ నాకూ సంబంధమేమిటి? లోహపు బిళ్ళల్నీ నీతి ప్రతిష్టల్నీ ఆరాధించే యీ ప్రజలతో నాకు సాపత్యమేమిటి? వీరెవరో నాకు తెలియదు. నేను వీరికి అర్థంకాను. నేనిట్లా యెందుకు వెతుకుతున్నానో ఊహించలేరు.

ఒకచోట నీ అధరలావణ్యమూ, ఒకచోట నీ కళ్ళ నలుపూ, యింకొక చోట నీ నడుము వంపూ, ఒకచోట నీ వొంటి మెరుపూ, ఒకచోట నీ కంఠము ఇంపూ మరి ఒకచోట నీ వక్షము పొంగూ చూసి నీ నించి ప్రేమలేఖలని స్వీకరిస్తున్నాను, అనుభవిస్తున్నాను, ఆనందిస్తున్నాను.

ఒక హృదయంలో నీ ప్రణయ మాధుర్యమూ, ఒక హృదయంలో నీ లీలా వినోదాసక్తి, ఇంకొక హృదయంలో నీ మాతృ మార్దవమూ, మరి ఒక హృదయంలో నీ ఆనంద పారవశ్యతా, చూసి ఆకర్షింప బడుతున్నాను. స్వీకరించి అనుభవిస్తున్నాను, ఆనందిస్తున్నాను.

కాని— నిరాశ, ఇవన్నీ నువ్వెట్లా కాగలవు? వీళ్ళంతా నన్ను నీతి లేనివాణ్ని అంటున్నారు చూడు. కాని నాకు భయమెందుకు, దొంగతనమెందుకు నిన్ను ప్రేమించిన నాకు? నీ వున్నావని, నీ నించి విడివడ్డానని, నీ కోసం వెతక్కుండా వొక్క నిమిషం నిలవలేనని, వీళ్ళ లెఖ్ఖ నాకు రవ్వంత లేదని, నీవు నాకు వార్తలు పంపుతున్నావని, యెక్కడ దేనిని ప్రేమించినా నిన్నేనని, వీళ్ళకేం తెలుసు ?

మృణ్మయమైన ఆత్మలో తమోనిర్మితాలైన మేధస్సులు నిన్నూ, నన్నూ అర్థం చేసుకోగలవా?

'సాహితి'
1922

చలం

## ప్రేమలేఖలు (2)

(రెండవ భాగం)

నీకు—నాకు

నిద్రకైనా విరామ మెరగని ఈ హృదయ యాత్ర నీ కోసమని మరవలేను.

ఎంత నీ నుంచి దూరం కావాలని ప్రయత్నించినా ఏదో విధాన ఏదో రూపాన నా దృష్టిని మరల్చుకుంటున్నావు.

నీవు రావు, నన్ను పోనీవు.

మరల్చి మత్తెక్కించి స్వప్నాలతో లాలించి మధుర గానాలలో ఊగించి, ప్రపంచానికి వ్యర్థుణ్ని చేశావు.

దిగులు కళ్ళతో వెర్రి చూపులతో మరపు మాటలతో అన్ని విశ్వాసాలు నశించి తోవ తెలీక తిరుగుతున్నాడు ఈ ప్రేమ బైరాగి.

అనాదిగా విన్న నీ పిలుపు, స్వప్నంలో అనుభవించిన నీ కుంతలాల కొనల స్పర్శ ఏ యుగాల అవతలి తీరానో సంయోగమనే వాగ్దానం, అంతే నాకు మిగిలిన ఆశలు.

నాకు వెర్ర.

ప్రియా,

నాకు సుఖం లేదు, శాంతి లేదు, నువ్వు లేనేలేవేమో. అంతం లేని ఇంత కాలమూ నన్ను నేనే వెతుక్కుంటున్నానేమో అని భయమేస్తోంది నీ కోసం వెతికి వెతికి అలిసి నా చూపులు తమలోకి తామే చూసుకుంటున్నాయి.

ప్రియా అని హృదయం తనని తానే గొణుక్కుంటోంది.

ఎండమావుల సౌందర్యానికై తపించి వొదిలి వాడి లయమయ్యే నిర్భాగ్యుణ్ని చూసి దిక్కులే నవ్వాయి. చుక్కలే ఏడ్చాయి.

యోగులు హృదయాలలో వెలిగించుకునే కాంతి నీ చిరునవ్వు.

నాకెట్లా దొరుకుతుంది?

లోకాన్ని వెతికే నాకు ?

చలం

1941

## మ్యూజింగ్స్

ఆటలాడే చిట్టి డాలీ మహాత్మా
నీకు ప్రణామ ప్రణాలి
అని D. E. O. అని మాటతూలి
నా పైన నీ ప్రేమవాలి

ఆటలకు మరిగిన మసాలి
పీడు పడి ఉన్నాడు సోలి—

॥ఆటలాడే॥

తండ్రి ఒడి ముద్దులను గ్రోలి
తల్లి సందిట ప్రేమవాలి
పీధులపడి తిరిగి చాళి
ఉన్నానులే బుద్ధిమాలి

॥ఆటలాడే॥

కూటికై తే కర్మనాలి
తెచ్చుకుంటున్నానులే రోజు కూలి
కూలీల యెడ నీకు జాలి
అని చేరవచ్చును డాలి!

॥ఆటలాడే॥

ఆయుస్సు రోజు పత్రాలెన్నో రాలి
ఊహించు ఆశలు నిరాశలై పేలి
ఆశాశకురుపులకు కాలి
ఏడు పేరాక పెదవులు నవ్వు తేలి
శక్తులుడిగిన నాడు చీలి
బడుగుగా కుప్పయై కూలి
మనసు లోపల పట్టుచీలి
ఆడుకో లేనిపుడు గోలి!

॥ఆటలాడే॥

నీ మందహాసాలు రమ్య దీపాలి
నీ నడలు లేడి పిల్లకు పాడు లాలి
ఆ పై ప్రకృతి జన్మరాలి
సంతోషముల పుష్పకేలి

॥ఆటలాడే॥

నీ ముద్దు మాటలు విడాలి!
సరిగమపదనిస్వరాలి

పల్కురాశ్శాలు డాలి,
చిగురాకు గుసగుస సుగాలి।
॥ఆటలాడే॥

నీ నలకూబరుడు నీతో డాలి
ముచ్చటల నేను వాచాలి
రంభాంగనకు నీవు డాలి
కూర్చెదవు సంతోష మోలి
॥ఆటలాడే॥

యోగాభ్యాసినీ డాలీ
నీకు అక్కరలేదు నౌలి, వజ్రోలి।
నీ పాదధూళి ధరించుకుని మౌళి
నిలబడవలదులే ఇంక ప్రజాలి।
॥ఆటలాడే॥

నీ పట్టు చెట్టు పనులకు పెట్టుడాలి
నీ తావికాని ఊహలకు సుడిగాలి
ఏ జన్మలందయిన డాలి
నిన్ను కీర్తించెదము రమ్య గుణశాలి।
॥ఆటలాడే॥

ముగ్గురు మూర్తులకయిన మేలి
మెచ్చనిను ముగ్ధేందు మౌళి
కైలాసగిరి పతికి ఆలి
దీవించు కొండచరా చూలి
ఆటలాడే చిట్టి డాలీ
మహాత్మా
నీకు ప్రణామ, ప్రణాళి॥

—రుక్మిణీనాథ్

## చలం హరిశ్చంద్రకు రాసిన ఇంట్రో—

## కోపమెందుకు ?

అసలు హరిశ్చంద్రుడనేవాడు వుండి వున్నాడో; వుంటే ఎటువంటి వాడో తెలీనూ తెలీదు. ఆ విషయంతో ప్రసక్తిలేదు. రోజురోజూ నాటకరంగంమీద ప్రదర్శింపబడి, ప్రజల ప్రవర్తనమీద, ఇన్‌ఫ్లూయన్సు కలిగివున్న హరిశ్చంద్రుడితోనే నా తగాదా.

హరిశ్చంద్రుడు గొప్ప సత్యవంతుడనీ, చంద్రమతి మహా పతివ్రతఅనీ ప్రజల వుద్దేశ్యం. ఆ రెండు తప్పు అభిప్రాయాలనీ, అట్లాంటి అభిప్రాయాలు కలిగివుండడం వల్లనూ, వాళ్ళని ఆదర్శంగా పెట్టుకోడం వల్లనూ, అనుకరించబోవడం వల్లనూ, ప్రజలు, క్షుద్రులూ, కపటులూ అవుతున్నారని నమ్ముతున్నాను. దొంగ సాక్షులకూ, వ్యాజ్యకారులకూ, భర్త దుర్మార్గాలన్నీ సహించి పీచత్వంలో వశించే భార్యలకూ, వాళ్ళ ప్రవర్తన సరైనదని సమర్థించుకోడానికి ఈ హరిశ్చంద్ర చంద్రమతులు ఆదర్శ వ్యక్తులవుతున్నారు.

ఈ దేశంలో ఏదో నియమమని పెట్టుకుని (మతము, కులమూ, ధర్మం, ఆచారం యిట్లాంటివి) ఆ నియమం ఆధారంగా సమస్త ధర్మాలనూ, కరుణనూ, సహజమైన బుద్ధినీ నాశనం చేసుకోవడం చాలా తరచుగా జరుగుతో వుంటుంది. అట్లా ఒక్క వ్రతంపూని ఘోరకార్యాలు చేసిన వాళ్ళకు ఈ హరిశ్చంద్రుడు ఉపాధ్యాయుడు.

తాను నమ్మినదానికి, ఏదో ధర్మానికి కాకుండా, కీర్తికోసం, అంటే నలుగురూ మంచివాడనేందుకు, ఏ దుష్కార్యాలు చేసినా సరే, ఎన్ని కష్టాలువచ్చా సరే ఆ కీర్తి సంపాయించాలనే ఉద్దేశ్యం ప్రజల్ని పరిపాలిస్తోంది. ఆ వ్రతం తాను కలిగి వున్నట్లు ప్రజలు విశ్వసించాలనుకుంటాడో ఆ వ్రతాన్ని అతిక్రమించి కూడా ఆ వ్రతం ఇచ్చే కీర్తి కోసం దేవుళ్ళాడతాడు, అపకీర్తి అంటే అమితమైన భయం, ధర్మంమీద మనస్సు - ధర్మం కలిగివున్నాడనే కీర్తిమీద.

"రాముడువంటి కొడుకు సీతవంటి భార్య

.... .... .... .... ....

ముందు యుగముల పురుషులు తలలూపవలెనే" అని రాముడు అంటాడు నాటకంలో.

అని పాడుతోవుంటే ఈ నాటి పురుషులూ, స్త్రీలూ తలలూపుతున్నారు. అదే ఆశయం, అందుకు ఈ పాట్లన్నీ. ఆ ఆశయం నీచమని తెలుసుకునే స్థితిలో లేరు ప్రజలు. హరిశ్చంద్ర నాటకంలో ప్రతి పద్యంలోనూ యిదే గోల! ఈ కీర్తి కోసమే హరిశ్చంద్రుడు అబద్ధాలాడాడు. నోటివెంట కాదనకపోతే చాలు. అదీ నలుగురికీ తెలిసేట్టు బిగ్గరగా అనకపోతే చాలు, అబద్ధంకింద లెక్కకాదని ఈ సత్య నియమంగాళ్ళ వుద్దేశ్యం. మనసులో అబద్ధాలు, ప్రవర్తనలో అబద్ధాలు అబద్ధాన్ని సహించి, ఉపేక్షచేసి వూరుకోడంవల్ల కలిగే అనృతదోషాలు, అబద్ధాన్ని నిజంకింద స్వీకరించడంవల్ల కలిగే మోసాలు, యిన్ని వుంటాయని వీరికి తెలీనే తెలియదు.

సత్యమనే ఆశయం ప్రవర్తనలోకి రాకముందు అసలు అది అర్ధంకావాలి, ఎవరి తాహతుకు సంస్కారానికి తగినట్లు వారు సత్యాన్ని అర్ధంచేసుకో గలరు! సత్యమనే దాంట్లో అనేకమైన 'స్టేజస్' వున్నాయని తెలుసుకునే స్తితికి చాలా కొద్ది మందే వొచ్చారు. ఈ లోకంలో ముక్కుకి సూటిగా నోటితో నిజం చెపుతూ, కళ్ళతో అబద్ధాలాడి, చిత్రగుప్తుణ్ణి మాయపుచ్చాంగదా అని సంతోషించే వాళ్ళు కొందరు NEW LINE హరిశ్చంద్రుడికి అసలు తెలీదు. తెలసినంత దాంటోనే ఆత్మవంచకుడు.

సత్యం మాటటుంచి, ఏ మాత్రం బుద్ధివున్న వాడూ ప్రపంచ వ్యవహారాలలో హరిశ్చంద్రుడివలె ప్రవర్తించడని అసలు కథ వ్రాసిన వాళ్ళకికూడ తెలుసు. అందుకనే అతని ప్రవర్తనని సమర్ధించడానికి విశ్వామిత్ర మాయని ఆధారం చేశారు. ఆ మాయే లేకపోతే కొంత వెర్రివాడు తప్ప అట్లాంటి అర్ధంలేని పనులు ఎవడూ చెయ్యడు. హరిశ్చంద్రుడిని స్టేజిమీద అందరూ మెచ్చుకుంటారుగాని అట్లాంటివాడు ఒకడు యింటోవుంటే గదికి తాళం వేస్తారు. భార్యా, పిల్లలూ, ఆస్తి అతని అధికారాన్నించి తొలగించాలని వ్యాజ్యం వేస్తారు. అతనేదన్నా ఆజ్ఞాపిస్తే నవ్వుతారు.

ఇంక చంద్రమతి - ఈమె పతివ్రతా శిరోమణి. పతివ్రత ఎందుచేత అయిందని ప్రశ్నిస్తే ఒకటి - భర్త ఏం చేసినా నోరెత్తక వొప్పుకుంది, రెండు వ్యభిచారం చెయ్యలేదు మనకి తెలిసినంత వరకు. పైగా అతని వెర్రి పనులన్నీ చాలా బావున్నాయని ప్రోత్సహించింది. ఎందుకు? భర్తగనక. సీత రాముడుచేసిన వన్నీ బావున్నాయంది. పతివ్రత అయింది. మందోదరి రావణుడితో ఏకీభవించింది

పతివ్రత అయ్యింది. కనక ఈ స్త్రీలకు వేరే నీతి ఆలోచనలూ లేవు. భర్త చేసిన దానికి తలవూపితే పతివ్రతలు; వూపకపోతే కులటలు. రాజ్యం, సుఖం, భర్త, తను, కొడుకు అందరూ భస్మమవుతూవుంటే తటస్థంగా చూసే చంద్రమతి పతివ్రత. ఆ సత్య నియమం ఆమెదికాదు. భర్తది. (ఆమెకి సత్యనియమానికి పేరు లేదుగా) ఆమె ధర్మం అల్లా అతను ఏమంటే దానికి తల గట్టిగా వూపడం. పోనీ ఈ కష్టాలు సంతోషంగా స్వీకరించిందా? అడుగడుగుకీ విధిని తిట్టుకుంటూ ఏడుపులే! కాని ఆ కష్టాల్లోంచి తప్పించుకునేందుకు ఒక్క వేలు కదల్చదు. కర్మ వేదాంతం తాగి మత్తెక్కింది. ఏడుపు, ఏడుపు. ఎందుకంటే ఆ సత్యాదర్శం ఈమె కేమీ తెలీదు. భర్త అబద్ధాలన్నీ నిజాలకింద వొప్పుకుంది. పతివ్రతలయ్యే ముందు వీళ్ళు ఏ డాక్టరి దగ్గిరికోపోయి మెదడుని పుర్రెలోంచి పూర్తిగా కోయించుకుంటారు.

భర్త నీచుడైతే ఆసంగతి గుర్తించని స్త్రీ అంతకన్నా నీచురాలు. నీచత్వం కనిపెట్టి తన భర్తని ఆ నీచత్వంలోంచి తప్పించడానికి ప్రయత్నించని స్త్రీ వ్యర్థురాలు. ప్రయత్నించినా అతను మారకపోతే యింకా వాడికి లోబడేస్త్రీ వ్యభిచారి. ఈ పతివ్రతలు ఈ మూడు కూడాను.

నా చంద్రమతి ఈ మూడు విధాలా తిరగబడ్డానికి ప్రయత్నించింది. కాని లొంగిపోయింది. జయించిందా, హరిశ్చంద్ర నాటకమేలేదు. నా చంద్రమతికి సౌందర్య పిపాస చావలేదు. పెళ్ళి కాగానే స్నేహభావం అడుగంటలేదు. కాని సుమంతుడితో ఒకమాట ఏకాంతంగా మాట్లాడితే యేమనుకుంటో వుంటారో అదే నా చంద్రమతిని అన్నారు.

ఎవరికీ ఉపయోగంలేని త్యాగాలను చేసి సమస్తమూ నాశనం చేసుకున్న చాతగాని పెద్దమ్మ గనకనే చంద్రమతి పతివ్రతా శిరోమణి అయింది.

కృష్ణుణ్ణీ, అర్జునుణ్ణీ యుద్ధము చేయించి, ఒకర్ని ఒకరు పంపుదగ్గిర ఆడవాళ్ళకన్నా అధమంగా యెత్తి పొడుచుకుని తిట్టుకునేట్టు చేస్తే.

'అల్లుడా రమ్మని'

అవి పద్యాల్లో వ్రాశారు గనుక అందరూ హర్షించారు. దేవుడి అవతారమనే కృష్ణుడిచాత పనికిమాలిన ప్రగల్భాలు పలికిస్తే నీచంగా తోచలేదు. కాని చంద్రమతికి కొంచెం మెదడు నిచ్చేటప్పటికి, హరిశ్చంద్రుడికి కొంచెం మెదడు లేదనేప్పటికి ప్రతివారికి కోపం వొచ్చింది.

### శ్రీశ్రీ మహాప్రస్థానానికి

# యోగ్యతాపత్రం

ఇది మహాప్రస్థానం సంగతి కాదు. ఇదంతా చెలం గొడవ. ఇష్టంలేనివాళ్ళు యీ పేజీలు తిప్పేసి (దీంట్లో మీ సెక్సుని ఉద్రేకించే సంగతులు ఏమీలేవు) శ్రీశ్రీ అర్ణవంలో పడండి. పడండి ముందుకు. అగాధంలోంచి బైలుదేరే నల్లని అలలు మొహానకొట్టి, ఉక్కిరిబిక్కిరై తుపానుహోరు చెవుల గింగురుమని, నమ్మిన కాళ్ళ కింది భూమి దొలుచుకుపోతో వుంటే, ఆ చలమే నయమని వెనక్కి పరిగెత్త చూస్తారు.

తన కవిత్వానికి ముందుమాట వ్రాయమని శ్రీశ్రీ అడిగితే, కవిత్వాన్ని తూచే రాళ్ళు తనదగ్గర లేవన్నాడు చెలం. 'తూచవద్దు అనుభవించి, పలవరించ' మన్నాడు శ్రీశ్రీ.

చెలం చూశాడు. మాట్లాడాడు. కాని శ్రీశ్రీని ఎరగడు. రుక్మిణీనాథశాస్త్రి ఒక ఉదయం వచ్చి—

"ఇదేమిటి. ఈ మూల స్త్రీల కోసం ఇట్లా మూలుగుతున్నారు? శ్రీశ్రీ పద్యాల వేగంతో ప్రపంచపు పాత దుమారమంతా వూడ్చుకు పోతో వుంటే!"

"హృదయాలమీదికి పెంకులు పగిలిపోతున్నాయి, బైటపినబడుతున్నాయి ఇట్లా రండి రోడ్డుమీదికి" అన్నాడు.

అంతవరకు శ్రీశ్రీ కవిత్వాన్ని ఎరక్కపోవడం చెలంలో క్షమించతగిన విషయం కాదు. కాని చాలావాటికి క్షమించాలి చెలాన్ని.

కవిత్వాన్ని, ముఖ్యంగా తెలుగు కవిత్వ కన్యల్ని చూస్తే చలానికి Impatience, అనుమానం. శబ్దసౌందర్యంతో తృప్తిపడి సంతోషించవలసిందే కాని, చెప్పేదానికి అర్థం వెతకడం అవివేకం అని. కాని నీరసపు కళాచతురులమల్లే అందాన్ని దూరం నుంచి చూచి సంతోషించి, విచారించి, తప్పుకోడం చెలానికి చాతకాదు. తను చెప్పదలుచుకున్న సంగతి తనకే స్పష్టంగా తెలీనప్పుడు తన చాతగాని తనాన్నీ అర్థ అస్పష్టతనీ ఛందస్సు చీరల వెనకా, అలంకారాల మధ్యా, కఠిన పదాల బురఖాలలోనూ దాచి మోసగించాలని చూస్తాడు కవి— ముఖ్యం

సహజ సౌందర్యం తప్పకపైనప్పుడు! సులభంగా, సూటిగా చెప్పేసి, ఇంత ధ్యానానికీ, మౌనానికీ, కార్యాలకీ, విజయాలకీ వ్యవధి నివ్వరాదా అని చెలం కోర్కె. ఆ పని స్త్రీలు చెయ్యరు, దేశనాయకులూ చెయ్యరు, కవులూ చెయ్యరు— ఎంకే, శ్రీశ్రీతప్ప కవిత్వంలోనూ, జీవితంలోనూ economy of words and thoughts లేకపోవడం దేశభక్తి కన్న హీనమైన పాపం. ఆత్మలోకంలో దివాలా.

తనకీ ప్రపంచానికీ సామరస్యం కుదిరిందాకా కవిచేసే అంతర్, బహిర్ యుద్ధావమే కవిత్వ మంటాడు చెలం. అందువల్లనే దిక్కుల్నీ, దేవుల్నీ, అధికారుల్నీ పూగించి ప్రశ్నించే శ్రీశ్రీ పద్యాలు అంత అభిమానం చెలానికి. నెత్తురూ కన్నీళ్ళూ తడిపి కొత్త Tonic తయారు చేశాడు శ్రీశ్రీ యీ వృద్ధ ప్రపంచానికి.

హృదయం ఎల్లా కంపిస్తే ఆ కంపనకి మాటల రూపాన్ని యివ్వడం అతనికే తెలుసు. మాటల్ని కత్తులూ, యీటెలూ, మంటలుగా మార్చటం అతనికే చేతనవును. పద్యాలు చదువుతోంటే, ఇవి మాటలు కావు, అక్షరాలు కావు— ఉద్రేకాలు, బాధలు, యుద్ధాలు— అతని హృదయింలోంచి మన హృదయంలోకి direct గా పంపిన ఉత్సాహాలు, నెత్తురు కాలవ లనిపిస్తుంది.

ఎందుకంటే—

క్రిష్ణశాస్త్రి తన బాధని అందరిలోనూ పలికిస్తే శ్రీశ్రీ అందరి బాధనూ తనలో పలికిస్తాడు.

క్రిష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ. ప్రపంచపు బాధ అంతా శ్రీశ్రీ బాధ.

శ్రీశ్రీ కవిత్వము, పాల్ రోబ్సన్ సంగీతమూ ఒకటే రకం అంటుంది సౌరిస్. ఆ రెంటికీ హద్దులూ, ఆజ్ఞలూ లేవు. అప్పుడప్పుడు లక్షణాలనూ, రాగాలనూ మీరి చెవి కిర్రుమనేట్టు ఇద్దరూ అరుస్తారు. ఏమీ రసం లేకుండా flat గా ఎక్కడికో, ఏమీ చేతకాని వాళ్ళమల్లే జారిపోతారు. కాని ఆ అరుపుల్లో, చీకట్లో మొహాలూ, తోకలూ కనపడక వెతుక్కునే ప్రజల రొద, గాలి దెబ్బల కింద ఎగిరి పడే సముద్రపు తుపాను గర్జనం, మరఫిరంగుల మరణధ్వానం గింగురుమంటాయి. కంఠం తగ్గించి వినపడకుండా తగ్గుస్థాయిలో కూలిగారా, దిక్కులేని దీనుల మూగవేదన, కాలికింద నలిగిన చీమల కాళ్ళు విరిగిన చప్పుడు, నీళ్ళులేక ఎండుతున్న గడ్డిపోచ ఆర్తనాదం వినిపింపచేస్తారు. బుద్ధివున్న వాడెవ్వడూ అతనిది సంగీత

మనికాని, ఇతనిది కవిత్వమనికాని వొప్పుకోడు: వొప్పు కోటమూ లేదు. ఎందు కంటే యీ యిద్దరి appeal బుద్ధిని, వివేకాన్ని కళా నిబంధనల్ని మించిన ఏ అంతరాళానికో తగులుతుంది— ఆ అంతరాళం అనేది వున్నవాళ్ళకి. కీర్తి మర్యాదల్ని డిగ్రీలతో కొలుచుకుంటో అగచాట్లు పడి కులికే మనుషులకి ఆత్మ ఎన్నో మందపు ఇనుప పొరల వెనక అణగి చచ్చి, కొనవూపిరితో ఆరిపోలేక మిణుకు మిణుకు మంటో వుంటుంది. అటువంటి వాళ్ళకి ఉత్త అర్థంలేని న్యూసెన్సుగా తోస్తాయి శ్రీశ్రీ పద్యాలు. సొంతయిల్లూ అణగారిన భార్యా, ప్రతి సంవత్సరం పై క్లాసులోని కెళ్ళే కొడుకూ, bank-account, వొట్టిపోని ఆవుతో తృప్తిపడే సంసారుల శాంత హృదయాలమీది నుంచి యీ గీతాల్లోని ఉద్రేక ఉత్సాహాలు విశాఖ పట్నం సముద్రంలో నల్లరాళ్ళమీద అలలు విఫలమైనట్లు దొర్లి పోతాయి. తాంబూలం వేసుకుంటో పుస్తకాన్ని ముడిచిపెట్టి "దేనికోసం? ఎందుకు? ఏమిటి కావాలంటాడు? ఏమిటి ఈ వేదన పాపం?" అని కొంచెం ఆలోచిస్తారేమో!

ఇదీ సాధారణంగా కల్చెర్డు రీడర్సు సంగతి.

కవుల సంగతివేరు. ఉత్తమ కవిత్వం ఎప్పుడు ప్రచురిత మవుతుందా అని వెయ్యి కన్నులతో కనిపెడుతూ వుంటారు. కనపడ్డదా, ఆ నాటి నుంచి అతి శ్రద్ధగా ఆ కవిత్వాన్ని గురించీ, కవిని గురించీ ప్రచారం మొదలు. సారస్వత పోషకులతో ఉచితులతో ఎట్లాగో ఓలాగు ఆ కొత్త కవిత్వాన్ని సంభాషణలోకి తీసుకుని వచ్చి వ్యక్తీ, కాల పరిస్థితులను బట్టి చప్పరి-చడమూ— తమ కావ్యాలనించో, ఇతర కావ్యాలనించో, సంగ్రహించబడిన దనడమూ- విప్లవకారణ మనడమూ- నిర్జీవ మనడమూ- కవిని గురించి చాలా righteous indignation తోనో, జాలిపడుతోనో, చాలా సానుభూతీ. దయా వున్నట్లు ప్రస్తావించడం వీళ్ళ టెక్నిక్.

"శ్రీశ్రీ కవిత్వాన్ని గురించి మీ అభిప్రాయం చెప్పండి" అని కవిని అడిగారా, అతను "దానికేం చాలా బావుంటుంది. ఓ బాగా వ్రాస్తాడు నేను అతన్ని కూడా బాగా ఎరుగుదును. నా అభిప్రాయం ఏమిటంటే—" అన్నాడా, అతను చాలా సన్నిహిత ప్రియమిత్రుడన్నమాట కవికి. చిరునవ్వుతో శ్రీశ్రీ విషయమై మీ కళ్ళలో కారం కొట్టి పోతున్నాడు. పొగడ్తలతో మీ నోట్లో విషం కక్కి పోతున్నాడు జాగ్రత్త!

శ్రీశ్రీ కవిత్వానికి Motive springs చూపుతాడు ఆ మిత్రుడు. తప్పదు

"ఆకలిపాట.... కటిక దరిద్రుడు అతను—తిండిలేక వీధులు తిరిగాడు.... పాపం" అంటో ప్రపంచపు సరిహద్దుల్ని పూగించాలని ప్రయత్నించే అతని హృదయోద్రేకాన్ని explain చేస్తాడు.

నిజమా? నిజమైతే శ్రీశ్రీ "ఆకలేసి" నక్షత్రాలు అదరిచూసే "కేకలేశాడు"

ఈ కవికి ఆకలివేస్తే రా—గారి యింటికెళ్ళి శ్లాఘించి భత్యం ఖర్చు తెచ్చుకుని, భోజనం చేసి ప్రియురాలి మీద గీతం వ్రాశారు.

అబద్ధాలతో, స్తోత్రాలతో, వంచనలతో, అనుకూల దుష్ట ప్రచారంతో, ఆత్మశ్లాఘనలతో దేశం మీదపడి బతుకుతున్న యీ Parasite కవివరేణ్యులు శ్రీశ్రీని విమర్శించడానికి సాహసిస్తున్నారు. 'అభివృద్ధికి రాతగినవాడవు' అని అకాశమంత ఎత్తుగా వుండే అతని వీపుతట్ట చూస్తున్నారు.

ప్రపంచంలో ఈనాడు ప్రతి దేశంలోనూ నూతన యుగ నిర్మాణం కోసం ధర్మ యుద్ధం చేసే ధీరులు ఈనాడూ పడుతున్న ఘోరమైన అగచాట్లు చూస్తే, అనాదిగా తనకోసం ప్రయత్నించే dreamers మీద ఈ లోకం వర్షిస్తున్న కర్కశత్వం వరించి ఆవేశించిన rotten channels యీ నాటి సారస్వత సభాపతులు.

తాము బతికివున్న కాలంలో పాత వాంగ్మయం మీద తిరగబడ్డ యీ బతికివున్న శవాలు ఈనాటికీ తాము ముప్పై యేళ్ళ క్రింద చేసిన తిరుగుబాటు ఇతరుల ఖర్చు మీద కాఫీ యిద్దెన్న ముందు Inspire ఐ ప్రగల్భాలు పలికే యీ రసికులు తాము తెచ్చిన సంస్కారమే యింక సారస్వతానికి శాశ్వతావధి అని నిరూపించి, ఉప్పొంగి తెలుగు ప్రపంచాన్ని పావనం చెయ్యడానికి మీదికి ఉరికే భగీరథ ప్రవాహాల్ని ఊరి రబ్బిష్ చెత్తల కట్టలతో ఆపాలని ప్రయత్నిస్తున్నారు.

మద్రాసు బస్సుల గోలల మధ్య ఓసారి "శ్రీశ్రీ యిప్పుడు వ్రాస్తున్న క్రొత్తదనాలకే ప్రజలు ఇంకా అలవాటు కాలేదే, ఇంతా యీ సర్రియలిజం తెస్తే అసలు గాభరా పడి చదవడమే మానేస్తారేమో" అన్నాడు. చెలం man of little faith.

శ్రీశ్రీ ఏం జవాబు చెబితేనేం! మానవజాతిని ఉద్ధరించడానికి కొత్తమతాన్ని నిపెట్టిన ప్రవక్తవలె చిరునవ్వు నవ్వాడు తన వ్రాతల అంగీకారాన్ని పొందేందుకు ఇరవై యేళ్ళ తర్వాత ఇంకా ఆశ వదలక కాచుకొని వున్న చెలం మానవత్వం మీద శ్రీశ్రీకి వున్న గాఢ విశ్వాసాన్ని చూసి తలవొంచాడు.

శ్రీశ్రీ కవిత్వాన్ని analyse చేసి, ముక్కలకింద ఎత్తి చూపి, కవీ. మనిషీ శైలీ, బాల్యం, కవిత్వం, ఛందస్సు, ఎదిరింపు, కొత్త పోకడలు, పాత influence అంటో వాటి శ్రేష్ఠత్వాన్ని explain చెయ్యడానికి చెలానికి అధికారమూ, అర్హత లేవు. చెలానికి విమర్శ చేతనైతే, కొత్తవ్రాతల్ని పాత పత్రికల్లో చీల్చి, చెండాడి గొప్పతనం లేదని నిరూపించి, ఘనత సంపాయించి, సంవత్సరానికోసారి విందు భోజనాలు చేసే ఒక డజన్ సారస్వత, కళా, నాటక, నృత్య, గాన, సినిమా పరిషత్తులలో సభ్యత్వం, ఏమో అదృష్టం అపూర్వంగా కలిసివస్తే జాయింటు సెక్రటరీ కూడా సంపాయించేవాడు కాడా!

శ్రీశ్రీ పుస్తకం కొని తీరికగా చదవండి, పద్యం పదిసార్లు చదవండి, ఏమీ అర్థం కాలేదా— ఏ యువకుడికో, భిక్షకుడికో death - bed present గా పంపండి. పారెయ్యకండి. అంతకన్నా దాచుకోకండి. తెలుగు కవిత్వాన్ని ఖడించి, దీవించి, ఊగించి, శాసించి, రక్షించే అపూర్వ శక్తి మీ చేతులో పుస్తకం. Pass it on.

పదేళ్ళు ఆగండి. ఈ లోపల ఆస్తి సంపాదించడం పిల్లల్ని కనడం, ధరలు హెచ్చడం కాక జీవితంలో ఇంకా ఏవన్నా మిమ్మల్ని అమితంగా influence చేసినవి జరిగి వుంటే మళ్ళీ కొత్తకాపీ కొని శ్రీశ్రీ పద్యాల్ని చదవండి, అప్పుడన్నా అర్థమౌతుందేమో.

స్వయంగా చదవండి. చదివింతర్వాత శ్రీశ్రీని చూడాలనిపిస్తే స్వయంగా చూడండి. ఎవరి అభిప్రాయమూ అడగకండి. ముఖ్యం కవి అనేవాణ్ణి-చెప్పినా వినకండి.

కవిత్వపు కాలం అంతమయింది. నగలూ, అపురూపపు కళలూ, సూర్య కిరణాల్ని ఎరగని అందాలూ గతిస్తున్నట్టే కవిత్వమూ గతించింది. కవిత్వానికి కూడా తన ప్రయోజనం తానే చెప్పుకోవలసిన గతిపట్టింది. "ఈనాటి కవిత్వమంతా ఏమిటి? ఎందుకు వుంది? ఏం చేస్తోంది?" అని దిక్కరించి అడిగే తెలుగు ప్రజలకు శ్రీశ్రీ కవిత్వం ప్రత్యుత్తరం. కొద్దిరోజుల్లో నేడు విర్రవీగే కవులు ప్రతి ఒక్కరూ శ్రీశ్రీ నీడకింద నుంచుని తమ ఉనికిని సమర్థించు కోవలసిన గతి వొస్తుంది.

చెప్పుకో తగిన ఒక్క కవీ మన క్రిష్ణశాస్త్రి ఉన్నత హిమాలయ శిఖరాల్లో కురిసిన కవితా వర్షం పాయలై, దేశాల వెంట ప్రవహించి చివరకు సైదు కాలు

వల్లో పలుకుతున్న సమయాన, భీషణాతపజ్వాలలతో ఆవిరి పొగలు లేపి ఆకాశ మార్గాన విహరింపజేసి, రక్షించాడు శ్రీశ్రీ.

ఎవతినించి దొంగిలించామో వాళ్ళని క్షమించడం కష్టం.

క్రిష్ణశాస్త్రి పద్యాలుచదివి అర్థం విడదీసి, "ఏది గొప్పతనం చూప"మంటే చూపలేకపోయినాను పూర్వం. శ్రీశ్రీ అగ్గిపుల్లలోనూ, కుక్కపిల్లలోనూ, కవిత్వం చూపమంటే చూపలేను ఈనాడూ.

అగ్గిపుల్ల వంక- ముఖ్యం పుచ్చిన అగ్గిపుల్లవంక చాలాసేపు చూడ మంటాను.

కుక్కపిల్లని- ముఖ్యం తల్లి చచ్చిన దిక్కులేని గజ్జికుక్క పిల్లని పెంచ మంటాను.

మెరీనాలో గాలిలో ఊగే (రేడియోలేని రోజులవి) flower bed పుష్ప శయ్య కేసి చూస్తున్న నన్ను చూచి, "ఈ పువ్వులు పాడు పువ్వులు ! ఎక్కడ చూసినా రోడ్డుప్రక్కన అంతా ఈ పువ్వులే" అని నన్ను నిందిస్తున్న మిత్రుడికి ఏం జవాబు చెప్పగలిగాను.

"ఏమిటి వంతెన మీద నుంచుని చూస్తున్నావు?"

"సంధ్య కేసి."

"ఎవరు ఆమె?"

అంటే ఏం మాట్లాడగలిగాను?

పాతపదాలు, డిక్షన్, వర్ణనలు, అలంకారాలు, ఛందస్సు, ఉపమానాలు, పద్ధతులు, ఆచారాలు కవిత్వంలోపీ, జీవితంలోపీ ఇంక మళ్ళీ లేవకుండా వాటి నడ్డి విరక్కొట్టాడు శ్రీశ్రీ.

"ధ్వంసం చేసి రోడ్డువేశాడు——"

"పదండి ముందుకు

పదండి తోసుకు——" అంటున్నాడు.

తాము వేటిని ఎదిరించలేక ప్రతిదినమూ లొంగిపోతున్నారో, ఆ నిరం కుశాధికారుల నెత్తిమీద నాలుగు దెబ్బలు కొట్టాడని యువకులు చెలం మీద చూపే

అభిమానం చాలదు శ్రీశ్రీకి. తామూ ఇంకో నాలుగు దెబ్బలు కొట్టగల శక్తిని తెచ్చుకో మంటున్నాడు మనుషుల్ని.

శ్రీశ్రీ ధ్వసం చేసిన పాత ఛందస్సుల్లోంచి పాత మూలుగులూ, serenadings మూర్ఛలూ వేదాంతాలూ మత్తులూ పోయి- దేశాలకి, ఉత్సాహాలకి, కదిలిపోయే యువక సైన్యాలకి, నూతన యుగ నిర్మాతలకి background music కింద marching band కింద, కొత్త రక్తాన్ని కదను తొక్కించే సంగీతం విన పడ్డంలేదా, శ్రీశ్రీ గీతాల్లో; వినపడకపోతే——

"ఎముకలు కుళ్ళిన, వయస్సు మళ్ళిన
సోదరులారా చావండి!"

ప్రపంచం ఎట్లా పోతేనేం? మీ కెందుకులెండి.

"అదృష్టవంతులు మీరు....
వడ్డించిన విస్తరి మీ జీవితం"

ప్రభుత్వాలు, న్యాయస్థానాలు, రక్షక భట వర్గాలు, చెరసాలలు, ఉరి కొయ్యలు, భావ కవిత్వం ఇవన్నీ మీ ప్రియమిత్రులు. యుద్ధాలనించి, ముష్టివాళ్ళ నించి, విప్లవాల నించి, అనాథల నించి, అశాంతినించి, సత్యాన్నించి మిమ్మల్ని కాపాడుతారు వీళ్ళు.

వీళ్ళందరి అధ్యక్షుడూ మీ దేవుడు. మీ డబ్బుకి దాసుడు. మీ నంగి పూజ లకీ స్వార్థ ప్రార్థనలకీ వశ్యుడు దొంగభక్త పరాధీనుడు.

ఇన్ని బాంబులు కురుస్తున్నా, ఇన్ని మర ఫిరంగులు మోగుతున్నా, ఇన్ని చెరసాలలు నిండుతున్నా, ఇన్ని విప్లవాలు జరుగుతున్నా ఇంకా విశదం కాదా మీకు-పాత పద్ధతులు, విశ్వాసాలు, ధర్మాలు అన్నీ ఓ మూల నించి కూలిపోతున్నా యని! ఇంకా లాభం లేదనీ మీ ఆటలు యింక సాగవని!

ఈ విధ్వంసం అనంతరం నవ ప్రపంచ నిర్మాణ కర్తల ఉత్సాహంతో కంఠం కలిపి పాడుతున్నాడు శ్రీశ్రీ.

ఏ లోకంలో అన్యాయాలు, అధికారాలు, ఏడుపులు, క్షామాలు, యాచకాలు క్షుద్ర కవిత్వాలు, శిక్షణలు, scandals లేవో ఆ లోకాన్ని dream చేస్తున్నాడు యీ కవి.

మీ ఆనందంకన్న ఇతరుల క్షోభ సంతృప్తినిచ్చే మీకు, నరకమంటే అట్లాంటి లోకం.

శ్రీశ్రీ ఎందుకు నచ్చుతాడు?

ఇంకారాత్రి చీకట్లో లోకం నిద్రలో భయంకర స్వప్నాలు కంటో, దీనంగ పలకరించే సమయాన ఉషాగమనాన్ని గుర్తించి స్వాగతమిచ్చే వైతాళికుడు శ్రీశ్రీ.

దేవుడు, అధికారాలు, పాతర్లు, సౌఖ్యాలు, నీతులు, స్వర్గం, మర్యాదలు మూట కట్టుకుని కులికే మీకు అర్థంకాని బాధ, మరణం, దరిద్రం, అవిశ్వాసం, అశాంతి ఇవన్నీ అర్థంకాక గట్టిగా సృష్టినే ప్రశ్నిస్తున్న యువకుల లక్ష కంఠాల్ని ఏకం చేసి పలుకుతున్నాడు శ్రీశ్రీ.

మీ కెందుకు లెండి. పట్టుదిళ్ళలో తలలు దూర్చి భాగ్యవంతుల పాలిటి ఈశ్వరుడి మీద స్తోత్రశ్లోకాలు చదువుతూ— "All is well with the world" అనుకుంటో నిద్రపొండి.

నిర్భాగ్యులం కొందరం మాకు—

"అన్నీ సమస్యలే, సందేహాలే"

"ఏవో,

ఏవేవో, ఏవేవో

ఘోషలు వినబడుతున్నాయ్!

గుండెలు విడిపోతున్నాయ్?"

మీకు కవిత్వం కావాలా?

అరుగో ఆ మూల పాత గోరీలకేసి మొహాలు తిప్పుకొని నగిషీలు చెక్కుతున్నారు- పాతపదాలకీ, ఊహలకీ చిత్రికలుపట్టి- ప్రేయసి మెల్లకన్నుల మీద పద్యాలు అల్లుతున్నారు— రామాయణాలూ, శర్మిష్ఠలూ, వృద్ధమునులు వ్రాసి అర్పిస్తున్నారు, "భారతి"కి నైవేద్యంగా.

వాళ్ళలో చేరండి. వాళ్ళ ధైర్యవచనాలను విని మళ్ళీ నిద్రపొండి.

"రాబందుల రెక్కల చప్పుడు
పయోధర ప్రచండ ఘోషం.
ఝుంఝూనిల షడ్జధ్వానం"
విని తట్టుకోగల చావ వుంటే ఈ పుస్తకం తెరవండి.

బెజవాడ,
17-7-49.

చెలం.

# అనుబంధం - చలం అంకితాలు

## చలం అంకితాలు

### శ్రీ భగవద్గీత

సంస్కృతంకాని,వేదాంతంకాని,ఏమీ తెలీనినాకు భగవద్గీతలోని గూఢార్థాన్ని బోధించి రాయించారు ఈశ్వరుడు. భగవద్గీత తెలుగు చెయ్యమని గోలచేసిన కంది కొండ సూర్యనారాయణశాస్త్రిగారి నించి, నేను రాశానో, తాము రాశారో సందేహం కలిగేటంతగా నా ప్రక్కన నిలబడి పనిచేసిన నర్తకీ కృష్ణావరకు, దిగజారిపోయే నా ఉత్సాహాన్ని ఎంత మంది ఈ మూడేళ్ళ తిరిగి తిరిగి ఎగసన తోశారో—

తెనాలి రామకృష్ణ తనకి రాజుగారిచ్చే బహుమానంలో ద్వారం దగ్గిర భటులకి పంచమన్నట్టు, నాకు తెలుగువారిచ్చే బహుమానాన్ని వీరందరూ పంచు కోవాలి.

—చలం

అరుణాచలం
13-3-1965

## 'చలం' నవలలు

అంకితం విశ్వనాథం ఆత్మకి—

విశ్వనాథంగారి ఆత్మగారు—

కథకోసం వాస్తవాన్ని మార్చినందుకు నన్ను క్షమించాలి. మీకు అంటగట్టిన అదృష్టానికి మీరు చాలా సంతోషిస్తారని నాకు తెలుసు- ఆ లోకంలో మీ నైతికాభిప్రాయాలు తారుమారు కాకుండావుంటే. కాని స్వర్గంలో ప్రిన్సిపాల్ రామకృష్ణారావూ, కాశీనాధుని నాగేశ్వరరావు మొదలైనవారి సహవాసం లభించి వుంటే నా మీద మీకు దీనికీ కోపం వొస్తుంది.

కాని ఎక్కడా మీ ఇంటా వొంటా అణుమాత్రమైనాలేని మిత్రవంచనని అంటగట్టానని చాలా నొచ్చుకుంటాయి. మరి ఏం చెయ్యను? 1947 పాఠక మహాశయులు ఊరుకోరు. చక్కని కథలురాసే 'చలం' బైరాగుల్లో చేరి రియాక్షనరీ తుక్కు వేదాంతం రాస్తున్నాడన్నారు.

మీకు చాలా ఇష్టమూ, సునాయాసమూ ఐన పనిని మిత్రద్రోహంగా మీచేత చేయించానంటే, మళ్ళీ నా ప్రతిష్ఠ నిలబెట్టుకోడానికనీ మిమ్మల్ని నేను చేసిన బలికన్న, కథకోసం, ప్రతిష్ఠకోసం, నా పరమ ఆప్తుడు సూర్యారావుని నేనెంత బలిచేసుకున్నానో మీరు గమనించారంటే మీ ఊర్ధ్వ అవరోహణపు విశాలదృష్టితో మీరు నన్ను క్షమిస్తారని తెలుసు.

—చలం

9-10-47

P. S. :—మద్రాసు రేడియోవారి కథలూ నాటకాలూ అక్కడికి వినబడవు కదా ! మీరు వాటిని వింటూ వుండడమే తటస్థిస్తే, ఈ నా శ్రమ అంతా చాలా వృధా !!

## అదృష్టం

To
The memory of my friend
Dr. K. AHOBALA ROW
Your soul was greater than what
Even
Your BEST friends could dream of

## అమీనా

ఏళ్ళల్లో ఎదిగి
వాకిట్లో నుంచుని, వొచ్చానంటే,
చిన్నప్పటి నీ వొంటి బురదని
కావిలించుకున్నా.
పెద్దయిన నీ మనసుమీద
లోకం చిమ్మిన మాలిన్యాన్ని
అంగీకరించలేని
చలం
అవమానానికి
లోక పరత్వానికి
పరిహారంగా
నీకు, అమీనా,
ఈ పుస్తకం !

## కొత్త చిగుళ్ళు

ఈ కథ అచ్చుకి పంపించేముందు తమకి చదివి తీరాలని తీరా చదవడం కాకుండా ప్రతి అడుగుకీ కేకలతో వినపడకుండా గోలచేసిన వాళ్ళందరికీ.

అంకితం

గోలచేసిన వాళ్ళు :

వొయ్యి : నిద్రపోతినని పడుకుని, మధ్య మధ్య కేకలు వేసింది షా;

చే : నిద్రని బలవంతాన ఆపుకుని వింది, పాపం.

పకపక : మాటి మాటికీ కీచురాయిలాగు అరిచింది.

చిత్ర : మొదట్లోనే నిద్రపోయింది.

శ్రీ : మధ్యలో అర్థంకాక లేచి పోయినాడు.

నర్తకి : వ్యాఖ్యానాలు చాలా చేసింది.

ఉంకోమ్మ : కథ అయిపోయాక వొచ్చింది, చేకి పెళ్ళి చెయ్యాలని !

—చలం

బెజవాడ

15-3-48

మధ్యాన్నం ఒంటిగంట.

# చలం

అంకితం

'నర్తకి' కి

—చలం

## సుధ

సౌరిన్

హృదయంలో

అవతరించి

దర్శన మిచ్చిన

ఈశ్వరుడికి

సమర్పితం

# మ్యూజింగ్స్

## అంకితం

అంకితం

'లీలగారికి'

—చలం

# అనుబంధం

## రమణస్థాన్‌లో 'బ్లాకీ, లక్ష్మి, జాకీ, అద్దం పిచిక'

రమణస్థాన్‌లో సహవాసం చేసిన జంతువులు పిట్టల గురించి సౌరిస్ యిలా చెబుతున్నారు—

### బ్లాకీ

భగవాన్‌కి నల్లకుక్కలంటే చాలా ప్రియం. పాలిన్‌నోయీ అనే అమెరికన్ ఇక్కడ ఉండేప్పుడు ఒక నల్ల కుక్కపిల్లని భగవాన్ నోయీకి ఇచ్చారట పెంచమని. భగవాన్ దేహం చాలించిన తరువాత ఆవిడ తన దేశానికి వెళ్ళిపోతూ ఆ కుక్కని మీరు తీసుకుంటారా అని మమ్మల్ని అడిగింది. మా దగ్గర ఇప్పటికే రెండు కుక్కలున్నాయి. అవి దీనితో పోట్లాడుతాయి మాకు వద్దు అన్నాం. ఆవిడ ఆ కుక్కని వదిలి పెట్టి వాళ్ళ దేశానికి వెళ్ళి పోయింది. ఇంతలో బాంబేనించి రోడా వచ్చింది. ఆ కుక్క రోడా దగ్గిర చేరింది. రోడా దాన్ని చాలా బాగా చూసుకునేది. దానికి పాలు అన్నం తప్ప ఇంకేమి పెట్టేది కాదు.

తను బొంబేకి వెళ్ళి పోయేటప్పుడు ఆ కుక్కని తన నౌకర్లకి జాగ్రత్తగా అప్పగించి వెళ్ళింది. దాని పేరే బ్లాకీ.

అది మెల్లిగా భజన సమయానికి భజనకి వచ్చే వాళ్ళతో కలిసి వచ్చేది. భజనలో అది కూడా మెదలకుండా కూచునేది. మా కుక్కలకి అప్పుడు రాగి అంబలి తప్ప ఇంకేం పోసే వాళ్ళం కాదు. వాటితో బాటు అది కూడా ఆ అంబలి తాగి భజనలో కూచుని వుండేది. భజన అయిపోగానే వెళ్ళిపోయేది. ఆ రోజుల్లో రాత్రి పది లేక పదిన్నర దాకా భజన జరిగేది ఒక్కొక్కప్పుడు. బ్లాకీ భజన అయిపోయే వరకూ వుండి వెళ్ళిపోయేది.

ఇంతలోకి రోడా బొంబే నుంచి తిరిగి వచ్చినప్పుడు రోడా నౌకర్లు చెప్పి నట్టున్నారు రాత్రిళ్ళు బ్లాకీ అక్కడ ఉండడం లేదని. రోడా వచ్చి నన్నడిగింది. "ఏమిటి మా కుక్క రాత్రిళ్ళు మీ యింట్లో కావలా వుంటోంచట మా యిల్లు వొదిలి. రాత్రిళ్ళు కావలా కాయని కుక్క నాకెందుకు మీరే ఉంచుకోండి" అని. "అది కావలాకు రావటం లేదు. భజనకు వస్తుంది. భజన అయిపోగానే వెళ్ళి పోతుంది" అన్నాను. "మరి మీరు తాగటానికి ఏమీ యివ్వకండి" అంది. "మే మిచ్చేది ఏమిటి—. మా కుక్కలు అంబలి తాగుతుంటే అదీ తాగుతోంది. మే మెట్లా ఆపగలం" అన్నాను. "మా ఇంట్లో దానికి రెండు పూటలా పాలు వడు తోంటే మీ ఇంట్లో అది కూళ్ళు తాగుతోందా" అని ఆశ్చర్యపోయింది రోడా [అంబలిని కూళ్ళు అంటారిక్కడ].

చివరికి రోడా దాన్ని వెళ్ళ గొట్టింది. బ్లాకీ మాత్రం భజనకి రావటం మాన లేదు. ఒకరోజు అది భజనకి వస్తుంటే నేనెదురుగా వెళ్ళి "బ్లాకీ నువ్విట్లా వస్తుంటే మీ అమ్మగారికి యిష్టం లేదు. రాకు" అన్నాను తెలుగులో. దానికి గుజ రాతీ, ఇంగ్లీషు భాషలు తప్ప తెలుగు తెలీదు. భాష రాకపోతేనేం మనుషులకి అర్థం కాదుగానీ ఏ భాషారాని జంతువుకి ఏ భాషలో మాట్లాడినా అర్థమవుతుంది. లోపలికి వస్తున్నదల్లా అక్కడే ఆగిపోయి తలెత్తి నా కళ్ళలోకి కొంతసేపు నిదానంగా చూసి వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది బ్లాకీ. ఆ తరువాత మళ్ళీ మా ఇంటికి భజనకి రాలేదు బ్లాకీ.

## బ్లాకీ—లక్కీ

భజనలో కూచుని ఉండగా ఒకరోజు రాత్రి ఎప్పటి మల్లేనే బ్లాకీ మాతో కూచుని ఉంది. ఇంతలోకి లోపలికి ఇంకో కుక్క వచ్చింది. బ్లాకీయే మళ్ళీ

వచ్చిందేమో అన్నంతగా ఉంది. రెండింటినీ విడివిడిగా పోల్చుకోలేనంతగా. కానీ వాడు మగవాడు.వాడే జాకీ. వాడు అంతసేపూ ఒకటే ఏడుపు కుయ్యోకుయ్యో అని. తెలుగు మాట్లాడితే ఏడుస్తాడు. అరవం మాట్లాడితే వూరుకుంటాడు. ఏ పల్లెటూరి నించో కుక్క దోవ తప్పి పోయి వచ్చిందనుకున్నాం. వాళ్ళవాళ్ళు వెతుక్కుంటూ వచ్చి తీసుకుపోతారనుకున్నాం. ఎవరూ రాలేదు. వాడు పోలేదు. వాడికి త్వరలోనే తెలుగు బాగా అర్థమవటం మొదలు పెట్టింది. వాడు తెలుగు వాళ్ళు ఎవరు వచ్చినా సరే ఆప్యాయంగా పలకరించే వాడు ఎదురుగుండా పోయి. అరవవాళ్ళు వస్తే భౌయిమని అరిచేవాడు. ఆవులు ఇంటికి వచ్చేటైముకి వాడు గేటు దగ్గర నించుని ఏవయిన వెనకబడితే వాటి దగ్గిరకి వెళ్ళి అన్నిటినీ ఇంటికి తీసుకొచ్చేవాడు. ఏ దూడలన్నా తప్పించుకొని గడ్డి మోపులోంచి గడ్డి తింటుంటే వాటి పగ్గం పట్టుకుని తీసుకొచ్చి షెడ్డులో వదిలిపెట్టేవాడు. రోడ్డు మీద ఏ ఆవులు పోతున్నా బస్సులు వస్తుంటే అవి వాటి కింద పడిపోకుండా పగ్గం పట్టుకుని రోడ్డు ప్రక్కకి లాక్కు వెళ్ళేవాడు. పగలల్లా నా గదిలో నేను ధ్యానం చేస్తోంటే నాతోబాటు పడుకునేవాడు. ఒకవేళ నా గదిలో వీలులేకపోతే భగవాన్ బల్ల దగ్గిర పడుకునేవాడు. సరిగ్గా ఆ టైముకి నాన్న "చలం" కూడా ఆ గదిలోనే పడుకునేవాడు. వీడు వూరికే ఉండచ్చా? ఏదయినా అలికిడి అవగానే భవ్‌మనే వాడు. నాన్న వాడిని కసురుకునే వాడు ఎందుకట్లా అరుస్తావని!వాడు భగవాన్ బల్ల కింద పడుకోగానే వాడికి సమాధి స్థితి వచ్చేసేది. వాడ్ని భోజనానికి పిలిస్తే ఎంతసేపటికోగాని వాడికి తెలివి వచ్చేది కాదు. తెలివి వచ్చినా కాళ్ళు స్వాధీనమయేవి కాదు. అందుకని కాళ్ళు ముడుచుకునే పొట్టమీద చాలా కష్టంగా పాకుకుంటూ వెళ్ళిపోయేవాడు. వాడికి 'టీ' అంటే చాలా ఇష్టం. మధ్యాహ్నం 'టీ' పోసేవాళ్ళు వాడికి. వాడు నెమళ్ళని తరుముతూ ఉండేవాడు. ఎంత కోప్పడినా వచ్చేవాడు కాదు. పకపక"నీకు టీ పొయ్యంరోయి" అనగానే వెంటనేమూకుడు దగ్గిరికి పరిగెత్తి వచ్చి పకపక వంక చూసేవాడు,నేను నెమళ్ళని తరమటం లేదుగా నాకు టీ పొయ్యండి అన్నట్టు.

ఏ కుక్కలో చూడని ఒక ప్రత్యేకత ఉంది వాడిలో. అదేమిటంటే ఎగురుతున్న పిట్టని పట్టేసేవాడు. పిల్లలకి కూడా సాధ్యం కాని పని అది. అది ఎగురుతూ ఉండగా వాడు కూడా ఒక గజం ఎత్తు ఎగిరి పిట్టని పట్టేసేవాడు. ఇంట్లో పిల్లులన్నీ అహింసా పరులు. వీడు హింసాపరుడు. ఎంత చెప్పినా కూడా వినే వాడు కాదు. రాత్రి అరుస్తాడని వాడ్ని పక్క నున్న గెస్టుహౌస్‌కి పంపించేవారు.

అక్కడ బసవరాజుగారు ఇనపపెట్టెకి కట్టేసేవారు. వాడికి అక్కడికి పోవడం ఏ మాత్రం ఇష్టం ఉండేది కాదు. భజనలో కూచున్నవాడు కాస్త చివరి భజన వచ్చేప్పటికి ఇంక హారతి ఇస్తారనగా ఎక్కడో మాయమయ్యేవాడు వాడు కారునలుపు. వాడు ఆ చీకట్లోకి పోతే ఎవరు కనుక్కోగలరు? ఏ మల్లె పొదలోనో వెనకో, ఏ పెట్టె వెనకో నక్కేవాడు. కానీ నర్తకి, పకపక ఒకటి మటుకు కనుక్కున్నారు. వాడు బలేబాగా ఎలకల్ని పట్టేవాడు. వాళ్ళు సాధారణంగా ఎలకని చూడగానే తలుపు మీద కొట్టి 'జాకీ జాకీ' అని పిలిచేవారు. వాళ్ళు అందుకని జాకీ జాకీ అని పిలవంగానే వాడు ఎలక అనుకుని దాక్కున్న చోటు నించి ఒక్క పరుగున వచ్చేవాడు. వాడిని పట్టుకుని బసవరాజుగారికి అప్పజెప్పేవారు నర్తకి, పకపక. రోజూ రాత్రి ఈ సంగతి జరిగినా వాడికి అది తెలిసినా వాళ్ళు తలుపు మీద కొట్టగానే రాకండా ఉండేవాడు కాదు.

పల్లాకుత్తులో ఉండే కోనారు దగ్గిర లక్కీ అనే కుక్కగాడు ఉండేవాడు. వాడు చాలా మట్టుకి మా దగ్గిరే పెరిగేవాడు. జాకీ వచ్చింతరువాత ఆ రెండింటికీ చాలా స్నేహం అయింది. రెండూ కలిసి ఎన్ని ఆటలు ఆడుకునేవో? జాకీగాడు ఏమన్నా కుళ్ళినవీ అవీ తింటూ ఉంటే లక్కీ ఒరేయి తినవద్దురా అన్నట్టు గోల పెట్టేవాడు. వాడి నోట్లోంచి లాగేయాలని చూసేవాడు. కానీ జాకీ అది పట్టుకుని పరిగెత్తేవాడు. వీడు ఎంత గోలపెట్టినా దాన్ని వదిలేవాడు కాదు. జాకీ మాతో షికార్లకి వచ్చేవాడు. వచ్చినపుడు సింహతీర్థం మంటపంలో ఒక కుక్క ఉండేది. దాన్ని చూస్తే వీడికి భయం. ఆ మండపం దగ్గరికి పోతూ ఉండగానే మా మధ్యకి వచ్చి ఇరికేవాడు అది ఎక్కడ వచ్చి తనని కరుస్తుందో అని. ఒక రోజు లక్కీ కూడా మాతో షికారు వచ్చాడు. మండపం దగ్గర అవుతుండగానే జాకీ మా మధ్య నక్కాడు. మండపం కుక్క భౌయ్యిమంటోంది. మాతో నడుస్తున్న లక్కీ దాని ముందుకు వెళ్ళి ఎదురుగా నుంచుని దాని కళ్ళలోకి చూశాడు. అది వెనక్కి తగ్గి వెళ్ళిపోయింది. ఆ రోజు తప్ప లక్కీ మళ్ళీ మాతో షికారు రాలేదు. మళ్ళీ మాతో షికారుకి వచ్చినపుడు ఆ మండపం కుక్క జాకీని చూసి మెదలకుండా లోపలికి వెళ్ళిపోయింది. ఏమీ అరవకుండా.

ఇంతలో జాకీని వెతుక్కుంటూ పల్లెటూరి ముసలమ్మ, ఆమె మనవలూ వచ్చారు. ఆ ముసలమ్మ ఏడుస్తోంది. "ఎన్ని నెలలయి పోయిందమ్మా మా

కుక్క వెళ్ళిపోయి. ఎక్కడ వెతికినా దొరకలేదు. ఎవరో మీ దగ్గిర ఉందని చెప్పారు. వచ్చాము" అంది. జాకీ వరండాలో దర్జాగా కూచుని ఉన్నాడు.

"అప్పామణీ! నువ్వు ఇక్కడున్నావా? నీ కోసం ఎంత వెతికామోరా! ఇంటికి రారా!" అని ఆ ముసలమ్మ వాడ్ని ముద్దులు పెట్టుకుని బతిమాలింది. వాడు వాళ్ళని చూసి తోకన్నా ఆడించలేదు. వాళ్ళెవరో తెలియనట్టు కూచున్నాడు. ఆ ముసలమ్మ చివరికి "పోన్లెండి, వీడు ఇక్కడే బాగున్నాడు ఇక్కడే ఉండనీయండి" అని వెళ్ళిపోయింది.

ఇంతలోనే కోనారుకి మాతో విరోధం వచ్చింది. మా ఇంటికి రావడం మానేశాడు. ఒక వేళ మా ఇంటి ముందు నించి వెళ్ళాల్సివచ్చినా మేము ఎవరో తెలియనట్టు మొహం అటుపెట్టుకుని వెళ్ళిపోయేవాడు. జాకీ పరిగెత్తుకుంటూ వెళ్లి లక్కీనిఆప్యాయంగా పలకరిస్తే భొయ్యిమని మొరిగి కరిచేవాడు జాకీ కరిచినందుకు కాదు. వాడి ప్రవర్తనకి కుయ్యోమని ఏడ్చేవాడు గుండె బద్దలయినట్టు.

రోజూ వాడు మా ఇంటి ముందునించి వెళ్ళడం, లక్కీగాడి దగ్గిరికి ఆప్యాయతతో పరుగెత్తుకుని వెళ్ళడం, లక్కీ జాకీని భొయ్యిమని కరవడం, జాకీ శోకాలు పెట్టడం జరుగుతూ ఉండేది. కొన్నాళ్ళకి జాకీకి తన గుండె గాయం నయమయింది. ఇంక వాడు రాగానే వీడు వెళ్ళి కరిచేవాడు. రెండూ కరుచుకునేవి. ఇంక నేను దగ్గరుండి జాకీకి శాంతం బోధించే దాన్ని. "చూడూ! నువ్వు ఆశ్రమంలో ఉన్నావు. నీతో వాడు విరోధించాడని నువ్వు వాడితో విరోధించాలేమిటి! పోట్లాడకూడదు. శాంతం నేర్చుకోవాలి" అని చెప్పేదాన్ని. ఒకవేళ కోపం పట్టలేక లక్కీ మీదికి వెళ్లినా నేను చెప్పంగానే వెనక్కి వచ్చేసేవాడు జాకీ. ఇట్లా కొన్నాళ్ళు జరిగింది. మళ్ళీ కోనారు మాతో స్నేహమయినాడు. లక్కీ ఏమీ ఎరగనట్టు ఇంటికి వచ్చి జాకీతో స్నేహం చేసుకొన్నాడు. ఎప్పటిమల్లే జాకీతో ఆటలు మొదలు పెట్టాడు. ఎంత సంతోషమో జాకీకి వాడు మళ్ళీ స్నేహమయినాడని.

విజయదశమినాడు మేమందరం ఆశ్రమానికి బయలుదేరుదామని ఇంట్లోంచి బయటకి వచ్చేశాం. ఇంతలోనే పకపక ఏడుస్తు ఇంట్లోకి వస్తోంది. జాకీ బస్సు కింద పడిపోయినాడు. ఆ తరువాత తెలిసింది. బస్సు వస్తోందగా పల్లాకుత్తు వైపు నుంచి గేదె వస్తోంది. దాన్ని రాకుండా పక్కకి లాగడానికి జాకీ రోడ్డుకి ఇటువేపు నించి అటువేపుకి ఒక్క దూకు దూకింది. వాడి మీద నించి బస్సు పోయింది.

ఎక్కడా ఒక్క గాయం లేదు వంటిమీద. మెడమీద నించి బస్సు పోయింది. అప్పటికప్పుడే రోడ్డు ప్రక్కన గుంట తీశారు. ఇంతలోనే లక్కీ పరిగెత్తు కుంటూ వచ్చాడు పల్లాకుత్తు నించి. జాకీని వాసన చూసి నాకుతూ అక్కడే కూచు న్నాడు వాడు. సమాధి చేస్తున్నంతసేపు మేము బోన్‌కాంపౌండ్ వంతెన మీద కూచున్నాం. సమాధి పూర్తి అయిన తరువాత లక్కీగాడు నా ఎదురుగా వచ్చి కూచునిఉన్నాడు. సానుభూతితో ఓదారుస్తున్నట్లు ఎంతో దయగా చూస్తున్నాడు, నా వేపు. చూసిచూసి వాడి చెయ్యిని నా ఒడిలో పెట్టాడు తీసుకొచ్చి. వాడి చూపులో అర్థం ఏమిటంటే పోయినవాడు ఎట్లానో పోయాడు. వాడి బదులు నేను మీతో ఉంటాను అని. ఆ రోజునించి కోనారు యిల్లు వదిలి మా యింటికి వచ్చేశాడు లక్కీ.

తరువాత మేము ఇల్లు మారాం. వాడు మాతోబాటు వచ్చేశాడు. వాడికి భజన అంటే గిట్టదు. మళ్ళీ హారతి కలకండ అంటే ఇష్టం. భజన మొదలు పెట్టగానే కుయ్యోమని ఏడ్చేవాడు. అందుకని చివరి భజన గుర్తు పెట్టుకునేవాడు. మొదటి భజన మొదలు పెట్టగానే కుయ్యోమనిఅరుచుకుంటూ డాబామీదికి వెళ్ళిపోయేవాడు. చివరి భజన అవుతూండగా మేడ మీదనించి కిందికి దిగి వచ్చేవాడు.

వాడు ఇంట్లో భజనప్పుడు గోల చేస్తున్నాడని "నువ్విట్లా భజన దగ్గర గోల చేశావంటే బెంగుళూరు నించి క్రొత్తకుక్కని తెచ్చుకుంటాం." అని బెదిరించే వాళ్ళం. ఆ మాట అనంగానే కొన్నాళ్ళు పాపం ఏడవకుండా కంట్రోల్ చేసుకొనేవాడు తనని తాను. కానీ కొన్నాళ్ళ తరువాత మళ్ళీ మొదలయ్యేది. అప్పుడు మళ్ళీ బెదిరించేవాళ్ళు.

రుక్మిణీనాథశాస్త్రిగారు జపం చేసుకుంటున్నప్పుడు ఆయన జపం చేస్తు న్నంతసేపు వదలకుండా ఆయన ఎదురుగా కూచునేవాడు ఏమిటో?

ఒకసారి శబరి అనే ఆవిడ వచ్చింది ఇక్కడికి. ఆవిడ ఒక యోగిని. "ఏం నాయి ? దర్జాగా వరండాలో కూచున్నావే" అంది లక్కీని చూసి. వాడు అమాంతం సిగ్గుతో తలవంచేసుకొన్నాడు. అట్లా వాడు తల వంచుకోంగానే ఆమె గ్రహించుకుని రెండు చంపలు వేసుకుని "అప్పా తప్పు అయిపోచ్చి. నీ పాయి ఇల్లెడీ" అంది. ఆ తరువాత వాడు మా దగ్గర నుంచి కోనారు దగ్గరికి వెళ్ళి పోయి నాడు, మా దగ్గరికి వేరే కుక్కలు రావడం వల్ల. తరువాత లారీకింద పడి చచ్చి పోయినాడని తెలిపింది.

# అద్దం పిచిక

మేము ఉండే చోటున ఊర పిచ్చికలు తక్కువ. కానీ చివరికి ఒక మగ పిచిక చేరాడు. నా గదిలో గూడు కట్టుకునే వాడు. వాడు అద్దం ముందు నుంచుని డ్యాన్స్లు చేసేవాడు. ఎన్ని రకాలు చేసేవాడో తన పావను తను చూసుకుని అద్దంలో. ఆ అద్దం దగ్గరే పకపక రుమాళ్ళు పెట్టుకోను ఒకతాడు కట్టుకుంది. ఆ తాడు మీద రకరకాల ఫీట్సు చేసేవాడు. వాడికోసం ఏ ఆడ పిచ్చిక వచ్చినా తరిమి తరిమి కొట్టేవాడు. దగ్గిర చేరనిచ్చేవాడు కాదు. ఇంక మరీ వెంట పడితే ఆ అద్దం దగ్గిరకి తీసుకొచ్చి డ్యాన్స్ చేయమనేవాడు. తాడు మీద ఫీట్లు చేయమనేవాడు. అవి చేయలేక పోతే వాటిని తరిమేసేవాడు.చివరికి ఎన్నో తంటాలుపడి ఒకత్తె చేరింది. వాళ్ళిద్దరూ కలిసి నా గదిలోనే మళ్ళీ గూడు కట్టుకున్నారు దానికి పాపం గాయాలు తగిలి కన్ను గుడ్డి అయిపోయి ఎక్కడికో వెళ్ళిపోయింది. చివరికి తంటాలుపడి మళ్ళీ ఒకత్తె చేరింది.చివరికి గుడ్లు పెట్టింది. ఆఆడదానికి మళ్ళీఏమయిపోయిందో అదీ మాయమైపోయింది. ఆ పిల్లల్ని వీడే పెంచాడు. వాడూ మాయమైనాడు. ఏమై నాడో తెలియదు. ఈ పిల్లలు ఒకటే గోల చేస్తున్నాయి. మూడు రోజులయినా కూడా తల్లీ తండ్రీ తిరిగిరాలేదు. ఇంక తండ్రి రాడని తెలిసి నర్తకి-పకపక నిచ్చెన వేసుకుని వాటిని కిందికి దింపారు. పాపం ఒక పిల్ల అరిచి అరిచి చచ్చి పోయింది. రెండు బతికే ఉన్నాయి. వాటికి సరిగా ఈకలన్నా రాలేదు.వాటికిఅక్కా చెల్లీ అని పేరు పెట్టాం. వాటిని భద్రంగా పెంచింది పకపక. రెండూ బాగా పెద్ద వయినాయి. చెల్లి ఎగిరిపోయింది. అక్క మాతో మిగిలిపోయింది.

# చలం బంధుమిత్ర పరివారం

రవి : చలం పెద్దకుమారుడు

షౌ-సౌ : సౌరిస్, చలం పెద్ద కుమార్తె

చే : నిర్మల, చలం రెండవ కుమార్తె

సంతి : వసంత్, చలం రెండవ కుమారుడు. ఇంట్లోంచి వెళ్ళిపోయి మళ్ళీ కనబడలేదు.

పకపక : చంపక, చలం మూడవ కుమార్తె, వజీర్‌రహ్మాన్ భార్య.

టి : చిట్టి రంగనాయకమ్మ, చలం భార్య, రంగమాలతి. మాలతీబాయి అని బ్రహ్మసమాజంలో చేరాక పేరు మార్చుకుంది.

వొయ్యి : డాక్టరు రంగనాయకమ్మ. చలంగారి వదిన

పెద్ద అక్కయ్య : పెద్ద రంగనాయకమ్మ, చలంగారి పెద్ద వదిన, చలం మామగారికి పెద్ద భార్య వలన కలిగిన కుమార్తె.

కొమ్మూరి సాంబశివరావు : చలం తండ్రి, గుడిపాటి వెంకట్రామయ్యగారికి ఇల్లరికపుటల్లుడు, వ్యసనపరుడు.

కొమ్మూరి వెంకటసుబ్బమ్మ : చలం తల్లి, గుడిపాటివారి ఆడబడుచు

గుడిపాటి వెంకట్రామయ్య : చలం తాతగారు.

ఉప్పులూరి రామశేషయ్య : చలం మామగారు, ఇంపీరియల్ బాంక్ మేనేజర్ చేశారు.

వల్లూరి గోపాలం : సౌరిస్ ముత్తాత, చలం తాత

ఉప్పులూరి సీతాయమ్మ : చలం అత్తగారు.

వల్లూరి పార్థసారథి : గోపాలంగారి కొడుకు, రంగనాయకమ్మగార్లకు మేనమామ.

అబ్బత్త : శ్రీమహాలక్ష్మమ్మ. చలం మేనత్త, కొమ్మూరి సాంబశివరావు (చలం తండ్రి)కి సయానా చెల్లెలు, కొమ్మూరు వెంకటా చలము పంతులుగారి కుమార్తె(ఈయనపేరే చలానికిపెట్టారు).వీరేశలింగంగారి సహాధ్యాయి, కనపర్తి సంజీవ రాయుడుగారి కోడలు, పారిపోయి వితంతు వివాహం చేసుకుంది. న్యాపతి సుబ్బారావు పంతుల్ని పెళ్ళాడింది.

కమల : అబ్బాత్త కూతురు

ఉవ్వి : కొమ్మూరి సాంబశివరావు, చలం తమ్ముడు కొమ్మూరి వెంకట్రామయ్య గారి కుమారుడు, ఎడిటర్, పబ్లిషర్, సినిమా నిర్మాత, డిటెక్టివ్ నవలా రచయిత, జానకి దోస్త్.

వజీర్ రహ్మాన్ : కాకినాడ ఇస్మాయిల్ కవిగారి తమ్ముడు. 'కవిగా చలం' ప్రచురణకర్త. చలంగారి అల్లుడు, చంపక భర్త, కవి, భావుకుడు.

టిప్పు : వజీర్ చంపకల కుమార్తె

వక్కలంక నరసింహారావు : చలానికి యిష్టమైన చెల్లెలి పిల్లల్లో ఒకరు. చలం చితికి నిప్పుపెట్టి అంత్యక్రియలలో పాల్గొన్నారు.

చిత్ర : చలం పెంపుడు కూతురు.

శ్రీ : చిత్ర భర్త

డాలీ : చిత్ర కుమార్తె

నర్తకి : రాజ్యలక్ష్మి, రాజనర్తకి, రాజ్యం, చలం పెంచుకున్న అమ్మాయి. రమణస్థాన్ అజమాయిషీ, మగపనీ, ఆడపనీ, ఆతిథ్యం అన్నీ యీమే చూస్తుంది. చలం ఆలనాపాలనా చూసింది. నిర్మోహ[illegible]టి. సేవానక్త.

కృష్ణ : పువ్వుల నుంచి ప్రూఫుల దాకా యీమె పనే. పరుచూరి యీమె భర్త. ఒకప్పుడు కాన్వెంటులో టీచరు. సౌరిస్ సంరక్షణ యీమే వహిస్తుంది.

కృష్ణ : చిక్కాల కృష్ణారావు, రమణస్థాన్ అంతేవాసి.

బసవరాజు : ఏలూరు ట్రయినింగ్ స్కూల్లో అసిస్టెంట్. చలానికి కొలీగ్, హోమియోపతి వచ్చు. రమణస్థాన్‌లో తోటపని, మొక్కల సంరక్షణ.

పిన్ని : కొమ్మూరి పద్మావతి, చలం తమ్ముడు వెంకట్రామయ్య గారి భార్య, కొడవటిగంటి కుటుంబరావుగారి అత్తగారు, కథా రచయిత్రి, నాటకాల్లో వేశారు (బళ్ళారి రాఘవతో).

లీల : సౌరిస్ రాసిన 'సుందర్' అనే నాటకంలో ఓ పాత్ర పేరు. అసలు పేరు అబ్బాయమ్మ. పిఠాపురం, సంగమేశ్వరశాస్త్రిగారి శిష్యురాలు. వొంటర్ల జాతివారు. రావు సూర్యారావుగారి కూతురు అని చెప్పుకుంది. వెంకట్రావు

గారిమె భర్త అని చెప్పుకుంది. కురుమెళ్ళ వెంకట్రావు, పిఠాపురం యీామె చిన్ననాటి నేస్తం. చలాన్ని పరిచయం చేసింది కూడా వీరే. ఈమె చలంతోవచ్చి భీమిలీలోనూ నూజివీడులోను వుండిపోయారు. కేన్సు వచ్చి చనిపోయింది. చలం 'మ్యూజింగ్స్' యీామెకే అంకితం.

రామ్మూర్తి : మొక్కపాటి రామ్మూర్తి. పిఠాపురం దివాన్ మొక్కపాటి సుబ్బారాయుడుగారి తమ్ముడు. చలం, కృష్ణశాస్త్రి, బుద్ధకృష్ణ (జ్వాల) ముగ్గురి అంకితాలను పొందినవాడు. మరదలు రత్నమ్మను ప్రేమించి విడవలేక ఆత్మహత్య చేసుకుని పోయాడు. బారిష్టరు పార్వతీశం రాసిన మొక్కపాటి నరసింహశాస్త్రి గారికి తమ్ముడు.

దీక్షితులు : చింతా దీక్షితులు గారు. కథానికా చక్రవర్తి. 'వటీరావు' సృష్టికర్త, బాలసాహిత్యం. జానపద సాహిత్యంలో కృషి. చలాన్ని తిరువణ్ణామలై భగవాన్ వద్దకు మొదట తీసుకెళ్ళినది వీరే. డిప్యూటీ ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ చేశారు. చలాన్ని కథలు, నాటికలు రాయమని ప్రోత్సహించింది వీరే

నండూరి సుబ్బారావు : ఏలూరులో అడ్వకేట్. ఎంకిపాటలకవి చలానికున్న గొప్ప మిత్రులలో ముఖ్యులు.

లూలూ : చలంగారి పెంపుడు కుక్క. బెజవాడ నుంచి తిరువణ్ణామలై వారితో వెళ్ళింది.

హీరా : రమణస్థాన్‌లో నెమలి.

జ్యోతి, మోతీ, హీరా : ర . ణస్థాన్‌లో పెంపుడు శునకత్రయం.

బుజ్జిగాడు : నర్తకి పెంచిన గోరింక- వీడికథ చలం 'బుజ్జిగాడు' అనే పేరిట రాశారు.

(అరుణాచలంలో (తిరువణ్ణామలై) రమణస్థాన్‌లో— డివోషన్ (భక్తి) చిన్నదాబా చలం నివాసం. డిటాచ్‌మెంట్ (అనాసక్త) చలం అతిథి గృహం. యివన్నీ బోస్ కాంపవుండ్‌ని అనుకుని వున్నాయి.)

నమస్కారం !

ఈ పుస్తక రచనలో విషయసేకరణకు పుస్తకాలు, పత్రికలు, ఫొటోలు యిచ్చి సహకరించిన వారూ, నోట్సులు, డిక్టేషన్లు రాసి పెట్టిన వారూ, సలహాలిచ్చి ప్రోత్సహించిన వారూ, వీరేగాక పరోక్షంగా పత్రికల నుంచి వారివారి పుస్త కాలనుంచి ప్రత్యేక వ్యాసాలను అంశాలను ఉటంకించు కున్నందున వారందరికీ పేరుపేరు వరసలా కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

ఈ బృహత్ గ్రంథాన్ని తీర్చిదిద్దడంలో స్వామి రామానంద విరచిత సౌరిస్ జీవిత చరిత్ర ముద్రిత అముద్రిత భాగాల్లోంచి చాలా విషయాలు సంగ్రహించి వాడుకున్నందుకు కూడా వారికి ప్రత్యేకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

చాలా కాలం అసంబద్ధంగా సాగిన యీ పుస్తక రచనలో తొందరపాటు వలన, అజ్ఞానంచేత అనేక దోషాలు నా వలన జరిగి వుంటే- అందుకు నా క్షమా పణలు. తెలిసిగాని తెలియకగాని ఎవరి మనసుకైనా నొప్పి కలిగించితే అందుకు కూడా నా సిన్సియర్ అపాలజీస్ !

ఇక్కడ పేర్కొన్నవారేగాక ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ నాకు ఈపుస్తక రచనలో సహాయం చేసిన వారెందరో నేను మర్చిపోయి వుండవచ్చు. వారందరికీ నా వందనాలు ! ఆంధ్రప్రింటర్స్ విజయవాడ వారికి ప్రత్యేక అభివందనాలు.

ముఖచిత్ర రచన చేసిన శ్రీ బాపుగారికి, కీ.శే. కొడవటిగంటి కుటుంబరావు యింకా శ్రీయుతులు ఆచంట జానకిరాం, సంజీవదేవ్, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి కె.వి. రమణారెడ్డి, కె రామమోహనరాయ్, చలసాని ప్రసాద్, ఆకెళ్ళ సూర్యనారా యణ (స్వామి రామానంద), కొనకంచి వెంకటప్పయ్య, శివం, వై. చందర్ రావు, బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు, చిక్కాల కృష్ణారావు, సూరంపూడి భాస్కరరావు, శ్యామలరావు (ఫొటోగ్రాఫర్), స్వర్గీయ కె. సభా, డాక్టర్ వి.యస్.యన్. శర్మ, ఎన్.ఆర్. చందూర్, వజీర్ రహ్మాన్, (పీఠికలు రాసిన) ఇస్మాయిల్, వద్దెర చండీ దాస్, బి. వి. నరసింహారావు, వి. యస్. అవధాని, శ్రీరమణ, పి. యస్. రావు, తుమ్మల గోపాలరావు, కొమ్మూరి సాంబశివరావు, వేగుంట మోహన్ప్రసాద్, నండూరి పార్థసారధి, డాక్టర్ వీరభద్రరావు(ఏలూరు), కె.యస్. రమణ, పురాణం సూర్యప్రకాశరావు, కుటుంబరావు గాంధీ, శ్రీమతి రంగనాయకమ్మ, పి.రామకృష్ణా రెడ్డి, మిస్. సత్య(చిత్తూరు), పిలకా గణపతిశాస్త్రి, శ్రీమతి తుమ్మల కృష్ణాబాయి, హరి, ఇంద్రగంటి శ్రీకాంత్‌శర్మ, ఘంటసాల నిర్మల, రా. రా. ఏటుకూరి బల రామమూర్తి, ఆర్వియార్, వరవరరావు, శివసాగర్, ఓంకార్, పి. రమాదేవి, పి. యస్. రామచంద్రరావు, పి. వాణీమిత్రభాను, పి. యస్. శాస్త్రి (నాని), సౌరిస్, నర్తకి, కృష్ణ, చిత్ర, బసవరాజు, రమణస్థాన్ వాసు లందరికీ నా కృతజ్ఞతలు !

పురాణం సుబ్రహ్మణ్యశర్మ

# అనుక్రమణిక

## య



## ర